# అధిక ఆహారోత్పత్తికి కావలసిన

## అన్ని రకముల వ్యవసాయపు యంత్రములు—

## ఇంగ్లండులో నిర్దుష్టంగా తయారుచేయబడినవి

1. నేషనల్ డీసెల్ ఆయిల్ ఇంజన్లు
2. వర్తింగ్టన్ సింప్సన్ పంపులు (అన్ని సైజులు)
3. క్రాంటన్ ఎలక్ట్రికల్ మోటార్లు
4. క్రాంటన్ మోటార్లతో జోడించబడిన వర్తింగ్టన్ పంపుసెట్లు
5. వ్యవసాయపు నాగలి (ఎస్లొలాగేని)

విశ్వవిద్యాలయ

## సీడ్డింగ్, మెన్యూరింగ్ యంత్రాలు

## కంచెవేయుటకు సామాన్లు, ట్రాక్టర్లు

సంఖ్య.........

ఈ క్రింది ఎడ్రసుకు వ్రాయండి:

| బ్రాంచి: | ఇంటర్నేషనల్ ఏజన్సీస్, | బ్రాంచి: |
|---|---|---|
| రూము నెంబరు 406 | హెడ్-ఆఫీసు: | నెం. 40, మెయిన్ |
| హోటల్ టోకియో, | 15/16, అంగప్ప | రోడ్డు-III |
| టోకియో. | నాయక్ వీధి, | గాంధీనగర్ |
| (జపాన్) | మద్రాసు | బెంగుళూరు. |

సోల్ ప్రొప్రయిటర్:

యస్ సి తిమ్మారెడ్డి, బి ఏ. బి. ఎల్.




సంపుటి 2. సంచిక 13.

శుక్రవారం, అక్టోబరు 28, 1949

# హిమధామం

దాశరథి

ఈ ఉత్తరదిశా
వాయుమండలం
గాలిలో తేలుతున్న
హిమాచలం.

వేనవేల మణుగుల
మంచు బరువు,
ఇక్కడ కేంద్రానికి
చెప్పడానికి కరువు.

సుదీర్ఘ
చైనా కుడ్యానికి
రెండూ పక్కలు—
మంచు పిట్ట
రెండు రెక్కలు.

మహానది
ఉత్తర దక్షిణ తీరాల
హద్దు లేవు,
అంతా మంచుమేల.

నర్తించే సుదీర్ఘ
రజత సర్పాల
దండలు
ఈ కొండలు.

మైదానంలో
పొంగిన పర్వతాలు—
మెరుస్తూ, తెల్లని
ఐరావతాలు.

అంతా చల్లదనం,
ఎంత హాయి!

నా ఔన్నత్యం
ఈ ఆకాశంతో
పోటీ పడాలని
ఆరాట పడుతోంది.

ఈ మృదుల ఉషస్సులో
నా భూమి—
అరుణ కపోలాల బాల
తెల్లని గౌన్ తొడుక్కున్నట్టుంది.

ఈ కొండలూ, నదులూ
ప్రతిధ్వనిస్తూ పిలుస్తున్నాయి—
"వీరులార! ధీరులార!
పోటీ పడండి, రణం చేయండి,
గెలవండి, ఠీవిగా నిలవండి.
మమ్మల్ని ప్రేమించండి
మా హృదయ సింహాసనాలు
అలంకరించండి."

'షి-హూ-ఆంగ్', 'హా-టీ' సమ్రాట్టులు
పశువులు—
అచ్చంగా
రాక్షస శిశువులు.

'తై-సూంగ్', 'తై-సూ' చక్రవర్తులు
అనాగరికులు—
క్రూరులైన ఎరుకులు.

చంగీజ్ ఖాన్
పిచ్చుకపై
బ్రహ్మాస్త్రం గుంజేవాడు!

అదంతా గతం,
నేటితో అది ఖతం.

నేటి మానవులు
తమను తాము
తెలుసుకొన్న
ప్రభాత రవులు,
నిండు హృదయాల కవులు—
నేటి మానవులు.

(మూలం : మావో సే-టుంగ్)

# తెలుగు స్వతంత్ర

సంపుటి-2
సంచిక-13

అక్టోబరు 28, 1949

ప్రచురణ:
ప్రతి శుక్రవారం


## క్రియారూపంలో ఆదర్శాలు

మద్రాసు ప్రధాని శ్రీయుత కుమారస్వామిరాజా గారు ఇటీవల మంగుళూరులో ఒక సభలో ఉపన్యసిస్తూ, జాతీయ కాంగ్రెసు యొక్క అతిముఖ్యమైన ఆదర్శాన్ని మళ్ళీ మన కందరికీ స్ఫురణకి తీసుకు వచ్చారు. దక్షిణ కెనరా జిల్లాలోని "బిల్లవా" తెగకు చెందిన వారికి విద్యా విషయంలో రాష్ట్రప్రభుత్వ సహాయం తప్పక లభిస్తుందని హామీ యిస్తూ, యిలా అన్నారు: "కుల, మత, వర్గ భేదాలను పాటించకండా, జాతిజనులందరినీ సమైక్య పరచి, సమాజపు సమూహ క్షేమం కోసం పాటుపడడం జాతీయ కాంగ్రెస్ ప్రాథమిక కర్తవ్యం." ఈ ఆదర్శం విని సంతోషించని సహృదయు లెవ రుంటారు? అంతకంటె జనసామాన్యానికి కావలసిన దేమున్నది! అంతేకాక ఆ సందర్భంలోనే ప్రధాని యిలా విపులీకరించారు: "జాతీయ కాంగ్రెస్ ముఖ్యంగా బీద వారి అభ్యున్నతి కోసం పాటుపడుతుంది. ప్రభుత్వం మీకు (బిల్లవా వారికి) తప్పకండా సహాయం చేస్తుంది; మీరు ఫలానా తెగకు చెందినవారనే కారణాన కాదు; సమాజం మొత్తం మీద సహాయం అవసరమైన ఒక భాగంవారని మాత్రమే."

నిజంగా అవి అమూల్యమైన సూక్తులు; అందులో తప్పు పట్టవలసింది ఆవంతయినా లేదు. అప్పటి సభ్యులపట్ల అవి ఆత్మగౌరవ ప్రదంగా ఉన్నాయి. ప్రత్యేకమైన తెగకు చెందినవారు కాబట్టి ప్రభుత్వసహాయానికి అర్హులనడం కంటె ఆర్థికంగానూ, తద్రీత్యా తక్కిన రంగాల్లోనూ వెనుకబడి వున్నారు కాబట్టి, దేశక్షేమం కోసం అలాంటివారిని వృద్ధిలోకి తీసుకురావడం ఏ ప్రజాప్రభుత్వానికైనా ప్రాథమిక కర్తవ్యం. ఈ యిరవైయో శతాబ్దపు జీవన విధానంలో, నేటి మన సమాజ స్వస్వరూపమే తీవ్రమైన పరిణామం చెందింది. నేడు సమాజంలో నివసించే వారి సుఖదుఃఖాల్ని నిర్ణయించేవి ఆర్థిక పరిస్థితులు. సంఘంలో ధనాని కుండే ప్రాబల్యంతో సరితూగగల యితరేతర ప్రాబల్యాలు ఏవైనా యినివరలో ఉండి ఉంటే, నేడవి సంపూర్ణంగా అదృశ్యమైనాయనే చెప్పవచ్చు. నేడెవరైనా వెనుకబడి ఉన్నారంటే, ఆర్థికంగా అని తప్ప వేరే అర్థం లేదు. ఈ విశాల దృష్టితోనే జాతీయ కాంగ్రెస్ ప్రజాహృదయాన్ని యిన్నాళ్లూ ఆకర్షించ గలిగింది. అటువంటి ఆర్థికస్వాతంత్ర్యం అందరికీ లభింప చెయ్యడానికే మన

స్వాతంత్ర్య పోరాటమని నాయకు లంతా వేనోళ్ళ చాటారు. ఆ స్వాతం త్ర్యమూ రాజకీయంగా దేశానికి లభిం చింది. పాలనాధికారం నాయకులకు లభించింది.

కాని నానాటికీ విశ్వరూపం దాలుస్తు న్నవి ధరలు: జీవితావసరాలకి సంబంధిం చినప్రతివస్తువూ సామాన్యుడికొనుగోలు శక్తికి అతీతమైపోయింది. ఈ నికృష్ట స్థితినుండి బైటపడడం ఎలాగో అతనికి తెలియటంలేదు. సమస్య తరవాత సమస్య ప్రజాసామాన్యాన్ని పీడిస్తూనే ఉన్నది. ఆ సమస్య ఉద్భవించడానికి కారణం నాయకులు సెలవిస్తూనే ఉన్నారు: బుద్ధిమంతులూ, పరిశోధన వేత్తలూ విపులమైన లెక్కలు ప్రక టిస్తూనే ఉన్నారు. క్రియారూపంలో ఫలితంమట్టుకు శూన్యం. అసలు సమస్యలైన గ్రాసం, వాసం, వసనం నానాటికీ గగనకుసుమాలై పోతు న్నాయి. మన దేశంలో యిన్ని లక్షల ఎకరాలభూమి యింకా సాగుబడి కోరు తున్నది, అదంతా వ్యవసాయం క్రిందికి తీసుకువస్తేనా - భారతదేశం రత్నగర్భ అయిపోతుంది: అని ఒక ప్రభుత్వనాయ కుడు. అయితే ఏమి టాలస్యం?- అంటే మళ్ళీ సుదీర్ఘమైన అంకెలు: వ్యాఖ్యా నాలు వెలువడుతాయి. ఈ లోపుగా ఎనిమిది ఔన్సుల రేషను చిరంజీవిగా వర్ధిల్లుతోంది. నిర్దాక్షిణ్యమైన ఒక క్రమంలో జీవితావసరాలు అకస్మా త్తుగా అదృశ్యం అవుతూంటాయి. ఏితే ఆహారధాన్యాలు: లేకపోతే వస్త్రం. నేడు పంచదార. ఇవన్నీ కృత్రిమంగా అదృశ్యం చేయబడుతున్న వే. వీటన్నిటి తోపాటు నేడు ధనం సైతం అదృశ్య మైన దంటున్నారు. జారీచేసిన కరెన్సీ విలువ వెయ్యికోట్ల రూపాయలకు పైన: నేడందులో సగంకూడా చలామణిలో లేదట. తక్కినది ఎక్కడో దాక్కున్నది. శుద్ధాంతకాంతవలె పైకి రాదు. వస్తేనే కాని మన ఆర్థిక సమస్య తీరదు. అలాగే పంచదార విషయం. గడచిన యిరవై సంవత్సరాలనుండీ యీ పరిశ్రమకు ప్రభుత్వం అనన్యమైన రక్షణ నిచ్చి కాపాడింది. అయినా ఆ పారిశ్రామిక వేత్తలు, వర్తకులు యింకా తృప్తి చెంది నట్లు గోచరించదు. ఉండుండి పంచదార దోబూచులాడుతుంది. ఆ చెలగాటం ప్రజాసామాన్యానికి ప్రాణ సంకటంగా పరిణమిస్తుంది. ప్రభుత్వం సుదీర్ఘమైన ప్రకటనలు చేసి, తీసుకోవలసిన చర్యలు తీసుకుంది: పంచదార ఉత్పత్తిదారులు అంకెలతోసహా తమ ఋజువర్తన రుజువు చేశారు. అయినా పంచదార బయటికి రాదు.

కాంగ్రెసు ఆదర్శాలు క్రియారూపం దాల్చిననాడే ప్రజల కవి బోధపడు తాయి. అంతే కాని, పదేపదే వాటిని వల్లెవేయడం నిష్ప్రయోజనం. నేడు జీవిత తక్షణావసరాలు ప్రజల కంద కుండా పోతున్నాయి. ఆ విషయంలో సమాజంలో అధిక సంఖ్యాకులంతా వెనుకబడే ఉన్నారు. ముందు యీ సమ స్యలు పరిష్కరించడం ప్రభుత్వ కర్త వ్యం. అన్ని గంభీరమైన ప్రజాహితా దర్శాలకూ కొలబద్ద ప్రజాసౌఖ్యం. శాంతివలెనే సమాజ క్షేమంకూడా అవిభాజ్యం.

# ఆభిజాత్యం

'జయంతి'

ఆమె జీవనయాత్రలో యిది యిరవై రెండో కార్తీక పౌర్ణమి. ఇలాంటివి యిరవై ఆమెకు తెలియకుండానే గడచిపోయాయి. ఆమెకు బాగా తెలిసినవల్లా నిరుడూ, ఈయేడూను. ఈ ఒక్క సంవత్సరంలోనూ తాను ఎంతగా మారిపోయిందో తలుచుకుంటుంటే ఆమెకే ఆశ్చర్యం కలుగుతూంది. ఒక స్వచ్ఛంద జీవితానికి స్వస్తి చెప్పి, ఒక అనారోగ్యపు వాతావరణంలో తిరిగి జన్మించినట్లు ఆమె భావిస్తూంది. ఎన్నడో తాను ఊహించుకున్న రసనిర్ఝరులు కేవలం ఎండమావులుగానే వుండిపోయాయి. ఈ భావాలతో సరళ మేడమీద ఒంటరిగా కూర్చుని కిటికీగా వీధిలోకి చూస్తోంది. అరబోసిన వెన్నెల ఆమె మనస్సు నింకా కలవర పెడుతూంది.

క్రిందటి కార్తీక పౌర్ణమకు సరళ అవివాహిత. ప్రపంచంలోని సుఖ సన్నివేశాలు మూర్తీభవించిన ఆనందదేవత. ఆ సాయంత్రం ఆమె కాలేజీలో టెన్నిస్ ఫైనల్సు ఆడుతూంది. ఉపాధ్యాయులు, విద్యార్థులు, విద్యార్థినులు ఆమెను మెచ్చుకుంటూ ఆట చూస్తున్నారు. యువక బంభరాలు ఆమెకు వినబడేలాగ వింత ప్రశంసలు వెదజల్లుతున్నాయి.

'అది సరళానిమీరం కాదురా, ప్రేమసుమారం' అని వొకరు,

'వెన్నెల రేఖ కాదు-మెరుపుతీగ' అని యింకొకరు,

'ఈ సామ్రాజ్యం వీరభోజ్యం' అని వేరొకరు చేస్తూన్న ప్రశంసలు సరళలో క్రొత్త ఉత్సాహాన్ని పుట్టించాయి. అనంతోషంలోనే ఆమె ఆటగెలిచి కప్పు అందుకుంది. ఎంతసేపటికీ తమకారు రాకపోవడంవల్ల ఒంటరిగా కాలినడకనే బయలుదేరింది సరళ. కాని, ఇంతలోనే పెద్దగాలి ప్రారంభమయింది. వెనువెంటనే జల్లుకురిసి పెద్దవర్షంగా మారింది. ఆ చుట్టుప్రక్క ఏయిళ్లూ లేవు. రోడ్డు ప్రక్క మర్రిచెట్టే ఆమెనాహ్వానించింది. ఆమెకు ఆశ్చర్యంకలిగేలాగ రామ్మూర్తి అంతకుముందే ఆచెట్టుక్రింద ఒంటరిగా నిలబడి వున్నాడు. వర్షం హోరుమని కురుస్తోంది. స్వర్ణసంధ్యాకాంతులు వర్షపుధారలలో ప్రతిబింబిస్తున్నాయి. సరళ పూర్తిగా తడిసిపోయింది. వింతవింతగా అమర్చుకొన్న కురులు పూర్తిగా చెరిగి నీళ్లు కారుతున్నాయి. మూడుపొరలమాటున దాగిన ఆమె శరీరకాంతులు ఆ సంధ్యాశోభలో మిళితమౌతున్నాయి. రామ్మూర్తి చూస్తూ అలాగే నిలబడ్డాడు. సరళ మాట్లాడకుండా తలవంచుకుంది. రామ్మూర్తి తన కోటు తీసి ఆమె శరీరంమీద వేశాడు. అర్ధనగ్న శరీరానికి ఆచ్ఛాదన కల్పించుకోవలసినందువల్ల సరళ కిమ్మనలేదు. రామ్మూర్తికేదో చిరకాలవాంఛ ఈనాడు ఫలించినట్లు అయింది. సరళమాత్రం కొంచెం బాధపడుతూంది. లిప్‌స్టిక్‌తో నిండిన పెదవులు రక్తపంకిలమయినట్లు సిగ్గుపడుతున్నాయి. వానకు తడిసిన హైహీల్డుబూటు జారియూ చీరకు అడ్డంపడుతూంది. వీటిని చూస్తున్న రామ్మూర్తి దృష్టి మార్చాలనుకుంది సరళ.

"ఏం రామ్మూర్తీ-అలా దీర్ఘంగా ఆలోచిస్తున్నారు!" అంది.

"ఏదో భావనకురాని మనోవేదన" అన్నాడు రామ్మూర్తి.

"అందరూ కవులు గారు. కొంచెం విడమరచి చెప్పండి" అంది సరళ.

"ఏం చెప్పను సరళా! ఎలా చెబితే తెలుస్తుంది నీకు" అన్నాడు రామ్మూర్తి తీయని బాధతో.

"మీ మాటలు నా కర్థం కావేడు" అంది ఆమె.

"సరళా! నీలో ఏదో పెద్ద ఆకర్షణ వుంది. కలభాన్ని లాక్కునే జ్యోతిలాగ అది నన్ను నీ

పద్ధతు లాక్కుంటోంది. అదే నన్ను దినదినం పవిత్రవాణ్ణిగా మారుస్తోంది" అన్నాడు రామ్మూర్తి.

"రామ్మూర్తిగారూ! మీరు ఎవరితో మాట్లాడుతున్నారో తెలుసా?"

"తెలుసు. ఒక దేవకన్యతోటి. సరళా! తెలుసుకో ప్రేమయొక్క నిజరూపాన్ని- నా హృదయపు పొరల వెనక వున్న భావాన్ని గ్రహించు. ఏదీ, నీ అంగీకారం..."

"రామ్మూర్తీ! క్షమించాలి. నన్ను మీరు పూర్తిగా అర్థం చేసుకో లేదు. నా దారి వేరు- మీ దారి వేరు."

"అవి ఏకం చేసుకోడం మన చేతుల్లో లేదూ? ఒక సామాన్యుడు ధనికురాలిని పెళ్ళి చేసుకోడం అసంభవమా?"

"సంభవం కావచ్చు-ఒక దశాబ్దం దాటేక. ఏమైతేనేం మన విషయంలో అది అసంభవమే. అదిగో వాన వెలిసింది. నేను వెడుతున్నాను" అంటూ సరళ తన దారిని తాను పోయింది.

రామ్మూర్తి సరళగారి మేడమీద ఒకగదిలో అద్దెకు వున్నాడు. అతనైతే సామాన్య కుటుంబంలో పుట్టినవాడే, కాని అతని అలవాట్లు ఎంతటి శ్రీమంతులకీ వుండవు. అతని ఠీవి, అతని వాక్చాతుర్యం వెయ్యిమందిలో ఏవొకళ్ళలోనో కనబడతాయి. అతను సరళకు ఒక క్లాసు సీనియరు. ఆమెకు యౌవనం వచ్చాక స్వేచ్ఛగా మాట్లాడిన మొదటి పురుషు డతడే. అతనిలో వున్న సుగుణాలు ఆమెకు తెలుసును: అతనంటే ఆమెకు ఆప్యాయం లేకపోలేదు. కాని, అతడు తన భర్త కాడానికి తగడు. జీవితాన్ని తనహోదాకు తగినట్టు నడపలేడు. ఈనాడు తాను డాక్టరు గారి కుమార్తె. ఎంత సొమ్ముపాడినా తండ్రి ఏమీ అనడు. ఒక్కొక్కరోజు 'టాయిలెట్' చేసుకు పోతూంటే కాలేజీలో విద్యార్థులు ఒళ్లు మరచిపోతారు. ఆ ఘుమఘుమలకు తోటి విద్యార్థినులు అసూయపడతారు. సమక్షంలోనూ పరోక్షంలోనూ ఆమెమీద పూలవానే కురుస్తుంది. ఇలాంటి జీవితాన్ని రామ్మూర్తిచేతిలో పెడితే మళ్లీ ఈ జన్మలో మిత్రుల మొహాలు చూడగలదా!

వానలో తడిసివచ్చేక రాత్రి ఆమె మనస్సు పరిపరివిధాల పోయింది. ఆమెలో రాగద్వేషాలు ప్రకోపించేయి. రామ్మూర్తి ఈనాడు తన్ని అవమానించాడు. అతనిపని శృతిమించి రాగాన పడుతూంది. ఏం తలుస్తున్నాడో. అతన్ని ఆ యింట్లోంచి పంపెయ్యడమే శ్రేయస్కరం. ఈవిషయం తప్పకుండా తండ్రితో చెప్పాలి- దుష్టుల్ని దూరంగా వుంచమన్నారు. ఇలాగ సరళ ఆలోచిస్తూ నిద్రపోయింది.

మూడురోజుల తర్వాత రామ్మూర్తి గది ఖాళీ చేస్తున్నాడు. పెరట్లో నిలబడి సరళ మేడవైపే చూస్తోంది. ఆమెలో పశ్చాత్తాపం కలిగి, 'తప్పుచేశాను' అనుకుంది. పైన ఎవరో రామ్మూర్తిని అడుగుతున్నారు- "దీనికంతకీ కారణం ఏమిటిరా?" అని. "లోకపు తీర్పు" అన్నాడు రామ్మూర్తి.

ఆ తర్వాత నెలవల్లోనే సరళ పెళ్ళి స్థిరమయింది. యథావిధిగా సరళ చూసుకుంది కాబోయే భర్తను. అన్నివిధాలా తనకిసరిపోయినట్లే కనబడ్డాడు. ధనవంతుడు-రూపవంతుడు. వివాహమయ్యాక సరళ అత్తవారింటికి వచ్చేసింది. కాని రోజురోజూ ఆమె మారిపోతూంది. వెనక ఆమెలో వున్న ఉత్సాహం దినదినం చల్లారి పోతూంది. ప్రతీ చిన్న విషయానికీ అత్తగారు సాధిస్తుంది. ఆడపడుచులు అనుక్షణం అదుపాజ్ఞలలో వుంచడానికి ప్రయత్నం చేస్తారు. ఇక భర్త - తన వ్యాపారం, క్లబ్బు - ఇంతే. తనలో దినాని కో గంటయినా సుఖంగా గడపడు. ఇలాంటి వింత శత్రువులమధ్య నలుగుతూ ఆమె సరి అయిన దుస్తులేనా ధరించదు. ధరించవలసిన అవసరమే లేదు. వివాహిత స్త్రీ జీవితం ఇంత అధమంగా వుంటుందని ఆమెఎన్నడూ భావించలే దంతకుముందు

పూర్ణ చంద్రుడు మబ్బుచాటునుండి అప్పుడే బయటకు వచ్చాడు. 'వైవాహిక జీవిత సుఖాలకి ప్రేమగాని, ధనం ప్రధానం కాదు' అన్న రామ్మూర్తి సూత్రం అక్షరాలా నిజం అనుకుంది సరళ. ఎందుకో రామ్మూర్తి ఆమె కళ్లకు కనిపించాడు, మబ్బు ప్రక్క వెన్నెలలో-మళ్లీ ఆ మబ్బు చంద్రుణ్ణి కప్పేసింది. 'రామ్మూర్తి ఉత్తముడు, ఒక్కసారి వస్తే బాగుండును' అనుకుంది.

అతని పాదాలు పట్టుకుని ఏడిస్తే తన దుఃఖం శాంతిస్తుంది అనుకుంది సరళ. ఆమెకు తెలిసీ తెలియకుండానే ఆమె ఇంద్రియాలు, మనస్సు రామ్మూర్తికోసం పరితపిస్తున్నాయి. ప్రక్కయింటి ఆడుబిడ్డ పూజ ముగించి, తులసీదేవికి మంగళం పాడుతూంది. ఆమె కళ్లు అప్రయత్నంగానే వర్షించడం మొదలు పెట్టాయి. ఆక్షణంలో తనకు కలిగిన అనుభూతి యేమిటో నిర్వచించుకునే ముందే ఆమె సొయ్యిలా కుర్చీలో వ్రాలి వుంది. పూర్ణచంద్రుడు వెలికివచ్చి ఆమెకు శీతలోపచారాలు చెయ్యమని తన కిరణాలని పంపాడు. ఇంతలో వామనరావు వెనకనుండి వచ్చి సరళకళ్లు మూశాడు.

"రామూ" అంది సరళ ఉలిక్కిపడి.

"రాముడు కావాలా - క్రింద పనిచేసుకుంటున్నాడు, పిలవనా" అన్నాడు భర్త.

"అక్కర్లేదు" అంది సరళ.

"అయితే సరళా, ప్రతిదినం ఇదే సమయానికి ఏమిటి దీర్ఘంగా ఆలోచిస్తుంటావు?" అన్నాడు భర్త.

"ఏమీ లేదు" అంది ఆమె.

"చెప్పు సరళా. నాకు కాక ఇంకెవరికి చెబుతావు? నిన్ను ఎంతగా ప్రేమిస్తున్నానో... ఎంతగా..." అంటూ వామనరావు ఆమెబుగ్గలు నిమురుతున్నాడు.

"అంతగా ప్రేమించకండి" అంది సరళ అతని చేతిని అందుకుంటూ.

"అదేం మాటలు సరళా- ప్రేమ అగ్నిహోత్రంలా పవిత్రమైనది" అన్నాడు వామనరావు.

"ఔను. ప్రేమ అగ్నిహోత్రం లాంటిది. పంచభక్ష్య పరమాన్నాలు వండిపెట్టనూ గలదు. లేదా చితాగ్నిగా మారి భస్మం చెయ్యనూ గలదు" అంది సరళ, మనస్సు ఎక్కడో పెట్టి.

---


స్టార్ ఆఫ్ ఇండియా

పెన్సిళ్లకై

ది మద్రాస్ పెన్సిల్ ఫాక్టరీవారిని,

ఉత్తమ తరగతి అచ్చుపనులకు, లిథోప్రింటుంగునకు

హో అండ్ కంపెనీ వారిని

అన్ని రకములైన స్టేషనరీ పరికరములకు

వి. పెరుమాళ్ చెట్టి అండ్ సన్సు వారిని

సంప్రతించండి

వి. పెరుమాళ్ చెట్టి అండ్ సన్స్,

5, స్ట్రింగర్ వీధి మద్రాసు–1

# ఆసియా రాజ్యాలపై రష్యా అధిక శ్రద్ధ

తాడిమళ్ల జగన్నాథరావు

ప్రతిదేశపు రాజనీతీ పూర్తిగా కొన్ని ఆదర్శాల పైనే కాక అనేక తాత్కాలిక అవసరాలపై ఆధారపడి ఉంటుంది. అందుచేత ఇది మిశ్రమని ప్రతిదేశపు రాజనీతినీ నిర్వచించి చెప్పడం కష్టం. కొన్ని ఆదర్శాలను దృష్టిలో పెట్టుకొని అన్ని దేశాలూ తమ అంతరంగిక, వైదేశిక విధానాలను నిర్ణయించుకొనేమాట నిజమైనప్పటికీ, ఆ ఆదర్శాలను ఆ రాజ్యాలు అన్ని కాలాల పాటూ అచంచలంగా నిలుపుకోలేవు. అవసరాల ప్రాధాన్యం కొద్దీ ఆదర్శాలకు స్వస్తి చెప్పవలసి వస్తుంది. మిగతా దేశాల విధానాలను కొద్దిగానో గొప్పగానో ఊహించుకో వచ్చును, కాని రష్యా విధానాలను మటుకు ఊహించుకోవడం చాలా కష్టం. రష్యాలోని వాస్తవస్థితి దాని నావరించివున్న ఇనుపతెరవల్ల దురూహ్యంగా ఉంది. కాని రష్యా రాజనీతి ద్వారా ఉత్పన్నమైన కొన్ని రాజకీయ వివాదాలు మిగతా దేశాలలోని అనేకులను తన అనుచరులుగా చేసికోగలిగాయి. ఆర్థిక సహాయంతో అమెరికా అనేకులను తన వైపునకు త్రిప్పుకోగల్గితే, కేవలం వివాదాల ద్వారానే రష్యా తన అనుచరులను సృష్టించుకో గల్గింది. ప్రపంచంలోని అన్ని దేశాలలోను కమ్యూనిస్టు లున్నారు. క్షుధార్తులు అధికంగా ఉన్నచోట్ల, రాజకీయ ఆర్థిక బానిసత్వంలో మగ్గుతున్న దేశాలలోను కమ్యూనిస్టుల సంఖ్య అధికంగా కన్పిస్తుంది. ఇతర దేశాల్లోని కమ్యూనిస్టులకు తమ స్వదేశ విధానాల కన్నిటినీ రష్యా విదేశ విధానాని కనుగుణంగా మేళవిద్దామనే సంకల్పం ఉన్నట్టు, ప్రపంచసంఘటనల ద్వారా వ్యక్తం అవుతోంది.

తూర్పు యూరపు రాజ్యాలను రష్యా తన చెప్పుచేతల్లో నడిపించ చూసింది, చూస్తోంది. దేశీయ అవసరాల కన్న, అంతర్జాతీయ అవసరాలకే అధిక ప్రాధాన్యం ఇవ్వవలసి ఉంటుందని ట్రాట్స్కీ వెనుక వాదించాడు. అప్పట్లో స్టాలినుకు ఆ విధానం నచ్చలేదు. కాని నేడు కథ అడ్డం తిరిగింది. అంతర్జాతీయ అవసరాల ప్రాధాన్యాన్ని స్టాలిన్ గుర్తించాడు. అంటే సోవియట్ రష్యా ప్రపంచ పరిస్థితుల ద్వారా నిర్ణయించే అవసరాలముందు సోవియట్ రష్యా అనుచర రాజ్యాలవారు తమ స్వకీయ ప్రయోజనాలను కట్టిపెట్టవలసి ఉంటుంది. ఒక పని చెయ్యడం రష్యాకు అవసరమని తోస్తే, అది చేయడంవల్ల తన స్వదేశ అవసరాలకు గట్టిగా దెబ్బ తగులుతుందని గట్టిగా నమ్మినప్పటికీ, సోవియట్ రష్యా అనుసరిత రాజ్యం తన స్వదేశ అవసరాలను వెనుకకు పెట్టవలసి వస్తుంది. అలా తన స్వకీయ ప్రయోజనాలను బలిదానం చేసికోడానికి నిరాకరించినట్లయితే ఆ అనుసరిత రాజ్యం సోవియట్ రష్యా ఆగ్రహ దృష్టిలో పడుతుంది.

ఆవిధంగా సోవియట్ రష్యా ఆగ్రహావేశాలకు గురియైన దేశాలలో ప్రముఖమైనది యుగోస్లావియా. స్వకీయ అవసరాలకు ప్రాధాన్యం ఇచ్చిన కారణంగా మార్షల్ జోసఫ్ టిటో రష్యా ఆగ్రహానికి గురి అయాడు. టిటో చేసిన అపచారమల్లా తనను ఒక యుగోస్లావియన్‌గా అతడు ఎంచుకోవడమే. సుమారు పదహారు నెలలుగా, యుగోస్లావియా రష్యాలకు వివాదం సాగుతూ వస్తోంది. యుగోస్లావియాలో అధిక సంఖ్యాకుల అభిమానాన్ని టిటో చూరగొన్న కారణంగా రష్యా అతనిపై ఇంతవరకు ప్రత్యక్ష చర్య ఏమీ తీసికోలేకపోయింది. లేకపోతే బాల్కన్ సమాఖ్య సందర్భంలో రష్యా ఆగ్రహానికి ఆహుతి అయిన డిమిట్రాఫ్ మార్గాన్నే ఈపాటికి టిటో కూడా పోవలసివుండేది.

రష్యా ఆశయాలకు విరుద్ధాశయాలుగల తూర్పు యూరపు ప్రజలు అణచి వేయబడుతున్నారు. చెకోస్లొవాకియాలో, బల్గేరియాలో విపరీతంగా అరెస్టులు జరిగిపోతున్నాయి. హంగరీ మాజీ విదేశాంగమంత్రి రజక్, ఆయనతో మరి ఇద్దరు ఉరి తీయబడ్డారు. ఇటీవలగా బల్గేరియాలో జరుగుతున్న విపరీతమైన అరెస్టులు పరికిస్తే బల్గేరియాకూడా యుగోస్లావియా మార్గం తొక్కుతుందా అనే సందేహానికి అస్కారాలు కల్గుతున్నాయి. బల్గేరియా కమ్యూనిస్టు పక్ష పొలిట్ బ్యూరో సభ్యుడు ఒకరు అరెస్టు అయినట్లు 'బోర్బా' అనే యుగోస్లావియా పత్రికలో 'ఇవాన్ కారయనోవ్' అనే మాజీ బల్గేరియా కమ్యూనిస్టు పార్టీ సభ్యుడు ప్రకటించాడు. తూర్పు యూరపు రాజ్యాలను తన గుప్పిట్లో ఉంచుకొనే సందర్భంలో రష్యా నెదుర్కొంటున్న చిక్కులను విశదీకరించాడు.

ఇక గ్రీసువిషయంగూడా రష్యా కంత ఆశాజనకంగా లేదు. గ్రీసు గెరిల్లాలు తమ అంతర్యుద్ధానికి స్వస్తి చెప్పవలసి వచ్చింది. దేశం సర్వనాశనం కాకుండా ఉంచడానికే ఈ నిర్ణయం చెయ్యబడిందని 'స్వతంత్ర గ్రీసు రేడియో' ప్రకటించినా, ఈ అంతర్యుద్ధ విరమణలోని అంతరార్థం అవగాహన కాకపోదు. గ్రీసులో యుద్ధం సమాప్తమయినట్లు ప్రకటించిన కొద్దికాలానికే, అటు అల్బేనియాలో గ్రీకు గెరిల్లా దళాలు సమీకరింప బడుతున్నట్లు, యుగోస్లావియా దక్షిణ రాష్ట్రమయిన మాసిడోనియాను తన అనుచరులద్వారా రెచ్చగొట్టి టిటోకు కష్టం కల్గించాలని రష్యా సంకల్పమైనట్లు వార్తలు ప్రచురితమౌతున్నాయి. యుగోస్లావియా మీద రష్యా దాడిచేస్తే అది తృతీయ ప్రపంచ సంగ్రామానికే తప్పక దారి తీయగలదనీ, రష్యా తమపైబడితే తాము ఐక్యరాజ్యసమితికి వెన్వెంటనే సహాయార్థం విజ్ఞప్తి చేస్తామనీ టిటో రష్యాను హెచ్చరించాడు.

ఇవి ఇలా ఉండగా భద్రతా సమితికి ఎన్నికలు వచ్చాయి. అందులో యుగోస్లావియా ఎన్నిక కాకుండా రష్యా విశ్వప్రయత్నం చేసింది. భద్రతా మండలికి యుగోస్లావియా ఎన్నుకోబడ్డట్లయితే రష్యా సమితినుండే వైతొలగి



పోవచ్చుననే బెదిరింపు ఒకటి చేయబడ్డట్లు కూడ వార్తలు వెలువడ్డాయి. 'భద్రతా మండలికి సభ్యుల నెన్నుకొనే విషయంలో ప్రాదేశిక ప్రాతినిధ్యాన్ని బాగా అనుసరించాలి. తూర్పు యూరపుకు ప్రాతినిధ్యం వహించకల్గింది చెకోస్లొవాకియాయే. దానికి కాకబలవంతాన్ని యుగోస్లావియాకు స్థానం కల్పిస్తే సమితిలో కక్షలేర్పడి సమితి నిస్సారం అయిపోతుంది. యుగోస్లావియా ఎన్నికయినట్లయితే దానిని ధర్మబద్ధమైనదిగాను, న్యాయయుక్తమైనదిగాను మేము గుర్తించం' అని విషిన్స్కీ హెచ్చరించిన రెండు రోజులలో జరిగిన ఎన్నికలలో యుగోస్లావియాకు స్థానం లభించింది. ఈ ఎన్నికను ధర్మబద్ధమైన దానిగా గుర్తించలేమని చెప్పడంతప్ప ఇంకేమీ విషిన్‌స్కీ చెప్పలేదు. మున్ముందు ఐక్యరాజ్య సమితిలో రష్యా ప్రవర్తన ఎలా ఉంటుందో, యుగోస్లావియా ఎన్నిక పర్యవసానం ఎలా పరిణమిస్తుందో ఊహించలేము. ఏది ఎలా అయినా తూర్పు యూరపు, బాల్కన్ తంత్రాల విషయంలో రష్యా రాజనీతికి నిరాటంకమైన బాట ఏర్పడ లేదనే చెప్పవలసి వస్తుంది.

యూరపు వ్యవహారాలు పైవిధంగా ఉంటంమూలాని, రష్యా ఆసియా, ముఖ్యంగా దూరప్రాచ్య వ్యవహారాలవైపు తన దృష్టిని మరలుస్తోంది. ఈ ప్రాంతంలో చెయ్యి చేసుకోడానికి సావకాశాలు చాలా కన్పిస్తున్నాయి. కొద్ది నెలల యుద్ధం పర్యవసానంగా చైనాలోని అధిక భాగం రష్యా సానుభూతిపరుల స్వాధీనం అయింది. దూరప్రాచ్యంలో విజయం సాధించాలనే అభిప్రాయం అధికం అవుతూ ఉండటంవల్ల రష్యా బాల్కన్ రాజ్యాలలో తన ఆశయాలకు స్వస్తి చెప్తోంది. బాల్కన్ రక్షణ యుగోస్లావియా చీలికతో బలహీనం అయింది. దూరప్రాచ్యంలో కమ్యూనిస్టు సిద్ధాంతాలపై ఆదరణ అధికంగా గోచరిస్తోంది. కాబట్టి ఇకముందు రష్యా దూరప్రాచ్యంలో అత్యధిక శ్రద్ధ చూపుతుందనే విషయం సుస్పష్టం. ఆసియా, దూరప్రాచ్యాల ప్రాధాన్యం అంతర్జాతీయ రంగంలో నానాటికీ అధికంగా పరిణమించడానికి కారణం ఇదే. ఇండియాను అమెరికా ఆహ్వానించినా, పాకిస్తానును రష్యా ఆహ్వానించినా కారణం ఇదే.

రష్యా అమెరికాల విభిన్న భావాలు పాకిస్తాను, ఇండియాలలో ప్రతిఫలం చెందకుండామటుకు ఇరు దేశాలవారూ గమనిస్తూ ఉండాలి. రెండు దేశాలవారూ రెండు దేశాల ప్రాభవాలకూ పూర్తిగా తల ఒగ్గితే ఫలితం సులభ గ్రాహ్యమే. పండిత నెహరూ) చెప్పినట్లు, కమ్యూనిజం- ధనిక వాదాలు రెంటికీ ఒకేచోట స్థానం లేదు. రెంటిలో ఒక్కటిమాత్రమే నిలుస్తుంది. ఎక్కడ ఏది ఎక్కువ ప్రయోజనకారిగా పరిణమిస్తే అక్కడ అది నెగ్గుతుంది. కాబట్టి ఆసియా దూర ప్రాచ్య వ్యవహారాలలో రష్యా జోక్యం కల్పించుకొని విజయం సాధించకలిగేదీ, లేనిదీ రష్యా జోక్యంవల్ల కలుగబోయే ప్రయోజనాలపై ఆధారపడి ఉంటుంది.

---

# ఐదు నిమిషాలు

కోటంరాజు జనార్ధనరావు

సర్వసాధారణంగా ప్రతి మానవుడూ తన జీవితంలో ఒక ఆశయాన్ని పెట్టుకుని, ఆ ఆశయ సిద్ధికై అనుక్షణమూ ప్రయత్నిస్తూ వుంటాడు. ఆ ఆశయంలేందే మానవుడు జీవించలేడు. ఒకడు జవహర్‌లాలంత నాయకుణ్ణి అవుదా మనుకుంటాడు. ఇంకొకడు పృధ్వీరాజంతటి యాక్టరు నవుదా మనుకుంటాడు. మరొకడు ఏ శరత్ బాబంతటి రచయితనో అవుదా మనుకుంటాడు. దానికై తనకు తెలియకుండా కృషి చేస్తూనే వుంటాడు. ఆ విధంగానే మరి కొంతమంది మానవులు తమకు తెలియకుండానే కొన్ని కొన్ని ఆశయాలను పెట్టుకుని, అవి నెరవేరే వరకూ నిరీక్షిస్తూ వుంటారు. ఒకొక్కప్పుడు ఆ ఆశయాలు నెరవేరకుండానే, వాళ్ల వాళ్ల జీవితాలు గడచిపోతాయి.

ఆ విధంగానే, ఏ 'నసీమ్' లాంటి సుందరినో భార్యగా కోరుకోటం వల్లనో లేక సంవత్సరానికి ఆరు పిక్చర్లలో యాక్టు చేస్తున్న 'సురయ' లాంటి ధనవంతురాలే ధర్మపత్ని కావా లనుకోటం వల్లనో నా వివాహం మామూలుగా జరిగే వయస్సులో జరగకుండా, కాస్త ముందుకు నెట్టివేయబడింది. నా యీ ఆదర్శాల వల్లనే, నాకు సామాన్యంగా గృహకార్యాలకు పనికివచ్చే స్త్రీ నచ్చకుండా పోయింది. ఈ విషయాలు తెలిసిన బంధుకోటి, 'ఇక వీడికి పెళ్లి కాదేమో!' నని చాటుగుండా భయపడుతూనే వచ్చారు. వాళ్ల వాళ్ళ పిల్లలను ఒప్పుకోనందున, కోపంతో ఆయా పిల్లల తల్లిదండ్రులు 'నాకు ఏ కొక్కిరాయో, ఏ కొండముచ్చో భార్యగావస్తుం'దనిదీవిస్తూ వుండేవారు. అయినప్పటికీ నేను నాలోని పట్టుదల, వాంఛ వదలలేదు. కాని ఈ 'పోస్ట్‌పోన్‌మెంట్' నా జీవితంలో వృథా కాలేదని చెప్పగలను. ఈ కాలంలో నేను నిరుపయోగమైన జీవితాన్ని గడపలేదు. పైగా నిరుపయోగమైన శిక్షణా పొందలేదు. ఈ ఖాళీలో నేను చాలా పుస్తకాలు చదివాను, పెక్కు రచయితలు నాకు చిరపరిచితులయారు. పోగా నాకు చాలా ఆశ్చర్యం కలిగింది—'ఒక రచయిత దేశానికెంత అభ్యుదయాన్ని తేగలడా!' అని. అటువంటి రచనలను వ్రాసే రచయితలు మాత్రమే దేశానికెంతో అవసరమని తోచింది.

ఈ మహనీయుల రచనలను చదవటం వల్లనో, లేక అనుభవజ్ఞులైన మా మాస్టరుగారి లాంటివారితో తిరగటం వల్లనో నా జీవితంలో ఒక క్రమశిక్షణ లభించింది. అది నా ముందు జీవితంలో జరిగిన సంఘటనకు చాలా తోడ్పడింది.

ఒకనాడు మా యింట్లో, నాకు పెళ్ళి సంబంధం వచ్చిందనీ, ఆనాటి సాయంత్రమే వెళ్లి చూడాలనీ అన్నారు. సరే, ఇంతకు పూర్వం అలవాటుగా జరుగుతున్న విషయమే కనుక, యథావిధిగా అలంకరించుకుని, పెళ్లికూతురిని చూడటానికి వెళ్లాను. మా ఫలహారాల, హాస్య సంభాషణల అనంతరం, ఒక రమణీలలామ తన రూపురేఖా విలాసాలకు శోభ నిచ్చేందుకు పట్టు

వస్త్రాల అలంకరణలతో మా కెదురుగా వచ్చి తలవంచుకుని కూర్చుంది. పెద్దవాళ్ళందరూ, నాకు ఆ అమ్మాయిని చూడటానికి 'ఛాన్సు' యివ్వటానికన్నట్లు, ఏదో రాజకీయాలు మాట్లాడుకుంటూ కూర్చున్నారు.

ఆ అమ్మాయిని చూసేటప్పటికి మొదటగా నాకు నవ్వు వచ్చింది. ఇక కొంటెతనం ప్రారంభమైంది నాలో......ఆ అమ్మాయికి వద్దనిమిది, పంథొమ్మిదేళ్ళ వయస్సుంటుంది. బహుశః ఆ అమ్మాయికి కూడా ఒక జగదేక సుందరుణ్ణి భర్తగా పొందాలనే ఆశయం వుండటం వల్ల కాబోలు, ఇంత వరకూ ఆమెకు వివాహం కాలేదనుకున్నాను. సరే- నేటికి నేను ప్రత్యక్షమైనాను కదా, ఆ అమ్మాయి కోరిక నెరవేరిందనుకున్నాను. మరి నాకోరిక—? ఆ అమ్మాయిలాంటి రూపవిహీనురాం డ్రీలోకంలో చాలా అరుదుగా వుంటారు.

'ప్రపంచంలో ఇంత రూపవిహీనులు కూడా వుంటారా!' అని ఆశ్చర్యపోతూ ఆ అమ్మాయి వంక చూస్తూవుండగా, ఎక్కడో 'డి. యల్. రాయ్' పుస్తకంలో చదివిన 'సహృదయుల ముఖవర్చస్సు చాలా ఆకర్షణీయంగా వుంటుం' దన్నది జ్ఞప్తికి వచ్చింది. అటువంటప్పుడు ఈ అమ్మాయి...నాకు చాలా భయం కలిగించింది. ఇక లేద్దామని సర్దుకోబోతూండగా తల వంచుకున్న ఆ అమ్మాయి నావంక చూసింది. కదలబోతున్న నన్ను ఆమె కళ్ళు కట్టేశాయి. ఆ కళ్ళవంకే చూస్తూ వుండిపోయాను. 'వివాహ మంటపంలో తెర తీయగానే, భార్యాభర్తల నడుమ ప్రప్రథమంగా కలిగే హావభావ విలాసాలు మా యిద్దరిమధ్యా కలుగుతున్నాయా!' అనిపించింది.

ఇదివరకు చదివిన పుస్తకాల్లోని పుటలు, అనుభవసారాంశాలు కొక్కొక్కటిగా గుర్తుకు వస్తున్నాయి. నా అభిమాన రచయిత 'శరత్ బాబు' ప్రప్రథమంగా జ్ఞప్తికి వచ్చాడు. అతని రచనలు ఒకదాని వెంబడి ఒకటిగా నా బుర్రలో తిరగటం ప్రారంభించాయి. 'ఓ మహాకవీ! జోహారు' అంది నా మనస్సు. ఎంతమంది రూపవిహీనురాండ్రలో ఊహించలేనంత హృదయపు లోతులను చూపించావు! తన 'అరక్షణీయ'లోని 'జ్ఞానద' జీవితం చదివిన ప్రతి వ్యక్తిలోను నా యీ ఘర్షణ ప్రారంభించక తప్పదు. అటువంటి రచన చదివిన ప్రతివ్యక్తికి అనాకారులైన వారిలో మనకు తెలియని లోతుపాతులు తప్పకుండా కనిపిస్తాయి. ఆ అమ్మాయి వంక చూస్తూంటే నా చూపులు ఎక్కడో ఆమెలో అణగి మణగివున్న సుగుణాలను, సహృదయతని గుర్తించిన ట్లనిపించింది. ఏవో మధురస్రవంతులు ఆమెలో ప్రవహిస్తున్న ట్లనిపించింది—

మళ్ళీ భౌతికవాంఛ జ్ఞప్తికి వచ్చింది. నా ఆదర్శాలు నన్ను చూసి వెక్కిరించాయి. కనీసం 'చలం'గారు 'మైదానం'లో వ్రాసిన మీరగారి భార్యలాంటి అందకత్తెనైనా, లేక 'అనసూయ' లాంటి రూపవతినైనా భార్యగా పొందకపోతే ఎలాగా అనిపించింది. కాని వెంటనే వాళ్ళ వెనకవున్న చరిత్ర జ్ఞప్తికి వచ్చి, ఒళ్లు జలదరించింది. శరత్ బాబు 'శ్రీకాంత్'లోని 'అన్నదా, దీదీ' జ్ఞప్తికి వచ్చింది. 'ఇటువంటి అల్పులలో అనాకారులలో ఇంతటి సుగుణ సంపద లున్నాయా!' అనిపించింది మొదటగా నన్నావహించిన 'డి యల్. రాయ్' అదృశ్యుడైపోయాడు. చలంగారు అసలు మళ్ళీ జ్ఞప్తికే రాలేదు.

కాని ఇంతకుపూర్వం చెప్పినట్లు ఆమె గుణగణాలనైతే ఆమె కళ్ళల్లో తెలుసుకోగలిగాను గాని, ఆమె రూపాన్నిమటుకు పూర్తిగా మరచిపోలేకపోయాను. మళ్ళీ నామనస్సు సందిగ్ధంలో పడింది—అబ్బా! "యుక్త వయస్సులోవున్న ఒక యువతి అందచందాల్ని నిర్ణయించడం ఎంత కష్టం!" అనిపించింది. మా మాస్టరుగారు చెప్పిన మాటలు చెవుల్లో ప్రతిధ్వనించాయి-ఒకనాడు మేము హోటలులో కాఫీ తాగుతూ, కవులను గురించి చర్చిస్తుండగా, ఈ విషయమే వచ్చింది. ఇప్పుడు కవుల విమర్శని వదలివేసి...మా మాస్టరుగారు 'రూపురేఖలను' గురించి అన్న మాటలు చెబుతున్నాను. అనుభవజ్ఞులైన ఆయన ఈ జగత్తులో ఒక విచిత్రమైన అనుభూతిని పొందారు. జీవితం చాలా తరచి చూశారు ... చివరకు తేల్చిందేమిటంటే—"బైటకు అందంగాను, ఆకర్షణీయంగాను వున్నవారి హృదయాలు కఠోరములనీ,

పాషాణములనీ, లేకపోతే విషతుల్యాలుకూడా అనీ; బైటకు వికారంగావున్న వారి హృదయాలు అతి సున్నితములనీ, మృదు మధురములనీ". ఆయన అనుభవం మళ్లీ నన్నా పిల్లవైపు మొగ్గేటట్లు చేసింది.

నాలో ఈ ఘర్షణ త్రీవంగా సాగుతోంది. బహుశః అప్పటికి "నాలుగు నిమిషాలు" గడచి వుంటాయి. నాలోని ఈ ఘర్షణ నా ముఖంలో కనపడుతోందో యేమో, ఆ అమ్మాయి నావంక అలాగే చూస్తూ వుండిపోయింది. ఇంతలో వంటయింట్లోంచి, "అట్లాంటి కోతిని ఎవరు చేసుకుంటారు!" అన్న కంఠధ్వని సన్నగా వినపడింది. నా హృదయానికి ఒక్క దెబ్బ తగిలినట్లయింది. నేను వులిక్కిపడి తేరుకోబోతుండగా, ఆ అమ్మాయి కళ్ళవెంబడి నీరు ప్రవహించడం ప్రారంభించింది. తర్వాత తెలిసింది, ఆ కంఠధ్వని అమ్మాయి సవతి తల్లిదని.

అబ్బ! ఆ అమ్మాయి నిస్సహాయత, నిరాశ చూస్తూంటే నాకు తెలియని ఆవేదన కలిగింది. వేదనతో కూడిన ఆమె ముఖాన్ని చూస్తూంటే నా కళ్లు తడి అయాయి. "ఐదు నిమిషాలు" పూర్తయింది. ఇక మానాన్నగారు, "అమ్మాయీ, నువ్వు వెళ్ళవచ్చునమ్మా!" అన్నారు. ఆ అమ్మాయి లేచి నిలబడి, చేతుల్లో ముఖాన్ని కప్పుకుని వెక్కి వెక్కి ఏడుస్తూ, తనకు తెలియకుండానే చకచకా నడచి వెళ్లిపోయింది.

ఏమయినప్పటికీ ఆ అమ్మాయినే భార్యగా స్వీకరించాలని నా అంతరాత్మ బోధించింది... అలాగే జరిగిందికూడాను. మా సంసారయాత్ర సాగినకొద్దీ, మా మాష్టరుగారు అప్పుడు పాఠాలలో చెప్పిన మాటలు అక్షరాలా యథార్థమేనని, నాకు నేను అనుభవపూర్వకంగా తెలిసికో గలిగాను. అప్పటినుంచీ మా సంసారయాత్ర మరింత శాంతంగాను, సుఖవంతంగాను నడచిపోతోంది.


శుభ్రమైన చలువ....






(గతసంచిక తరువాయి)

## సాళువ నరసింహరాయలు

(క్రీ. శ. ౧౪౮౫-౧౪౯౦)

సంగమ రాజవంశమును దుదముట్టించి సాళువ నరసింహరాయలు పట్టాభిషిక్తుడైన పిమ్మట చిరకాలము సామ్రాజ్యము నేల లేదు; అతడు పరిపాలించిన కాలము స్వల్పము. కాలజ్ఞానములం దతడేలినది మూడేండ్ల కాలమని చెప్పియున్నది. శాసన సాక్ష్యమునుబట్టి చూడగా గొంచె మించుమించుగ నీకాలము సరియైనదేయని తెలియవచ్చుచున్నది. ప్రౌఢ దేవరాయలను బాఱదోలి యతడు సామ్రాజ్య పట్టాభిషేకము గావించుకొన్నది క్రీ.శ. ౧౪౮౬వ సంవత్సరము కడపట; క్రీ. శ. ౧౪౯౦వ సంవత్సరాంతముననో మరుసటియేటి ప్రారంభముననో అతడు కాలధర్మము నందెను. అతడు వజ్రసింహాసనాసీనుడై పృథ్వీ సామ్రాజ్యము నేలిన మూడు నాల్గేండ్లును బహిరంతర శత్రువర్గముతో నెడతెగక పోరవలసి వచ్చెను. కావున నిజాధికారమును సుస్థిరముగ స్థాపించి నిరుపద్రవమైన రాజ్యమును దన పుత్రులకు నైవసము జేసి చనుటకతనికి వ్యవధి లేకపోయెను; రాజ్యాక్రమణ మధికారనిర్వహణముకంటె సులభతరమైన కార్యమని యతనికెఱుకపడినది; రాజ్యాక్రమణ కార్యమున నతనికి దోడ్పడిన సామంతులును నాయకులును అతనియాధిపత్యము నంగీకరింపక విముఖులై; అందున నాతడు తన పూర్వ సాహాయ్యులతో పోరాడవలసి వచ్చెను.

సాళువ నరసింహరాయల యాధిపత్యము నంగీకరింపక ప్రతిఘటించిన వారిలో గండికోట సీమలోని పెరనిపాడు నివాసస్థలముగా గల సంబెటవారును, హొయ్సళ రాజ్యమునందుమ్మత్తూరు తలకాడులను బాలించుచుండిన పాలెగాండ్రును ముఖ్యులు. సంబెట శివరాజు విజయనగర రాజధానియందు సంభవించిన విప్లవమును సందు చేసికొని తాను రాయల కీయవలసిన కప్పమును జెల్లింపకపోవుటయే కాక రాయల యధికారమును ధిక్కరించి చుట్టుపట్టనుండిన సీమలనుండి పన్ను పర్యాయములను వసూలుచేసి వెచ్చపెట్టుకొనగడగెను; అతని జ్ఞాతియగు సంబెట వీరనరసింహుడు తిరుగుబాటు చేసి, పరిసర ప్రదేశములను ధారామార్గమున సరకులను గొనిపోవు వర్తకులను దోచుకొన నారంభించెను. సాళువ నరసింహరాయలు వారిమీదికి సైన్యముతోకూడ వంకరకుమార బసివినాయని బంపెను. శివరా జతని నెదిర్చిపోటు లాడెను; కాని నిర్వహించుకొనజాలకపోయెను; బసివినాయని ధాటికి నిలువ జాలక శివరాజు కాటపట్టయిన మద్దిగుండాల దుర్గము నేలమట్టమువఱకు జదునాయెను; శివరాజు సంస్థానము రాయలకు హస్తగతమాయెను.

మైసూరు తులు దేశములను పాలించుచుండిన యుమ్మత్తూరు సంగీతపుర పాలెగాండ్రు కూడ సాళువ నరసింహుని యాధిపత్యము నొప్పుకొనక ధిక్కరించిరి; వీరిని జయించుట కత డెట్టి ప్రయత్నముల నొనర్చెనో తెలియదు; ఎట్లో సంగీతపుర మతని కడపటి యేండ్లలో స్వాధీనపడినను, యతని మరణకాలము వఱకు నుమ్మత్తూరు దుర్జయమై రాయల యేలుబడి క్రిందికి రాక యుండెను.

సాళువ నరసింహరాయలు సామ్రాజ్యాధిపత్యమును వహించిన పిమ్మట నడచిన చరిత్రాంశములలో నుదయగిరిపై వచ్చిన యుత్కళ దండయాత్ర ప్రధానమైనది. క్రీ. శ. ౧౪౭౦ వ సంవత్సరమున కపిలేశ్వర గజపతి నోడించి స్వాధీనము జేసికొని నప్పటినుండియు నుదయగిరి సాళువ నరసింగరాయల స్వాధీనమై యుండెను. క్రీ. శ. ౧౪౮౨ వ సం॥నం బిమ్మడి మహమ్మదు షాహు మరణానంతరము తెలింగాణమున బహమనీ సుల్తానుల యధికారము క్షీణించెను; విజయనగర సింహాసనాక్రమణోద్యోగమున సాళువ నరసింహుడు నిమగ్నుడై యుండెను; ఈ కారణముల వలన ఓఢ్రవారి కడ్డపడగలిగిన వారెవ్వరును లేకపోయిరి. పురుషోత్తమ గజపతి సమయ మనుకూలమై యుండుటను జక్కగ గుర్తించి, క్రీ. శ. ౧౪౮౪-౮౫ వ సంవత్సరమున ఏనుగొండ పర్యంతము వ్యాప్తమై యుండిన తీరాంధ్రభూమిని జయించి వశపఱచుకొనెను; కాని తీరాంధ్రమునకు దక్షిణద్వార మనదగు నుదయగిరి కైవసమగువఱకు నతని యధికార మచట స్థిరమై నిలుచునను నమ్మక మతనికి గలుగలేదు; కావున కొండవీటి రాజ్యమంతయు స్వాధీనపడిన పిమ్మట పురుషోత్తమ గజపతి దండెత్తివచ్చి యుదయగిరి కోటను ముట్టడించెను. పురుషోత్తము డుదయగిరి నెప్పుడు ముట్టడించెనో నిశ్చయించి చెప్పుటకు వీలుపడకపోయినను, అది క్రీ. శ. ౧౪౮౯ వ సం॥నకు పూర్వము జరిగియుండదు; ఏలనగా సరస్వతీ విలాసములోను, అనంతవరం తామ్రపట్టికలయందును పురుషోత్తమ గజపతి యుదయగిరిని ముట్టడించినపుడు సాళువ నరసింహుడు కర్ణాటాధిపతి యని చెప్పియున్నది. క్రీ. శ. ౧౪౮౫ వ సం॥ కట్టకడపట సాళువ నరసింహుడు కర్ణాట సింహాసనము నాక్రమించుకొని రాజ్యాభిషేకము జేసికొని యుండుట వలన, పురుషోత్తమ గజపతి యుదయగిరిని ముట్టడించినది క్రీ. శ. ౧౪౮౯ వ సం॥నో తదనంతరముననో కావలయును గాని తత్పూర్వము గాజాలదు. ఉదయగిరి ముట్టడి జయప్రదముగ కొనసాగినది; ముట్టడికాలమున దుర్గమును సంరక్షించుటకొఱకు వచ్చియుండిన సాళువ నరసింహరాయలు పురుషోత్తముని చేతిక్కి బందీకృతు డాయెనట; ఉదయగిరి దుర్గమును పురుషోత్తమునికి సమర్పించి విడుదల నందెనట. దీని సత్యాసత్యములను రుజువు సేయగల సాధనాంతరము లింకను లభ్యపడలేదు; సాళువ నరసింహుడు గజపతిచే వాస్తవముగ బందీకృతుడైనను గాకపోయినను, ఉదయగిరి కోలుపోకనుగూర్చి సంశయమున కెడము లేదు; సాళువ నరసింహుని యనంతర మీ దుర్గము గజపతుల యధీనమందుండుటయే దీనికి నిదర్శనము; మఱియు, పోర్చుగీసు ఇతిహాసికుడగు న్యూనిజుసాక్ష్య మీ యభిప్రాయమును బలపఱచుచున్నది. మరణకాల మాసన్నమగుటచే దనకు రాచూరు, కొండవీడు, ఉదయగిరి దుర్గములను శత్రువులనుండి మరల జయించుటకు సాధ్యము గాకపోయె ననియు, దన యనంతరము రాయసింహాసనము నధిష్ఠించువారీ మూడు దుర్గముల నెట్లయిన సాధింప వలసిన దనియు సాళువ నరసింహుడు దన మరణ కాలమునందాజ్ఞాపించెనని న్యూనిజు తెలియ జేయుచున్నాడు. పురుషోత్తముని యుదయగిరి విజయమునకు విజయనగర సామ్రాజ్యాంతర్గత రాజకీయ సంక్షోభమే ముఖ్యకారణము.

క్రీ. శ. ౧౪౯౧ వ సంవత్సర ప్రారంభమున సాళువ నరసింహరాయలు దేహము చాలించెను; అతనిపుత్రు లిరువురును స్వయముగ రాజకార్యముల నిర్వహింపజాలని యర్భకులగుటవలన, దన మరణకాలమున మంత్రియగు నరసానాయకుని బిలిపించి యతనిని వారికి బోషకునిగను సామ్రాజ్య సంరక్షకునిగను నియమించి; పెద్ద వారైన పిమ్మట వారిలో నెవ్వడు రాజ్యార్హుడో వానిని గద్దె నెక్కింపవలసినదని యాజ్ఞాపించి ప్రాణములను విసర్జించెను. సాళువ నర

సింహరాయలు విజయనగర సామ్రాజ్యమునకు జేసిన సేవను దగురీతిని ప్రశంసించి పల్కుట సులభసాధ్యముగాదు. స్వామిద్రోహము గావించి సింహాసనమును బలాత్కారముగ గైకొనలేదా యని విచికిత్సాపరులు ప్రశ్న వేయవచ్చును. సాళువ నరసింహుడు సంగమ వంశజులను వెడల నడచి సామ్రాజ్యము నాక్రమించుకొన్న మాట వాస్తవమే; కాని సామ్రాజ్యైక్యమును జెడనీయక నిలబెట్టుటకును, హిందూధర్మ సంరక్షణ నిమిత్తమును దుశ్చరిత్రులైన కడపటి సంగమ వంశజులను వెడల నడచి సింహాసనము నాక్రమించుకొనుట యత్యంతావశ్యక మాయెను. అచటనచట బొడవడు సామ్రాజ్య విచ్ఛేద చిహ్నముల కంటెను, గజపతి బలములకంటెను దరతరముగ ఝంఝానిల తరంగములవలె బెల్లుగ బైకొని వచ్చు తురకతండము లతని కెక్కుడు భయంకరములుగ గానవచ్చినవి. కావున, సనాతనధర్మోద్ధారణకొఱకును, గోబ్రాహ్మణ సంరక్షణార్థమును సంస్థాపితమైన రాయ సామ్రాజ్యమును వానిని జేరనీయక తఱుముగొట్టుటయె తన రాజరికమునకు బరమావధియని యతడు నిశ్చయించెను. ఈ కార్యము నెరవేర్చుటకొఱకే సత్త్వహీనులైన సంగమ వంశజులను వెడలనడచినది. వజ్ర సింహాసనము నధిష్ఠించిన పిమ్మట నతడు రాజ్యస్థితి యందు గొప్ప మార్పును గలిగించెను; అరబీ వర్తకులతో సఖ్యము నెరపి యుత్తమాశ్వములను వారియొద్ద విలిచి, యశ్వ సైన్యమును జక్కగ నభివృద్ధి గావించెను; అతని వెనుక సామ్రాజ్య పదమునకు వచ్చిన విజయనగర చక్రవర్తుల జైత్రయాత్రలను విజయవంతములుగ గొనసాగించుటకీ యశ్వ సేన జాల సహకారియైనది. మఱియు శాంతవృత్తిని జీనయాత్రను సాగించుచుండిన జనులకు రణాలాలసత గల్గించి శూరుల గావించి. మహమ్మదీయుల తోడను నొడ్డెల తోడను రణరంగమున బరిపోరునట్లు, తీర్చెను. సాళువ నరసింహుని కృషికి ఫలితముగ దార్ఢ్యము జెడి శిథిలావస్థ యందుండిన రాజ్యాంగములు సత్త్వవంతములైనవి; విచ్ఛిన్నమై పోవుచుండిన రాయసామ్రాజ్యము పునరుజ్జీవితమైనది.

## సాళువ నరసింహుని పుత్రులు

(క్రీ. శ. ౧౪౯౦-౧౫౦౫)

సాళువ నరసింహుని పుత్రు లిరువురు గలరని పూర్వప్రకరణమున జెప్పియున్నది. వారియందు జ్యేష్ఠుడు తిమ్మరాజు; తండ్రికాలమున నితడు యౌవరాజ్యమునకు బట్టాభిషిక్తు డాయెను. కనిష్ఠుని పేరు నరసింహుడు; వజ్రసింహాసనాసీనులైన నరసింహ నామధేయులలో రెండవ వాడగుటచే నితని కిమ్మడి నరసింహు డను పేరు వచ్చినది. మఱియు నితనికి తమ్మ లేక దమ్మరాయ డను నామాంతరము గూడ గలదు.

సాళువ నరసింహుడు పరమపదమును బొందిన పిమ్మట నతనిచే రాజ్యసంరక్షకుడుగ నియమింప బడిన నరసానాయకుడు రాజపుత్రులలో బెద్దవాడైన తిమ్మరాజును సింహాసనాధిష్ఠితుని గావించి, యతడు స్వయముగ రాజ్యపాలన సేయనేరని పసిబాలు డగుటచేత రాయలకు బ్రాపై యతని పక్షమున దానే సామ్రాజ్యమును నేలగడగెను. తిమ్మరాజు రాజ్యకాల మత్యల్పము. సింహాసనము నధిష్ఠించిన పిమ్మట కొన్ని దినములలో నతడు దన ప్రాణము గోల్పోయెను. తిమ్మరాజు మరణ విషయమై చరిత్రకారులందు గొంతయభిప్రాయ భేదము గానవచ్చుచున్నది. పోర్చుగీసు చరిత్రకారుడగు న్యూని జిట్లు వ్రాయుచున్నాడు: "(సాళువ నరసింహ) రాయల మరణానంతరము నరసానాయకుడు రాజ్యమునకు బాలకుడై, సక్వరమ రాజకుమారుని సామ్రాజ్య పట్టాభిషిక్తుని గావించెను; కాని భండారమును రాష్ట్రమునుండి చేకూడు నాయమును సమస్తమును దన యధీనమందే యుంచుకొనెను. అప్పుడు నరసానాయకునికి విద్వేషియగు దండనాయకు డొకడు రాయలను జంపుటకు నిశ్చయించెను; రాజ్య సంరక్షకుడుగ నియమింపబడిన నరసానాయకుని యాజ్ఞచే దానా హత్యను గావించితి నని ప్రకటించిన, రాజద్రోహ మొనర్చినందులకై నరసానాయకునికి మరణదండన కలుగునని యతడు దలచెను. కావున నతడు రాచయూడిగపు వాని కొకనికి లంచమిచ్చి యొకనాటి రాత్రి వాడు రాయలను జంపున ట్లేర్పాటుగావించెను; ఊడిగపువా డాయేర్పాటు

ప్రకారము రాయలను కత్తితో నఱికి చంపెను." కాని మహమ్మదీయ చరిత్రకారు డగు ఫెరిష్టా తిమ్మరాజు మరణమును మఱియొక విధముగ వర్ణించియున్నాడు: క్రీ. శ. ౧౪౯౩ వ సంవత్సరమున తిమ్మరాజు (నరసానాయకుడు) ను యూసుఫు ఆదిల్ ఖానుడును యుద్ధమునకు దారసిల్లిరి. యుద్ధ ప్రారంభదశయందె యూసుఫు ఆదిల్ ఖానుని ఫౌజులో దాదాపైన వందలమంది రణక్షేత్రమునకు బలియగుటచే దక్కిన వారు యథాయథలై పాఱిపోయిరి. అప్పుడు నరసానాయకుని చేజిక్కిన తురకసిపాయి యొకడు తప్పించుకొనిపోయి శత్రువు చూఱయందానక్తుడై యాదమరచి యున్నాడనియు, నప్పుడతనిపైబడిన జయము కలుగగలదనియు నాదిల్ ఖానునికి దెల్పెను. అంతట యూసుఫు ఆదిల్ ఖానుడు తన సైన్యములను మరల గూర్చుకొనిపోయి యుద్ధము సేయగడగెను. తిమ్మరాజు (నరసానాయకు) నకు దన సైన్యముల నన్నిటిని గూర్చుకొనుట కవకాశము లేకపోయినది. కావున నతడు వేల గుఱ్ఱములను, మూడు వందల యేనుగులను, కాల్బలర నసల్ప సంఖ్యాకులను రణక్షేత్రమున బారుచేసి పోటు చూపెను; యూసుఫు ఆదిల్ ఖాను డీ సైన్యముపై క్రోధోద్రిక్తుడై పడుటవలన నతని ధాటి కాగజాలక తిమ్మరాజు (నరసా నాయకుడు) పాఱిపోయెను. రెండువందల యేనుగులును, వేయి గుఱ్ఱములును, నఱువదిలక్షల హొన్నులును విజయుడైన యాదిలుఖానునికి హస్తగతమైనవి. యువకుడగు రాయలతో గూడ తిమ్మరాజు (నరసానాయకుడు) విజయనగరమునకు బాఱిపోయెను; యుద్ధమున దగిలిన గాయముల వల్ల రాయలు మార్గమధ్యమున మృతినందెను *

ఈ కథలయం దేది సత్యమో తెలియదు; కాని న్యూనిజు ఫెరిష్టా కంటె బూర్వుడు. నరసానాయకుని పుత్రుల కాలమున నతడు విజయనగరమునకు వచ్చి దన చరిత్ర రచనకు వలసిన సాధన సామగ్రి సేకరించుకొనెను కావున ఫెరిష్టా వృత్తాంతము కంటె నతని చరిత్రయె ఇచట విశ్వాసపాత్రమని తోచుచున్నది.

(సశేషము)

---

*దస్తూరుదీనారు ఈ వృత్తాంతమును వేఱొకతీరుగ వర్ణించుచున్నాడు. యూసుఫు ఆదిల్ ఖానుడు యుద్ధమున నోడి సంధి జేసికొనవలయునని నరసానాయకుని ప్రార్థించెను. తాను రాయలకు సామంతుడై కప్పముగట్ట సిద్ధముగ నున్నాడని విన్నవించెను. సంధి షరత్తులను నిశ్చయించుకొనుటకు యుద్ధరంగమున నిరువాగుల దొరలును సమావేశమైరి. పసివాడగు రాయలును నరసానాయకుడును, నాలుగువందల పరివారమును సమావేశమునకు బోయిరి. ఆకస్మికముగ యూసుఫు ఆదిల్ ఖానుడు వారిపైబడెను; డెబ్బదిమంది రాయసామంతులు మడిసిరి. తక్కినవారు చెల్లాచెదరై పాఱిపోయిరి.

---


ఈ క్రింది ఊళ్లలో ఇంగ్లీషు, తెలుగు 'స్వతంత్ర' పత్రికలు అమ్ముటకు ఏజెంట్లు కావలెను:

ఆమలాపురం, చోడవరం, రాజమండ్రీ, బళ్లారి,
శృంగవరపుకోట, కైకలూరు, పొన్నపల్లి అగ్రహారం

వివరములకు :—

మేనేజరు, 'స్వతంత్ర',
160 లాయిడ్స్ రోడ్,
రాయపేట. మదరాసు-14.

# పల్లెటూరు పాలకులు

వి. యస్. అవధాని

దీపావళి పండగ వెళ్ళిన రెండో రోజున మోహన్ ఏం పని లేకుండానే బెజవాడ వెళ్ళాడు. ఒంటరిగా వెళితే బాగుండేదేమో!

తనంతట తను వెళ్లడం అయితే ఒంటరిగానే వెళ్ళి ఉండేవాడు. కాని ప్రెసిడెంటూ, చౌదరయ్యా వచ్చి బెజవాడ వెళదాం రమ్మని పిలిచారు. తనూ అదివరకే వెళదామా వద్దా అని ఆలోచిస్తున్నాడేమో, వాళ్ళు రమ్మంటమని పిలవగానే బయల్దేరాడు.

అసలే కార్తీకమాసం. అందులోనూ చలిగాలి జాస్తిగా ఉన్నది. పైగా పొట్టిగా పొడుగు చొక్కాలతో ఆరోజుల్లో రాత్రిపూట సినిమా చూడడానికి బెజవాడ వెళ్లడం మోహనుకే తగును.

వెంటవచ్చిన ప్రెసిడెంటూ చౌదరయ్యా తమ పనులు చేసుకుని తిరుగు బండికి ఇంటికి బయల్దేరారు. మోహనుకు ప్రత్యేకం పనిలేదు కనుక వాళ్ల వెంబడి వాళ్ళు తిరుగుతున్నంత సేపూ తిరిగాడు. వాళ్ళు తిరిగి ఇంటికి బయల్దేరే సరికే వాన ప్రారంభమయింది.

ఆరోజుల్లో నాగయ్యగారి త్యాగయ్య బెజవాడలో దిగ్విజయంగా సాగుతోంది. తనకు సినిమా చూడాలని ఉన్నది. కాని వాళ్ళతో మొహమాటం లేకుండా నేను సినిమాకి వెళ్ళాలి అని చెప్పడం తన చేత కాలేదు. వాళ్ళు వెళతాం అని అన్నప్పుడు. "నాకు కొంచెం పనున్నది" అని బూకరించాడు. అట్లా అనడానికి కారణం లేకపోలేదు. సభ్యతకు పాటించి చౌదరి కాక పోయినా ప్రెసిడెంటు తనతో బాటు ఆగుతాడని అనుకున్నాడు. కాని అనుకున్నదానికి వ్యతిరేకం అయింది.

అక్కడికీ ప్రెసిడెంటు, చౌదరిని చూసి, "నువ్వు త్యాగయ్య చూడలేదుగా" అన్నాడు.

కాని, "ఏం త్యాగయ్య లెద్దూ, ఇంక వాన కురుస్తుంటేనూ" అన్నాడు చౌదరయ్య. అంతటితో మోహన్ వేసిన పాచిక వ్యర్థమయింది. వాళ్లు వెళ్ళిపోయారు. వాన దబాయించి కురుస్తోంది. తెచ్చిన గొడుగు ఉపయోగిస్తుందా లేదా అన్నంత భయం వేస్తోంది. ఈ భయానికి అతడి హృదయంలో చోటేదీ?

రోడ్డు వెంబడి నడుస్తున్నాడు. ఎక్కడికి పోవాలో తనకు తెలియదు. పోయి చూడాల్సిన చుట్టాలు లేక కాదు; చూడడం అనే నెపంతో ఆ రాత్రికి తల దాచుకునే వీలు లేక కాదు.

నడుస్తుంటే కోపం వస్తోంది. ఏం చేసికోనూ ఆ కోపం? తన కోపం ఎవడికి కావాలి! తనకు కోపం వచ్చిందని చౌదరికీ, ప్రెసిడెంటుకీ తెలుసా? ఎట్లా తెలుస్తుంది? "నాకు పని ఉన్నది" అని అనేటప్పుడు అక్కడికీ తను మొహం చిట్లించాడు. పరధ్యానంగా ఉన్నట్టు మాకాడు. మాస్తే ఏం ప్రయోజనం? అవన్నీ కోపం వచ్చినవాడే చేస్తాడని ఎక్కడ ఉన్నదీ? ఒకవేళ తనకు కోపం వచ్చిందని వాళ్ళకు తెలుసునే అనుకున్నా, తనను బ్రతిమాలాల్సిన అవసరం వాళ్ల కేమిటి?— ఈ భావం కలిగేటప్పటికి అతడి కోపం మరీ జాస్తయింది.

తను వాళ్ళకు ఎంతో అవసరం. వాళ్ల ఊళ్లో బడి పాడుబడి ఉంటే— తను బి. యే. ప్యాసయినప్పటికీ ఎటువంటి గర్వం లేకుండా— వాళ్ల ఊరు వెళ్ళి ఆ బడిని బాగుచేశాడు. దాన్ని ఎంతో అభివృద్ధిలోకి తెచ్చాడు. తెస్తే ఏం? వాళ్ళు జీతం ఇచ్చారు. ఇస్తున్నారు. వాళ్ళకు చేతనయిన గౌరవం చేస్తున్నారు. అంతకన్న చేసేదేముందీ? ఏ మనిషినయినా అవసరం వెంబడే ఈ సంఘం గౌరవిస్తుంది— ఈ సంగతి గుర్తుకు వచ్చేసరికి మోహానుకు కోపం తగ్గి భయం వేసింది.

ఇహ తన అవసరం వాళ్ళకు లేదా! లేకపోతే ఏం, తను బ్రతకలేడా? ఎక్కడికి పోయినా తనపని తాను చేసుకుంటే తనూ, తన కమలా హాయిగా బ్రతకగలరు. కాని ఈ కమల ప్రొద్దున— రేషనుగింజలదగ్గరికి వస్తున్నాయని ప్రెసిడెంటుగారి కోళ్ళను మంటిబెడ్డతో ఎందుకు కొట్టింది?

రేషనుబియ్యం ఎండబెట్టి కమల దంపిస్తుంది. చౌదరిగారు వడ్లబస్తాలిస్తానంటే మోహన్ వద్దన్నాడు. రేషను గింజలను బాగుచెయ్యడం, వండడం కష్టం అని కమల గోల పెడుతుంది. ఆ గోలతో తనను విసిగిస్తుంది. తనతోబాటు ఆమె విసుక్కుంటుంది. ఆ విసుగులో కోళ్ళమీద రాయి విసిరింది. అదిపోయి ఆ కోడి కాళ్లకే తగలాలి?

అంతా అయోమయంగా ఉంది. ఎంత ఆలోచించినా మనుష్యులు ఒకళ్ళతో ఒకళ్ళు ఎందుకు పోట్లాడుకుంటారో మోహానుకి అంతుపట్టడం లేదు. తనకు అంతు పడితే ఎంత, పట్టకపోతే ఎంత? తనకు అంతుపట్టినంతమాత్రాన వర్గకలహం ఆగుతుందా యేమిటి?

నడుస్తూనే ఆలోచిస్తున్నాడు. చలిగాలి ఎక్కువయి వానచినుకులు గొడుగులోంచి వచ్చి మీదపడుతున్నాయి. ఆలోచనలతో తనువస్తుంటే రిక్షావాలా ఒకడు తనను రాచుకుంటూ పోయాడు. ఎవడో ఒక కల్లువెధవ ఎదురుగా వస్తూ "కొంచెం ఫైర్ ఇప్పిస్తారా బాబూ" అన్నాడు. ఇప్పుడు తనే ఒక ఫైర్. తన్నే తీసుకుని వాడు బీడీ కాల్చుకుంటే సరి. వ్యర్థజీవి!

ఇంతలో ఎలక్ట్రిక్ దీపాలు వెలిగాయి. సినిమాకి టైం అయింది. తను వాళ్లతో ఎందుకు వచ్చాడు? వాళ్లు తనను ఎందుకు పిలిచారు? పిలిచారు కనుక వచ్చాడు. వచ్చాడు కనుక చలికి బాధపడుతున్నాడు.

అతడిది చలిబాధ కాదు. తనలోని ఏదో ఒకటి వాళ్ల ప్రవర్తనవలన దెబ్బతిన్నది. ఏం తింటే? దానిసంగతి అది చూసుకో లేదూ?... లేదు. ప్రతిదానికీ తన పెత్తనం కావాలి?... ఎదురుగా ఒక కోడెదూడ ఎక్కడినుంచో పరుగెత్తుకుని వస్తోంది. తను పక్కకు తప్పుకున్నాడు. ఆదూడను చూడగానే గుండెలు దడదడా కొట్టుకున్నాయి. అది తనను పొడుస్తుందని కాదు. రెండు రోజుల క్రిందట ప్రెసిడెంటుగారి కోడెదూడ తన సొరతీగమీద పడుతుంటే తనొకపుల్ల విసిరి వేశాడు. అది పోయి దాని కన్నుకి తగిలింది. ఆ సాయంత్రం ప్రెసిడెంటుగారు జీతగాణ్ని గదమాయించడం తను విన్నాడు. ఈ దూడను చూడగానే ఆ దృశ్యం గుర్తుకు వచ్చింది. ఎందుకు వచ్చిందో! ఆరాత్రి రెండాటలూ సినిమా చూసేప్పటికి వాన దేవత కొంచెం శాంతించింది. వానకూడా ఒక దేవతేనా? అందరూ దేవతలే చేతగానివాడికి. చేతనయినవాడికో! వాడే దేవత... "ఛీఛీ... పాడు దేవతలు" అనుకుంటూ స్టేషన్ వైపువెళ్ళాడు. రాత్రల్లా జాగారంచేసి తెల్లవారి ఏడు గంటలకి ఇంటికి హాజరయాడు. అప్పటికి రెండుసార్లు తాగివున్నా మళ్లీ కమల యిచ్చిన కాఫీ తాగి ఏదో పుస్తకం చూస్తూ పడుకున్నాడు. ఆ పడుకోవడం సాయంత్రం అయిదు గంటలదాకా లేవలేదు.

అతడు పగలు పడుకోనే పడుకోడు, పడుకున్నా నిద్రరాదు. నిద్రవచ్చిందా కమల లేపదు. అది ఆమె నియమమేమో.

కాచిన కాఫీ చల్లారిపోతూ లేపుదామా వద్దా అని కమల ఆలోచిస్తుంటే, "మాష్టరుగారూ" అని బయటనుంచి పిలుపువచ్చింది.

"ఇహ లేవండి, ప్రెసిడెంటుగారు వచ్చారు" అన్నది కమల.

"రండి" అంటూ మోహన్ లేచి ఇంకో గ్లాసు కాఫీ అన్నట్టు కమలవైపు చూస్తుంటే ప్రెసిడెంటుగారు "ఇంకా ఇప్పుడు కాఫీ తాగుతున్నారేం!" అన్నారు.

"ఇప్పుడే నిద్రలేచానండీ. మీరుకూడా..."

"అబ్బే, అక్కరలేదండీ... ఇందాకటినుండీ మీకోసం చూశాం. వెంకటేశ్వర్లును పంపితే తమరు నిద్రపోతున్నారని చెప్పాడు."

"ఏం సంగతి?"

"అబ్బే ఏమున్నదీ? కమిటీ మీటింగ జరిగింది."

"అట్లాగా, నాకు తెలియనే తెలియదండీ తెలిస్తే రాకుండా ఉంటానా? ఏమేం అనుకున్నారూ?"

"విశేషాలేమీ లేవు. అన్నీ మీరు చెప్పినవే పాటుచేశాం... మా రామయ్య మొన్ననే ట్రెయినింగ్ పాసయ్యాడు. ఎక్కడా ఉద్యోగం దొరక్క బాధ పడుతున్నాడు. వాణ్ణి మన స్కూల్లో వేసుకున్నాం."

"వారిని ఎవరికి బదులు వేసుకున్నారు?"

"కొత్త పోస్టేమీ లేదుగా. మీకు బదులుగానే వేశాం. మీరు అచ్చంగా ట్యూషన్లు చెప్పాలని నాకూ చౌదరికీ ఉన్నది. మామూలు కేం లోపం రాదు."

"లోపానికేం కానీండి. నేను ట్యూషన్లు చెప్పలేను. కొంతకాలం రెస్టు కావాలి."

"అదంతా ఇహ మీయిష్టం, వస్తా"నంటూ ప్రెసిడెంటు వెళ్లిపోయాడు.

* * *

అమావాస్య రాత్రి. పల్లెటూళ్లలో వానకురిసిన రాత్రి ఒక్క పురుగుకూడా ప్రొద్దు క్రుంకగానే బయటికి రాదు. ఊరంతా బురద బురదగా ఉంటుంది. అయినా పని ఉన్నవాళ్ళు తిరగడం మానారా? మోహానుకు పని లేకపోయినా నిద్ర రాదు. అంత తొందరాలే రాదు. పైగా ఆలోచనలు- ఈ ఆలోచనలకు తను తప్ప దొరకనట్లు తననే వేధిస్తాయి. తనేమో ఆ ఆలోచనలు చెప్పినట్లు చెయ్యలేడు. చెయ్యడానికి ప్రయత్నిస్తుంటే అనేక ఇబ్బందులు. అసలు అట్లాంటి ఆలోచనలు ఎందుకు రావాలి? ఉన్న యథార్థతను గుర్తిస్తున్నాడు కనుక ఆలోచనలు వస్తున్నాయి. ఆలోచనలు వచ్చినట్లు చేయగలగడానికి ప్రయత్నిస్తున్నాడు కనుక ఇబ్బందులు వస్తున్నాయి. ఇబ్బందులనే అలవాటుగా భావించి- వాటిపట్ల నిర్లిప్తంగా ఉండడం తనకు చేతనయితే బాగుండును. కాని అది చేతకాందే! మోహాన్ పక్క మీద అటూ ఇటూ దొర్లాడు. కిటికీ తెరిచాడు. 'బిగ్‌బెన్' పదకొండు గంటలను చూపింది. అయినా నిద్రరాదు. నిద్రపోవడానికి తను చేసిన ప్రయత్నం ఏమిటి? బోర్లపక్కలా పడుకుని శాలువా కప్పుకున్నాడు... ఆహా... నిద్ర రాదు.

ఉద్యోగం పోయి ఆరు నెలలయింది. ట్యూషన్లూ మానివేశాడు. వాళ్ళ పిల్లలు వస్తే "నాకు ఒంట్లో సరిగ్గా లేదు, నేను మళ్ళీ రమ్మనమనేదాకా రావద్దు" అని చెప్పాడు. అప్పుడప్పుడు కమల దాచి నిలువ చేసిన చిల్లరతో సహా అంతా ఖాళీ అయింది. రాఘవయ్య కొట్లో నలభయి రూపాయిలు అప్పయింది. ఇవన్నీ ఎట్లా తీరుతాయి? ఏం తీరకపోతే? వాళ్లు బజార్లో నిలవేస్తే? ఎందుకు నిలవేస్తారు వాళ్ళ డబ్బు ఇవ్వలేదు కనుక...

సమాధానాలు దొరకని ప్రశ్నలు మనసును కలవరపెట్టాయి. పెద్దపెట్టున గాలి వచ్చింది. కాపేపట్లో జోరుగా వాన సాగింది. మోహానుకి కొంచెం నిద్ర పట్టింది.

మెలకువ వచ్చి చూసేసరికి లాంతరారి పోయింది. పక్కని టేబిల్ మీద బ్యాటరీ లైటుండాలి. దానికోసం వెదికితే అది కనిపించలేదు. కొంచెం నెమ్మదిగా అటూ ఇటూ తిరుగుతుంటే నిప్పుపెట్టె కాళ్ళకు తగిలింది. గుండె వేగంగా కొట్టుకుంటున్నా, కాళ్లు తడబడుతున్నా, చేతులు వణుకుతున్నా నెమ్మదిగా ఆ నిప్పుపెట్టెను తియ్యబోయేసరికి కాళ్ళకు రాళ్లు తగిలాయి. ఒకపుల్ల గీసేసరికి ఎదురుగా వున్న తలుపు పక్కగా ఒక కన్నం ఉన్నట్టు మోహానుకి తెలిసింది.

మెల్లగా కమల మంచం దగ్గరకుపోయి ఆమెను లేపాడు. ఉలిక్కిపడుతూ లేస్తూ "అప్పుడే లేచారేమండీ!" అన్నది. మరుక్షణమే ఇంట్లో దీపం లేకపోవడంవల్ల ఒకరకమైన భయమూ, ఎదురుగా కన్నం కనిపిస్తున్నందువలన అంతకన్న ఎక్కువ భయమూ ఆవరించగా "అమ్మో... ఇదేమిటండీ" అంటూనే మంచంమీద పడిపోయింది. ఇహ ఇంట్లో ఎవరూ లేరు కనుక ఎవరికీ ఆ సువార్త అందించాలిసిన అవసరం లేదు. కాబట్టి భయం వేస్తున్నా తప్పక అటూ ఇటూ తడుములాడుకుంటూ పోయి బెడ్ లైటును సాధించి వెలిగించాడు. సంగతంతా తెలిసింది కాబట్టి భయం సెలవు తీసుకుంది. మంచంకింద ఉండాలిసిన మంచినీళ్ల చెంబు లేదు. కమల మొహాన కాసిని నీళ్లు కొడితేనే గాని తిరిగి ఈ లోకంలోకి రాదు. నీళ్లు ఎక్కడున్నాయోనని వెదుక్కుంటూ పోయి నాలుగయిదుసార్లు కింద పడ్డాడు. నీళ్ళుండడానికి బిందె లుంటేనా! అటూ, ఇటూ తోచీ తోచక తిరుగుతున్నాడు.

అంతలో కమలకు ఫిట్ వదలిపోయినట్లు తెలిసింది. మళ్ళీ ఎక్కడ విరుచుకు పడుతుందోనని ఆమెను దగ్గరికి లాక్కుని ఒళ్లో పెట్టుకుని భుజం తడుతూ "మరేం భయం లేదు. తెల్లవారవచ్చింది" అన్నాడు గాద్గద కంఠంతో. అవును, తెల్లవారవచ్చింది.

కొంచెంసేపయాక లాంతరు వెలిగించి ఇద్దరూ ఇల్లంతా వెదికి చూశారు. తమ ఒంటిమీద గుడ్డలూ, తమరు పడుకున్న మంచాలూ,- ఇవీ మిగిలినయి. అన్నం వండుకుని వదిలిన గిన్నెల దగ్గరనుంచీ కమల వెండికంచం, చీరెలూ, పట్టుగొలుసులూ- అవీ ఇవీ-అన్నీ మాయమయాయి.

తెల్లవారింది. మోహన్ దొడ్లోకి వెళ్లేటప్పటికి అక్కడ చాలామంది నుంచుని విడ్డూరంగా చూస్తున్నారు. పుస్తకాలపెట్టె, కమలచీరలూ సొమ్ములూ ఉండే పెట్టె-బయటపడేసివున్నాయి. పెట్టెల అడుగునవేసిన కాగితాలుతప్ప ఇంకా ఏం ఉంటాయి!

జరిగిన సంగతి ప్రెసిడెంటుకూ, చౌదరికీ తెలిసింది. బళ్లో పిల్లలందరికీ తెలిసింది. ఆరోజు సోమవారం. బడి ఉన్నది. అయినా చాలామంది పిల్లలు బడి మానుకుని మోహన్ ఇంటిదగ్గర గుమికూడారు. అందరితోనూ నవ్వుతూ అదో రకంగా మోహన్ మాట్లాడుతున్నాడు. కమల కాఫీ పెడదామని ప్రయత్నంచేసి ఇంట్లో గిన్నెలూ, కుంపటీకూడా లేవు కాబట్టి ఓమూల చాపవేసుకుని పడుకుని ఏమిటో ఆలోచిస్తోంది.

"అయితే మేష్టరుగారూ ... మీరు చాలా మెలుకువగా ఉంటారుగా ... " అన్నాడు ప్రెసిడెంటు.

"ఏం మెలుకువలెండి."

"ఆ...ఆ సమయం వచ్చేసరికి అట్లా ముంచుకొస్తుందయ్యా..." అన్నాడు చౌదరి. వరండాలో గుంపుగా ఉన్న పిల్లలను చూసి "ఇక్కడేం చేస్తున్నారోయ్? ఇక పొండి." అన్నాడు ప్రెసిడెంటు.

కొంతమంది వెళుతున్నట్లు నటించి తిరిగి అక్కడే నిలబడ్డారు. ఒక ఆడపిల్ల వాళ్ల ఇంటి దగ్గరనుంచి కాఫీ తీసుకువచ్చి కమలచేత బలవంతాన తాగించింది.

వరండాలో ఈతాకుల చాపలమీద మునసబూ, ప్రెసిడెంటూ, చౌదరీ, కొంతమంది మేష్టర్లూ — కొంతమంది పిల్లలూ, అందరూ మోహన్‌చుట్టూ కూర్చున్నారు.

"లక్ష్మయ్య పంతులుగారికోసం మోతాదును పంపించా. రాగానే రిపోర్టు రాద్దాం" అన్నాడు మునసబు చౌదరివైపు చూస్తూ.

"రిపోర్టు దేనికి?" అన్నాడు మోహన్.

"జరిగింది కన్నపు దొంగతనం. సుమారు ఓ వెయ్యి రూపాయల సొమ్ముదాకా పోయి ఉంటుంది. కాబట్టి రిపోర్టు చెయ్యాలిసిందే" అన్నాడు చౌదరి.

"దానివలన ప్రయోజనమేమిటి?" అన్నాడు మోహన్.

"ప్రయోజన మేమిటో మీకు చెప్పేటంత వాళ్ళమా మేము?" అన్నాడు ప్రెసిడెంటు.

"మీరు చెప్పాలని నాభావంకాదు. ప్రయోజనం మనకు లాభంగా ఉండదని నా అనుభవంలో నాకు తెలుసు. కాబట్టి రిపోర్టు చెయ్యవద్దు అని అంటున్నాను" అన్నాడు మోహన్. కొంచెంసేపు ఎవరూ ఏమీ మాట్లాడలేదు. ఈ నిశ్శబ్దం అక్కడ కూర్చున్న పెద్దవాళ్ళ నందరినీ అనేక విధాల బాధ పెట్టుతోంది. ఆబాధ వారి మనస్సుల్లో ప్రతిఫలించి ముఖాలలో తీవ్రత రూపంగా కనిపిస్తోంది.

"ఇంకా ఏం...చౌదరీ, మనవాళ్లను నలుగుర్నీ పిలిపించి మాట్లాడు. తలో కాస్తా వేసుకుని పంతులుగారి సొమ్ము అంతా కాకపోయినా కొంతయినా ఒప్పు చెప్పాలిసిన బాధ్యత మనకు ఉందిగా" అన్నాడు ప్రెసిడెంటు. ఈ మాటలు విని చౌదరి మొహం చిట్లించుకొన్నాడు. "ఈ ప్రెసిడెంటుకి గొడవ దేనికి? ఈ పెత్తనం ఎవరు ఇచ్చారు ఈయనకు!" ఆవేశావేశం అతనిలో గిరగిరా తిరిగితిరిగి చివరికి ఒక రకమైన అనుమానాన్నీ, అసూయనూ కలిగించింది. ఐనా అదేమీ కనుపడ నీయకుండా-

"ఆ... అట్లాగే చేదాం కాని పంతులుగారు రిపోర్టిస్తే బాగుంటుంది" అన్నాడు. ఇంతలో కోమటి రాఘవయ్య వచ్చి అక్కడ కూచున్నాడు.

"మీరు ఈ శ్రమం కా పడడం అనవసరం. నాకు నష్టం కలుగలేదని కాదు. మీరు చందాలు వేసుకొని కొంతసొమ్ము నాకు ఇప్పించి

అవస్థాన్ని పూర్తిచేయలేరు. నన్ను అవమాన పరచగలరు. ఆ పనిమాత్రం చేయవద్దని మిమ్మల్నందరినీ బ్రతిమాలుకుంటున్నాను."

"ఇదేం మనిషి? ఇవేంమాటలు!" అని అక్కడ కూచున్న అందరూ అనుకున్నారు.

చిన్న పిల్లలు. "అవును, మా మేస్టరుగారి ఉద్యోగం తీసేశారు. వాళ్లు డబ్బు ఇస్తేమాత్రం ఆయన ఎందుకు తీసుకుంటారు?" అని అనుకున్నారు. పిల్లలంతా ఆదోరకంగా మోహన్ వంక చూస్తున్నారు. వెంకటేశ్వర్లుకి తనిన్నాళ్ళ నుంచీ తన పంతులుగారిని గురించి అనుకున్న అభిప్రాయాలలో ఒకటీ సరయింది కాదని రుజువయింది. రామారావు తన అయిదోఫారం తెలివంతా ఉపయోగించినా కోపంవచ్చినపుడు మేస్టారు ఎందుకింత ప్రశాంతంగా — ఓడిపోయినట్లు ఉంటారో అర్థంకావటంలేదు.

"జరిగిందేమో జరిగింది. ఇహ నేను సెలవు తీసుకుంటాను.

"అంటే..." అన్నాడు చౌదరి. "నేను ఇక్కడినుండి వెళ్లిపోతా." అన్నాడు మోహన్

"అదేంమాట!" అన్నాడు ప్రెసిడెంటు.

"అదంతా తరువాత చూసుకోవచ్చు. ముందర ఇవాళ సంగతి కొంచెం కోపంలేకుండా ఆలోచించి చూడండి" అన్నాడు మునసబు మోహన్‌వంక చూస్తూ.

"ఇలాంటి అవకాశాలు ఎప్పుడూ రావు. అవకాశంతో మనుషుల ప్రవర్తన మారుతుంది. దాంతోనే భవిష్యత్తుయొక్క రూపంగూడా మారుతుంది."

"అంటే...మీరు వెళ్లక తప్పదంటారా?" అన్నాడు ప్రెసిడెంటు.

"తప్పదని మీకు తెలుసు." అన్నాడు మోహన్ ఒక రకమైన నవ్వుతో.

"నాకు తెలియనిదేమిటి?" అని ప్రెసిడెంటు అన్నాడు. కాని కొంచెం ఖంగారుపడక పోలేదు. అనుభవం ఆయన భుజం తట్టి "నేనున్నానుగా" అన్నది.

మళ్లీ మోహన్ అన్నాడు. "ప్రెసిడెంటుగారూ, దయవుంచి ఈ చేతి గడియారం మీకు వీలయినప్పుడు అమ్మి, ఆ రాఘవయ్య బాకీ నలభయి రూపాయలు తీర్చండి."

"పోనీ, రాఘవయ్యకేఇయ్యరాదూ అది" అన్నాడు చౌదరి.

"అట్లా ఎందుకు, ప్రెసిడెంటుగారికే ఇవ్వడమే మంచిది."

"అంత ముంచుకుపోయిన కారణం ఏమీ లేదు. కొంచెం ఉద్రేకం తగ్గించుకోండి. మరో కొంత కాలం పాటు ఇక్కడ ఉంటే మీకు నిజానిజాలు తెలుస్తవి" అన్నాడు ప్రెసిడెంటు.

"నిజా నిజాల గొడవ నాకు పట్టలేదు. ఈ సంగతి నాకు పట్టింది. నేను ఇవాళనే యీ ఊరు వదల దల్చుకున్నాను. నాకు ఇష్టం లేకుండా ఇక్కడ ఉంటే మాత్రం ప్రయోజనం ఏమి ఉంటుంది...కనుక సెలవిప్పించండి."

"మరీ......" అని చౌదరి ఏదో చెప్ప వచ్చాడు. అంతలోనే మోహన్ అందుకుని "అవును, మీకూ కొంచెం డబ్బు ఇవ్వాలి."

"దానికేం లెండి. నేను సర్దుతాగా" అన్నాడు ప్రెసిడెంటు.

"అయితే, నే ననుకున్న దానికంటె అన్నీ సులభంగానే పరిష్కారమయాయి. బెజవాడ పోయే బండికి టైం కూడా అయింది. సెలవు. కమలా...."

"మరి మీ సామాన్లో....." అన్నాడు మునసబు.

"ప్రెసిడెంటుగారింట్లో ఉంటాయి. అయినా చెప్పుకోతగ్గ సామాన్లు ఏమీ లేవు. ఈ టేబిలూ, కుర్చీ...ఆ రెండు మంచాలూ...ఇవి ఎప్పుడో ఒకప్పుడు నా దగ్గరికి వస్తాయి. రాకపోయినా ఇబ్బంది లేదు. సెలవు"

అంటూ ఉన్నవాడున్నట్లే మోహన్ లేచి పోయి కమలను వెంట పెట్టుకుని బయల్దేరాడు బల్లకట్టు సిద్ధంగా ఉన్నది.

బల్లకట్టు ఎక్కుతుండగా, "మీరు ఎప్పుడయినా పంతులుద్యోగం చెయ్యదల్చుకుంటే మావూరే రావాలి" అన్నాడు ప్రెసిడెంట్.

"అట్లాగే..." అన్నాడు మోహన్. పిల్లలంతా బల్లకట్టు అవతలి ఒడ్డుకిపోయి కమలా మోహనులు దిగిపోయేదాకా చూస్తూనిలబడ్డారు. రామారావు స్టేషన్ దాకా పోయాడు. ఏం లాభం? అసలు ఇదేం జరగనట్టే మోహన్ టిక్కట్టుకొని రైలెక్కాడు.




## 9

ఆమె నారాత్రి విడిపించిన దగ్గరనుంచీ రామదాసు సరోజకోసమే బతికివున్నాడు. ఆమె కూడా తనతో సాధారణంగా మాటలాడే అందరి లాటివాడు దాసు కాదనుకొంది; కాని నిజానికి దాసు ఆమెను ఆకర్షించిన దానికంటె వెగటు కలిగించినదే ఎక్కువ. గంభీరపు చూపులు, విచారంతో కూడిన అతని అనాకారి ముఖం ఆమెకు భయాన్ని కూడా కలిగించాయి. అత నాయింట్లోనే వుంటున్నాడనీ, తన అడుగు జాడల్లోనే ఎక్కువ శ్రద్ధతో సంచరిస్తున్నాడనీ ఆమె గ్రహించింది.

ఆమె వీధిలోకి వెళ్లేటప్పుడు బండిలో కూర్చొని ఎప్పుడూ అటుకేసి చూడకూడదని నిశ్చయించుకున్నా, ఆమె తల ఎత్తి కిటికీకేసి చూసి అతన్నక్కడ చూసేది. ఆ చూపు ఆమె సరదాని దారిపొడుగునా చంపేసేది. తనమీద అతని కాంక్ష ఏమిటో ఆమె కర్థమయేదికాదు. తన ప్రవర్తనంతా పరీక్ష చేసి చూసుకునేది- తనే మయినా తప్పుపని చేసిందేమోనని.

రామదాసు సంఘర్షణ ప్రారంభమైనదని తెలుసుకున్నాడు. అతను తనపాత్ర—మూగి రక్షకుడుగా చక్కగా నటిస్తున్నాడు. తన ప్రవర్తనలో ఏమన్నా ఆమెకు ఆగ్రహంగాని, అభ్యంతరం కలిగించేదిగాని వుంటే క్షమాపణ చెప్పుకుందామని అతను ప్రయత్నిస్తున్నాడు. ఆమెకు చాలా అసంతృప్తిని కలిగిస్తున్నాననీ, దానివల్ల ఆమెకు తాను కోపం తెప్పించినవాడ నవుతానేమోననీ అతను భయపడుతూనే వున్నాడు. ఆమె సుఖంగా ఆనందంగా వున్నప్పుడు తను ఆమెను తీక్ష్ణదృష్టితో చూసేకంటె, ఆమె ఆనందంలో తనూ పాల్గొని సుహృత్వం ఓర్మి చూపిస్తే మంచి దనుకున్నాడు.

అయినా అతని విధ్యుక్తధర్మం అతన్ని తీవ్రంగా శాసిస్తోంది. సరోజ క్షేమసౌఖ్యాలు అతని లక్ష్యం. ఈ నవనాగరికతా వ్యామోహం, పురుషులతో స్వేచ్ఛగా వుండటం- ఇది ఆమెను కామాసక్తురాలిగా చేసి, ఆ తరవాత ఎంత విచారించినా లాభంలేకుండా అయిపోతుందేమో నని అతని భయం. ఆమెని వ్యామోహంలోంచి, యీ నూతన సాంఘిక పరిణామంలోంచి తప్పించాలనే ప్రయత్నంతో అత నామె స్వేచ్ఛకీ సౌఖ్యానికీ అడ్డు తగిలి ఆమెకు చాలా బాధ కలిగించాడు.

ఈ విధంగా అతను సరోజకీ, జానికమ్మకూ కూడా సింహస్వప్న మయాడు. అత నెప్పుడూ సాధారణమైన దుస్తులు ధరించేవాడు; ఆ దుస్తులతోనే వారిద్దరియెదుటా వీలయినప్పుడల్లా ప్రత్యక్షమయేవాడు. తన పనినంతా చురుకుగా చేసేసి వాళ్లెక్కడికి వెడితే అక్కడికి తనూ వెళ్లేవాడు; తన ఉనికివల్లనే వాళ్ళ ఆడంబరత్వం యొక్క నిరర్థకతను నిరూపించటానికి ప్రయత్నించేవాడు.

ఒకసారి సరోజ విషాదాంతనాటక మొకటి చూస్తోంది. అందులో ఒక నటుడు మాట్లాడే వాక్యాలు అర్థం కాకుండానే నవ్వుతూ కూర్చుంది. ఎందుకో ఆమె తనచుట్టూ కలయ చూసేటప్పటికి ఆమెకు సమీపంలోనే రామదాసు కూర్చుని ఆమెకేసి పొరబాటు చేస్తున్న మనిషివైపు చూసినట్టు చూస్తున్నాడు. అతని ఆ చూపు ఆమె హృదయానికి తాకింది. అత నలా చూడబట్టి ఆమె తను తప్పుచేస్తున్నట్టుగా గ్రహించింది. ఆమె యింక నవ్వలేదు; పైగా అతనికి కనిపించకుండా కూర్చుంది.

ఇంకొకసారి ఇంతకంటె పెద్ద సంఘటన జరిగింది. అటువంటి సంఘటన జానికమ్మ ఒంటరిగా బయటికి వెళ్ళినప్పుడు కూడా జరిగింది. ఈ సారి అత్తాకోడళ్ళిద్దరూ బాగా ఆడంబరంగా అలంకరించుకొని బయటికి వెళ్లినప్పుడు జరిగింది. వాళ్ళ దుస్తులూ, అలంకరించుకొన్న విధానం చూసి యిద్దరు యువకులు వెంటబడ్డారు. వాళ్లు కూడా యౌవనపు పొంగులో ఒళ్ళు పై తెలియకుండా వున్నారు. వాళ్ళిద్దరూ ఆ స్త్రీల వెనకాలే నడుస్తూ సంభాషణ ప్రారంభించారు.

"ఒరేయి, వీళ్లు ఖరీ దెక్కువైనా చాలా తేలికగా లొంగిపోతారురా" అన్నా డొకడు.

"అసలు వాళ్లే తిరిగి మనకు దబ్బిస్తారురా- మనం పలకరిస్తే చాలు మన వెనకాల వస్తారు. ఎంత తెగించినా వాళ్ళు మాత్రం ముందు పలకరించరు" అన్నాడు రెండోవాడు.

"అయితే పలకరిస్తానురా" అని ఆ రెండోవాడు "ఏయ్ పిల్లా, యిలా చూడు" అన్నాడు.

సరోజ, జానికమ్మ యీ సంభాషణ వింటూనే వున్నారు-సరోజ చిత్తరపోయి, కంగారుగా చూసింది. ఇంతలో ఆ పలకరించినవాడి భుజంమీద దాసుచెయ్యి పడి అతణ్ణి అక్కడే నిలబెట్టింది.

"మీరు పొరపాటు పడుతున్నారు. వీళ్ళు చాలా మర్యాదగల కుటుంబానికి చెందినవాళ్లు- మీరు వీళ్ళని చాలా నొప్పించారు; క్షమాపణ వేడుకోండి" అన్నాడు.

"మాది పొరపాటే. అయితే సంసార స్త్రీలు కూడా సానివాళ్లలా అలంకరించుకుంటే మాకు యిద్దరికీ తేడా ఎలా తెలుస్తుంది!" అన్నాడు యింకా పెంకితనంగా.

రామదాసు ఆ పొగరుమోతులను క్షమించి విడిచిపెట్టాడు. జానికమ్మ రామదాసునుకూడా తమతో బండి ఎక్కరమ్మని కోరింది. వాళ్లు యింక బజారులో తిరగడం మానేసి యింటికి బయలుదేరారు.

బండి మలుపు దాటుతుంటే వెకిలి నవ్వు నవ్వుతూ ఒక ఒయ్యారిభామ విలాసంగా నడిచి వెళుతోంది. ఆమెను సరోజకి చూపిస్తూ, "వదినా, సానివాళ్ళిలా వుంటారు" అన్నాడు దాసు. సరోజ ఆమెకేసి చూసింది. ఆమె బట్టలు ధరించిన విధానం, ఆ ఒయ్యారివద్ద తమ పద్ధతులతో సరిపోవడం చూసి సరోజ సిగ్గుతో తల వంచుకొంది. ఆమెలోను తమలోను ఒకే ఆడంబరత్వం, ఒకే ఆకర్షణ వున్నాయి.

ఇంటికి వెళ్ళాక సరోజ తన గదిలోకి పోయింది- దాసుమీది కోపం, కసి పోయేటట్టు గట్టిగా ఏడవడానికి.

జానికమ్మకు మాత్రం తన భర్త కార్యదర్శి మీద చాలా అసహ్యం కలిగింది. తమ గౌరవం కాపాడినందుకు ఆమె అతన్ని అభినందించినా, తమకు జరిగిన అవమానం అతనికి తెలిసిపోయిందని కొంత విచారం; పైగా అటువంటి అల్పుని వల్ల తమ గౌరవం కాపాడబడటం ఆమెకు భరించ లేనిదిగా వుంది.

ఆవేశపాట్లు ఆమె అతని ఉద్యోగం తీయించివేద్దామని ప్రయత్నించింది. కాని, సుబ్బారాయుడు అతన్ని వదిలిపెట్టడానికి యిష్టపడలేదు. అతను తెలివిగల మెదడు నొకదాని జీతమిచ్చి పెట్టుకున్నాడు గాబట్టి తను వీలయినంత అశ్రద్ధగా వుండవచ్చును. ఆ మెదడును వదిలివెడితే మళ్ళీ అలా వుండటానికి వీలుండదు.

తన భార్య చేసే ఫిర్యాదులన్నీ వీలయినంత అధికారం కనబరుస్తూ విన్నాడు; కాని చివరకి ఆమె చెప్పినట్టుగా మాత్రం తను చెయ్యలేదు. ఆమె షోకులకూ ఆడంబరాలకూ తను ఓర్పుతో ఊరుకుంటున్నాడు గాబట్టి తన కార్యదర్శిని ఆమె కూడా అలాగే సహించాలన్నాడు. అతను వర్తకుడుగా ఉన్నన్నాళ్లూ ఎవ రెలాగ చెబితే అలాగ తను నడచుకునేవాడు. ఇప్పుడు శాసనసభా సభ్యుడయ్యాడు గనుక అతను అధికారాన్ని చలాయిస్తూ అందరినీ శాసించడానికి చూస్తున్నాడు

రామదాసుకి తాను యింత ఆందోళన కలిగించాననే సంగతే తెలియదు. అతను గుడ్డిగా, ముక్కుకు సూటిగా ముందుకు సాగిపోయేవాడు. అతని ఆశయాల్లోని బలీయమైన వాంఛ అతణ్ణి జీవితలక్ష్యం వైపు నడిపించేది. అసలు నిజానికి అతను తన లక్ష్యాన్ని పిరికిగానే ప్రారంభించేవాడు. రాజేశ్వరమ్మకు అతనికంటె అభిమానస్తుడు, అతనికంటె హృదయపూర్వకంగా పని చేసేవాడు యింకొకడు దొరకడు; కాని అతనికి ఒప్పజెప్పిన కష్టసాధ్యమయిన ఆపనిలో యింకా చురుకుతనం, చాతుర్యం చూపించాలని ఆశించింది.

దాసు తన ఆరాధ్యదైవం ఒప్పగించిన పని నమ్మకంగా నెరవేరుస్తున్నాడు. అతని అమాయకత్వం, మెత్తని హృదయం ఎవరినైనా యిట్టే ఆకర్షిస్తుంది.

అతను నివసించే లోకానికే అతను కొత్తవాడవలసి వచ్చినా, అతని ధీశక్తి, త్యాగం అతణ్ణి ఏ అపాయం లేకుండా కాపాడుతాయి. రాజేశ్వరమ్మ అంతిమ సమయంలో నైనా రామదాసుని సరిగా అర్థం చేసుకొని గుర్తించగలిగింది. ఒకవైపు వెంకటేశ్వర్లు తన అధఃపతనానికి తనే కారకుడౌతూ కాలం గడుపుతూ, తన కొక కుమార్తె వున్నదనే సంగతి కూడా మరిచిపోయి వుంటే, జానికమ్మ తన స్వార్థపరత్వంలో మునిగి ఆమెకు అపకారం చేస్తూవుంటే, కృతజ్ఞత మినహా మరే సంబంధమూ లేని రామదాసు ఆ పిల్ల సంరక్షణే ప్రధానంగా పెట్టుకుని జీవిస్తూ వుండేవాడు. కాని తన శ్రమకు ఫలితంగా ఆమె దగ్గరనుంచి ఏ సమాధానమూ వచ్చేది కాదు. ఆమెకు తను బాధ కలిగిస్తున్నాననే నిర్ణయాని కతడు వొచ్చాడు. అతను ఏ హక్కుతో తన్ను ప్రతిసారీ వెంబడిస్తూ, తనని తీక్షమైన చూపులతో ప్రతీ క్షణం కనిపెడుతూ వున్నాడని సరోజ ప్రశ్నించుకొని వుండాలి. ఇంతకీ అతను వాళ్ళింట్లో ఒక నౌకరు—ఏ రోజు భత్యం ఆ రోజు సంపాదించుకోవలసిన బీదవాడు. అతని మీద పూర్తిగా జాలివల్లనే అతని ఉద్యోగం తీయించాలనే నిర్ణయానికి సరోజ రాలేదు. పాపం, రామదాసు ఒక్కొక్కప్పుడు పూర్తిగా నిరుత్సాహ పడేవాడు. సరోజ కోపపు చూపులకు తాళలేక పొగిలేవాడు; పూర్తిగా క్రుంగిపోయేవాడు.

ఆమె కోపంతో కూడిన చిరాకు చూపులు యింకా జాగ్రత్తగా పరిశీలించ గలిగి నట్లయితే, అతను కొంత ఊరటను, కొంత ఆనందాన్ని పొందగలిగి వుండేవాడు. ఆమెలో ఒక విధమైన చైతన్యాన్ని రేకెత్తించాడు; ఆమె హృదయంలో కదలిక లేకుండా పడివున్న ప్రేమాంకురాన్ని అతనికి తెలియకుండానే కదిలించాడు. ఆమె తన నరాల్లోను, హృదయంలోను కలిగిన చైతన్యాన్ని కోప మనుకొని భ్రమసింది. ఆమెకు తెలియకుండానే ఆమెలో పశ్చాత్తాపాన్ని కలిగించాడు. అతను ఆమె దగ్గర వున్నపుడు ఆమె సిగ్గుతో క్రుంగిపోయేది. ఆమెకు అతనిమీద కోపం కూడా వచ్చేది.

ఆమె చిన్న పిల్లగా వున్నపుడు తను ఎత్తుకు రానందుకు రోజూ తనను తనే నిందించుకొనే వాడు దాసు. ఆ విషయం నిరంతరం బాధను కలిగిస్తూండేది. ఇప్పుడు చపల బుద్ధితో తృణీకార భావంతో వున్న యీ పిల్ల స్థానంలో, తను పెంచినట్టయితే వుండే సహృదయం గల, సద్బుద్ధి గల పిల్లను ఊహించుకునే వాడు. ఆమె హృదయం పాడుచేశారు, అత నిప్పుడు దానిని మళ్ళీ బాగుచెయ్యలేడు. ఆమె చేసే తప్పు పనులూ, సంకుచిత బుద్ధితో చేసిన పనులూ తను బాధతో చూస్తూవుండాలి. అసలు తా నామెను ఆదర్శప్రాయమైన, సలక్షణమైన యువతిగా చేయటానికి కంకణం కట్టుకొన్నాడు.

ఒకరోజున సరోజ సుబ్బారాయుడి ఆఫీసు గదిలోకి ఏదో పుస్తకంకోసం వెళ్ళింది; అక్కడ



దాపాక్కుడే పని చేసుకుంటూవుంటే అతను చుట్టూ తిరిగి అతనికి ఆశ్చర్యం, చికాకు కలుగ జేదామని ఆమెకు బుద్ధి పుట్టింది. అందరి ఎదుటా ఎంత బింకంగా ధైర్యంగా వున్నా ఆమెతో ఒంటరిగా ఆ గదిలో వున్నప్పుడు అతను పిరికివాడై పోతాడని గ్రహించింది. ఆమె అనుకున్నట్టే జరిగింది. ఆమెతో ఒంటరిగా వుండడంతో అతన్ని పిరికితనం ఆవహించింది. అతనికి సిగ్గు, వణుకు ఎంత ఆపుకుందామనుకున్నా శక్యం కాలేదు. ఆమెను చూడటానికి, ఆమె మాట్లాడుతుంటే వినటానికి అతను చాలా భయపడ్డాడు. అప్పుడతనొక చిన్న పిల్లవాడయ్యాడు; ఆమె అతన్ని జయించింది.

అతని చేత తలయెత్తించలేక విసుగుచెంది బయటికి వెళ్ళిపోవటానికి ప్రయత్నించింది. ఆమె చీరకొంగు తలుపుకి వున్న మేకుకు తగిలి పర్రున చిరిగింది. ఆ శబ్దానికి అతను తల యెత్తి చూశాడు; సరోజ నవ్వుతూ చీర సర్దుకుంటోంది. ఆ సమయంలో ఏదో ఒకటి మాట్లాడితేగాని బాగుండదనుకొని, "మీ చీర పని అయిపోయింది" అన్నాడు అతను.

సరోజ ఆశ్చర్యంగా అతనికేసి చూసింది, "మీ కా విషయంలో ఏంపని?" అన్నట్టుగా. ఆమె చిరునవ్వు నవ్వుతూ యిలా అన్నది: "మీరు యీ చీరకి ఏమాత్రం నష్టం జరిగిందో చెప్పడానికి ఎప్పుడైనా దర్జీవాడుగా పని చేశారా?"

"నేను చీరవాణ్ణి, ఖరీదైన వస్తువులు చెడిపోవడం చూడలేను. నన్ను క్షమించండి" అన్నాడు అతి నిదానంగా, గంభీరంగా.

ఆ మాటల్లోని మార్దవం ఆమె హృదయానికి బాగా నాటింది. ఆమె అతన్ని కావాలని గాయపరచినందుకు చాలా నొచ్చుకుంది.

"మీకు ఆడంబరమంటే అసహ్యం గదండీ, దాసుగారూ?" అంది.

"నేను దాన్ని అసహ్యించుకోను. అదంటే నాకు భయం."

"అయితే మీరు మీ ధైర్యాన్ని పరీక్షించుకుందుకు గాబోలు [illegible] చేరే స్థలాలకి వెడుతూ వుంటారు? [illegible] అటువంటి చోట్లల్లో చూసినట్టు [illegible]

దాసు కొంచెం [illegible]... [illegible]... యిలా అన్నాడు.

వేది.....

"నాకు ఆడంబరత్వ మంటే భయం. అది హృదయానికీ, మనస్సుకీ గూడా అపకారం చేస్తుంది."

ఈమాటలు అని అతను చూసిన చూపు ఆమెని కలత పెట్టింది.

"మీ కెలాగైనా మర్యాద తెలియదు" అంది కటువుగా.

ఆమె గదిలోంచి వెళ్ళిపోయింది; కోపంగా. అతను మర్యాద, చమత్కారం తెలియనివాడని ఆమె నిర్ణయించేసింది.

ఆమె తన్ని తప్పించుకు పోయినందుకూ, అవకాశం దొరికినప్పుడు మర్యాదగా ఆమెకు నాటేలాగ తనుపాఠం చెప్పలేక పోయినందుకు అతను తన్ను తానే నిందించుకొన్నాడు. ఆమె హృదయాన్ని కనిపెట్టి, ఆమె తిరస్కారపు చిరునవ్వును పోగొట్టి ఆమెకు సలహాల నిచ్చే సమయంలో మోటుగా సమాధానం చెప్పి ఆమెకు చిరాకునూ, కోపాన్నీ కలిగించాడు.

అసలు సంగతేమిటంటే ఆమె శక్తు లన్నిటితోను ఒక్కసారిగా అతను పోరాడలేక పోయాడు. ఆమె ప్రాపంచిక వ్యక్తి; ఆమె ఎల్లప్పుడూ ఉద్రేకంతోను, ఉత్సాహంతోను వుండేది; కాని, వ్యథిత హృదయంలోని బాధలను వినే అవకాశం ఆమెకు లేదు. ఆమె ఉత్సాహంలో, ఆవేశంలో దాసు చెప్పే సాత్విక వచనాలకు తావు లేకపోయేది.

చీర చిరిగిపోయిననాటి సంఘటనల వంటివి అనేకం ఆతరువాత జరిగినాయి. రామదాసు నీతి వాక్యాలు బోధించటానికి అవకాశాలు దొరికేవి గాని, అసనా అవకాశాలు వినియోగించుకున్న దానికంటె పోగొట్టుకొన్నదే ఎక్కువ. ఆమె అతన్ని కలుసుకున్నపుడల్లా నిరుత్సాహంగా చిరాకుగా వుండేది. అతనికి సంబంధంలేని దాంతో బాధపడుతున్నాడని ఆమె అనుకుని వుంటుంది. అతను మనస్సులో ఎన్నోసార్లు అనుకున్నట్టుగా ఆమెతో అనవలసింది: "అమ్మా, నువ్వు నా పెంపుడు పిల్లవు. నేను నీకోసమే బతుకుతున్నాను. నేను ఎవరి కోసం సర్వస్వం ధారపోయటానికి సిద్ధంగా వుండేవాణ్ణో ఆమె నా కప్పగించిన ఆస్తివి నీవు. నీవు దయగా మాట్లాడితే, నా హృదయం చిగురుస్తుంది; నీవు కటువుగా నవ్వితే నేను క్రుంగిపోతాను. నా దయ నీవు సంపాదించ దలచుకుంటే నన్ను దయతో చూడాలి నేను నీ మేలుకోసం, నీ సౌఖ్యం కోసమే పాటుపడుతున్నాను-" యిలా అనేస్తే అతని బాధ కొంత తగ్గిపోయేది.

కొన్నాళ్ళపాటు అతని కో భయం వుండేది; కాని యిప్పు డాభయం, అనుమానం యింక లేవు. వెంకటేశ్వర్లుకి తన కూతురు సంగతి జ్ఞాపక మొచ్చి ఆమెను తీసుకొని వెళ్ళిపోతాడేమోనని అతని భయం. అతను సుబ్బారాయుడింటికి వచ్చిన దగ్గర్నుంచీ ఆమె తండ్రిగురించి ఒకరూ యింతవరకూ ప్రస్తావించలేదు.

వెంకటేశ్వర్లు తన కూతురు విషయం పూర్తిగా మరచిపోయాడు. సరోజ స్కూలు వదలి జానకమ్మదగ్గర కొచ్చాక, వెంకటేశ్వర్లు ఒక ఉత్తరంమాత్రం వ్రాశాడు- తన చెల్లెలి పేర. ఆ ఉత్తరంలో తన కూతురు నెప్పుడూ తనని చూడటానికి తీసుకురావద్దని వ్రాశాడు. తాను తీసుకొన్న జాగ్రతవల్ల ఆమె తనదగ్గర కెప్పుడూ రాదనే ధైర్యంతో అతను జీవిస్తున్నాడు. చెల్లెలు యింటికి వెడితే కూతురు తన మెడకు చుట్టుకుంటుందని అతని భయం.

ఆ యింట్లో ఎప్పుడూ ఎవరో ఒకరు వుంటూ వుండేవారు, ఆ యింటికి సంబంధంలేని వాళ్ళు. వాళ్ళని చూస్తే దాసుకి చిరాకుగా వుండేది. ఆయింట్లో వుండేవాళ్ళలో శేషగిరి ఒకడు. అతను మంచి మాటకారి; సరదాగా వుండి, అందరినీ మెప్పించేవాడు. సరోజకి అతన్ని చూడట మన్నా, అతనితో మాటలాడటమన్నా సరదా. ఆమెను ఎలా నవ్వించాలో అతనికి తెలుసు. అతను లేకపోతే ఆమెకు తోచేదికాదు.

అతని ఉద్దేశ మేమిటోనని దాసు అతన్ని చూసి కంగారు పడేవాడు. ఇదివరకు శేషగిరి మాటలాడిన ధోరణి యింకా అతన్ని కలత పెడుతూనే వుంది. ఆ రోజునుంచి అతను దాసుకు కనబడుతూనే వున్నాడు. అతని అభిప్రాయా లేమిటో తెలుసుకుందామని ప్రయత్నించాడు గాని, అతని అనుమానాలు ఏవిధంగానూ దృఢ పడలేదు. అయినా అతనికి అనుమానం పోలేదు. అందుకని సరోజను యీ విషపూరిత వాతావరణంలోంచి తప్పించితేనే కాని లాభం

లేదని తోచిం దతనికి. ఆమెకీ ప్రాపంచిక సౌఖ్యాలు అందుబాటులో వున్నంతకాలం తను ఆమెను మార్చటానికి ఎన్ని ప్రయత్నాలు చేసినా లాభం లేదనుకున్నాడు. ఆమెను జన సమ్మర్దంలేని ఏకాంత స్థలాలకు తీసుకువెళ్ళగలిగితే బాగుండు ననుకున్నాడు.

అతని కల నిజమయింది-అతని వాంఛ నెరవేరింది. ఒకరోజున సుబ్బారాయుడు అతనినొక వారం రోజులలో జానికమ్మతోను, సరోజతోను బయలుదేరి, ఆవేసంకాలం వాళ్ళ పొలాలు, యిళ్ళు వున్న పల్లెటూళ్ళో ఉండడానికి వెళ్ళమన్నాడు. ఆవూళ్ళో పని చక్కబెట్టుకొని తనుకూడా వస్తానన్నాడు. తన కార్యదర్శి తనతోకూడావుంటే, యిన్నాళ్ళూ నెమ్మదిగా సాగుతున్న అతని పని అక్కడకూడా జరుగుతుందని అతని అభిప్రాయం.

రామదాసు తన గదిలోకి చాలా ఉత్సాహంగా వెళ్ళాడు. అతన్నిన్నాళ్ళూ శీతాకాలపు చలిగాలి కొరికేసింది. హృదయమంతా కరడుగట్టిపోయింది. ఈ వేసవికాలంలో అతని దేహం, హృదయం వికాసం చెందటానికి ప్రయత్నిస్తున్నాయి. రాజేశ్వరమ్మ కోరిక నెరవేర్చటానికి యీ అవకాశం వినియోగించుకో దలచుకున్నాడు.

ఆ మరుసటి వారం అతను సుబ్బారాయుడి ఎస్టేటులో గోదావరి నదిపక్క భవనాల్లో ఉన్నాడు.

(ఇంకా వుంది)



కొత్తపద్ధతులు

# నేర విచారణ

"రావు"

ఒక ఎల్లయ్య ఒక మల్లయ్యదగ్గిర డబ్బు కొట్టేశాడు. ఆ డబ్బుతో ఎల్లయ్య కొన్ని కొత్త గుడ్డలూ, ఇంటికి కావలసిన వస్తువులూ, తన చుట్టపక్కాలకు కొన్ని బహుమానాలూ కొన్నాడు. నలుగురు స్నేహితులకూ, బంధువులకూ సదుపోపేసంగా విందులూ వాటీ చేశాడు.

ఎల్లయ్య తనదగ్గిర డబ్బు కాజేశాడని మల్లయ్య అధికార్లదగ్గిర ఫిర్యాదు చేశాడు. విచారణ చేయిస్తామన్నారు. కొన్ని మాసాలు గడిచాయి. విచారణ విషయమై అతీ గతీ లేదు.

ఈలోపుగా మల్లయ్యచేసిన ఫిర్యాదుగురించి దేశమంతా పాక్కింది. కొందరు స్నేహితులు ఎల్లయ్యతో అన్నారుకూడాను. కాని ఎల్లయ్య లక్ష్యపెట్టలేదు. అతను స్నేహితులతో అన్న మాటలు గమనించదగినవి.

"నేను డబ్బు కొట్టేశానని మల్లయ్య రుజువు చెయ్యలేడు...ఆమాటకు వస్తే మల్లయ్యా చేతివాట్లు వేసినవాడే నంటాను."

ఇంకా కొన్ని నెలలు గడిచాయి. ఈలోపల ఎల్లయ్య ఇంకాచాలాచోట్ల చేతివాట్లు వేస్తున్నట్లు పుకార్లు బయలుదేరాయి. ఎవరూ ముందుకు వచ్చి అధికార్లతో ఫిర్యాదు చేయలేదు. ఆగద మల్లయ్య చేసిన ఫిర్యాదు ఇంకా పెండింగులోనే ఉంది.

మల్లయ్య ప్రయాసపడి చేతివాట్ల జాబితా తయారుచేయ మొదలు పెట్టాడు. జాబితా ఏమో కొండవీటి చేంతాడల్లే పెరిగింది. ఈ లోపుగా ఎల్లయ్యది నిత్యకల్యాణం పచ్చతోరణం. అంతా స్నేహితులే, అందరూ బహుమానాలు పొందినవారే, అందరూ విందులు కుడిచినవారే.

వాళ్లు కూడా ఎల్లయ్యను మహాచమత్కారంగా సమర్థించారు. "సరే, బాగుందే! దొరికే దానికూడా దొంగతనమేనా? అవసరం దొరికితే చేతివాటు వెయ్యని పవిత్రుడెవడు? అసలు మల్లయ్య కేదో పగలేనిదే ఎల్లయ్యమీద ధ్వజ

మెత్తుతాడా? తన విషయం తను చూసుకోక ఊళ్లోవాళ్ళ వ్యవహారాలన్నీ ఇతడి కేలా?"

తటస్థంగా ఉండేవాళ్ళు తటస్థంగా మాట్లాడారు.

"విన్నావటోయ్?"

"మన కెందుకు పోనిస్తూ!"

"మల్లయ్య వన్నీ అబద్ధాలేనా?"

"లేకపోతే ఈయన పోయి చూసి వచ్చాడా? అయ్యా, చేతివాటు వేసేవాడు అందరూ చూసేలా వేస్తాడనుకుంటాడే!"

"మరెందుకీ మల్లయ్య అట్టహాసం?"

"వాళ్ళకీ వాళ్ళకీ ఏం లావాదేవీలున్నాయో!"

"అదీ నిజమేలే."

అందరూ మల్లయ్య ఆరోపణలు మరిచే సమయంలో విచారణ ఆరంభమై నలుగురికీ ఉత్సాహం కలిగించింది.

విచారణాధికారి ఎల్లయ్యగారింటికే వచ్చాడు. మల్లయ్యను పిలిపించాడు. ఆరోపణలు చెప్పమన్నాడు. మల్లయ్య కాగితం ఇచ్చాడు.

"ఇక నువ్వు వెళ్ళవచ్చు" అన్నాడు విచారణాధికారి.

రెండుపూటలు విందు ఆరగించి విచారణాధికారి వెళ్ళాడు. విచారణ ఫలితానికి అతీగతీ లేదు. కొన్ని నెలలు గడిచాయి.

మల్లయ్య అధికార్లకు ఉత్తరం రాశాడు.

"విచారణాధికారి నివేదిక తయారు చేస్తున్నాడు" అని అధికార్లు సమాధానం రాశారు.

కొన్ని మాసాలు గడిచాయి. మళ్ళీ మల్లయ్య అధికార్లకు రాసుకున్నాడు.

"విచారణాధికారి నివేదిక తయారు చేశాడు. అందులో ఉన్న విషయాలు బయట పెట్టటానికి ఎంతమాత్రం వీలులేదు. అది రహస్య నివేదిక," అని జవాబు చెప్పారు అధికార్లు.

మల్లయ్య జీడీలాగా పట్టుకున్నాడు. పత్రికలకు సంపాదక లేఖలు వ్రాశాడు.

మల్లయ్యను అధికార్లు ఆరోపణలతోనూ సాక్ష్యంతోనూ బయలుదేరి రమ్మన్నారు. మల్లయ్య వెళ్ళాడు.

"ఇందులో ఉన్న ఆరోపణలు ఉపసంహరించుకుంటే విచారణ జరపటానికి అభ్యంతరం లేదు" అన్నారు అధికార్లు.

"విచారణ జరిపి తీరాలిసిందే" అన్నాడు మల్లయ్య.

"ఎల్లయ్యా నువ్వూ రాజీపడమని మా సలహా."

"ఏ విషయమై రాజీపడం?" అన్నాడు మల్లయ్య.

"మీ యిష్టం!"

"విచారణ జరిగి తీరాలిసిందే", అన్నాడు మల్లయ్య.

"సరే విచారణ జరుపుతాం. నువ్వు వెళ్ళు" అన్నారు అధికార్లు.

మరొక విచారణాధికారి వచ్చాడు. ఇది నిజమైన విచారణ అయి ఉండాలి.

ఈయన కేమీ తెలీకపోవటం చేత "రెడ్డొచ్చె మొదలాడె" అయింది. మల్లయ్యతో మాట్లాడి విచారణాధికారి ఎల్లయ్యతో కూడా ఏదో మాట్లాడి వెళ్ళిపోయాడు.

కొంతకాలానికి అధికార్ల వద్దనుండి ఉత్తరం వచ్చింది మల్లయ్యకు.

"నువ్వు చేసిన ఆరోపణల్లో నూటికి 19 పాళ్లు విచారణాధికారి విశ్వసించ లేదు. ఆయన కా ఆరోపణలు అసత్యంగా ఉన్నాయి. మిగిలిన వాటిలో నూటికి 35 పాళ్లు రుజువు కాలేదు. సాక్ష్యం ఏమీ లేదు. మిగిలినవాటిల్లో నూటికి 90 పాళ్లు ఎల్లయ్య ఖండించాడు. అవి పచ్చి అబద్ధాలు. మూడు ఆరోపణలను మాత్రం ఎల్లయ్య స్వయంగా ఆమోదిస్తున్నాడు. వాటికి కారణాలున్నాయి. అవి బహిరంగ పరచటానికి వీలులేదు. అవి బహిరంగపరిస్తే దేశంలో శాంతి భద్రతలకు అపాయం వాటిల్లుతుంది."

మల్లయ్యకు ఏం చేయాలో తోచలేదు.

"శ్రీ ఎల్లయ్యగారి మీద అక్రమ ఆరోపణలు చేసినందుకు నన్ను విచారించి శిక్షించ వలసినదిగా విజ్ఞాపన చేసుకుంటున్నా", అని మల్లయ్య అధికార్లకు ఉత్తరం వ్రాశాడు.

కథానిక

# భూతరాజు విడిది

మూలం(హిందీ): హేమేంద్రకుమార్ రాయ్  అనువాదం: ఆర్. సోమసుందర రావు

సంథాలు పరగణాలలో సర్కారు ఉద్యోగం నాది. కొన్ని రోజుల సెలవుపై మా వూరికి వెళుతున్నాను. నే నుండే స్థలానికి దగ్గిర రైల్వేస్టేషనుకూ సుమారు ముప్పది మైళ్ళకు పైగా దూరం వుంది. అందులో కొన్ని మైళ్లు కొండదారి. రాత్రులు ఈ ప్రదేశంలో పులులూ, ఎలుగ్గొడ్లూ మొదలగు అడవిమృగాలు విచ్చలవిడిగా విహరిస్తాయి. మునిమాపున ప్రయాణమైనా మధ్యదారిలోనే రాత్రి సమీపిస్తుంది. అందుకై ఆ ప్రదేశంలో ఒక ఆశ్రయస్థానం ఆవశ్యకత ఏర్పడుతుంది.

మార్గ మధ్యంలో ఇక్కడిరాజా కొక్క శికారుప్రదేశం వుంది. అక్కడనే రాజాగారి శికారుగృహంకూడా వుంది. ఆబంగళాలో బస చేయటానికి మేనేజర్ని అడగాలి. వెళ్లి అడిగాను.

అత డిలా అన్నాడు—"ఇప్పు డేమీ శికారు సమయంకాదు. గదులన్నీ ఖాళీగానే వున్నాయి. కావాలంటే ఒకరోజే కాదు, ఒక మాసమైనా వుండండి. దాని కేమీ అభ్యంతరం వుండదు. నేడే ఒక పోలీస్ అధికారి టేలర్ దొర ఈ రాత్రి అక్కడ బసచేయటానికి కోరారు. మీరు యే గది నచ్చితే ఆ గదిలో వుండండి. కాని..."

"కాని యేమిటండీ?"

"రాత్రి అక్కడ మీ రుండగలరాయే అని సందేహిస్తున్నాను."

"ఎందుకుండ లేం?"

"ఆ భవనంలో భూతాలున్నా యని ప్రతీతి;"

"భూతాలున్నాయా?"

"అవును. బంగళా చుట్టుపక్కలవుండే దట్టమైన సాలవనంలో సంథాలీ ప్రజల భూతరాజు వున్నాడు; ఆ భూతరాజుభయంతో చీకటిపడగానే అక్క డెవ్వరూ వుండరు. ఆ ప్రదేశానికే వెళ్లరు. నిశీథంలో ఆ భూతరాజు రాజాగారి బంగళాలో నిద్రించటానికి వస్తాడని ప్రతీతి."

"అలాగైతే మంచిదే! మానవుడైనా ఒక భూతరాజుతో రాత్రి గడపడం విశేషమే... ఒక పుణ్యకార్యమే. నే నిందుకు సిద్ధమే—!" నవ్వుతూ నే నన్నాను.

"మీ యిష్టం బాబూ, నేను చెప్పవలసింది చెప్పాను"- అన్నాడు మేనేజరు.

యథాసమయానికి డోలీలో కూర్చొని ప్రయాణం సాగించాను. చీకటి పడక మునుపే శికారు గృహం చేరుకున్నాను.

డోలి మోసినవాళ్ళు అక్కడికి మూడుమైళ్ళ దూరంలోవుండే పల్లెలో రాత్రి గడుపుతామనీ, పొద్దరాళే మళ్ళీవచ్చి రైలుస్టేషన్ వరకూ డోలీ కట్టుతామని చెప్పి వెళ్ళిపోయారు.

బంగళా వరండాలో టేలర్ దొర కుర్చీపై కూర్చొని చుట్ట కాలుస్తున్నాడు. అతనితో నాకు బాగా పరిచయం వుంది. నన్ను చూడగానే అత డన్నాడు-

"ఓహో, గుప్తాబాబూ! ఎక్కడికి మీరు కూడా ప్రయాణం?"

"సెలవుపై మా వూరు వెళుతున్నాను... మరి మీరు?"

"నేను కూడా 'హోమ్' వెళుతున్నాను. మీరు ఈ రాత్రికి యిక్కడే నిలుస్తారుగా?"

"ఆ..."

"ఐతే మనమిద్దరం కులాసాగా కబుర్లు చెప్పుకుంటూ ఈరాత్రి గడిపేద్దాము."

"మన మిద్దరమేనా? ...ముగ్గురం!"

"మూడవవా రెవరండీ? నా ఆర్డర్లీని కూడా చేర్చుతున్నారా? అలే, వాడిని నేను మనిషికిందే జమకట్టలేను."

"మీ ఆర్డర్లీ కాదులెండి."

"మరి యిక్కడి బంగళా కావలివాణ్ణిగురించి అంటున్నారా? వాడు రాత్రిళ్లు యిక్కడ వుండనే వుండడు."

"వాళ్ళిద్దరూ కారండీ... మీరు వినలేదూ, వంథాలీల భూతరాజు రోజూ నిశీధ సమయాల్లో యిక్కడికి వస్తాడని? ఆ భూతరాజే లేదూ మనతో తానుకూడా కలుస్తాడు."

"ఓహో! నే విన్నాను. వీటినన్నీ నుత రామూ నేను నమ్మను నుమండీ. ఏం, మీరు నమ్ముతారా?"-టేలర్ నవ్వుతూ అన్నాడు.

"నమ్మినట్టయితే నే నిక్కడికి ఒంటరిగా వచ్చేవాడనే కాదు."

టేలర్ మూడు నాలుగుసార్లు చుట్టపొగను పీల్చి అన్నాడు-"గుప్తాగారూ, నే నా వంథాలీ భూతరాజ విగ్రహాన్ని చూశాను. చూడ్డానికి భీభత్సంగా, భయానకంగా వుంది. ఆమూర్తిని నేను చాలా మెచ్చుకున్నాను."

"మెచ్చుకున్నారా?" - ఆశ్చర్యంతో అడిగాను.

"అవును... రేపు నావెంబడి ఆ విగ్రహాన్ని కూడా మాదేశానికి తీసుకువెడతాను. అక్కడ మావాళ్లందరూ ఆ మూర్తిని చూసి చాలా ఆనందిస్తారు."

"అలాగైతే రేపటినుంచి భూతరాజు యిక్కడికి రాడేమో? ఇప్పుడా విగ్రహాన్ని ఓమారు చూసి వద్దామా!"

"అలాగే... చాలా దగ్గరగానే వుంది."

"మే మిద్దరం నడకను సాగించాము. బంగళా పక్కనే సాలవృక్షాలు దట్టంగా పెరిగి చక్కని నీడల్ని విరజిమ్ముతున్నాయి. ఆ నీలి నీడలమధ్య రాతిపై మసక మసకగా ఒక విగ్రహం కనబడింది. దగ్గరగా వెళ్లి చూశాం.

విగ్రహాన్ని కర్రతో చేశారు; రంగు పూశారు ...మనిషి యెత్తున ఉంది. దేహం వికారమైన దానవాకారం ... భయానకం...తలపై జుత్తు పొడవైన జడలుకట్టి పాముల వలె మెలికలు తిరిగి వ్రేలాడుతోంది ... ఏనుగు చెవులు ... సింహ ముఖం...కోరపళ్లు...కళ్లు రెండూ రెండు నిప్పులు... చేతులు పులికాళ్లను పోలి వాడైన గోళ్లు కలిగిభయంకరంగా వున్నాయి. నడుంనుండి తదితర అంగాలన్నీ చెక్కబడలేదు. ప్రతిమ యొక్కవర్ణం 'కోల్టారు' లాగావుంది.

నిజంగా ఈమూర్తి రాత్రి భవనాంతరంలోకి గాని వస్తే యిక మానిద్ర చిరనిద్రే అవుతుంది అని నాలో నే ననుకొన్నాను.

మెల్లగా బంగళా చేరుకున్నాము.

టేలర్ పడమటి దిక్కు మొగమై ఆకాశాన్ని పరికించాడు. అతనికి నల్లగా యేదో అగుపడింది.

"గుప్తాగారూ, ఈరాత్రి కుంభవర్షం తప్పదు. అదిగో చూడండి, కారు మేఘాలు యెలా వస్తున్నాయో"-అంటూ టేలర్ చూపించాడు.

అత డన్నట్లుగానే కారుమేఘాలు మావైపు దౌడు తీస్తున్నాయి. ఒక్కక్షణంలోనే అవి ఆకాశ మంతటా ఆక్రమించాయి. ఇక వర్షం రావడానికి ఆలస్యం లేదు.

* * *

ఘోరున వర్షం ఆరంభించి మహారణ్యాన్ని మేల్కొల్పింది.

టేలర్ కోరికమీద కొంతసేపు బాతాఖానీ సాగించాము. కొంతసేపటికి 'డిన్నర్' కూడా ముగించాము. మరికొంత సేపటికి 'గుడ్ నైట్' తో మా గదులను ప్రవేశించాము. పడకపైన మేను వాల్చాను. కాని నిద్ర మాత్రం రాలేదు. టేలర్ అప్పుడే గుర్రు పెడుతూ హాయిగా నిద్రిస్తున్నాడు.

భూతప్రేతాదులను నమ్మకపోయినా యెందుకో నా గుండె ధక్కు ధక్కు మని కొట్టుకొంటూ వుంది. ఆ మేనేజరు మాటలూ, భయానకమైన ఆ దేవతావిగ్రహం నా మనస్సును పూర్తిగా ఆవరించుకొని నాలో అవ్యక్త భయాన్ని రగుల్కొల్పాయి.

వెలుపల కుంభవృష్టి ఘోరుమని పాడుతూ వుంది. దీనికి తోడుగా గాలి కూడా హో-హో-హో అని ధ్వనిస్తూ వుంది. వనంలోని తరు పత్రాలు మర్మర ధ్వనులను చేస్తూవున్నాయి.

ఈ ధ్వనుల మధ్యలో యెవ్వరిదో అట్టహాసాన్నీ, సృగాలదళాల మృత్యు రోదనాన్నీ, శార్దూల గర్జనాలనూ విన్నాను.

హఠాత్తుగా నా గది తలుపు కటకట మని అదిరింది. నా హృదయం దడదడ మని బెదిరింది. ఏం భూతరాజు వచ్చేశాడా?

తలుపు మ్రోగటం నిలిచింది. తీవ్ర ఝంఝూనిలానికి తలుపు మ్రోగిందనీ, శబ్దం చేసిందనీ యోచించి నా భయానికి నేనే నవ్వుకొన్నాను. ఇంతలో బయటనుండి ఓ పాట వినబడింది-

'మేడపైనా మేఘాలూ
దాడిలీసినై తమ్ముడా!...'

ఇది సంథాలీ భాషకు చెందినదే. సూనవ కంఠస్వరమే. నిశ్చయంగా యెవరో ఒక సంథాలీవాడు ఈ పాటను పాడుతూ వుండాలి. కాని నిబిడ నిశీథంలోనా? ఈ పెను ముసురులోనా? భయంకరవన్య మృగాలు విచ్చలవిడిగా విహరించే సమయంలోనా?

మళ్లీ గది తలుపుపై అవే ఘోరమైన శబ్దాలు ఆరంభమైనాయి. ఈసారి మరీజోరుగా. నా సమస్త శరీరం కంపించింది. ఇది గాలివాన వల్ల కలిగే శబ్దం కాదు. నిజంగా యెవ్వరో తలుపును బాదుతున్నారు. మరి భూతరాజే తలుపును బాదుతున్నాడా? ఇక మా గతేమిటి?

మళ్లీపాట...ఈసారి చాలా దగ్గరగా....ఉన్నత కంఠశ్రుతితో—

'మేడపైనా మేఘాలూ
దాడిలీసినై తమ్ముడా!...'

ఇంకేముంది, విపత్తు మూడింది. తలుపులన్నిటినీ బ్రద్దలు కొడుతున్నారు. నాలోని చేతనాలన్నీ నశించాయి. ఒక శిలాప్రతిమలా కూర్చొని వింటున్నాను. అప్పుడే—"గుప్తా...గుప్తా...రామ్ దోహోయీ...తలుపు తియ్యి...త్వరగా...త్వరగా...తియ్యి"—ఈ మాటలు నా చెవిని బడ్డాయి. ఇవి టేలర్ అన్న మాటలు. అబ్బా, బ్రతికాను!

త్వరగా లేచి తలుపు తీశాను. అతను చర చరా నా గదిలో ప్రవేశించాడు. ముఖం పాలిపోయివుంది... చేతిలో తుపాకీ వుంది.

రెండు చేతులతోనూ అతణ్ణి పట్టుకొని అన్నాను—'మిస్టర్ టేలర్, ఏమిటి ఖంగారు? ఏమయింది?..."

టేలర్ గోడ కానుకుని అన్నాడు-"గుప్తా... నా గదితలుపుపై యెవళ్లో లాఠీతో బాదుతున్నారు, వుండి వుండి పాటకూడా పాడుతున్నారు...ఏం, నువ్వు నన్ను పిలిచావా?"

"లేదే...నా పడకవిడిచి ఒక్క అడుగైనా వెయ్యలేదే. నా గది తలుపుకూడా యెవరో బద్దలు కొడుతున్నారు. పాటకూడా పాడుతున్నారు...అదిగో విను."

నాగది తలుపుపై శబ్దవర్షం ధామ్-ధామ్-ధామ్ అని కురిసింది. పాటకూడా ప్రారంభమయింది.

'మేడపైనా మేఘాలూ
దాడిలీసినై తమ్ముడా!...'

అకస్మాత్తుగా ఒక్క పిడుగు పడింది. దాని మిరుమిట్లు గొలిపే వెలుగులో ఎవరిదో అస్పష్ట ఆకారాన్ని వరండాలో గుర్తించాను. ఆ భయంకరాకారం యెవరిది? ఎవరా మూర్తి? ఆ ఛాయ బంగళా కావలివాడిది కాదే!...నా గొంతుక యెండిపోయింది. నా నరాలు చల్లబడ్డాయి.

టేలర్ తుపాకిని సర్దాడు...ఛాయ అవతలకి తొలగింది.

"గుప్తా...గుప్తా...కిటికీ తెరను సర్దిరా...త్వరగా..." టేలర్ అన్నాడు.

రంయిమని గాలి వీచినదానికి కిటికీ తెర కొంత తొలగింది. భయంతో నా కాళ్లు కదలటం లేదు. దేహం అంతా కంపించిపోతున్నది. నేను పోకపోతినా ఈ బెంగాలీవాడు పట్టి పిరికివాడని తరువాత టేలర్ అంటాడు. ఈ భయంతో నా దౌర్బల్యమంతా అతి కష్టంతో అణచిపెట్టి నే నా కిటికీ తెరను సర్దాను.

టేలర్ నా పడకపై కూలబడి అన్నాడు—"గుప్తాజీ, మరేమీ మీరు అనుకోరు కదా? నే నీరాత్రికి మీతోకూడా ఈ పడకపైనే పడుకుంటాను."

బయటనుంచి అదేపాట మళ్ళీ మా చెవులను దూసింది—

'మేడపైనా మేఘాలూ
దాడిలీసినై తమ్ముడా!..'

* * *

ఎలాగో తెల్లారింది. వర్షం మాత్రం అలాగే కురుస్తూవుంది.

మెల్లగా అడుగులో అడుగువేస్తూ గది తలుపు తెరిచాను. వరండాను సమీపించాను. ఆకాశమంతటా ఒక్కటే వరుసగా కారు మేఘాలు ఆవరించివున్నాయి. సూర్యుణ్ణి కారు మేఘాలనే రాహువు పీడించినట్లు అగుపడుతూ వుంది. కనుచూపుమేరలో సాల వృక్షాలు

గుంపులుగుంపులుగా పెరిగిన మహారణ్యమే... శైలమాలతో అగుపడుతున్నాయి. కొండ కొనల నుంచి క్రిందికిజారే జలధారలు తెల్లగా వెండి తీగలవలె వున్నాయి. వర్షధారలు విల్లునుండి సూటిగా విడువబడిన అమ్ములవలె క్రిందికి వేగంగా జారుతున్నాయి. శకుంత సంతతి కూజితాలేవీ వినబడలేదు.

హఠాత్తుగా నా దృష్టి వరండాలో ఒకమూల పడింది. బిర్ర ముసుగు పెట్టుకొని యెవరో గుర్రు పెడుతున్నాడు.

దగ్గరగా వెళ్ళి బిగ్గరగా అన్నాను—"ఏయ్, యెవరు నువ్వు?"

కొన్నిసార్లు అరవగా ఆ మనిషి ముసుగుతీసి, కళ్ళునులిమి, ఆవులించి గొణిగాడు. వాడు ఏం గొణిగిందీ నా కర్థంకాలేదు. మళ్ళీ అడిగాను—"ఏయ్, ఎవరు నువ్వు?"

"దేవతార్చకుణ్ణి"—వాడు జవాబిచ్చాడు.

"దేవతార్చకుడివా? ఏ దేవతకు?"

"ఈ సాలవనంలో వుండే దేవతకు."

"మరి, ఇక్కడికి ఎందుకు వచ్చావు?"

"మాదేవుడు రోజూరాత్రి యిక్కడ నిద్రించటానికి వస్తాడు. మా దేవునితో కలిసి నేనూ యిక్కడే పడుకొంటాను."

"ఐతే నువ్వేనా రాత్రి తలుపుల్ని బాదింది?"

"మా దేవతా, నేనూ."

"పాటను యెవరూ పాడింది?"

"నేనే."

ఆదేసమయానికి టేలర్ బయటికి వచ్చాడు. అతనికి ఈ విషయమంతా తెలియజేశాను. అతనికి అరికాలిమంట నెత్తికెక్కింది. చురచురా పూజారిని చూశాడు. ఆ పూజారి ఒక్కసారిగా లేచి క్రిందికిదిగి శరవేగంతో పరుగెత్తి ఒక్కత్రుటిలో అదృశ్యమయ్యాడు.

"నే నిప్పుడే వాణ్ణి కాల్చేస్తాను. ఆ వెధవ పీక నులిమేస్తాను... అబ్బా, రాత్రి యెంతటి అశాంతితో గడిచింది—" అంటూ టేలర్ వానలో పరుగెత్తటానికి ఉద్యమించాడు.

"పోనిద్దురూ, ఏది జరగాల్సిందో అది జరిగిపోయింది. ఇప్పుడేమిటీ ఉపాయం? బంగళా కావలివాడు రాలేదు. డోలీ మోసేవాళ్లుకూడా రాలేదు. బహుశా ఈ వానలో రారేమో. మరి యేమిటీ కర్తవ్యం?"-అన్నాను నేను.

అందుకు టేలర్ అన్నాడు—"నే నెలాగైనా ఇప్పుడు వెళ్లాల్సిందే. బొంబేవరకూ టికెట్టు తీసుకొన్నాను. అక్కడ స్టీమరుని అందుకోవాలి. సాధ్యమైతే మిమ్మల్నికూడా రైల్వే స్టేషన్ వరకూ దిగబెట్టివుందును. కాని నా కారు టూ-సీటర్. నేనూ, అర్డర్లీ, మీరు, మరి మన సామాను- నాచిన్న కారు పట్టదు. అందుకు మిమ్మల్ని యిక్కడే వదిలి వెళ్లాలి నేను...అర్డర్లీ!"

అర్డర్లీ వచ్చి సలామ్ చేశాడు.

"మన సామానంతా సర్దు...తరవాత సాలవనంలో వుండే ఆకర్రబొమ్మను తీసుకొనిరా"-టేలర్ అన్నాడు.

"ఐతే మీరు నిజంగా ఆ ప్రతిమను మీదేశానికి తీసుకువెడుతున్నా రన్నమాట?" - ఆశ్చర్యంతో అడిగాను.

"అవశ్యంగా... నే నేమంటానో దాన్ని చేసి తీరుతాను"-నవ్వుతూ టేలర్ అన్నాడు.

* * *

మళ్లీ రాత్రి సమీపించింది. వాన యింకా ఆగనే లేదు. నేను బంగళాలోనే బంధింపబడ్డాను.

టేలర్ తెల్లవారే వెళ్ళాడు. వెళ్లేటప్పుడు భూతరాజునుకూడా తనవెంట తీసుకెళ్ళాడు అబ్బా...ఇక ఆ భూతం యిక్కడికి రాదు!

నాకు నిద్ర రాలేదు. నవల ఒకటి తీసి చదివాను. కొంతసేపటికి కళ్లు బరువెక్కాయి. దీపం సన్నగా చేసి పక్కపై మేను వాల్చాను. అప్పుడే విన్నాను, వెలుపలినుండి అదే ధ్వని- టక్-టక్-టక్- అదే కర్ర శబ్దం. నాగదివరకూ సమీపించింది. ఇక తలుపుపై ధామ్-ధామ్-ధామ్ అని శబ్దవర్షం కురిసింది.

ఇదేమిటీ విపత్తు! టేలర్ ఆ భూతరాజును తనవెంట తీసుకెళ్ళాడే! నిశ్చయంగా ఆ సంథాలీవాడే, ఆ వెధవపూజారే యిలా దొంగవేషాలు వేస్తూ వుండవచ్చును.

శబ్దవర్షం అధికమయింది. చెవులు చిల్లులు పడ్డాయి. తలుపు తీసి ఆ పురోహితుడి పని పట్టేద్దామా అని ఆలోచించాను. కాని మళ్లీ

వాడు కాదేమో అన్న అనుమానం నన్నావరించింది. పైగా నే నొంటరిగాణ్ణి.

తుపాకిని తీసుకొని మెల్లిగా తలుపు వద్దకు నడిచాను. లేని బలం తెచ్చుకొని బిగ్గరగా అన్నాను—"ఏయ్...పూరికే వెళ్ళిపో...లేకపోతే తుపాకితో కాల్చేస్తాను."

జవాబు రాలేదు. శబ్దపాతంకూడా తగ్గలేదు.

"ఇప్పుడైనా వెళ్లిపో..ఇదిగో కాల్చేస్తాను."

వెలుపల నుండి వెకిలినవ్వు వినబడింది—

'హిహిహిహిహి ... హిహిహిహిహి...ఈ హి హిహిహి...'

తుపాకిని బారు చేశాను. అప్పుడే శబ్దవర్షం నిలిచింది.

టక్-టక్-టక్ అను ధ్వని దూరంగా తొలగింది.

కొంతసేపటికి అదే వెకిలినవ్వు నాసరసరాల్ని పీడించింది—

'హిహిహిహిహి...హిహిహిహిహి... ఈ హి హిహిహిహి...'

* * *

వాన వెలిసింది. తెల్లవారింది. తలుపు తీయగానే కమల బాంధవుడి కాంచన వర్ణ కిరణాలు ప్రకృతికంతటికీ శోభ తెచ్చాయి నులివెచ్చని సూర్యరశ్మి నాదేహాన్ని పులకింపజేసింది. వరండా చేరుకొన్నాను. బిర్రముసుగు పెట్టుకొని యెవడో గుర్రుపెడుతున్నాడు.

దగ్గరగా వెళ్లి ఒక తాపు తన్ని లేపాను-వాడు నలుగుతూ, గొణుగుతూ, ఆవలిస్తూ లేచి కూర్చున్నాడు.

పట్టరానికోపంతో గదమాయించాను-"నిన్న రాత్రి మళ్లీ యెందుకొచ్చావు?"

వా డేమీ చలించలేదు. మామూలుగానే అన్నాడు—"మా భూతరాజు రాత్రి యిక్కడికి వచ్చాడు...నేనుకూడా అందుకే వచ్చాను"

"మీ భూతరాజు యెక్కడున్నాడోయ్? ఆ తెల్లదొర తీసుకెళ్ళాడే?"

"మా భూతరాజు యిదివర కెక్కడున్నాడో యిప్పుడూ అక్కడే వున్నాడు."

"ఛా, అంతా అబద్ధం. నేను కళ్ళారా తెల్లదొర తీసుకెళ్ళడం చూశాను!"

"మా భూతరాజు అక్కడే వున్నాడు. నేను అబద్ధం చెప్పేవాణ్ణిగాను. కావాలంటే వెళ్ళి చూడండి."

నేను చరాచరా వెళ్లి చూశాను. ఆశ్చర్యం ...భూతరాజు యథాస్థానంలో వున్నాడు. అతని ఉదరానికి మధ్యగా రంధ్రంపడింది. ఆ రంధ్రం చుట్టూ రక్తం—దేహంనిండా రక్తపు చారలు.

నా కేమీ అర్థంకాలేదు. నా కళ్ళలో కారుచీకట్లు క్రమ్మాయి. ఏదో అజ్ఞాతభయం నన్నావరించింది. ఇంక అక్కడ ఆగలేకపోయాను. ఒక్కటే పరుగున దారితీశాను.

* * *

కలకత్తా చేరగానే వార్తాపత్రికలో యిలా చదివాను-

"సంథాల్ పర్గనా పోలీస్ సూపరింటెండెంట్ మిస్టర్ టేలర్ దొరయొక్క ఆకస్మిక విషాద మరణం.

"మిస్టర్ టేలర్ సెలవుపై తన దేశానికి ప్రయాణ మయారు. కాని దారిలో ఒక దుర్ఘటనకు పాల్పడి ఆకస్మిక మరణానికి పాత్రులయారు.

"సంథాల్ మహారణ్య మధ్యంలో వారి కారు దొరికింది. కారు చుట్టూ, లోపలా అంతా రక్తమయం. మిస్టర్ టేలర్, అతని అర్ధశిల్ల శవాల జాడ యెక్కడా దొరకలేదు. అక్కడి పోలీస్ అధికారులు యేదో వన్యమృగం వాళ్లని కబళించి వుండునని సందేహిస్తున్నారు. నరభక్షియైన ఒక పెద్దపులికూడా ఆ అడవుల్లో వుందని వార్త తెలిసింది."

ఆ భూతరాజుపైగల రక్తపు చారలు యెవరివి? అవి టేలర్ దొరవేనా? ఆ సంథాల్ పురోహితుడే దీనికంతకీ కారణమా? వాడే ఆ భూతరాజును మళ్లీ యథాస్థానంలో ప్రతిష్ఠించి వుంటాడా?

ఈ ప్రశ్నాపరంపరకి జవాబులు రేవని నప్పటికీ ఒక శపథంమాత్రం చేశాను - ఇక యెప్పుడూ ఆ బంగళాలో రాత్రిళ్లు నిలువకూడదని.

కథానిక

# జ్ఞాని

"హితశ్రీ"

"ఇవాళ ఆఫీసులేదా ఏమిటి?" అంది స్వర్ణ జడ అల్లటం ముగించి అందం అద్దంలో చూసుకుంటూ.

"ఎందుకు లేదూ?"

"వెళ్ళలేం మరి?"

"ఇంకా పదేగా."

"రోజూ పదింటికేగా వెళ్ళేది."

"మేనేజరు వెళ్ళాలిసింది పదకొండింటికి- అన్నట్టు నీకు చెప్పలేదు కాబోలు. నాకు మేనేజర్‌గా ప్రమోషనయింది."

సాశ్చర్యంగా చూసింది స్వర్ణ బ్రహ్మానందరావువైపు. అతను పడకకుర్చీలో మేను వాల్చి పేపరు చదువుతున్నాడు తీరిగ్గా.

"మరి నిన్నటినుంచీ చెప్పలేదేం?"

"చెప్పేందు కేముంది యిందులో?"

"ఏమీ లేదా!"

బ్రహ్మానందరావు మాట్లాడలేదు. స్వర్ణకి కోపంవచ్చింది. శుభవార్త చెప్పేవిధం ఇదేనా? ఆఫీసునుంచి ఇంటికి రాగానే ప్రథమంగా తనతో చెప్పవలసినవార్త, మాటలసందర్భంలో తర్వాత రోజున తెలియచెయ్యటం తనమీద ఆయనకి ఉన్న నిర్లక్ష్యభావాన్ని వ్యక్తీకరించటంకాదా? రెండేళ్ళనుంచీ ఇంతే. ఈ మాత్రం గ్రహించలేని పసిపిల్లకాదు తను. బ్రహ్మానందరావుకి తన మీద ప్రత్యేకశ్రద్ధగానీ, ప్రేమగానీ ఉన్నట్టు నిదర్శనాలేమీ లేవు.

"అయితే నాకు బహుమానమేమిటి?" అడగకూడదనుకుంటూనే అడిగింది స్వర్ణ.

"నీ ఇష్టం."

మనస్సు కలుక్కుమంది ఆమెకి.

"నా ఇష్టమేమిటి? బహుమతీ ఇచ్చేవాళ్ళ ఇష్టంగాని."

"అయినా ఇందులో సంతోషానికేముంది? నిన్నటిదాకా అకౌంటెంట్ చేశాను. ఇవ్వాళ మేనేజరు చేస్తున్నాను. రేపింకోటి చేయవచ్చు. లేకపోతే అసలేమీ చేయకుండా ఉండొచ్చు. జీవితంలో వెలుగు చీకట్లు వాటి ధర్మాన్ననుసరించి వొస్తూవుంటాయి. వెలుగుని చూసి సంతోషించటం, చీకటిని చూసి దుఃఖించటం తెలియనివాళ్లు చేసేపనులు." భర్త జ్ఞానబోధ విని స్వర్ణ కోపంలోకూడా నవ్వింది.

తామరాకుపై నీటిబిందువులా జీవించటం బ్రహ్మానందరావు ఆశయం. ఏ వస్తువుపైనా అతిగా అపేక్షించటం దుఃఖాన్ని ఆహ్వానించటమేననే సిద్ధాంతం అతనికి బాగా నచ్చింది. మనసుని అరికట్టటానికి అన్నివిధాలా ప్రయత్నించాడు. రాగ ద్వేషాలకి అతీతంగా ఉండటానికి నిశ్చయించుకున్నాడు. అతనికి ప్రాణస్నేహితుడంటూ ఎవరూ లేరు. అతను ఎవర్నీ ద్వేషించలేదు. ఆఫీసర్ చీవాట్లు పెడుతుంటే ఎదురుచెప్పేవాడు కాదు. "ఉద్రేకాన్ని జయించలేవా?" అన్నట్టు మందస్మిత వదనంతో ఆయనవైపు జాలిగా చూసేవాడు. ఈ ప్రవర్తన అతని అభివృద్ధికి చాలా దోహదమిచ్చింది. బ్రహ్మానందరావు చాలా వినయవిధేయతలు కలవాడని, తెలివితేటలు కలవాడని ప్రతి అధికారీ సిఫారసు చేశాడు. అయితే తోటి ఉద్యోగుల్లో బ్రహ్మానందరావుకి పలుకుబడిలేదు. మానాభిమానాలులేని వాడనీ, ఉద్యోగం నిలబెట్టుకోటానికి ఆఫీసర్ అడుగులకి మడుగు లొత్తుతాడనీ వాళ్లు తీర్మానించుకున్నారు. అతని ప్రవర్తన అర్థంచేసుకోటం ఇష్టంలేకపోతే అతన్ని గర్విష్ఠి అనీ, పొగరుబోతు అనీ, మానాభిమానాలు లేనివాడనీ అనవచ్చు.

స్వర్ణమీద తనకి అనురాగం అధికమౌతోందని మొదట్లోనే గ్రహించి జాగ్రత్త పడ్డాడు బ్రహ్మానందరావు. తన ఆశయం మనసులో ఉంచుకుని, ఏ వస్తువుమీదా ఎక్కువగా మమకారం

ఉండటం మంచిది కాదని స్వర్ణకి చూచాయగా చెబుతూ వొచ్చాడు. స్వర్ణతో అతను, "నీవే నా సర్వస్వం,నువ్వు లేకపోతే నేను జీవించలేను" లాంటి మాటలు ఎప్పుడూ మాట్లాడలేదు. ఆమెతో మాట్లాడుతున్నంతసేపూ అతనికి తామరాకుమీద నీటి బిందువు జారిపోతున్నట్టుగా చిత్రం కనిపించేది.

"ఇదం కాష్ట మిదం కాష్టం నదీతీరే సముచ్చయః" అనే వాక్యం అతను ఎప్పుడూ స్వర్ణతో మాట్లాడుతున్నంతసేపూ మర్చిపోయేవాడు కాదు.

ఓరోజు బ్రహ్మానందరావు ఆఫీసునుంచి ఇంటికి రాగానే అతన్ని చిరునవ్వుతో పలకరించి అంది స్వర్ణ:

"ఇవాళ మీకో శుభవార్త."

"ఏమిటి?"

"చెప్పుకోండి మరి, చూద్దాం." తమాషాగా కళ్లు తిప్పుతూ అంది.

"నా కలాంటి విద్యలు రావు."

"విశారద మొదటి తరగతిలో ప్యాసయాను. ప్రేమీమండలి వాళ్లు చెప్పారు."

"అలాగా?" అని క్లుప్తంగా అనేసి బ్రహ్మానందరావు పడక కుర్చీలో పడుకుని పేపరు అందుకున్నాడు. తను ఈ వార్త చెప్పగానే భర్త ఏం చేస్తాడో, ఎలా తన సంతోషం ప్రకటిస్తాడో చిత్ర, విచిత్రంగా ఊహించుకున్న స్వర్ణకి చెంపపెట్టు పెట్టినట్టయింది. ఉక్రోషంతో అంది:

"నేను ప్యాసయితే మీకు సంతోషంగా లేదా?"

మహాయోగి అజ్ఞాని వైపులా, బ్రహ్మానందరావు స్వర్ణవైపు చూశాడు.

"కష్టపడి చదివావు, పాసయావు. నీకర్తవ్యం నువ్వు నెరవేర్చినప్పుడు ఫలితానికి సంతోషించటంగాని, దుఃఖించటంగాని అనవసరం, అవివేకం."

"ఏమిటో మీ మెట్ట వేదాంతం మీరూ, నా ఉత్సాహం కాస్తా చంపేశారు. ఇంకా ఎంతో సంతోషించి మెచ్చుకుంటారని పొద్దుటి నుంచీ ఎంతో ఆశ పెట్టుకున్నాను."

బ్రహ్మానందరావు ఆమెవైపు జాలిగా చూసి అన్నాడు:

"స్వర్ణా, ఈ ప్రపంచంలో పుట్టి బతికేది ఒకరి మెప్పు సంపాదించుకోటంకోసం కాదు. ప్రపంచంలో పుట్టింది మొదలు చచ్చిపోయే వరకూ ఎన్నో పనులు చేస్తాం. చేయటం మన కర్తవ్యం. ఫలితంతో మనకి సంబంధం లేదు. అలాకాక ఫలితంకోసం మనం ఆశిస్తే జీవితంలో దుఃఖాలు తప్పవు. భూమిమీద పుట్టాం. ఎవరెవరం ఎక్కడినుంచి వొచ్చామో ఎవరికీ తెలియదు. ఎలా వొచ్చామో అలాగే నిష్క్రమిస్తాం. అలాగే మనం జీవించటం ముఖ్యం. లేకపోతే జీవితం దుఃఖభాజనమైపోతుంది. మమకారాలకి అంతచను ఇవ్వటం మంచిది కాదు." పాలిపోయిన ముఖంతో స్వర్ణ శూన్యంలోకి చూసింది. తర్వాత తడిలేని కళ్లతో బ్రహ్మానందరావువైపు చూసి కళ్లు తడిచేసుకుంది.

రోజులలాగే గడిచిపోతున్నాయి. బ్రహ్మానందరావులో మార్పేమీ లేదు. స్వర్ణ హృదయవేదనతో రోజురోజుకీ క్షీణించిపోతోంది. ఆమెకి జీవించటం ఎందుకో అర్థం కావటం లేదు. ఓరోజు మధ్యాహ్నం భోంచేసి తీరిగ్గా పడుకుని కుర్చీలో కూర్చుని ఏదో పుస్తకం చదువుతుంటున్న స్వర్ణవైపు పరాకుగా చూశాడు బ్రహ్మానందరావు. వెంటనే ఉలిక్కిపడ్డాడు. స్వర్ణ జ్వరపడ్డ దానిలా చిక్కి సగమైంది. ఆమెకళ్లు గుంటలుపడి ఉన్నాయి.

"అలా ఉన్నావేం స్వర్ణా?"

"ఎలా ఉన్నాను?" పుస్తకంనుంచి దృష్టి మరలించి భర్తవైపు కాంతిహీనమైన కళ్లను విప్పి అంది స్వర్ణ.

"ఎలా ఉండట మేమిటి? బొత్తిగా చిక్కిపోయావు."

స్వర్ణ ప్రత్యుత్తర మివ్వలేదు.

"అన్నం తిన్నావా?"

"ఊహుఁ."

"ఏం?" ఆశ్చర్యంతో అడిగాడు బ్రహ్మానందరావు.

"తినాలని లేదు."

"వొంట్లో బావుండ లేదా?"

"ఊఁ."

"ఎప్పటినుంచి?"

"వారం రోజులవుతుందేమో." నిర్వికారంగా అంది స్వర్ణ.

"ఏమిటీ? వారం రోజుల్నించీ అన్నం మానేశావేమిటి కొంపతీసి?"

"ఏం తినకపోతే?"

"మతిపోయిందా ఏమిటి? నాతో చెప్పలేదేం? అంత అశ్రద్ధ ఐతే ఎలా?"

"ఇంతలో వొచ్చే నష్టమేముంది?"

"అఘోరించినట్టే ఉంది. డాక్టర్ని పిలుచుకు వొస్తానుండు."

"డాక్టరెందుకు?"

"ఎందుకేమిటి, లేకపోతే ఎలా తగ్గుతుంది?"

"తగ్గకపోతే ఏం?"

స్వర్ణ మొండి జవాబులు వింటుంటే బ్రహ్మానందరావుకి బ్రహ్మాండమైన ఆశ్చర్యం వేసింది.

"మొండిగా మాట్లాడటం ఎప్పటి నుంచి నేర్చుకున్నావు?"

"మొండితనం కాదు. ఈ ప్రపంచంలోకి ఎలా వొచ్చామో అలాగే నిష్క్రమిస్తాము. నేను చస్తే మాత్రం ఎవరికి నష్టం?"

బ్రహ్మానందరావుకి మనసు కొంచెం చలించింది.

"ఆవేం మాటలు?"

"అబద్ధమేముంది నేను చెప్పిందాంట్లో?"

నిజమే, స్వర్ణ చెప్పిందాంట్లో అబద్ధమేముంది? "ఇదం కాష్ఠ మిదం కాష్ఠం..." తనకు తెలియకుండానే స్వర్ణమీద తనకి అనురాగం ఎక్కువైపోతోంది. తన ఆశయం నుంచి దూరమవుతున్నాడు. తామరాకుమీద నీటిబిందువులు పడి జారిపోతున్నట్టు చిత్రం కనిపించింది అతడి మనోఫలకం మీద. మనసుని బిగబట్టుకోవాలి.

"డాక్టర్ని పిలుచుకు వొస్తాను" అనేసి బ్రహ్మానందరావు వెళ్ళిపోయాడు. స్వర్ణ అతను వెళ్ళినవైపు రెప్ప వాల్చకుండా చూసింది. తర్వాత నిస్పృహగా నిట్టూర్చింది. తనమీద ఏమాత్రం ప్రేమ ఉన్నా బ్రహ్మానందరావు అలా ప్రవర్తించగలడా? తన భర్త ప్రదర్శించింది కేవలం మానవత్వం. హృదయం ఉన్నవాడు ఎవరయినా ఆ విధంగానే ప్రవర్తించేవాడు—ప్రేమ లేకపోయినా కూడా. వారం రోజుల నుంచి తిండి లేక కృశించిన తనపట్ల అతని వైఖరి చూసి స్వర్ణకి దుఃఖం వెల్లువలైంది.

డాక్టరు మందుతో స్వర్ణకి క్రమేణా ఆరోగ్యం కలిగింది. అప్పుడప్పుడు బ్రహ్మానందరావు స్వర్ణ నుదురుపై చేయివేసి "తగ్గుతుందిలే" అని మాత్రం అనేవాడు. ఆ సమయాల్లో కిటికీలోంచి దూరంలో చెరువులోని తామరమొక్కపై దృష్టి నిలపటం మాత్రం అతను ఎప్పుడూ మర్చిపోలేదు. అనురాగం ఒలికే ఒక్కమాట కోసం స్వర్ణ తహతహలాడింది కాని ఆమెకది లభించలేదు.

ఓరోజు బ్రహ్మానందరావు ఆఫీసుకి వెళ్ళి మామూలు ప్రకారంగా పేపరు చేత పట్టుకున్నాడు.

"మా అన్నయ్య ఉత్తరం రాశాడు" అంది స్వర్ణ.

"ఓహో."

"ఏం రాశాడో తెలుసుకోవాలని లేదా?" అందామె చిరాగ్గా, అతని వైఖరి చూసి.

"ఏం రాశాడు?"

"నే నిక్కడికి వొస్తున్నాట్ట."

"అలాగా?" అని ఊరుకున్నాడు బ్రహ్మానందరావు.

"ఎందుకు?"

'నన్ను తీసుకువెళ్ళటానికట"

"అహా" అని మాత్రం అని పేపరు చదవటం ప్రారంభించాడు బ్రహ్మానందరావు. అతని నిర్లక్ష్యం చూసి స్వర్ణ అభిమానం దెబ్బ తిన్నది.

"ఎప్పుడూ ఆ పేపరేమిటి. నా చెప్పేదేమీ వినిపించుకోకుండా?" అని అతని చేతిలో పేపరు విసిరి అవతల పారేసింది స్వర్ణ

"ఏమిటి స్వర్ణా, రానురాను మరీ చిన్న పిల్లవయిపోతున్నావు" అన్నాడు బ్రహ్మానందరావు ఆమెవైపు వింతగా చూస్తూ.

"ప్రయాణం సంగతి ఆలోచించండి, పేపరు ఎక్కడికీ పోదు."

"ఆలోచించేదేముంది? నువ్వు వెళ్ళదలుచుకుంటే వెళ్ళు."

"మరి మీకు ఇక్కడ కష్టంగా ఉండదూ!"

"కష్టమెందుకూ! ఇంట్లో తినేది హోటల్లో తింటాను."

"అంతేనా - ఒంటరిగా మీకేం తోస్తుంది? పోనీ, మీరు కూడా రాకూడదూ?"

"ఒంటరిగా ఉండటం నాకు అలవాటేలే. అదే నాకు ఇష్టం." చివరి వాక్యం స్వర్ణ మనస్సుకి ఎంత బాధ కలిగిస్తుందో బ్రహ్మానందరావుకి వెంటనే తట్టలేదు. తర్వాత నాలిక కొరుక్కున్నాడు; కాని పరిస్థితి చక్కబరచటానికి ప్రయత్నించ లేదు. మర్నాడు స్వర్ణ పుట్టింటికి వెళ్ళిపోయింది, వ్యథిత హృదయంతో.

పుట్టింటికి వెళ్ళిన తర్వాత స్వర్ణ భర్తకి ఒకే ఒక ఉత్తరం రాసింది. ఆ ఉత్తరంలోని ప్రతి అక్షరం ఆమె ప్రేమని ప్రస్ఫుటంచేసింది. బ్రహ్మానందరావు ఆ ఉత్తరం అందుకుని చాలా కదిలిపోయాడు. ఆమెకి తిరిగి వ్రాసిన ఉత్తరం మళ్ళీ చదువుకుని చింపేశాడు. తామరాకుపై నీటి బిందువుకీ, ఆ ఉత్తరానికీ ఏమీ సంబంధం లేదు.

స్వర్ణకి పుట్టింటికి వెళ్ళాంక తర్వాత భర్త దగ్గర నుంచి ఒకే ఒక ఉత్తరం-ఆమె ఉత్తరానికి సమాధానం-వొచ్చింది.

"స్వర్ణకి—

నీ ఉత్తరం అందింది. నేను హాయిగానే ఉన్నాను. మరీ ఒకే విషయంమీద కేంద్రీకరించి అనవసరంగా బాధపడ వద్దు. ఇంతే సంగతులు.

బ్రహ్మానందరావు."

అతను స్వర్ణకి మళ్ళీ ఉత్తరం వ్రాయలేదు. ఆమె ఆత్మాభిమానం పూర్తిగా దెబ్బతిన్నది. బ్రహ్మానందం ఆశయం ఏ వస్తువునీ అతిగా ఆపేక్షించకుండా ఉండటం. కాని స్వర్ణకి ఇప్పుడసలు ఆపేక్షించవలసిన వస్తువేదీ కనపడలేదు. ఆపేక్షించిన వస్తువు తిరస్కరించింది. అయినప్పుడు జీవించటంలో గల అవసరం ఆమెకి బోధపడలేదు. ఫలితం ఆమెకి తన ఆరోగ్యంమీద శ్రద్ధ తగ్గిపోయింది. రోజురోజుకీ ఆమె క్షీణించిపోసాగింది. ఆమె అన్నయ్య గోపాలరావు చాలామంది డాక్టర్లకి చూపించాడు. మనోవ్యాధి అన్నారు డాక్టర్లంతా.

గోపాలరావు బండిదిగి ఇంట్లోకి పోయేసరికి బ్రహ్మానందరావు శూన్యంలోకి చూస్తూ ఏదో ఆలోచిస్తున్నాడు. స్వర్ణమీది ప్రేమకీ, తన ఆశయానికీ జరుగుతున్న యుద్ధంలో జయాపజయాలు స్థిరంగా ఎవర్నీ వరించటంలేదు. గోపాలరావుని చూసి అతను ఆశ్చర్యంతో అన్నాడు-

"ఉత్తరం రాయకుండానే వొచ్చావేం!"

"నే ఒక్కణ్ణే వొచ్చాను. నీతో కొన్ని విషయాలు మాట్లాడాలి."

"ఏమిటి?" బ్రహ్మానందరావు కిదంతా అగమ్యగోచరంగా ఉంది.

"బావా, చదువుకున్న వాడివి; నీ విలా ప్రవర్తించటంలో అర్థంలేదు."

"ఏమిటి నీ అభిప్రాయం?"

"తప్పెవరిదయినా సర్దుకుపోవటం విద్యాధికుల లక్షణం."

"తప్పేమిటోయ్?"

"నాకు తెలియదనా నీ ఉద్దేశం? నేనంతా గమనిస్తూనే ఉన్నాను. స్వర్ణ మా ఇంటికి వచ్చిన తర్వాత ఒక్కసారిమాత్రం నువ్వు ఉత్తరం రాశావు దానికి. ఆ ఉత్తరం చూసి స్వర్ణ కన్నీళ్లు నింపుకోవటం నేను చూశాను. కాని ఎందుకో అనుకున్నాను. పోట్లాట వొస్తే మాత్రం అంత తెగేదాకా లాగటం ఎవరికీ ఘనత కాదు."

"నువ్వపోహ పడుతున్నావోయ్, గోపాలరావ్. స్వర్ణని నే నెప్పుడూ పల్లెత్తు మాటకూడా అనలేదు. ఆమెకూడా నాతో ఎప్పుడూ పోట్లాడలేదు."

"నిజమా!"

"శుద్ధ నిజం."

"మరయితే డాక్టర్లు దానికి మనోవ్యాధి అంటా రేమిటి!"

"మనోవ్యాధా?"

"అవును. బావా, స్వర్ణని చూస్తే కడుపు తరుక్కుపోతుంది. మనిషి సగమైనా మిగల్లేదు. ఎలా నయమవుతుందో నా కేమీ అర్థంకావటం లేదు."

"ఏమిటీ. స్వర్ణకి జబ్బా?" కడుపులో ఏదో కెలికి నట్టయింది బ్రహ్మానంద రావుకి. "నాకు ఉత్తరమైనా రాయలేదే!"

"అందుచేతే ఏదో పోట్లాట జరిగి ఉంటుందని నే నభిప్రాయపడ్డాను. కాని స్వర్ణ నడిగితే ఏమీ లేదంది."

బ్రహ్మానందరావుకి కాలు నిలవలేదు. అతని మనస్సు స్వర్ణ దగ్గిరికి పరిగెత్తింది. శరీరాన్ని కూడా అక్కడికి చేరవేసేదాకా అతనికి పిచ్చెత్తినట్టయింది.

చిక్కి శల్యమై మంచంమీద పడుకునివున్న స్వర్ణనిచూసి బ్రహ్మానందరావు ఓ పిచ్చికేక వేశాడు. స్వర్ణ ఉలిక్కిపడి చూసింది. బ్రహ్మానందరావు ఆమె మంచంమీద కూర్చుని ఆమె శిరోజాలు సర్దుతూ అన్నాడు:

"ఉత్తరం ఎందుకు వ్రాయలేదు, స్వర్ణా?"

స్వర్ణ అతని మాటకి జవాబుచెప్పలేదు. కాసే పాగి అంది:

"మిమ్మల్ని ఆఖరిసారిచూడటం ఇదేనేమో. ఇహ నేను కోరికలేంలేకుండా హాయిగా చచ్చిపోగలను."

"ఛీ,అవేంమాటలు స్వర్ణా?" అన్నాడుబ్రహ్మానందరావు గద్గదికంగా.

"ఎవ రెవరివాళ్లు ఈప్రపంచంలో? నేను చచ్చిపోయినా నా కంత దుఃఖం ఉండదని నాకు తెలుసు."

తామరాకుపై నీటిబిందువు జారి అతని తడి చేయకుండా మట్టిలో లీనమై పోయినట్లు బ్రహ్మానందరావుకి మనోవీధిలో చిత్రం కనిపించింది.

"స్వర్ణా, నీ వెంటే నే కూడా-" ఆ తర్వాత బ్రహ్మానందరావుకి మాట పెగల్లేదు.

విస్ఫారిత నేత్రాలతో స్వర్ణ అతనివైపు చూసింది.

"అవును, స్వర్ణా! నా సర్వస్వం నన్ను ఒదిలేస్తే నేను ఈ ప్రపంచాన్నే ఒదిలేస్తాను."

స్వర్ణ నేత్రాలు అశ్రువులతో నిండాయి. ఆమె బ్రహ్మానందరావు చేతిని తన చేతుల్లోకి తీసుకుని నెమ్మదిగా అంది-

"నేను చావను. ఎందుకు చస్తాను? చావటంలో అర్థంలేదు."

బ్రహ్మానందరావు గోముగా ఆమెతల నిమిరాడు.



ప్రభుత్వ తీర్మానాలు

# "ధర హెచ్చుట తగ్గు కొర" కవునా?

రావెళ్ల హనుమంతరావు

ఆహార ధాన్యాల ధరలు నూటికి పదివంతులు తగ్గించాలని అక్టోబరు రెండో వారములో ఢిల్లీలో జరిగిన రాష్ట్ర-సంస్థానాల సమావేశం ఏకగ్రీవంగా నిర్ణయించటం జరిగింది.

"ప్రస్తుతం దేశంలోగల ఆర్థిక పరిస్థితుల దృష్ట్యా అత్యవసర చర్యలు తీసుకోవలసిన అగత్యం వున్నందున జీవితావసర వస్తువుల ధరలు తగ్గించటం ఆవశ్యకమని యీ సమావేశం తీర్మానించింది. అందుకోసం ఆహార ధాన్యాల ధరలు, వీటితోపాటు వ్యవసాయదారులకు కావలసిన ప్రధాన వస్తువుల ధరలూ ఒకేసారి తగ్గించాలని వీరు నిర్ణయించారు. ఈధరల తగ్గింపుతో పాటు పట్టణ ప్రాంతాలకు కావలసిన వస్తువుల సప్లయి అధికం చేయడానికికూడా తగు కార్యవిధానాన్ని రాష్ట్ర-సంస్థానాల ప్రతినిధులతో సంప్రతించి కేంద్ర ప్రభుత్వం త్వరగా తయారు చేయాలనికూడా వీరు సూచించారు."

ఇది సంతోషకరమైన వార్త. అన్ని తరగతుల జనం ఆనందించదగిన విషయం. ఎరువులు, విత్తనాల ధరలు-వ్యవసాయపు పనిముట్ల ధరలు-పశువులకు కావలసిన దాణా దినుసుల ధరలు-మానవులకు నిత్యజీవితావసర వస్తువులైన పంచదార, బెల్లం, ఉప్పు, పప్పు, చింతపండు, కారం, నూనె వగైరాల ధర లన్నీ చుక్కలు చూస్తూన్న యీ సమయంలో ఇలాంటి నిర్ణయానికి రావటం కంటే ఆనందించతగిన విషయం మరొకటి వుండబోదనటంలో ఆశ్చర్యంగాని, అతిశయోక్తిగాని అణుమాత్రంగూడా లేదు.

అధికధరలుబెట్టి నిత్యజీవితావసర వస్తువుల కొనలేక, కుటుంబాలకు పోషించలేక నానా బాధలూ పడుతున్న మధ్యతరగతి ప్రజలకు ఇది ఎంతో సంతోషం కలిగించింది.

ఎరువులు - విత్తనాలు-వ్యవసాయంపనిముట్లు-పశువుల దాణాదినుసులు కొనలేక బాధపడుతున్న రైతుల కిది పరమానందం కలిగించింది.

పగలల్లా కష్టించి పనిజేసినా సాయంకాలం చేతికొచ్చే కూలి డబ్బులతో కుటుంబానికి సరిపడే ఆహార పదార్థాలుగూడా లభించకపోవటంతో కష్ట బాధకు గురవుతున్న వ్యవసాయ కూలీలకు, నిరుపేద ప్రజల కిది ఆశాజనకం.

ఒక్కమాటలో చెప్పాలంటే- ఈనాడు కుటుంబాలకు పోషించుకోలేక, వ్యవసాయం చేసుకోలేక పలుకష్టాలనుభవించుతున్న ఫలితంగా ఎండి-మోడై-మాడిపోతున్న సమస్త మానవుల హృదయాలం తిరిగి చిగురించడాని కిది ఎంతో ఉపయుక్తంగా వుంది. నిరాశ, నిస్పృహాలతో ముకుళించుకపోతున్న హృదయ కుసుమాల కిది తీయని ఆశలు గల్పించింది. ఈవార్త విన్న వెంటనే అంతా సంతోషించారు.

చెప్పేదొకటి- చేసేది మరొకటిగా వున్న జాతీయప్రభుత్వ పరిపాలనలో యీ ధరల తగ్గింపు కార్యక్రమం ఎంతవరకు క్రమంగా జరుగుతుందనే విషయం చాలా మందికి సందేహంగా వుంది.

ఇదివర కిలాంటి సమావేశాలు, తీర్మానాలు చాలా జరిగాయి. ఆ సమావేశాల్లో నిర్ణయించిన తీర్మానాలను ఆచరణరూపంలో పెట్టవలసి వచ్చేసరికి ప్రభుత్వం ప్రజల కనుకూలంగా ఏ మాత్రం గూడా పనిచేయ లేకపోయింది. ఇలా జరగటం వలన యీ అవకాశాన్ని వినియోగించుకొని స్వార్థపరులగు పెట్టుబడిదార్లు- వ్యాపారస్థులు ప్రజానీకాన్ని మరింత విచ్చలవిడిగా దోచుకుంటారు. ప్రజలు మరింత అధికంగా బాధలకు గురవుతారు.

ఇదే ఇంతవరకూ జరుగుతూన్న విషయం. ఈ విధంగా అనేకసార్లు బాధ లనుభవించి, తల బొప్పికట్టేట్టు దెబ్బలు తినివున్న ప్రజలకు యీనాడు ప్రభుత్వం చేసిన తీర్మానాలమీద అనుమాన మున్నదనటంలో ఆశ్చర్యం లేదు.

కాంగ్రెసు ప్రభుత్వం అనేక వస్తువుల ధరలు కంట్రోలు జేసింది. బ్లాకు మార్కెట్టు చేసే వారిని ఉరిదీస్తామని ప్రగల్భాలు పల్కింది. బహిరంగ ప్రదేశాలలో కొరడా దెబ్బల శిక్షలు విధించుతామని బెదరించింది. అయినప్పటికీ పెట్టుబడిదార్లు- వ్యాపారస్థులు యీ బెదరింపులన్నిటినీ తాటాకు బెదరింపుల క్రింద జమకట్టి తమ దోపిడీని మరింత అధికం జేశారు. వస్తువుల ధరలు పెంచి ప్రజల్ని మరింత విచ్చల విడిగా దోచుకో ప్రారంభించారు. "అగ్నికి వాయువుతోడైనట్లు" ఇప్పుడు రూపాయ విలువ తగ్గించటం వ్యాపారస్థుల దోపిడీకి మరింత అవకాశం గల్పించింది.

దీనికి ఉదాహరణగా యీనాడు అనేక వస్తువుల ధరలు ఏ విధంగా పెరిగిపోయాయో చూస్తే మనకు తేలిగ్గా అర్థమౌతుంది.

పంచదారను వీసె రూ 1-4-9 లకు అమ్మాలని ప్రభుత్వం నిర్ణయించింది. ఈరోజున మార్కెట్టులో పంచదార దొరకటం లేదు. దొరికినా విపరీతమైన ధర. నిడదవోలులో వీసె పంచదార మూడు రూపాయలు.

బెల్లం అక్టోబరు మొదటి వారంలో వీసె అ14లు. ఈరోజు బందరులో వీసెరూ1-8-0.

మిరపకాయల విషయం గూడా ఇంతే. కళ్లంమీద రైతుల దగ్గర వున్న సమయంలో, అనగా ఫిబ్రవరి-మార్చి మాసాల్లో, మణుగు 16 లేక 17 రూపాయ లుంది. ఈరోజున మిరపకాయల ధర మణుగు 33 నుండి 34 రూపాయల వరకూ వుంది.

ఇదేవిధంగా చింతపండు - మంచి నూనె - వగయిరా వస్తువుల ధరలన్నీకూడా పెరిగి పోయాయి. విత్తనాలు-వ్యవసాయపు పనిముట్ల ధరలుగూడా ఇలాగే వున్నాయి.

జొన్నవిత్తులు బస్తా 27 రూపాయలకు అమ్మాలని ప్రభుత్వ నిర్ణయం. ఈ రోజున 60 నుండి 70 రూపాయలవరకూ జొన్నవిత్తుల ధర వుంది.

బండి పట్టాలు అరుమళ్ళ బరువుగలవి 30 రూపాయలలోపు కమ్మాలని ప్రభుత్వ ప్రకటన. ఈరోజున వందరూపాయ లిచ్చినా దొరకటం లేదు...

ఇలాంటివే ఇంకెన్నో ఉదాహరణలు చూపించవచ్చును. వ్యాపారస్థులు అన్నిటి ధరలూ పెంచేశారు. ప్రజల్ని విపరీతంగా, విచ్చల విడిగా దోచుకుంటున్నారు. గత్యంతరం లేక, మరో మార్గం కనుపించక ప్రజలు ఎంతో బాధ పడుతూ వస్తువులు కొనుక్కొంటున్నారు. లేదా, పస్తు బాధ పడుతున్నారు.

ఇటువంటి పరిస్థితుల్లోకూడా ప్రభుత్వోద్యోగులు మాట్లాడటంలేదు. కాంగ్రెసు సంఘాల కార్యకర్తలు ప్రజల కనుకూలంగా పని చేయటం లేదు. ప్రభుత్వంచేత తగిన ఆర్డినెన్సులు తయారుచేయించటంగాని, చేసినవాటిని అమలు పెట్టేట్టు చేయటంగాని ఏమీ జరగటంలేదు. రైతు, కూలీ, మధ్యతరగతి ప్రజ లనుభవించే బాధలతో తమ కేమీ ప్రమేయం లేనట్టుగా వీరు కూర్చుంటున్నారు. పూర్వం బ్రిటీషు ప్రభుత్వమున్న రోజుల్లో ఇలాంటివి జరిగితే కాంగ్రెసు నాయకులు ఎంతో ఆందోళన చేసే వారు. ఈ రోజున కాంగ్రెసు ప్రభుత్వమే మన దేశాన్ని పరిపాలించుతూంది. కనుక దాన్ని విమర్శించటం పనికి రాదనేమో వీరు మాట్లాడటంలేదు. ఎవరూ మాట్లాడకపోవటం-జోక్యం కల్గించుకోకుండగా వుండటం చూసి వ్యాపారస్థులు మరింత అధికంగా తమ దోపిడీ విధానాన్ని సాగించుతున్నారు.

పరిస్థితు లీవిధంగా వున్నపుడు, చెప్పేదొకటి చేసేదొకటిగా వున్నపుడు ఢిల్లీలో జరిగిన మంత్రుల సమావేశంలో నిర్ణయించిన విధానం ఎంతవరకు ఆచరణలోకి వస్తుందనే విషయమై ఆశ్చర్యం గల్గటంలో విడ్డూరమేమీ లేదు.

ఇందులోనే మరొక విషయం వుంది. "ఈ ధరలు తగ్గింపుతో బాటు పల్లె ప్రాంతాలకు కావలసిన వస్తువులు సప్లయి చేయడానికిగూడా తగు కార్యక్రమం ఆలోచించడానికి రాష్ట్ర-సంస్థానాల ప్రతినిధులతో సంప్రతించి కేంద్రప్రభుత్వం త్వరగా ఒక విధానమనుసరించా"లని యీ సమావేశపు పెద్దలు నిర్ణయించారు.

పరిస్థితులు విషమరూపంలో వున్నాయి. ప్రజల బాధ లధికమౌతున్నాయి. ఇలాంటి సమయంలో సమావేశమైన పెద్దలు దీన్ని పరిశీలించి ప్రజల కనుకూలమగు కార్యక్రమ మనుసరించక మరెప్పుడో కేంద్రప్రభుత్వం తగిన కార్యక్రమాన్ని నిర్ణయించా లన్నారు. ఇది ప్రజల బాగోగుల్ని గాలికి వదిలివేయడమే అవుతుంది. ప్రజల కష్టాలు మరింతగా అధికం గావటానికే తోడ్పడుతుంది.

ఇదేవిధంగా పరిస్థితులు ఇకముందుగూడా వ్యాపారస్థుల కనుకూలంగానే కుదిరితే, ప్రజానీకంలో ఉన్న సహనశక్తి పూర్తిగా నశించుతుంది. దేశంలో ఆందోళన - అలజడి అధికమౌతుంది. దోపిడీలు - దొంగతనాలు పెచ్చు పెరిగిపోతాయి. ఇవి జరుగుతున్నపుడు ప్రభుత్వమెన్ని ఆర్డినెన్సులు జారీచేసినా ప్రయోజనం వుండదు. "చేతులు కాలిన తరువాత ఆకులు పట్టుకుంటే" ఫలితం శూన్యం.

కనుక ప్రభుత్వం వెంటనే ప్రజల కనుకూలంగా పని చేయాలి. భవిష్యత్తులో రానున్న ప్రమాదాన్ని దృష్టిలో పెట్టుకొని, అరాజకానికి-అశాంతికి తావీయని కార్యక్రమాన్ని అవలంబించాలి.

జీవితావసర వస్తువుల ధరలు - వ్యవసాయపు పనిముట్ల ధరలు - ఎరువులు, విత్తనాల ధరలు-పశువులకు కావలసిన దాణాదినుసుల ధర లన్నిటినీ కంట్రోలు చేయాలి.

కోఆపరేటివ్ స్టోర్సు ద్వారాగాని, సహకార పరపతి సంఘాల ద్వారాగాని, పంచాయతీల ద్వారాగాని వస్తువులను నిల్వచేసి ప్రజల కమ్మించాలి.

ధాన్యం ధరను బస్తాకి ఎంతగా ప్రభుత్వం నిర్ణయించుతుందో ఆంత ధరకు రైతుల నుండి కొనేందుకు ప్రభుత్వం సిద్ధపడాలి. గత సంవత్సరం కంట్రోలు రేటుకు కొనక మిల్లు వ్యాపారులు ప్రజల నే విధంగా కష్టపెట్టారో గుర్తు తెచ్చుకొని పనిచేయాలి.

వీటికొరకు ప్రజ లాందోళన చేయాలి. ప్రభుత్వోద్యోగులవద్దకు - కాంగ్రెసు నాయకుల వద్దకు రాయబారాలు వెళ్లాలి. సమావేశాలు జరిపి, తీర్మానాలుచేసి ప్రభుత్వానికి పంపాలి. ఈ విధంగా గట్టి ఆందోళన చేస్తేనే ప్రజలకు న్యాయం జరుగుతుంది. వస్తువుల ధరలు తగ్గుతాయి. ప్రభుత్వంచేసిన తీర్మానాలకు సరైన విలువ వుంటుంది.

# జానపద సంఘాలు

"జానపదుడు"

"స్వేచ్ఛ నా జన్మహక్కు" అనే నుడి చాలా గొప్పది. కాని ఈ స్వేచ్ఛ అనే మాటకు ఒక నిశ్చితమగు అర్థం కావాలి. ఆచరణలోని పరిపాలనా విధానాలు ఈ స్వేచ్ఛ నిస్తున్నవా అనే విషయాన్ని మనం తీసుకునే స్వేచ్ఛ అనే గీటురాయి మీద పరీక్షించి, అనుభవ మనే త్రాసుతో వెలగట్టాలి. స్వేచ్ఛ అనేది వ్యక్తి అనుభవించెడి సుఖం యొక్క మొత్తం. వ్యక్తిలోని అసంపూర్ణత తగ్గి, అతని మానసిక, భౌతిక, వ్యాపారాల కట్టి అడ్డంకులూ లేకుండా ఉండాలి. ఒకని స్వేచ్ఛ మరొకని స్వేచ్ఛకు అడ్డు రాకూడదు. వ్యక్తి సంఘానికి దాసుడు కాకపోయినా, వ్యక్తే సకలానికీ మూలము కూడా కాబట్టి, తనవంటి పొరుగువాని బాధ తన బాధ అవుతుంది.

వ్యక్తిలోని అసంపూర్ణత తన పరిసరాలనూ, వాని గమనమునూ గుర్తించి, ఆ గమన సూత్రాలను తనలో ఆకళింపు చేసుకుని అవసరమగు చోదల నా సూత్రములను వ్యక్తపరచుటతో తగ్గిపోవును. పరిసరములు వ్యక్తికి జ్ఞానము నిచ్చును. పరిసరములలోని లోటును వ్యక్తి తన ప్రయత్నముచే తగ్గించును. ఈ విధంగా ఆ సరణి సాగుతూనే ఉంటుంది. అగుట జ్ఞానమున కంతు ఉండదు. జ్ఞాన మెక్కువైన అంతరాలలో వ్యక్తి స్వేచ్ఛకు దగ్గరవా డగును. వ్యక్తి పొందిన చైతన్యమును తన నడవడిలో చూపగలగాలి. అతని నడవడి, అతడు పొందిన జ్ఞానదశ ఏకకంఠాన పడవాలి. అట్లా నడవగల శక్తి నిచ్చే జ్ఞానం వ్యక్తి తన వ్యక్తిగత కృషి ద్వారానూ, సమిష్టి కృషి ద్వారానూ సంపాదించ గలడు.

అయితే ఈ వ్యాపారానికి ఎక్కడ కక్కడ నిష్పాక్షికమగు పరిశోధన కావలసి యున్నది. అట్టి పరిశోధన వ్యక్తికి హేతువాదము మాత్రమే ఇవ్వగలదు. అందుకనే వ్యక్తి ప్రాయికంగా హేతువాది. ప్రతిదాన్నీ విమర్శించి పరిశోధించ గల తాహతు మానవ ప్రఅంతస్థులలో నున్నది. ఆ సహజశక్తిని వాడుకుని అవనిలోని అసంపూర్ణత్వమును పోగొట్టగలం. తనకు తోచని-తెలియని-తనలోని ఒక లోపాన్ని వ్యక్తికి అతని ప్రతిబింబమగు అతని వ్యవస్థలు చూపుతయి. దాన్ని వ్యక్తి తీసుకోగలగాలి. ఆ లోపాన్ని గ్రహించి తనలోని జ్ఞానాన్ని ఎక్కువ చేసుకున్న నాడు ఆ లోపం అక్కడ ఉండదు. ఒక వేళ నేను ఆ లోపాన్ని అంగీకరించను-అని వ్యక్తి భీష్మించుకుని కూర్చున్నా యథార్థమగు అనుభవం అతనికి తెలియకుండానే అతని మనోపరిధిని ప్రవేశిస్తుంది. కాని వివేకీ, జిజ్ఞాసువూ అయిన మానవుడు తన లోపాన్ని తన చైతన్యం వలన పోగొట్టుకొనడానికి ఎందుకు ప్రయత్నించడూ?

అలా ప్రయత్నించక పోవడానికి సహజమయిన కారణాలేవీ కనిపించవు. కృత్రిమ కారణాలు చాలా ఉన్నాయి. మానవుడు తన మనుగడకై ఆదినుంచి ప్రకృతితో పోరాటం సలుపుతూ దాని మైత్రిని సంపాదిస్తున్నాడు. ఆమైత్రి మానవ సమాజంలో ఈనాడు కనిపించకపోయిన కారణాన మానవుడు ఎవరినో మోసగిస్తున్నాననుకుని తనను తానే మోసగించుకోవాలిసి వస్తుంది.

కాబట్టి వ్యక్తినీ అతని అనక్తులనూ అస్వీకారం చేసుకుని అతని అభివృద్ధికి పాటుపడవలసిన తాత్వికత వ్యక్తిని దేనికివిరుద్ధంగా తీసుకోరాదు. వ్యక్తిని ఒక యూనిట్ గా గణించి ఆయూనిట్ సమూలంగా అభివృద్ధి పొందాలంటే అతని పరిసరాలు-జ్ఞానం-నీతి-అన్నీ మారాలి. అవి మారు

తున్నాయి అనే కాలజ్ఞానాన్ని అందరు వ్యక్తులకూ కలుగ చెయ్యాలి.

అలా చేయడానికి అందరూ కూర్చుని ఉద్రేకరహితంగా విషయ విమర్శ చేసుకోగల ఒక వేదిక కావాలి. ఈనాడు మనం కొన్నికొన్ని గ్రామాలకి పోయిచూస్తే చెట్లదగ్గర, అరుగులమీద, ఇంకా అటువంటి చోట్ల కొంతమంది కూర్చుని ఏవేవో పిచ్చాపాటీ మాట్లాడుకోవడం చూస్తాం. దాన్నిబట్టి వ్యక్తి తనకు కలుగుతున్న ఆవేదనను సంఘంలో వెలిబుచ్చనిదే ఉండలేడని విశద మవుతుంది. కొంతమంది మనుషు లున్నారు. వారు దినంలో ఒక్కసారయినా కాసేపు ఈ కేంద్రాలలో కూర్చుని మాట్లాడనిదే భోజనం సరిగ్గా తినలేరు. ఆ గుణాన్ని ఆస్కారం చేసుకుని గ్రామీణుల దైనందిన వ్యవహారాలలోకి శాస్త్రీయజ్ఞానాన్ని ప్రవేశపెట్టాలి. అట్టిపని ప్రజా కమిటీ - లేక జానపద సంఘం చేయగలదు.

అవును- అరుగులమీద కూర్చునేవారూ, చెట్లక్రింద కూర్చునేవారూ ముఠా రాజకీయాలో లేక అటువంటివో మాట్లాడుతుంటారు. కానిమీరు చెప్పే జ్ఞాన సముపార్జన కృషికి రారు" అని కొంద రంటారు. మొదట్లో కొంతమంది రారు. కాని ప్రతి గ్రామంలోనూ ఒక (కార్య-కారణ) హేతువాదుల ముఠా ఏర్పడి, వారు కూడా మొదటి దశలో ఆ గుంపులలో చేరి వారితో సమానంగా తర్కించడం సాగిననాడు, వారి దృష్టి కొంతకు కొంతయినా వారివైపు తిరుగుతుంది.

ప్రజాకమిటీలలో చేరుటకు సభ్యత్వము అవసరంలేదు. గ్రామంలోని మైనారిటీ వెళ్లిన ప్రతి యువకుడికీ, యువతికీ అందులో సభ్యత్వం వుంటుంది. వారు మీటింగుకు వచ్చి చర్చలలో పాల్గొనవలెను. ఆ చర్చ వీలయినంతవరకు హేతువాదముపై నాధారపడి యుండవలెను.

ప్రారంభదశలో హేతువాదులు చెప్పునది యథార్థమే అయినను, వారి తీర్మానములు వీగి పోవుచుండవచ్చును. కాని అనుభవదృష్ట్యా, "నేను చెప్పింది తప్పని మీ రీవిధంగా చేశారు, అందుచేత ఈ ఫలితం ఇలా ఉంది" అని యథార్థ



జెమినీవారి "అపూర్వ సహోదరులు" చిత్రంలో ఒక సన్నివేశం



జెమినీవారి "అపూర్వ సహోదరులు" చిత్రంలో—భానుమతి

వాది అయిన హేతువాది వాదించినపుడు ఆ ప్రజాకమిటీలో కనీసం కొంతమంది అయినా అతని మాటలమీద శ్రద్ధ చూపగలుగుదురు. ఆ కమిటీలో ఒక మనిషి తన స్వార్థాన్ని వెళ్లి బుచ్చును. దానిపై విమర్శ జరుగును. అది మొదట్లో అతని పొరుగువానికిని, తరువాత తరువాత అతనికిన్నీ ఏవిధంగా అనర్థదాయకమో నిష్పాక్షికచర్చ జరుగును. బహుశా అతడు మొదటిదశలో తన పట్టును వీడక పోవచ్చును. కాని తిరిగి అట్టిదే మరొక సంఘటన వచ్చినపు డట్టి చర్చయే జరుగుచో నతడు తప్పక హేతువాదియగు మార్గదర్శి చూపు మార్గము నవలంబించగలడు. అయితే మొదటిసారి అతని స్వార్థాన్ని కొనసాగ నివ్వవలసినదేనా? సాగనివ్వవలసినదే. అనుభవం కంటే పెద్ద గురువు లేడు. ఆ అనుభవమే అతణ్ని నీతివంతునిగ చేయును. అనుభవం ఇచ్చిన పాఠాన్ని హేతువాది తనలో లీనపరచుకుని ఇతర్ల కతడు కొంత వరకు నమూనా అయి వుంటాడు. కనుక చెప్పడం, చెయ్యడం- రెండూ ముఖ్యమయినవే

ఈ కమిటీలలో మానవుని ప్రతి విక్రీడా (activity) చర్చించనగును. ఆ చర్చా ఫలితములను అనుభవదృష్ట్యా సరిచేయనగును. చర్చలు ఒకరి నొకరు అర్థము చేసికొనునవిగ నుండును. ఒకరి నొకరు అర్థం చేసుకొనగల తాహతు ప్రారంభంలో కొంత తక్కువగానున్నా, మానవుని లోని కౌతుకము, ఒక దశలో పొరుగువాడు చెప్పిన వాదన తనదిగా భావించి అందు తనకు నచ్చిన దేదో నచ్చనిదేదో నచ్చ నందుకు కారణ మేమో, అన్వేషించగల స్వభావము గలది.

తినగా తినగా వేము తీపిగా నుండును. అట్లే ఆ ప్రీతికరమగు యథార్థతను వ్యక్తికి అతని మన స్తత్వరీత్యా చెప్పగా చెప్పగా-తప్పక యథార్థము నవగాహనము చేసుకోగలడు. వ్యక్తి ప్రాయికంగా హేతువాది అయినా, అతనిలో స్వార్థంకూడా ఉన్నది. ఈ స్వార్థం మానవుని ఏ యితర ప్రకృతికీ విరుద్ధ మయినది కాదు. ప్రకృతినుండి లభించిన ఈ స్వార్థమును ప్రజా కమిటీ ఆలోచించి, అందరి లాభాన్ని సరిదిది

అనుభవంతో సమన్వయపరచి బోధిస్తుంది. అట్లా చేయడం ఒక సరణి. అట్టి సరణిని మానవునిమీదా, మానవత్వంమీదా పూర్తి విశ్వాసం ఉన్న తాత్వికుడు మాత్రమే ఆకళింపు చేసుకోగలడు. ఆ తాత్వికుడు నాయకుడు కాదు. వీరుడు కాడు. అతడు అన్వేషి. మార్గదర్శి స్నేహితుడు. యథార్థవాది. అతనివంటి నమూనాలు గల సంఘంలో మాత్రమే అతడు బ్రతకగలడు. అదే అతని కార్యక్రమానికి ఉద్దీపన అవుతుంది.

ఆ కార్యక్రమంలో ఎత్తులుండవు. ప్రతి విషయమూ బహిరంగంగా తర్కించడానికి అవకాశం ఉంటుంది. తెలియని విషయాలను తెలుసుకోవడానికి ప్రతి వ్యక్తికీ అవకాశాలు ఇవ్వబడతాయి. కొన్నికొన్ని విషయాలను ఇతర్లు చెప్పినప్పుడు కన్న వ్యక్తి తాను చదివి తెలుసుకోగలుగుతాడు. అట్టి విషయాలు తెలుసుకోగలగడానికి ఒక లైబ్రరీ ఉంటుంది. ఆ లైబ్రరీలో విశేషించి శాస్త్రీయ జ్ఞానమునకు సంబంధించిన పుస్తకాలుంటవి. కొన్నికొన్ని పుస్తకాలను వ్యక్తి చదివినప్పుడు కన్న, దానిమీద నొక చర్చ జరిగినప్పుడు వ్యక్తి ఎక్కువ లభించగలడు. అట్టి చర్చ జరిగినపుడు-వ్యక్తి తనకు గల అనుమానాలను వ్యక్తపరుస్తూ-తను ఆ పుస్తకంనుండి నేర్చుకున్న విషయాలను సంగ్రహంగా చెపుతాడు లేదా క్లుప్తంగా వ్రాసుకుని వచ్చి చదువుతాడు. అదే పుస్తకం చదివిన మరొకవ్యక్తి ఆ అనుమానాలకు సమాధానం ఇస్తూ ప్రసంగించవచ్చు. ఒకవేళ ఆ సమావేశంలో కాకపోయినా మరొక సమావేశంలో నయినా ఆ అనుమానాలు తీర్చబడుతవి. ఒకవేళ ఆ కమిటీలో ఆ విషయానికి సంబంధించిన అనుమానాలను తీర్చగల వ్యక్తి లేకపోయినా బయటినుండి అట్టి తాహతుగల వ్యక్తిని తీసుకొనిరావచ్చును.

ప్రజాకమిటీ అక్షరములు నేర్పుటయే కాకుండా శాస్త్రీయ విషయములు, తాత్విక విషయములనూ సాకల్యంగా చర్చిస్తుంది.

మొదటి దశలలో ఈకార్యక్రమం ఉత్సాహజనకంగా ఉండకపోవచ్చు. కాని స్వేచ్ఛకు దగ్గరి మార్గం లేదు. స్వేచ్ఛ ఒకరు ఇస్తే వచ్చేది కాదు. వ్యక్తి అలవరచుకొన వలసిన అంతస్తు. ఆ అంతస్తు ఈ దేశంలోని సాంఘిక జీవనం



సెప్టెంబరు 30 వ తేదీని వీరవరం (రాజమండ్రి ఫిర్కా)లో, ఆంధ్ర రాష్ట్ర నిర్మాణ కార్యకర్తల సమావేశం సందర్భాన్ని, శ్రీ ప్రకాశం గారు జాతీయపతాకను ప్రతిష్ఠించిన దృశ్యం.

సమూలంగా మారితేనేగాని రానట్టిది. వ్యక్తి ఎట్టిభావాలుంటవో అతని రాజ్యాంగ యంత్రం కూడా అట్టి స్వభావం కలదిగానే ఉండును.

వ్యక్తిలో "ఒకరు చెపితే వినాలి, ఒకరు చెపితేనే చెయ్యాలి" అనే గుణం ఉన్నంత కాలం నిజమగు ప్రజాస్వామ్యం రాదు. అందుకనే 'ఫార్మల్ డెమోక్రసీ' (లాంఛనయుక్త ప్రజాస్వామ్యం) పేరుతో పార్టీ నియంతృత్వం తన చక్రాన్ని ఇంక నిరంకుశంగా నడిపించుకోగలుగుతోంది.

ప్రజాకమిటీల తీర్మానములు మెజారిటీని బట్టియే ఉంటవి. అయితే మైనారిటీ వారి మాటలు త్రోసివేయబడవు. వారు తమ అభిప్రాయములను సావధానముగా చెప్పుకునేందుకు అవకాశం ఇవ్వబడుతుంది. ఆ అవకాశంలో వారు తమ అభిప్రాయాన్ని ఇతర్లకు నచ్చచెప్ప

దానికి యత్నిస్తారు. విఫలులయితే మరొక అవ కాశం కొఱకు వేచివుంటారు. తమ అభిప్రాయమే తప్పని అనుభవం వల్ల ఋజువయితే వారు సరిదిద్దుకుంటారు. లేదా వారే ఒప్పు చెప్పిన వారయితే మరుసటి సమావేశంలో తమ సంస్థ ఏ విధంగా ఒప్పయిందీ ప్రతిపక్షులకు చెపుతారు.

ఏడతెగని ప్రయత్నమూ, ప్రయత్నమునకు తగిన సహనమూ, సహనముతో కూడిన చైతన్యమూ,— ఈ ప్రజాకమిటీల ఆశయ లక్షణాలు. ప్రజాకమిటీ ప్రజల తరఫున, ప్రజలకొరకు వ్యవహరించేవి కాదు. ప్రజలందరూ ఐకమత్య సహకార కృషి చేత—ప్రతి వ్యక్తికీ సాంఘిక నీతి, రాజకీయ నీతి, వీనికి తగిన తాత్వికతా అలవరచగల స్థానిక పరిపాలన.

అయితే ఒక దేశంలోని అన్ని గ్రామాలలోని ప్రజాకమిటీలు ఒక విషయంలో ఒకే నిర్ణయానికి రాకపోవచ్చు. అక్కడ కూడా మైనారిటీ వారికి చెప్పుకునేందుకు అవకాశం ఉంటుంది. కాని వారు తమ ప్రతికక్షులకు తమ అభిప్రాయాలకి తీసుకు రాలేకపోతే వారు తమ గ్రామకమిటీలకు పోయి తమరు ఏ విధంగా ఆ శాసనాన్ని ప్రతిఘటించిందీ, అందుకు కారణాలనూ చర్చిస్తారు. గ్రామకమిటీలు తమ ప్రతినిధులు చెప్పిందే రైటని భావిస్తే ఆయా గ్రామాలవారికి వారి ప్రతినిధులు చెప్పినట్లు అన్వయించగల శాసనాన్ని అమలుపరచుకో గల వీలు సెంట్రల్ కో-ఆర్డినేటింగ్ కమిటీ ఇవ్వాలి. అనుభవం వారి పద్ధతిని తప్పని ఋజువుచేస్తే వారే ఆ మార్పును అంగీకరిస్తారు. ఒకవేళ ప్రతినిధులు మొహమాటపడితే వారిని త్రోసివేయడానికి హక్కు ప్రజా కమిటీకి ఉంటుంది. అనుభవం మైనారిటీ ప్రతినిధులు చెప్పిందే రైటని దృఢపరచినట్లు మిగతా జనం అంతా వారి పరిస్థితుల దృష్ట్యా వారి అభిప్రాయాలను మార్చుకుంటారు.

ఏక జాతి, ఏక పతాక, ఏక లిపి అనేమందు అన్ని రోగాలకీ పనిచేసే మందు కాదు. ఒక్క 'చైనా' అనే మట్టినే తీసుకోండి. అది చలిజ్వరానికి మందు అని అంటోంటారు. కాని నా అనుభవంలో చాలా చలిజ్వరాల కేసులలో అది విఫలం అయింది. మనిషి శరీరతత్వంతో పాటు, అతని భావాలుకూడా మనకు వైద్యంలో ఎంతో సహాయం చేస్తవి. స్వేచ్ఛాజీవులు సమాన వంతులయి — జీవితం అంతా ఆరాటమయం, పోరాటమయం కాదని - తమ యిష్టమొచ్చిన స్వేచ్ఛాయుత జీవితాన్ని సాగించాలి.

దాన్ని ప్రజాకమిటీ సాగిస్తుంది. ప్రజాకమిటీ ఒక కుటుంబం అవుతుంది. కుటుంబంలోని అందరు సభ్యులకు సమాన హక్కు లుంటవి. అంతే తెలివితేటల అంతరాన్నిబట్టి దోహదానికి ఇచ్చే ప్రోద్బలాలు వేరువేరుగా ఉండవని కాదు. అందరూ సంబంధించిన వ్యవహారాలలో సమన్వయానికి దగ్గరవా రవుతారు. భయంచేత కాదు, స్వేచ్ఛాయుతంగా.

శాసనం భయానికి చిహ్నం అవుతోంది. ఈ శాసనమే 'నేనే రాజ్యాంగాన్ని అనగల' ధీమాని ఒక వ్యక్తికిచ్చి, రేపు 'నేనే నువ్వు, నీ మనస్సు నీ భావాలు శూన్యం. శాసనమే సర్వమూను' అనే దోవకి పోతుంది. ఆ సరణికి కావలసిన సరంజామా అంతా సిద్ధంగా ఉన్నది. విద్యలో, సాంస్కృతిక చింతనలో, కానుగోలులో -ప్రతి రంగంలోనూ అది కళ్ళకు కనబడుతోంది. తెలివి గలవాడూ - తెలివి తక్కువవాడూ, బలంగలవాడూ-బలహీనుడూ, మతస్థుడూ—మతేతరుడూ, అందరూ కాంక్షించే స్వేచ్ఛ నశిస్తోంది. కనుక దేశంలోని విజ్ఞానవంతులు ఈ తాత్త్వికకార్యక్రమాన్ని పరిశీలించి, లోపాలను చూపి—అవసరం అయితే సరిదిద్ది - స్వేచ్ఛకు దీక్షాకంకణం కట్టాలిసిన అవసరం ఈ నాడెంతయినా ఉన్నది.

10 సం॥ గ్యారంటీ
ఉమా
గోల్డుకవరింగ ఆభరణములు
ఉపయోగించండి
ఉమాగోల్డుకవరింగవర్క్సు
మచిలీపట్నం

# జనవాక్యం

సంపాదకునికి ప్రకటనార్థం పంపించిన లేఖలు యీశీర్షిక క్రింద ప్రచురిత మవుతాయి. లేఖలు క్లుప్తంగా, కాగితానికి ఒక పక్క వ్రాసి పంపాలి.

---

### ఆర్. యస్. యస్.

స్వాతంత్ర్యం రావడంతో పతనోన్ముఖమైన "కాంగ్రెస్", ఆర్. యస్. యస్.ను తనలో చేర్చుకొనుట కంగీకరించుటతో, పూర్తిగా పతన మైనదనే చెప్పవచ్చు. నిన్న మొన్నటివరకూ, కమ్యూనిస్టులు, ఆర్. యస్. యస్. వారూ ఆదర్శములలో ఎంత భేదం చినప్పటికినీ, లక్ష్యమును సాధించుటలో ఇద్దరు అవలంబించెడి విధానములూ "దౌర్జన్యయుతములే" అని పండిత నెహ్రూ ఉద్ఘోషిస్తూనే ఉన్నారు. కాని సర్దార్ పటేల్ చలువవల్ల అంక్ష తొలగించి వేశారు. అంక్ష తొలగించివేసిన పిదపకూడ నెహ్రూ, ఆర్. యస్. యస్.ను విశ్వసింపరాదనియు, కమ్యూనిస్టులతోబాటు ఆర్. యస్. యస్.ను కూడ ఒక కంట కనిపెట్టి చూచెదమనియు చెప్పారు.

కాని నెహ్రూ పలుకులనుకూడ తిరస్కరించి, ఆయన లేకుండా చూచి కాంగ్రెస్ వర్కింగ్ కమిటీ ఆర్. యస్. యస్.ను కాంగ్రెస్‌లో చేర్చుకొన నిశ్చయించినది. అంటే "కాంగ్రెస్" హిందూ (మత) సంస్థగా మిగిలినదని చెప్పవచ్చు. నిన్న మొన్నటివరకూ ఆర్. యస్. యస్.ను అతితీవ్రముగా విమర్శించిన పత్రికలుకూడా నేడు కిక్కురుమనుట లేదు. అంటే పత్రిక లన్నియుం కాంగ్రెస్‌కు జోహుకుమ్‌దారులై వంతపాట పాడుతున్నవన్నమాట.

చేసి చూచిన వాటిలో "తెలుగు స్వతంత్ర" ఒక్కటిమాత్రమే ధైర్యముగ విమర్శింపగలిగినది. ఇందుకు సంపాదకులు అభినందనీయులు.

పొదూరు ఆర్. యస్. మూర్తి

---

### హైదరాబాద్ వర్తకుని నిరశనవ్రతం

శ్రీ బి. యస్. గుప్తాగారు మహబూబ్ ఆబాద్ (హైద్రాబాద్ స్టేట్) పట్టణంలో ఒక ప్రముఖవర్తకులు. వీరు నాకు చిరపరిచితులు. వీరు హైద్రాబాద్ నగరమున రాయల్ హోటలు నెంబరు 31 లో తం 1 సెప్టెంబరు 1949 నుంచి ఆమరణాంతపు వుపవాసము ప్రారంభించారని వార్త వినగానే నాకు ఒకవిధమైన ఆందోళన ప్రారంభమయింది. పూటపూటకు పరిస్థితి తెలుసుకొన మొదలిడితిని. ఇది యేపరిణామములు తీసుకొని వచ్చునోయని వూహింపసాగితిని. ఇంతలో తం 2 సెప్టెంబరు 1949 నాటి "రహనుమా" అను ఉర్దూ దినపత్రిక (హైదరాబాద్)లో, వీరు యునైటెడ్ ప్రెస్ ప్రతినిధిని కలుసుకొని యిచ్చిన స్టేటుమెంటు చదివితిని, వెంటనేవీరు ప్రారంభించిన వుపవాసము అధికారులతోకూడి ఇతరులదూషణలతో అంతమయినందుకు విచారముకలిగెను.

కొద్దిరోజులలోనే వీరి వుపవాసమునుగురించి పలురకాలుగా కాంగ్రెసువాదులు, మరియు ప్రముఖవర్తకుల స్టేటుమెంట్లు పత్రికలలో ముద్రి

తములయ్యెను. వాటిలో వీరి రాజకీయ ఆర్థిక జీవితమును విమర్శించిరి. వీరి వృత్తియే బ్లాకు మార్కెటు అని, వీరు దేశానికి యెప్పుడు సేవ చేయకపోవుటయేగాక రజాకార్ల రోజులలో ప్రముఖపాత్ర వహించి ప్రభుత్వముచే అనేకసార్లు అరెస్టుకాబడిరని, తిరిగి ఇపుడు వారి ధాన్యము వగైరాల నిలువలు అక్రమచర్యల క్రింద జప్తుగాబడినవని, కాంగ్రెసు గవర్నమెంటులో ప్రభుత్వచర్యలకు నిరసనగా ఆమరణాంతపు వుపవాసము ప్రారంభించి అపనిందలచే వుపవాసము అంతము చేసిరని విమర్శించిరి.

దేశములో వస్తుసముదాయము సమృద్ధిగా నుండియు ప్రజలకు దొరకక నానాబాధలు పడుచుండిరి. ఇటువంటి పరిస్థితిలో ధాన్యపునిలువలను వర్తకులు ప్రభుత్వమునకు చూపి పంపకము సక్రమముగా జరుపుటకు ఉద్యుక్తులగుట దేశానికెంతయో శ్రేయోదాయకము. ఆపని తాను చేయకుండుటబట్టియు, ఇతర అక్రమచర్యల క్రిందను ధాన్యము వగైరానిలువలు ప్రభుత్వముచే జప్తుచేయబడినట్లు తెలిపిరి. అరెస్టుకు కారణము కాంగ్రెసు గవర్నమెంటు రాజకీయ ధృక్పథమునకు వ్యతిరేకత, శాసనాతిక్రమణ అని కూడ విమర్శించిరి. కాంగ్రెసు గవర్నమెంటులో తాను ఆమరణాంతపు వుపవాసము చేయుంట గవర్నమెంటు తనపై తీసుకున్న చర్యకు సవాలుగ భావించిరి. అరెస్టులకు ఇతరులపై నిందమోపుటకూడ నాటకమనిరి. రజాకార్ల రోజులలో రజాకార్లతో వ్యవహరించి, కాంగ్రెసుగవర్నమెంటువచ్చినంతనే వుపవాసములుచేయుంట-ఉపవాసములు అను నెపమున తన గత చరిత్రను మరుగుపరచుటయేయని భావించిరి. జప్తు చేయబడిన ధాన్యము నిలువలు తన సొంత సేద్యము కావని, వీరికి ఇంత సేద్యము లేదని, ఇవి వేరే మార్గముగా ఖరీదుచేయబడినట్లును ప్రకటించిరి.

ఉపవాసము పవిత్రహృదయముతో చేసినపుడు ఫలితము గలుగును. అందులో ఆమరణాంతోపవాసము ఎంతపవిత్రముగావాలో వేరే చెప్పనవసరము లేదు. వీరు చేసినటువంటి వుపవాసము ఒక ఎత్తుగడ కాని వేరు కాదు. కావున బి. యస్. గుప్తాగారు, నిజంగా దేశసేవ చేయ తలంపుండిన ఈ ప్రకటనలు, పరస్పరదూషణలు మాని, వుపవాసమును నిర్మలము చేసికొని నిస్స్వార్థులై ప్రజల రాజకీయ ఆర్థిక సాంఘిక నైతిక అవసరములను దృష్టియందుంచుకొని చేయగలరని ఆశిస్తున్నాను.

కన్నెకంటి శ్రీనివాసరావు
మేనేజరు, జూబిలీటాకీస్, మహబూబ్ఆబాద్
నైజాం

---

## మదరాసు ఆంధ్రులకే-

ఆనాడు ఆంధ్ర భీష్ములు, మహాత్యాగి అయిన స్వర్గీయ దేశభక్తుని తలచుకొంటూ సర్దార్ గొల్లపూడి సీతారామశాస్త్రిగారు, శ్రీ అయ్యదేవర కాళేశ్వరరావుగారు మొదలగు ప్రముఖులు అక్టోబరు తొమ్మిదవ తేదీనుండి, చెన్నపట్నంతోసహా ఆంధ్ర రాష్ట్ర సిద్ధికొరకు, సత్యాగ్రహం చేస్తామని ఏమేమో చెప్పేరు. అక్టోబరునెల కావచ్చినా ఏదీ కార్యరూపం దాల్చలేదు. పరిస్థితుల దృష్ట్యా ఐతేనేమి, హిందూ సంప్రదాయానుసారంగానైతేనేమి మన ఆశయ పూర్తికి త్యాగంతో కూడిన ప్రయత్నం అత్యవసరం. ఇంతవరకు సభలు, ఉపన్యాసాలు, తీర్మానాలు మాత్రమే జరిగేయి కాని గట్టి ప్రయత్నమేమీ కొనసాగలేదు. ఆనాడు, యింతవరకూ ముంచుకొచ్చిన తరువాతనైనా, శ్రీ సీతారామశాస్త్రి మొదలగువారు సత్యాగ్రహానికి పూనుకోవడం ముదావహమే. అటువంటి నాయకులెవరైనా దారితీస్తే అనుసరించడానికి ఆంధ్రయువజనులు సంసిద్ధంగా వున్నారు.

ఈనాడు మన నాయకుల మొగమోటమి వల్లగాని, అభిప్రాయ భేదాల వల్లగాని, పదవీ వ్యామోహంవల్లగాని యీ సదవకాశాన్ని జారవిడుస్తే మన కర్మగతి తప్పదు. వ్యక్తిగత స్వార్థపరత్వంవల్ల సమిష్టి హక్కును వమ్ముచెయ్యడమనేది నేటి ప్రజాయుగంలో కడు శోచనీయ పరిస్థితి.

సహజంగా ఆంధ్రులు ఉదార హృదయులు. ఆ ఔదార్యమే ఒకప్పుడు చక్రవర్తులవారి జిత్తుల ఉపయోగానికి దారిచ్చింది. అయినా మన సహజప్రవృత్తి మానలేక పోయేము. జాతి విలక్షణంగా వుండడంకూడా అనర్థదాయకమే.

మన ఔదార్యంతోనే మనకు మహాత్ము డుపదే శించిన అహింసాయుత సత్యాగ్రహం చేసి, జీవితా లర్పించి, చెన్నపట్నంలో రక్తపుటేరులు ప్రవహింప జేస్తామనే తమిళ సోదరుల ప్రతిభా విశేషానికి దోహదం చేదాం.

చెన్నపట్నం మన పట్నం. ఏ విధంగా చూచినా మనదే. దాన్ని వదలిన రాష్ట్ర సంపాదన, తలకాయ లేని మొండెం కోసం దేవులాట కాగలదు. వర్తకరీత్యా కాని, నౌకరీ కొరకు గాని చెన్నపట్నం చేరిన ఆంధ్రేతరులకు మన హక్కుభుక్తాలతో దాన్ని విడిచిపెట్టడం ఘోరమైన నేరం కాగలదు. భవిష్యదాంధ్ర ప్రజానీకానికి జవాబు చెప్పవలసి వుండడమే కాకుండా, వారి స్వతంత్ర హక్కును భంగపర చిన వారమౌతాము. పై ధోరణిలో మాట్లాడ వలసివస్తే హిందూదేశం బ్రిటిష్‌వారి దనడంలో తప్పు కనపడదు.

ఆదిలో చెన్నపట్నం ప్రసక్తి లేకుండానే ఆంధ్రరాష్ట్ర ప్రయత్నం జరిగిందని కొందరు పెద్ద లన్నారు. ఇప్పటి పరిస్థితు లప్పుడు లేకపో వచ్చును. మరచి వుండవచ్చు. ఏలాగూ చెన్న పట్నం మనదే యని ప్రత్యేకంగా ఉదహరించ వలసిన అవసరం కలిగి వుండకపోవచ్చు. అప్పుడు లేని ప్రసక్తి ఇప్పుడు కూడదనడం సమంజసం కానేరదు. భారత జాతీయ మహాసభ ప్రథ మంలో భారతీయుల కష్టసుఖాలు చెప్పుకొనడం తోనే ప్రారంభమైంది. కాని యిప్పుడు, బ్రిటిష్ ప్రభుత్వం అంతంతోనే గాక, సమాజ సమత్వ సంపూర్ణ ప్రజారాజ్యంగా అవతరిస్తోందని పెద్దలు గ్రహించాలి. అలాగే ఇప్పటి ఆంధ్ర ప్రజానీకం చెన్నపట్నంతో కూడిన ఆంధ్రరాష్ట్ర స్థాపనే కోరుతోంది. పలుకుబడి గలిగిన పదవీ వ్యామోహితులు, కలం వుపయోగించగల తదను యాయులు వెనుకనున్న మూగ ప్రజాకోటిని నిర్లక్ష్యం చెయ్యడం సాహసంతో కూడిన ద్రోహం కాగలదు. దేశాంతరాలలోను, ఖండాం తరాలలోను నివాస మేర్పరచుకొని రాష్ట్రసిద్ధిని గూర్చి ఆనందించేవారికి, రాష్ట్రంలో నుండే వారి కష్టసుఖాలు అవగతం కావడం సందేహా స్పదం గనుక అట్టివారి నిర్ణయాలపై ఆధార పడడం ఆత్మవంచన కాగలదు.

త్యాగశీలురు, అనుభవజ్ఞులు మన ఆంధ్రకేసరి కూడా చెన్నపట్నం కోసం సత్యాగ్రహం చేస్తా మనడంలో గల ప్రత్యేకతను ఆంధ్ర నాయకులు గ్రహించి, రేపు నవంబరులో కలియనున్న ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ సంఘంలో సముచిత నిర్ణయానికి వచ్చి, అవసరమైతే సత్యాగ్రహో ద్యమం ప్రారంభించి, ఆంధ్రప్రజల హక్కులను నిలబెట్టి, చెన్నపట్నంతో కూడిన ఆంధ్రరాష్ట్ర ప్రతిష్ఠాపనోత్సవం త్వరలో జరిపించగలరని ఆశిద్దాం.

మదరాసు — శ్రీ విజయ

---

## "దీనిభావమేమి తిరుమలేశ!"

అక్టోబరు 14 "తెలుగు స్వతంత్ర"లో "నిత్యజీవనంలో నీతి నియమాలు" అనే (వి.యన్. అవధానిగారు వ్రాసిన) వ్యాసం చదివాను. నా కా వ్యాసం బాగుంది. కాని వ్యాసం పూర్తిగా చదివిన తర్వాతకూడా నిత్యజీవితంలో నీతి నియమాల అవసరాన్ని వారు భౌతికశాస్త్రరీత్యా ఏవిధంగా నిర్ధరించారో బోధపడలేదు. అవధానిగారు యీ క్రిందివిషయాల్ని తేల్చాలి.

(1) ప్రకృతి నియమాలు ఒక నియమాన్ని అనుసరించి మారతాయని, ఆమార్పు మానవునిలో వస్తుందని వ్రాశారు. ఈ మార్పును గ్రహించి, వాటికనుకూలంగా ప్రవర్తించటమే కదా మానవుడు చేసేది?

(2) నీతికి ఆస్కారం ప్రకృతిలోని మూలమైన అణువుల సమాజ వ్యాపారం. ఆవ్యాపారమే నీతి కాదు. అది మానవ అంతస్తులలో నీతి అవుతుంది-అని వ్రాశారు. ఈ అణువుల సమాజ వ్యాపారం యేమిటో, అది మానవ అంతస్తులలో యేవిధంగా నీతి అవుతుందో చదువరులకు అవధానిగారు విడమర్చి చెప్పాలి.

మరొకచోట "ఆర్గానిక్ మేటర్"కు, "ఇనార్గానిక్ మేటర్"కు వుండిన భేదం లిబరల్ వాదులు గ్రహించలేక పోయారనీ, అందువల్ల వారి వాదం నిరసపడి పోయిందని వ్రాశారు. వీటి భేదమేమిటో, ఈ భేదం వల్ల వచ్చిన మార్పు లేమిటో వారు విపులంగా తెలియజేస్తారని ఆశిస్తున్నాను.

చెంగల్వరాజ్

# తెలుగు స్వతంత్ర

## విషయసూచిక



సంపుటి 2. సంచిక 15.

శుక్రవారం, నవంబరు 11, 1949

# శ్రీ స్వతంత్ర

సంపుటి-2 నవంబరు 11, 1949 ప్రచురణ:
సంచిక-15 ప్రతి శుక్రవారం


## పండిత నెహ్రూ

శోభావంతమైన మూడున్నర వారాల అమెరికా యాత్ర ముగించుకుని (పదివేల మైళ్లు పర్యటించిన సుదీర్ఘ యాత్ర) రేపు 14వ తారీకున పండిత నెహ్రూ బొంబాయి చేరుతున్నాడు ఆ రోజే ఆయన అరవై ఒకటవ జన్మదినం. భారత సంప్రదాయంలో ఏ వ్యక్తికయినా "షష్టిపూర్తి" అయితే అది మంగళప్రదం; బంధుమిత్రులకు ఆనందదాయకం. అటువంటప్పుడు పండిత నెహ్రూ అరవై ఒకటో జన్మదినోత్సవం భారతదేశానికంతటికీ పండుగ దినమే అవుతుంది. ఆనాడు దేశమంతటా ఉజ్వలమైన స్థాయిలో ఉత్సవాలు జరపడానికి ప్రయత్నాలు జరుగుతున్నాయి.

అరవై సంవత్సరాలు నిండినా, సర్వదా పండిత నెహ్రూ తరుణమూర్తి. వృద్ధాప్య యౌవనాలనేవి కేవలం కాల ప్రమాణంతో కొలవలేనివి. ప్రతి జీవితానుభవాన్నీ దృక్పథం సువిశాలం చేసుకుందికే వినియోగించి మానవత్వానికి యింకా చేరువగా వెళ్ళడానికి యత్నించేది యువ హృదయం. ప్రతి నూతన సమస్యనూ పురాణానుభవంతో పరిష్కరించ గల్గే క్రలిభ వృద్ధాప్యానిది. తారుణ్యం సాహసంతో ముందడుగు వేయిస్తుంది; తద్వారా నిత్యపల్లవశీలమైన అభ్యుదయం వేపు దృష్టి కేంద్రీకరింప చేస్తుంది ఈ ప్రమాణరీత్యా అరవై సంవత్సరాలు నిండిన పండిత నెహ్రూ నేడు కూడా దేశంలోని నవాశయాల యువ సమూహానికి నాయకుడు. ఇరవై సంవత్సరాల క్రితం చరిత్రాత్మకమైన లాహూర్ కాంగ్రెస్‌కి జవహర్‌లాల్ అధ్యక్షత వహించినప్పుడు, ఆనాటి యువకలోకానికి ఆయన ఆదర్శమూర్తి. అటుపిమ్మట దేశంలో ఎన్నో బ్రహ్మాండమైన పరిణామాలు జరిగిన ప్రతి ఘట్టంలోనే కాక స్వాతంత్ర్య లబ్ధి తరవాత మన భవిష్యత్తు అంధకారంగా గోచరిస్తున్న నేడుకూడా, పండిత నెహ్రూయే మనకి ఏకైక ఆశాజ్యోతి.

జవహర్‌లాల్ రాజకీయరంగంలో అడుగుపెట్టి అప్పుడే ముప్ఫై సంవత్సరాలయింది. ఆనాడు లాలసమయమైన సుఖజీవనం విడిచి అప్పటికి తీరసీమ గోచరించని పోరాటార్ణవంలో అడుగు పెట్టినప్పుడు, ఈ జీవితకాలంలోనే తన సాధన ఫలోన్ముఖమవుతుందని ఆయన ఊహించి అయినా ఉండకపోవచ్చు. ఈనాడు జవహర్‌లాల్ ప్రపంచంలో కల్లా ఎక్కువ జనాన్వితమైన దేశానికి (చైనాను మినహాయిస్తే) ప్రధాని.

ఆసియాఖండంలో కల్లా అంతర్జాతీయ స్తోమత కల్గిన నాయకుడు. గాంధీజీ తరవాత అంతటి మహోన్నత స్థానానికి అర్హత పొందినది ఒక్క నెహ్రూయే. ఈ ఉన్నతపీఠం ఆయనకు ఒక్కనాటితో వచ్చినదికాదు. భారత స్వాతంత్ర్యోద్యమంలో ఆయన వహించిన పాత్ర ఫలితంగా ప్రజాహృదయాలలో ఏనాడో ఆయనకు సుస్థిరమైన స్థానం ఏర్పడింది. 1947 ఆగస్టులో భారత ప్రధానిగా నెహ్రూ ఎన్నుకోబడినప్పుడు, ఆ ఎన్నిక ప్రకృతి సిద్ధమైన సహజ పరిణామంవలె అందరికీ గోచరించింది. ఎందువల్ల? సూక్ష్మంగా పరిశీలిస్తే, ఏ కాంగ్రెస్ సంస్థ ఆయన్ని ప్రధానిగా ఎన్నుకున్నదో, ఆ సంస్థపై అతనికి చెప్పుగోదగిన అధికారం లేదు. నాయకుడేగాని ఆయనకు అనుచరవర్గం లేదు. అధికార రాజకీయాల చదరంగపు ఎత్తులలో అత్యవసరమైన "కూటమి" అసలే ఆయనకు లేదు. అయినా తనని అనుసరించని రాజకీయ పార్టీకి నాయకుడెట్లా అవగల్గాడు? అనేప్రశ్న సహజంగా వస్తుంది. కాంగ్రెస్ సంస్థలో గల బహుళ సంకీర్ణమైన వర్గాలూ, కొంతలో కొంత భావ తీయుల మనస్తత్వం, యివి ఆ ప్రశ్నకు సమాధానాలు. కాంగ్రెస్ కేవలం ధనికవర్గాల చేతిలో కీలుబొమ్మ ఐనా, లేక పూర్తిగా శ్రామికవర్గానికి చెందిన పార్టీ అయినా, అందులో నెహ్రూకి స్థానం ఉండీ ఉండేది కాదు. లేదా కాంగ్రెస్ ప్రతికక్షులన్నట్లు ఆ సంస్థ కేవలం హిందూ జాతీయవాదుల సంస్థ అయినా నెహ్రూను దూరంగా ఉంచేవారు. లేక కొందరు పాశ్చాత్యులు భావించినట్లు కాంగ్రెస్ గాంధీజీ శాసించిన నైతిక, ఆధ్యాత్మిక సూత్రాలను తూ. చా. తప్పకుండా ఆచరించినా, అందులో ఉండడం నెహ్రూకు దుర్భరమనిపించేది. కాని నేడు భారతదేశం అపూర్వమైన సంధి యుగంలో ఉంది. ఆర్థిక, రాజకీయ, నైతికరంగాల్లో మనం ఏదీ యిదమిత్థమని తేల్చుకోలేని "కింకర్తవ్యతామూఢుల"మై ఉన్నాము. అనూచానమైన మన సంప్రదాయాలకు నూతన విలువలకు, ఆచరణలోని స్వార్థాలకు ఆశయాలలోని అనర్థాలకు నిత్యసంఘర్షణ జరుగుతున్నది.

ఈ సంఘర్షణ కాలంలో పండిత నెహ్రూది చారిత్రకంగా అనివార్యమైన పాత్ర. ముఖ్యంగా గాంధీజీ నిర్యాణం అనంతరం మనదేశ చరిత్రలోనే అత్యంత సంక్లిష్టమైన నేటి ఘట్టంలో ప్రజల్ని గమ్యస్థానానికి తీసుకు వెళ్లవలసిన బాధ్యత నెహ్రూ భుజస్కంధాలపై పడింది. ఆయన ధైర్యం, విశాలదృష్టి, ప్రజాపురక్తి—ఎన్నడూ శంకించబడలేదు. అనేక విజయ పరంపరలు సాధించిన నెహ్రూ జీవితంలో యింకొక్క విజయాన్ని సాధించవలసి ఉంది. అధికారం చేజిక్కించుకోవడం కంటె, సద్వినియోగం చెయ్యడం ఘనతరం. ఆ విజయాన్నికూడా పండిత నెహ్రూ సాధిస్తాడనే సంపూర్ణ విశ్వాసం నేడు భారత ప్రజలందరికీ ఉంది. ఆయన జన్మదినోత్సవానికి ప్రజలందించే అమూల్యమైన కానుక అదే.



# పండిత నెహ్రూ అమెరికా యాత్ర

మోపర్తి వెంకటరమణయ్య

పండిత నెహ్రూ పర్యటనకు ఇండియాలోను, అమెరికాలోను పత్రికలన్నీ విశేష ప్రాముఖ్యం యివ్వటమే గాక యీ పర్యటన పర్యవసానంగా ముందుముందు ఉభయదేశాల సంబంధ బాంధవ్యాలలో అధిక సన్నిహితత్వం చేకూరగలదని కూడా జోస్యం చెపుతున్నవి. ప్రపంచ దేశాలన్నీ అత్యంత ఉత్సుకతతో — కొన్ని ఆమోదంతోను, మరికొన్ని అనుమానంతోను యీ పర్యటన ఫలితాన్ని నిరీక్షిస్తున్నవి. ఇతర దేశాల సంగతి ఎలా ఉన్నప్పటికీ భవిష్యత్తులో యీ పర్యటన మన దేశ ఆర్థిక, రాజకీయ రంగాలలో ఎటువంటి ఫలితాలకు దారితీస్తుందో ఊహించటం అంత కష్టం కాదు. నెహ్రూ గారి అమెరికా పర్యటన ఫలితాలు మన దేశ శ్రేయస్సుకు ప్రతికూలంగా ఉంటాయేమోనని సందేహించటానికి చాలా అవకాశం ఉంది.

అమెరికా ప్రెసిడెంట్ ట్రూమన్ యిప్పుడు ప్రత్యేకంగా నెహ్రూను ఆహ్వానించటానికి, నెహ్రూ ఆ ఆహ్వానాన్ని వెంటనే అంగీకరించి అమెరికా ప్రయాణమవటానికి, కారణం యేమిటి అన్న ప్రశ్న రాకపోదు. నెహ్రూ గారి అమెరికా యాత్ర కేవలం "పరిశోధనార్థం" అని ట్రూమన్, తన పర్యటన "అమెరికా మనస్సును, హృదయాన్ని పరిశోధించటానికి" మాత్రమే నని నెహ్రూ చెపుతున్నప్పటికీ రాజకీయ పరిజ్ఞానమున్న వారెవరైనా యీ మాటలను పూర్తిగా విశ్వసించటం అసాధ్యమే. కేవలం యీ "పరిశోధనలే" గాక అటు అమెరికా ప్రభుత్వానికి, ఇటు ఇండియా ప్రభుత్వానికి — ఉభయతారకమైన అంతరార్థమేదో యీ పర్యటనలో యిమిడి ఉన్నదనటంలో సందేహం లేదు. ఆసియాలో యీ మధ్య జరుగుతున్న కొన్ని సంఘటనలు అమెరికాకు ఆందోళన కలిగిస్తున్నవి. ముఖ్యంగా చైనా కమ్యూనిస్టుల చేతులలో పడటంతో ఆసియాలో అమెరికా ప్రాబల్యానికి ప్రమాదం సంభవించింది. ఇంతవరకూ జాతీయ చైనా అమెరికా వ్యాపారానికి పెద్ద మార్కెట్ గాను, ఆసియాలో కమ్యూనిజం వ్యాప్తికి అడ్డుకట్టగాను ఉండగలదని అమెరికా ఆశించింది. ఇప్పుడు చైనా చేయి జారిపోవటంతో దానికి బదులు యింకో దేశాన్ని వెదుక్కోవలసిన అవసరం కలిగింది. ఆసియా దేశాలన్నిటిలోను సుస్థిరంగా ఉన్న దేశం యిండియా ఒక్కటే. కాబట్టి ఆసియాలో అమెరికా ప్రాబల్యాన్ని నిలుపుకోవాలంటే ఇండియాను తన ప్రక్కకు త్రిప్పుకోవటం చాలా అవసరం. అమెరికా పెట్టుబడులకు, కమ్యూనిజాను అరికట్టేందుకు ఇండియా చక్కగా ఉపయోగపడుతుంది. ఈ ఉద్దేశంతోనే ట్రూమన్ నెహ్రూను ఆహ్వానించి ఘనంగా సత్కరించారు. అమెరికా పత్రికలన్నీ అసలు విషయం బయట పడకుండా చేయటానికి యెంత ప్రయాసపడుతున్నా ఒకటి, రెండు పత్రికలు "ఇండియా భవిష్యత్తు రష్యాతో గాక, అమెరికాతో ముడిపడి యున్నదని నెహ్రూకు నచ్చచెప్పేందుకై తెరవెనుక అమెరికా అధికారులు భగీరథ ప్రయత్నాలు చేస్తున్నా"రని సూచిస్తున్నవి. ఇక ఇండియా తాటస్థ్యాన్ని గురించి యెంత నొక్కివక్కాణించినా నెహ్రూ అమెరికా ప్రతినిధుల సభలో ఉపన్యసిస్తూ, "మేము వాస్తవికతను గుర్తించలేనంత అంధులము కాము. స్వేచ్ఛకు యెవరు ప్రమాదం కలిగించినను సహించేది లేదు. స్వేచ్ఛకు ప్రమాదం సంభవించినను, న్యాయానికి అపాయం కలిగినను, ఎక్కడ దురాక్రమణ జరిగినను మేము తటస్థంగా ఉండజాలము, ఉండకూడదు." అనటంతో ఇండియా తాటస్థ్యం కండిషనల్ మాత్రమేనని వెల్లడి అవటం లేదా? స్వేచ్ఛను, న్యాయాన్ని రక్షించేందుకు, దురాక్రమణను ప్రతిఘటించేందుకు కంకణం కట్టుకోవటం హర్షించదగినదే. కాని యెవరిపక్షం న్యాయమైనదో యెవరు స్వేచ్ఛను నాశనం చేస్తున్నారో,

యెవరు దురాక్రమణదారుని నిర్ణయించటం అంత తేలిక విషయంకాదు. అమెరికా జనపక్షం న్యాయమైనదంటే, రష్యా జనపక్షం న్యాయమైన దంటుంది. తరుచు న్యాయాన్యాయాలను నిర్ణయించేది నైతిక ప్రమాణాలుకాక, యేవో రాజకీయ లక్ష్యాలు, అధికార రాజకీయాలు అవటం సంభవిస్తుంది.

అమెరికా కేపిటలిజంగాని, రష్యా కమ్యూనిజంగాని, యీ రెండిటిలోను మనము కోరుకోవలసింది యేదీ లేదు. రెండూ న్యాయాన్ని, స్వేచ్ఛను హరించేవే; దురాక్రమణకు దారి తీసేవే. ఒకవేళ యుద్ధమే సంప్రాప్తమయితే మనము అటు అమెరికా పక్షానగాని, యిటు రష్యా పక్షానగాని చేరటం వాంఛనీయంకాదు. కమ్యూనిస్టుల నియంతృత్వంకంటే, కేపిటలిస్టుల పార్లమెంటరీ ప్రజాస్వామ్యం మేలనుకున్నా యుద్ధంలో గెలుపొందిన అమెరికా కేపిటలిజం సంరక్షణార్థమై ఫాసిజంను పునరుద్ధరించదని నమ్మ వీలులేదు. ద్వితీయ ప్రపంచ యుద్ధంలోవలె, తృతీయ ప్రపంచ యుద్ధంలో ప్రజాస్వామ్యపక్షం, నియంతృత్వపక్షం అని విడదీయటం కష్టము. రెండవ ప్రపంచ యుద్ధ ఫలితంగా యూరపులో పెట్టుబడిదారీ విధానపతనం పూర్తిఅయి ఆ దేశాలన్నీ సోషలిస్టు పంథాలో పడినవి. అదే విధంగా తృతీయ ప్రపంచ యుద్ధ ఫలితంగా అమెరికాలో కేపిటలిజం భగ్నమై అక్కడ సోషలిజం వ్యాప్తిలోకి వస్తుందని నిర్ధారణగా చెప్పలేము. యూరపులోని ప్రజాస్వామ్య సోషలిస్టు దేశాలు చావు బ్రతుకులమధ్య ఊగిసలాడుతున్న సమయంలో తృతీయ ప్రపంచ యుద్ధంలో యేకైక విజేతగా బయలుదేరిన అమెరికా కేపిటలిజం పునరుద్ధరణకై ప్రయత్నిస్తే ఫాసిజం పునరుద్ధరణకూడా తప్పనిసరి అవుతుంది. దీనికితోడు ఆసియాలోని జాతీయ ప్రభుత్వాలన్నీ పెట్టుబడిదారీ విధాన రక్షణకై అమెరికాతో చేతులు కలిపితే అంతర్జాతీయ ఫాసిజం అవిఘ్నంగా వ్యాపించగలదు. రష్యాపక్షం నియంతృత్వ పక్షం అనటంలో సందేహం లేదు. కాని అమెరికా ప్రజాస్వామ్య విధానాన్ని రక్షిస్తుందని అనుకోటానికికూడా ఆధారం కనిపించటంలేదు.

అమెరికా ప్రజాస్వామ్య విధాన రక్షణార్థం



ప్రెసిడెంట్ ట్రూమన్

కేపిటలిజాన్ని త్యజిస్తుందో, లేక కేపిటలిజం రక్షణార్థం ప్రజాస్వామ్యాన్ని బలియిస్తుందో వేచి చూడవలసిఉంది. ఇప్పటివరకూ అమెరికా రెండవ విధానాన్నే అనుసరిస్తున్నది. కాబట్టి ప్రజాస్వామికవాది అయిన ప్రతివాడు యేదో ఒక పక్షంలో చేరి యుద్ధాన్ని ఆహ్వానించటంకంటె అసలు యుద్ధమే రాకుండా చేయ ప్రయత్నించటం శ్రేయస్కరం. ఇందుకై ప్రజాస్వామ్య సోషలిస్టు దేశాలతో కూడిన మూడవపక్షంబయలు దేరతీరాలి. అది చేయలేకపోతే కనీసం తటస్థంగానైనా ఉండాలి.

పై చర్చనుబట్టి యిండియా తటస్థంగా ఉండటం అత్యవసరమని స్పష్టమయింది. అయితే అమెరికానుండి ఆర్థిక సహాయంపొందే ఇండియా యెంతవరకూ తటస్థంగా ఉండగలదు అన్నదే అసలు సమస్య. తన అమెరికా పర్యటనలో పండిత నెహ్రూ ఇండియా అమెరికానుండి సాంకేతిక సహాయాన్ని, పెట్టుబడులను కోరుతున్నదని అనేక సందర్భాలలో వెల్లడించారు. కాని తన షరతులకు ఒప్పుకొనిదే అమెరిక పెట్టుబడిదారులు ఇండియాలో పెట్టుబడి పెడతారనుకోవటం కేవలం భ్రమ. తమ పెట్టుబడులకు కావలసిన రక్షణలిస్తేనేగాని

పెట్టుబడి పెట్టేది లేదని అమెరికా పత్రికలు బెదరిస్తున్నవి కూడాను. వారికి మద్దతుగా మన పెట్టుబడిదారులుకూడా ప్రభుత్వాన్ని వత్తిడి చేస్తున్నారు. వారి వత్తిడికి మన ప్రభుత్వం చాలావరకు లొంగిపోయినట్లే కనబడుతున్నది. ఓవర్‌సీజ్ ప్రెస్ క్లబ్‌లో మాట్లాడుతూ ప్రధాని నెహ్రూ "కొన్ని రక్షణలు యిస్తేనే గాని అమెరికావారు ఇండియాలో పెట్టుబడి పెట్టలేరు. ఇండియా ప్రభుత్వం కావలసిన గారంటీలు యివ్వటానికి సిద్ధంగానే యున్నది" అన్నారు. చాలారోజుల క్రితమే మన ప్రభుత్వం వారు పది సంవత్సరాలవరకు పరిశ్రమలను జాతీయంచేసే ప్రశ్న రానేరాదని చెప్పేశారు. ఇటువంటి అసంపూర్తి వాగ్దానాలు చాలవు; ఇంతకంటె దీర్ఘకాలపు రక్షణలు కల్పిస్తేనే గాని మా పెట్టుబడిదారులు, సాంకేతిక నిపుణులు గడపదాటరు అని "సండే యీవినింగ్ పోస్టు" అనే అమెరికా పత్రిక తెగవేసి చెప్పినది. కాబట్టి నెహ్రూగారి పర్యటన ఫలితంగా మన దేశంలోకి అమెరికా పెట్టుబడులు వారు కోరిన షరతులపై ధారాళంగా ప్రవహిస్తవని రూఢి ఐంది. దీనితో మన దేశంలోని పెట్టుబడిదారులకు విదేశీ పెట్టుబడిదారుల తోడ్పాటు లభించి వారు బాగా బలపడతారు; తాము పెట్టుబడి పెట్టిన దేశాలలో కమ్యూనిజంను అరికట్టటం మాత్రమే గాక, అచ్చటి సాంఘిక వ్యవస్థను యథాతథంగా ఉంచటంకూడా అమెరికా లక్ష్యం. కాబట్టి మనదేశ సామాజికవ్యవస్థలో మార్పు తెచ్చేందుకు చేసే ప్రతి ప్రయత్నము స్వదేశీ పెట్టుబడిదారుల ప్రతిఘటననే గాక, విదేశ పెట్టుబడిదారుల ప్రతిఘటననుకూడా యెదుర్కొనవలసి ఉంటుంది. ఈవిధంగా ఇండియా ఆర్థికవిధానం అమెరికా కేపిటలిజంతో ముడి పెట్టబడుతుంది. తృతీయ ప్రపంచయుద్ధమే వస్తే ఇండియాలో పెట్టుబడి పెట్టిన అమెరికావారు మనలను తటస్థంగా ఉండనివ్వరు. ఇండియానుకూడా తమ పక్షాన యుద్ధంలోకి లాగుతారు. అమెరికాతో లంకె పెట్టుకున్న యిండియా అమెరికాతో పాటు యుద్ధంలోకి దిగక తప్పదు." "అమెరికాతో సంబంధం ఇండియాకు కొన్ని డాలర్లు, ఒక విధమైన ఆర్థికాభివృద్ధి తెచ్చి పెట్టవచ్చును. కాని యీ బేరంలో ఇండియా తన ఆత్మనే గాక ఆలోచన, కార్యాచరణ స్వాతంత్ర్యాన్నికూడా కోల్పోయి అమెరికాకు బంటుగా తయారవక మానదు" అంటాడు యం. యన్. రాయ్.

ఇండియా తన స్వాతంత్ర్యాన్ని, వ్యక్తిత్వాన్ని కాపాడుకోవాలంటే అమెరికన్ సూపర్ ఇంపీరియలిజంతో కాని, రష్యన్ ఎక్స్‌పాన్షనిజంతో కాని సంబంధం పెట్టుకోక ప్రజాస్వామ్యవిధాన రక్షణకు అనువైన ఆర్థిక, రాజకీయ వ్యవస్థలను నిర్మించుకోవలసి ఉంటుంది. కేపిటలిస్టు సామాజిక వ్యవస్థను ఆదర్శంగా పెట్టుకున్నంత కాలము అమెరికా సహాయంపై ఆధారపడక తప్పదు మన ప్రభుత్వంవారు దేశంలో భారీ యంత్రపరిశ్రమాభివృద్ధికై తొందరపడక, వ్యవసాయాభివృద్ధికి ప్రాధాన్యం యిస్తే విదేశ ఆర్థిక సహాయానికి ప్రాధేయపడవలసిన అవసరం లేకుండా క్రమముగా స్థిరమైన ఆర్థికాభివృద్ధిని సాధించవచ్చును.

ఈ క్రింది ఊళ్లలో ఇంగ్లీషు, తెలుగు 'స్వతంత్ర' పత్రికలు అమ్ముటకు

ఏజెంట్లు కావలెను:

అమలాపురం, చోడవరం, రాజమండ్రీ, బళ్లారి,
శృంగవరపుకోట, కైకలూరు, పొన్నపల్లి అగ్రహారం

వివరములకు :—

మేనేజరు, 'స్వతంత్ర',

160 లాయిడ్స్ రోడ్, రాయపేట- మదరాసు-14.

**మానవ శ్రేయస్సుకు తోడ్పడవలసిన శాస్త్రవిజ్ఞానం నేడు స్వార్థపూరిత ప్రభుత్వాల కైవసం అయి మారణాయుధాలు సృష్టిస్తోంది. సాహిత్యం కూడా రాజకీయవేత్తల ఆయుధం అయితే యిక మిగిలినదేమున్నది?**

# సాహిత్యం రాజకీయవేత్తల బాకా కాకూడదు

భట్టిప్రోలు హనుమంతరావు

ప్రాణికోటి పరిణామ క్రమంలో మానవ దశ చరమదశ. ఈ దశ నుండి పరిణామం ద్విముఖంగా ప్రారంభమైంది. ఒకటి భౌతికం— ప్రకృతిని, భౌతికావసరాలకు అనుగుణంగా నిర్జించి స్వాధీనపరుచుకోవటం. మరొకటి చాల ముఖ్యమైన ఆధ్యాత్మిక, మానసిక, నైతిక పురోగమనం. ఇతర జీవరాశి నుండి మానవుని ప్రత్యేకించే విశిష్ట గుణములైన, ఆలోచనాశక్తి, నీతి విచక్షణ, స్వేచ్ఛాన్వేషణ, ప్రేమ, కరుణ, కళాభిజ్ఞత మొదలైనవే ఈ ఆధ్యాత్మిక పురోగమనానికి ఆధారమైనాయి. ఈ గుణాల మొత్తాన్నే స్థూలంగా 'మానవత్వం' అందాము. భౌతిక జీవితంలోని భావాలు, వ్యవస్థలు శాస్త్ర విజ్ఞానం వల్ల జీర్ణమగుచున్ననూ 'మానవత్వం' జీర్ణమగుట తటస్థించదు. శాస్త్రవిజ్ఞానం, మానవత్వానికి నైశిత్యం చేకూరుస్తుంది. ఇట్టి మానవత్వమే సాహిత్యానికి వస్తువు; మానవునిలోని శాశ్వత స్వభావాలనే సాహిత్యం గుర్తిస్తుంది. దీనివల్ల సాహిత్యానికి శాశ్వతత్వం చేకూరింది—భౌతికమైన వ్యవస్థలకు అతీతమైన మానవత్వాన్ని దృష్టిలో నుంచుకొనుట వలన; శాశ్వతమైన ఆధ్యాత్మిక పురోగమనం సాహిత్యానికి వస్తువగుట వలన.

విశ్వమానవకోటిలో సూత్రప్రాయంగా ఉన్న మానవత్వమే సాహిత్యానికి వస్తువగుట వలన సాహిత్యం సర్వజనీనమని చెప్పనక్కర లేదు. అందు చేత సాహిత్య విచారంలో—బూర్జువా, మధ్యవర్గ, కార్మికవర్గ సాహిత్యాలనే విభజన ప్రకృతివిరుద్ధం. వీరందరినీ మానవులుగానే సాహిత్యం పరిగణించటం వల్లనే ఉత్తమ సాహిత్యాన్ని అన్నివర్గాలవారూ ఆనందించ గల్గుతున్నారు. ఇందుకు ఉదాహరణగా సాహిత్య ప్రపంచంలో ధ్రువతారలుగా వెలుగుచున్న షేక్స్పియర్, టాల్‌స్టాయ్, గోథే, కాళిదాసు మొదలైనవారి కావ్యాలు తీసుకొందాం. షేక్స్పియర్ క్రింది తరగతికి చెందినవాడు. టాల్‌స్టాయ్ జమీందారు. ఇద్దరూ ఉత్తమ సాహిత్య స్రష్టలుగా శిరసా వహింప బడుతున్నారు, అన్ని వర్గాలవారి చేతా! షేక్స్పియర్ గ్రంథాలు కార్మిక రష్యాలోకి బోరిస్ పాస్టర్‌నాక్ అనువదించాడు. తులసీదాసు రామాయణానికి రష్యాలో విపరీతప్రచారం లభించింది. ఇందుకు కారణం— వీరు మానవత్వాన్ని కృత్రిమంగా విభజించే భావాలను గుర్తింపక అందునీ సమైక్యపరచే శాశ్వత శ్రేయస్సులను, విలువలను గ్రహించటమే.

ఇట్లనటంచే, సాహిత్యానికీ భౌతిక జీవితానికి పూర్తిగా సంబంధం లేదనడం మాత్రం కాదు. సాహిత్యంలో తాత్కాలికంగా జీవితచ్ఛాయలు ప్రతిబింబించవచ్చు; యాదృచ్ఛికంగా పరిష్కారాలనూ సాహిత్యం సూచించవచ్చు. కాని సాహిత్యంలోని విలువ ఆ సమస్యాపరిష్కారంతో నశించిపోదు. అందలి విలువ శాశ్వతమైనది. డాంటే మహాకవి కావ్యాలు రినైజాన్సు ఉద్యమానికి తాత్త్వికమైన ప్రోత్సాహాన్ని ఇచ్చినై. వాటి విలువ అంతటితో నశించిపోలేదు. ఆ కావ్యాలు నేటికీ ఉత్తమ సాహిత్యంగా పరిగణింప బడుతూనే ఉన్నై. కాబట్టి సాహిత్యం సార్వకాలీనము, సర్వజనీనము నైన మానవత్వపు విలువలనే గ్రహించి చిత్రించి శాశ్వతత్వం పొందుతుంది.

ఇక ప్రస్తుతం, మనం వింటున్న ప్రజాసాహిత్యం లేక అభ్యుదయ సాహిత్యాన్ని పరిశీలిద్దాం.

ప్రజాసాహిత్యానికీ, అభ్యుదయ సాహిత్యానికీ మధ్య భేదాన్ని విచారించ బూనటం వృథా ప్రయాస. రెండూ ఒకటే. రచనా వస్తువూ, రచనలోగల ఆశయం రెంటిదీ సమానమే. అందుచే నిజానికి ఈ రెంటిమధ్య వ్యత్యాసం లేదనడమే సబబు.

అభ్యుదయ వాదులకు సాహిత్యం ఒకప్రచార సాధనం. తమ అభిప్రాయాలను, ప్రణాళికలను ప్రజల్లో వ్యాప్తిగావించి, ప్రజల సానుభూతి పొందటమే వారి సాహిత్యసృష్టికి ఆశయం. వార్తా పత్రికలూ, ఉపన్యాస వేదికలవలె సాహిత్యంగూడా ఉపయోగపడాలని వారి అభిప్రాయం. కాని నిర్దుష్టమైన ఉద్దేశంతో సృష్టింపబడే సాహిత్యానికి స్వేచ్ఛా వాతావరణ లభించదు; తాత్కాలికమైన అవసరాల ననుసరించి సాహిత్యాన్ని నిరోధించటంగాని, ఆదేశించటం గాని జరుగుతుంది. ఎలిసోలిట్సార్నిత్సో అనే కమ్యూనిస్టు కవి టోగ్లియాటీకి వ్రాసిన జాబులో ఇలా అన్నాడు: 'స్వేచ్ఛగా పెంపొందలేని సంస్కృతి తనపని నెరవేర్చలేదు...సంస్కృతి అంతా రాజకీయమే ఐనచో, తత్ఫలితంగా అభివృద్ధి నిరోధింపబడి నూతన సమాధానాలకు అన్వేషణ జరగదు.'' అంతేగాదు, ప్రచారకుల దృష్టిలో తాము సూచించినదే 'అంతిమ సత్యం' అనే సంకుచిత దృష్టి, అహంభావం బయలుదేరుతుంది. కాని 'సత్యం' ఎన్నటికీ అంతిమం కానేరదు. అందువల్ల సత్యాన్వేషణలో కళాకారుడు,తన అనుభవాలను పరిశీలించి ఆలోచించటానికి, వస్తుసేకరణకు స్వాతంత్ర్యం ఉండాలి గాని ఒక నిర్ణీత ప్రణాళికద్వారా అతని స్వేచ్ఛను అరికట్టరాదని ఉక్రెయిన్ రచయితలసంఘఅధ్యక్ష పదవినందున్న పెట్రో పాంక్ అభిప్రాయం. కాబట్టి ప్రచారక దృష్టితో జరిగే రచనకు స్వాతంత్ర్యం ఉండదు. అందువల్ల దానికి ఉత్తమసాహిత్య ప్రపంచంలో స్థానం లభించదు. మరొక విషయం. ఒక ప్రయోజనాన్ని ఉద్దేశించి జరిగే రచనలు, అది సాధింపబడిన వెంటనే తమ ప్రయోజనాన్ని కోల్పోయి వాటి విలువ నశిస్తోంది. ఉదాహరణకు, యుద్ధకాలంలో అనేక గేయాలు వ్రాయబడినై. కాని యుద్ధంతో వాటి ఆయుర్దాయం పూర్తిఅయింది. ఇట్లే ఇతర



ప్రచారక రచనలకుగూడా శాశ్వతత్వం లభించదు-అవి వాఙ్మయ గర్భంలో జీర్ణించిపోతై.

ఇక అభ్యుదయ వాదుల ఆశయాలు ఎంత వరకు అభివృద్ధికరంగా ఉన్నవో పరిశీలిద్దాం. పీడిత ప్రజానీకపు కష్టాలను తొలగించి వారిని ఉద్ధరించడమే వీరి దృష్టిలో సాహిత్యోద్దేశం. ఈ ఆశయం మంచిదేనని అందరూ అంగీకరించి తీరాలి. కాని ఆ ఆశయ పూర్తికి సాధించే విధానమే ముఖ్యంగా గమనించవలసిన విషయం. మార్క్సియన్ డయలెక్టిక్స్‌పై ఆధారపడిన వర్గవిభాగము, చరమదశలో జరిగే సంఘర్షణ, తద్వారా నూతన సమాజ నిర్మాణము సాధ్యం కాగలదని వీరి నమ్మకం. కాబట్టి వీరి అభిప్రాయాల ప్రకారం సాహిత్యం ప్రాతవ్యవస్థలను విధ్వంసంచేసి నూతన వ్యవస్థా నిర్మాణానికి పురికొల్పాలి. కాని మానవ చరిత్రను పరిశీలించినచో సంఘర్షణ, విధ్వంసం మొదలైన చర్యలు అభివృద్ధికి సాధనములు గావని, కేవలం వినాశాత్మకమైనవనే విషయాన్ని రుజువు చేస్తున్నది. ప్రాణి, ప్రాథమిక దశలోగూడా సాధ్యమైనంతవరకు సంఘర్షణను తప్పించుకొని సామరస్యం ద్వారానే పరిణామాన్ని సాధించినట్లు ప్రకృతి శాస్త్రంవల్ల తెలుస్తున్నది. నిన్న లేక నేడులేదు. నేడు రేపటికి పునాది. ఇదే అభివృద్ధిలోని మూలసూత్రం. గతమునుండి సేకరించిన అనుభవాల ననుసరించి ప్రస్తుతాన్ని పునర్నిర్మించుకొంటూ భవిష్యత్తును తేజోవంతంగా ఎంచటానికే మానవుడుతొలినుండి ప్రయత్నిస్తూ వచ్చాడు. ప్రకృతి సిద్ధమైన ఈ పరిణామ సూత్రానికి విరుద్ధంగా ఉన్న దాన్ని విధ్వంసం చేసి శూన్యంనుండి సర్వమూ సృష్టిస్తా మనుకోవటం కంటె పొరపాటు మరొకటిలేదు.

సంఘర్షణద్వారా అభివృద్ధిని సాధించటం ఎంత ప్రకృతివిరుద్ధమో, నేటి ఆర్థిక వ్యవస్థలో వర్గ విభాగాన్ని చరమదశకు గొనిపోవటంగూడా అంతటి అసంభవమే. ప్రస్తుత సామాజికవ్యవస్థ, బూర్జువావర్గమూ, మధ్యవర్గమూ, ప్రొలిటేరియట్ వర్గమూ అని ఆర్థికంగా విభజింపబడి యున్నది. ఇందు బూర్జువా ఉన్నతవర్గం, ప్రొలిటేరియట్ క్రిందితరగతి, మిగిలినది మధ్యవర్గం. సాంప్రదాయంగా వీరు విద్యాధికులు; విద్యయే

వీరిజీవనసాధారణం కావటంవల్ల సహజంగా వీరు ఆలోచనాపరులై సాంస్కృతిక విలువలకు, ఉన్నతాదర్శాలకు సంరక్షకులుగా ఉన్నారు. సమాజంలో ఉత్కృష్ట సంస్కృతికి వీరు ప్రతినిధులు. అభ్యుదయవాదుల ప్రకారం. ఈ మధ్యవర్గం క్రమంగా చివరికి ప్రొలిటేరియట్ వర్గంలో కలిసి పోతుంది. సమాజవర్గీకరణ క్రమంలో నాడు బూర్జువా ప్రొలిటేరియట్ వర్గాల విభిన్న శ్రేయస్సులు సంఘర్షకు వస్తై. ఇది నిజమైన అభివృద్ధిక్రమమేనా? అనే సందేహం రాకమానదు. ఉత్తమ సంస్కృతికి చెందిన మధ్యవర్గం క్రింది వర్గంలో కలిసిపోవటం సంస్కృతికి తీరని నష్టం. అందుచే అది వాంఛనీయం కాదు. అంతేగాక తమ విశిష్ట వ్యక్తిత్వాన్ని మధ్యవర్గం కోల్పో గలదా? మరియూ నేడు యంత్రయుగంలో, శాస్త్రవిజ్ఞానాభివృద్ధివల్ల పారిశ్రామిక యాజమాన్యంలో వచ్చిన నూతన పరిణామాలవల్ల మార్క్స్ ఊహించినట్లుగా వర్గీకరణ జరగక క్రమంగా మధ్యవర్గం బలపడుతోంది. తత్ఫలితంగా వర్గసంఘర్షణకు అవకాశం నశిస్తోంది అని చెప్పవచ్చు.

తమ సాంస్కృతిక విలువలను విడిచి కేవలం ప్రొలిటేరియట్ వర్గంతో తమ్ము సమైక్యపరచుకోవటం మధ్యవర్గం సమ్మతించదనే విషయం నేడు విస్పష్టంగా కన్పిస్తోంది. అభ్యుదయ వాదుల్లోనే, అభిప్రాయభేదం రావటానికి మధ్యవర్గ వాసనలు విడిచిపెట్ట లేనివారే కారణం. వారి దృక్పథం యదార్థమైనదే. కాని వారు తమస్థానాన్ని భావాలను నిర్దుష్టంగా గుర్తించి స్థిరపరుచుకో లేకపోవటం శోచనీయం.

"అభ్యుదయవాదులు" మానవుని భావాలను, కృషికి, ఆర్థిక కారణాలను, వ్యవస్థలకు ఉత్పత్తి శక్తుల సంబంధాలను మూలంగా పరిగణిస్తారు. అందుచే మానవజీవితం వారి దృష్టిలో ఆర్థిక శ్రేయస్సుపైనే కేంద్రీకరింపబడి యున్నది. కాబట్టి నిజమైన 'సాహిత్యం' అమలులోనున్న ఆర్థిక పరిస్థితులను మాత్రమే వస్తువుగా స్వీకరించాలి. ఆవిధంగా సృష్టింపబడిన సాహిత్యమే "అభ్యుదయ సాహిత్యం" అని వీరి అభిప్రాయాలు. ఇతరములు-అనగా సెక్స్-మొదలైనవి ముఖ్యంగా పరిగణించిన రచనలు క్షీణ సాహిత్యంలో కలిసి నామరూపాలు లేకుండా పోగలవని వీరి ఉద్దేశం. కాని తిండి ఎంత ప్రధానమో, మానవునకు సెక్సుకూడా అంతే. ఈ రెండూ మానవునిలోనూ, పశువుల్లోనూ సమంగా గోచరించే లక్షణాలే! కాని సెక్సువాదులూ, అభ్యుదయవాదులూ విషయాన్ని చెరి యొక వైపుకు లాగుతున్నారు. ఒకరికి జీవితమంతా సెక్సే; మరియొకరికి జీవితమంతా ఉదరపూరణమే. ఇద్దరూ మానవునకు బుద్ధిబలం, హృదయం ఉన్నవని గుర్తించటం లేదు. పేరునకు మాత్రమేగాక, యథార్థమైన సాహిత్యం మానవుని మానసికహృదయ క్షోభలను గుర్తిస్తుంది. అదే సాహిత్యంలోని విశిష్టత. అభ్యుదయ సాహిత్యంలో ఇది వ్యంగ్యం.

వారి రచనలనుబట్టి అభ్యుదయ వాదులకు రాజకీయమైన ఆశయములు గల వనటంలో అ స త్యం లే దు. వా రి దృ ష్టి లో రష్యా ఒక్కటే ప్రజాప్రభుత్వ సిద్ధాంతాల ననుసరిస్తోంది! కాబట్టి రష్యా ఆదర్శాలే ప్రజాసాహిత్యానికి ఆదర్శాలు! రష్యాలో తయారైనదంతా ప్రజా, లేక అభ్యుదయ సాహిత్యమే! అని వీరి అభిప్రాయం. ఈ సందర్భంలో రష్యా నేడు సాహిత్యంపట్ల అనుసరిస్తున్న విధానం ఎట్టిదో, అది ఎంత వరకు అభ్యుదయకరంగా ఉన్నదో పరిశీలించటం అప్రస్తుతం కాదు.

1946 మే లో 'బోల్షివిక్' అనే ప్రభుత్వ పక్షపత్రిక ఈ విధంగా ప్రకటించింది: "రష్యా ప్రజలు, తమ థియేటర్లలో, విదేశ రచయితలకు చూపే ఆదరాభిమానాలను సాధారణమైనవిగా పరిగణింపరాదు. ఆ నాటకాలు కళాసృష్టిలో ఉత్తమమైనవి కావు; సోవియట్ ప్రజల స్వభావానికి పరిపోయేవీ కావు." తమ స్వభావానికీ, అభిరుచులకు విరుద్ధములైనచో ప్రజలే గర్హించి బహిష్కరించ గలరు. తమకు ఆనందం గలిగించే వస్తువును నిర్ణయించుకొనే హక్కు ప్రజలకున్నది. కాని ఆ వస్తువు రష్యాలో ప్రభుత్వంచే నిర్ణయింప బడుతున్నది. కాబట్టి అధికారవర్గం నిర్ణయించిన సాహిత్యం, ప్రదర్శనాలు మాత్రమే ప్రజలకు లభిస్తున్నై. తత్ఫలితంగా వారిలో కళాభిజ్ఞత నశించిపోతోంది.

కాలానుగుణమైన రాజకీయపు టెత్తుల ననుసరించి సాహిత్యంపట్ల రష్యాప్రభుత్వ విధానం

జూరుతోంది. ప్రభుత్వం నిర్ణయించిన కొలత బద్దలకు సరిపోని సాహిత్యాన్ని ప్రభుత్వం విధ్వంసం చేస్తున్నది. యుద్ధానంతరమీ విషయానికి నిదర్శనాలు అనేకం లభించినై. రష్యను రచయితలలో జోష్చెంకో సుప్రసిద్ధుడు. అతడు 'జ్వెజ్‌డా' పత్రికా సంపాదకుడు. 1946 జూన్ మాసంలో, రష్యా కమ్యూనిస్టు పార్టీ జోష్చెంకో రచనలను లక్ష ప్రతులు ప్రకటించటానికి తీర్మానించింది. కాని మరి రెండు నెలల తర్వాత ఆగస్టులో జోష్చెంకోను రష్యాకు గర్భశత్రువుగా ప్రకటించి అతని రచనలను ప్రచారం నుండి తొలగించి వేసింది ప్రభుత్వం. అతడు పత్రికా సంపాదకత్వం కూడా గోల్పోయాడు. జోష్చెంకో రచనలలో కెల్ల పూర్తిగా గర్హించ బడి విమర్శించబడిన కథ ఇది.

"మరణశయ్యపై నున్న వృద్ధుడు, భార్య వైపు చూస్తాడు. ఆమె అతని హస్తాన్ని గైకొని వక్షస్థలంపై నుంచుకొంటుంది. వృద్ధుని విహ్వలవదనంలో చిరునవ్వు కనిపిస్తుంది. వెంటనే అతడు మరణిస్తాడు. గృహం రోదనలతో నిండిపోతుంది."

ఈ కథ సోవియట్ ప్రభుత్వానికి ఆగ్రహం కలిగించటానికి గల కారణం ఏమిటి? కేవలం ఆర్థిక రాజకీయములైన విషయాలే ఆనందానికి కారణముకావని, అగాధమైన, అవ్యక్తమైన భౌతిక మానసిక కారణాలు మానవుని ఆనందానికి కారణాలని నిరూపిస్తూ జోష్చెంకో సాంప్రదాయ సిద్ధమైనమార్క్సు అభిప్రాయాలను వ్యతిరేకించాడని అతనిపై అభియోగం. అభ్యుదయ దృక్పథం ఇదేనా?

ఈవిధంగా 'సాహిత్యం' రాజకీయ సాధనంగా నుపయోగింపడి నిర్జీవమై పోతోం దనడంలో అత్యుక్తిలేదు. శాస్త్ర విజ్ఞానం ప్రభుత్వాలకు ఆయుధమై, మారణహోమాల్లో ప్రపంచాన్ని తేలుస్తోంది. సాహిత్యంకూడా ప్రభుత్వానికి సాధనమైనచో ఇక మానవుడు మానసికంగా పరిణామక్రమంలో వెనకటి దశకు పోవలసిన దౌర్భాగ్యం పట్టక తప్పదు.

కాబట్టి 'అభ్యుదయ సాహిత్యం' అసలు సాహిత్యంగాదు. ప్రచారానికి వీలుగా నుపయోగించబడుతున్న వాఙ్మయ సాధనం. ఇక ఆ సాహిత్యం ప్రచారంచేసే భావాలు, ఆశయాలు కూడా అభ్యుదయకరంగా లేవు. కేవలం పురాతనమైనవి, విధ్వసాత్మకమైనవి. 'అభ్యుదయ సాహిత్యం' పేరుతో ప్రచారంలోనున్న రచనల్లో నిజంగా అభ్యుదయమూ లేదు, సాహిత్యమూ లేదనే విషయం యథార్థము.



కొత్త పద్ధతులు

# సమస్యా పరిష్కారం

జీవితం సమస్యలతో కూడుకుని ఉన్నది. సమస్యలు పరిష్కారాలు కోరతాయి. సమస్యను పరిష్కరించటానికి చాలా మార్గాలుంటాయి. కొందరికి సమస్య లెందు కేర్పడ్డాయో తెలుసుకుని ఆ కారణాలు తొలగించడం ఇష్టం. ఇదే సరి అయిన పరిష్కారమార్గం అనుకునే మూఢవిశ్వాసులు చాలామంది ఉన్నారు. నిజానికి అన్నిటికన్నా కష్టతరమైన దీ మార్గమే. ఆంధ్రదేశంలో ఉప్పెన వచ్చింది. ఎందుకొచ్చింది? బంగాళాఖాతంలో వాయు గుండం ఏర్పడటంవల్ల ఉప్పెన వచ్చింది. వాయుగుండాన్ని ఎట్లా తీసెయ్యటం? వీల్లేదు. అట్లాగే, సంసార భారం ఎందుకు హెచ్చుగున్నది? పిల్లలు పుట్టుకు రావటంవల్ల! పిల్లలెందుకు పుట్టుకొస్తున్నారు! పెళ్ళాట్టంవల్ల! ఇందులో ఏ కారణాన్ని తీసేస్తాం? జైల్లో తోస్తారు!

కారణాలను తీసెయ్యటం మాటలు కాదు. కారణాలు గతానికి చెంది ఉంటాయి. అవి కార్యరూపంలో అంతర్హితంకూడా అయి ఉంటాయి. అంతర్హితం కావచ్చును కూడా

వాటిని తీసెయ్యటం మాటలు కాదు. అవి "ఫటాఫ్" అంటే పోవు. ఒక్కొక్కసారి తిరగబడతాయి, మా చాకలిలాగా.

అందుచేత బుద్ధిమంతులైనవారు, ఇప్పుడిప్పుడు, సమస్యలను ఎదుర్కొనే టప్పుడు చాలా యుక్తిగా ఆ సమస్యలకు కారణాలే లేనట్టు నటిస్తున్నారు. వాటిని దువ్వి, బుజ్జగించి, గోముచేసి, ముద్దెట్టుకుని, జైకొట్టి బుట్టలో వేసుకోవటానికి ప్రయత్నిస్తున్నారు.

నేను మా చాకలాడితో అదే చేస్తున్నాను. నా కేర్పడ్డ సమస్య మీరంతా ఊహించుకోవచ్చు. ఇటీవల నా చొక్కాలు—సరి కొత్త చొక్కాలు సయితం—ఒక్క ఉతుక్కే చిరిగి పోతున్నాయి. అచ్చంగా చొక్కాల దుర్మార్గమే అనుకోవటానికి ధోవతులూ, బనీనులూ, మా ఆవిడ చీరలూ, దుప్పట్లూ, జంబుఖానాలూ, (చాకలికి వేసినప్పుడు) తివాసీలూకూడా చిరిగి పోతూనే ఉన్నాయి.

నేను సహజంగా చాకల్ని తిట్టుకున్నాను. వాణ్ణి ఏమీ అననందుకు మా ఆవిణ్ణికూడా తిట్టాను.

మా ఆవిడ అంతకన్న సహజంగా నన్ను తిట్టింది. చాకలిని అనే గుండె ధైర్యం ఉంటే నన్నే అనమన్నది. చాకలిని అనలేకనా? మహారాజుగా అందును. కాని అది డిప్లొమెసీ కాదు. అందులో కావ్యంలేదు. వాడు ఏ మత్తులో ఉండి నన్ను మళ్లీ అన్నాడంటే ఇక నామాట మా ఎదటింటివాళ్ల కుక్కకూడా వినదు. ఆ సంగతి ఆడదైన మా ఆవిడను ఎట్లా తెలుస్తుంది?

అందుకని నేను మా చాకలివాడిమీద నా డిప్లొమెసీ అంతా ఉపయోగించాను. వాడువచ్చే టైముకు ఇంట్లోఉండి వాణ్ణి చూడగానే ఒక చక్కని చిరునవ్వు పారేశాను.

మా ఆవిడ, పిచ్చిమొత్తుకోలు, వంటింట్లో నుంచి, "అడుగో, వాణ్ణి నాలుగు పెట్టండి." అని కేకేసింది.

"నాకు వాడు కనిపిస్తున్నాడు," అని మళ్లీ కేకేశాను.

"ఒరే చాకలీ," అన్నాను గొంతు కొద్దిగా సవరించుకుని.

"ఏం, బాబూ" అన్నాడు చాకలి.

"ఒరే, గుడ్డలధరలు మండిపోతున్నాయి."

"అవును, బాబూ."

"మన గుడ్డలు ఉతికేవాళ్లుకూడా తగలేస్తున్నారు—ధరలతో మండటం చాలనట్టు."

"అలాగాండి?"

"అదికూడా ముఖ్య సమస్యకాదు. ఈ కరువు కాటకంలో మనకు గుడ్డలు బొత్తిగా అటే రాకుండా ఉన్నాయి. మనకు పేరుకు ఎనిమిది చొక్కాలున్నాయి కాని ధరించటానికి యోగ్యమైనది ఒకటే కనిపిస్తున్నది. ప్రస్తుతం మన ఆర్థిక వెనుకబాటునుబట్టి ఈ చంకలో చినిగిన చొక్కా కలుపుకున్నా రెండుకంటే చొక్కాలు లేవు. కాగా ఈ ఎనిమిది చొక్కాల మిగతావి నాలుగు కిందటి నెలలో కొన్నవే. అంటే వాటిలో రెండు అప్పుడే చినిగిపోయాయన్నమాట. అదికూడా చంకలో చినుగు ఒక చినుగు కాదనుకుంటే మటుకే. లేకపోతే మూడు చినిగాయన్నమాట. నెలకు మూడేసి చొక్కాల చొప్పున మనం కొనలేమని వేరే చెప్పాలా!"

చాకలి నాకేసి కోపంగా చూసి, "చొక్కాలు నేను చింపానంటున్నారా?" అన్నాడు.

'ఛీ, ఛీ! ఎబ్బెబ్బే! ఎంతమాట! నేను ఎప్పటికీ అనను. ఈ బట్టల సమస్య నేను సంపూర్ణంగా నీ సహకారంతోటే సాల్వ్ చెయ్యదలిచానని నీవు నమ్మవచ్చు."

"అదికాదు లెండి, బాబూ, అమ్మగారన్నారు, నన్ను మానేసి ఇంట్లోనే చాకిరేవు పెడతామని. అందు కడిగా!" అన్నాడు చాకలి.

"దాని మొహం! దానికేం తెలుసు? ఈ సోషలిష్టు కబుర్లకేంతే?... మనం ఇండియా ప్రభుత్వంలాగే ఖర్చు తగ్గించాలి. లోటు లేని బడ్జెటు తయారుచేసుకోవాలంటే నెలకు మూడు- పోనీ, రెండు- చొక్కాలు కుట్టించుకునే మాట తలపెట్టరాదు. అందుకని ఏం చెయ్యాలి? ఆ విషయంలో నువ్వు ఏ సలహా చెబితే అది చెయ్యటానికి సర్వసంసిద్ధంగా ఉన్నాను. అంతేగాని చాకిరేవు దాలీయను చేసేదికల్ల. అనగా కల్లో వార్త."

"బాబూ, నా మాటిని ఇంట్లో చొక్కా వెయ్యటం మానెయ్యండి."

"భేష్!"

"ఒక్కొక్క చొక్కా సొంతంగా వారం రోజులు వాడండి."

"మాకా నా!"

"మళ్ళీ, చిరిగిన చొక్కాలన్నీ అమ్మగారి చేత కుట్టించండి."

"వింటున్నావుటే!"

"అంతేగాని నిక్షేపంలాటి ఇస్త్రీ బట్టలు మానుకుని చవుకు లేనోళ్ళలాగా ఉంటారా, బాబూ!"

"చాలా బాగా చెప్పావురా! నాకు నిజంగా ఇప్పుడిప్పుడే నువ్వొక్కడివే కనిపిస్తున్నావు. మా ఆవిడే నాకు గర్భశత్రువైపోయి, చొక్కాలు ఇస్త్రీకి వెయ్యకుండా ఉంటే, పిల్లకొద్దీ ఉంటాయనీ, నీకిచ్చే పని రూపాయంటా ప్రతి నెలా ఆదా అవుతాయనీ, బట్టల ఖర్చు నెలకి ఇరవై చొప్పున మిగులుతుందనీ వచ్చి సామ్యవాదం మాట్లాడుతున్నదంటే నమ్ము."

"నాకు పన్నెండు రూపాయలు చేయించండి, దొరా! ముడిసరుకు, అంటే సోడా సబ్బూ అవీ మహా గిరాకీగా ఉన్నాయి" అన్నాడు చాకలి.

"దానికేం భాగ్యం!; వచ్చే దీపావళికి నీకు ప్రత్యేక ఈనాం మిస్తాను జ్ఞాపకం చెయ్యి" అన్నాను.

ఇంతలో అమ్మకత్తిలాగా మా ఆవిడ వంటింట్లోనుంచి ఊడిపడి, "వాడికో చొక్కాల మీద లెక్కెట్టు గొడుతున్నారేమిటి? బట్టలెందుకు చించుతున్నాడో అడగరేం? నా చీరలు అన్నీ దాళ్ళవాళ్ళు చేశాడు. ఒక్క చీర లేదు." అని ఆరంభించింది.

"నీ స్వార్థం చూస్తే నాకు ఒళ్ళు మండిపోతోంది. వాడూ మనిషేనా? వాడి కష్టసుఖాలు విచారించావా? నే చెడో చెప్పవలసినట్టు చెయ్యి తున్నావా? మధ్య నువ్వు వేలుపెట్టటం దేనికి? నీకు తెలిసినపాటి నాకు తెలీదూ! చాల్లే ఊరుకో!" అని నా ఆవిడ్ని గట్టిగా కోప్పడ్డాను.

"అన్నట్టు వాడు కిందటి ఉతుకులో మీ షోవలి ఒకటీ బనీనొకటీ తీసుకురాలేదు... అది తెచ్చావట్రా?"

"ఇప్పుడే తెస్తినిగా, అమ్మగారూ!"

"అబద్ధం! పచ్చి అబద్ధం!"

"వాడట్లా అబద్ధా లాడేవాడు కాదు."

"మీరు లెక్క తప్పుగా చూసుంటా రమ్మగారూ? నే నింటో ఎంత వెతికినా కనిపించందే! ఉంటే ఏమవుతాయా?"

"లెక్క నీ ఎదట చూస్తిని కాదుటో?"

"అయితే తప్పుగా రాసుంటారు."

"చూచారా, వాడు ఎంతలో మాట మారుస్తాడు!"

'నువ్వూరుకోవే! పోయిన బట్టల విచారణ' సంఘం వేస్తాను. దానికి మన చాకలే అధ్యక్షుడుగా ఉంటాడు. నువ్వు వాడికి మాటికి మారు పాళ్లు సహకరించి పోయిన గుడ్డల ఆరా తీయి. న్యాయంగా విచారణ జరపటానికి నాకే అర్థం కరమూ లేదు."

"మీ మొహంమల్లే ఉంది విచారణ!"

"ఛప్! నోరెత్తకు! చాకలి ఆర్డినెన్సు పాస్ చేసేస్తున్నాను. నేను మళ్ళీ చెప్పేవరకూ నువ్వు చాకలాడిమీద చాడీలు చెప్పటానికి వీల్లేదు."

"అయితే వాడూ మీరూ ఎందులోనన్నా దూకండి. నన్ను మాత్రం చినగని గుడ్డ లడక్కండి."

"అదేంమాట! బట్టలు ఉతకటం వాడివంతూ, నా కవి ధారణయోగ్యమైన స్థితిలో అందించటం నీవంతూనూ! మన చాకలీ, నువ్వూ, నేనూ కలిసి నిర్మలహృదయంతో పరస్పరం సహకరించుకుంటేనేగాని ఈ సమస్య పరిష్కారం కాదు" అని చెప్పేశాను

"రావు"






ఇది నాది అనే గుణం యథార్థమయినది. ఈ నాది అనే ప్రవృత్తే వ్యక్తియొక్క అన్ని రకాల విక్రీడలకు మూలం: దాన్ని ఆస్కారం చేసుకుని నేడు అన్ని రకాల ప్రబోధాలూ సాగుతున్నాయి. ఈ నాది అనేదాన్ని కార్యకారణ దృష్టితో తర్కించుకోగల తాహతును సామాన్య విద్యాసంస్కారాలు గల పౌరునికి కలుగచేయవలసిన బాధ్యత ఎంతయినా ఉన్నది. ఆ పనిని రాజ్యాంగయంత్రం చేస్తే మంచిదే, చేయడం లేదన్న నెపంతో చేతులు నలుపుకుంటూ కూర్చుంటూ వ్యక్తి తన "నా" కోసం పాట్లు పడుతున్నానని అనుకుంటూ, తననే నాశనం చేసుకుంటున్నాడు.

... ... ...

వెంకయ్యకాపు తన చేలన్నీ గిరగిరా తిరిగి ప్రొద్దు క్రుంకేసరికి వచ్చాడు. వీధుల్లోకి వచ్చేసరికి వాన వాసన తగిలింది. పెద్ద జువ్విచెట్టుకింద నుంచుని ఏటివంక పరకాయించి చూశాడు. ఏరు చాలా కొద్దిసేపట్లో పొంగనున్నదని తెలుసుకున్నాడు. మునుపు ఓసారి ఇట్లానే ఏరు చాలా ఎక్కువగా పొంగింది. అప్పుడు తను నడి వయస్సులో ఉన్నాడు. పైరుతో ఉన్న చేలన్నీ చెడిపోయినా తన శరీరంలోని బలాన్ని చూసుకుని చాలా ధైర్యంగా ఉన్నాడు. అప్పటికి తన కూతురు ప్రసవమయి ఇరవై రోజులు. ఆ పసిగుడ్డునూ బాలెంతనూ తన పిల్లలను నలుగుర్నీ ఏ ప్రమాదమూ రాకుండా ఆనాడు కాపాడుకోగలిగాడు. ఈ సారి క్రిష్ణ పొంగితే సంగతులు ఎట్లా ఉంటాయో తన ఊహ కందడం లేదు.

తన నలుగురు కొడుకులూ పెద్దవాళ్ళయినారు. ఆడపిల్లలు అత్తవారింటికి వెళ్ళారు. తనకున్న పొలమూ గట్రా కొడుకులే చూసుకుంటున్నారు. అసలు వాళ్ళు చూసుకోవడమే తన కోరిక. అయినా రోజు కోసారయినా పొలాలన్నీ చూసివస్తేనేగాని తనకు తృప్తి ఉండదు.

జువ్విచెట్టు క్రిందనే ఓ పెద్ద బండ ఉన్నది. ఆ బండదగ్గర గొడ్లు కాచుకునే పిల్లలు ఆడుకుంటారు. వెంకయ్యకాపు కాసేపు అటూయిటూ చూసి ఆ బండమీద చతికిలబడ్డాడు. తన పెద్దకొడుకు గ్రామమున్సిఫ్ సంపాయించాడు. తన చిన్నకొడుకు స్కూలు ఫయినలుదాకా చదివి ఊళ్ళోనే ఉండి పొలంపని చూసుకుంటున్నాడు. మూడోవాడూ నాలుగోవాడూ అయిదోక్లాసుదాకా చదివి అంతతో చదువు మానుకుని పొలం పని చూసుకుంటున్నారు. నాలుగోవాడు కొంచెం కొరకొరలాడే స్వభావం కలవాడు. పెద్దవాడు ఎప్పుడూ తన గౌరవ ప్రతిపత్తుల సంగతే తప్ప సమష్టికి సంబంధించిన సంగతులే పట్టించుకోవడం లేదు. ఆ సంగతి నాలుగోవాడికి గిట్టకనే భాగాల పంపకం తెచ్చాడు.

ఇది యిప్పటికి ఆరేండ్లనాటి సంగతి. కొడుకు "అయ్యా, ఎవళ్ళకుండ వాళ్ళం పెట్టుకుంటాం" అని అన్నప్పుడు వెంకయ్య తన పొడుగు మీసం పైకి తీసుకుని ఓ చిరునవ్వు నవ్వుతూ, "అట్లాగే" అన్నాడు. నాలుగోవాడికి వెంకయ్యకాపు కూడా భాగం తీసుకోవాలని ఉన్నది. వెంకయ్యకాపు ససేమిరా అన్నాడు. ఆఖరికి అయ్యను

తనతో పాటు ఉండమన్నాడు. వెంకయ్యకాపు అదీ వీల్లేదన్నాడు.

తను ఆ ఊరు మొదట వచ్చినప్పుడు ఓ చిన్న గుడిసె వేసుకున్నాడు. కొంచెం కొంచెం మార్పులతో అదే ఈనాటికీ నిలిచి ఉన్నది. దాంట్లోనే ఉంటానన్నాడు. ఎవరికి తోచిన గింజలు వాళ్లనే తెచ్చి యిమ్మన్నాడు. తనకు గుబులు పుట్టితే ఇంట్లో వండిమాని ఏకొడుకు ఇంటికో పోయి తింటాడు. అప్పుడు తనమడిసి లచ్చి ఏమీ అనేదికాదు. ఇప్పుడు అదీ లేదు. ఇహ తనకేం దిగులు? ఆ బండమీదనే కూర్చుని అన్నీ గుర్తుకు తెచ్చుకుంటున్నాడు. ఇవన్నీ ఎందుకు గుర్తుకు వస్తున్నాయో తెలియక వెంకయ్యకాపు తికమకపడ్డాడు.

లేచినుంచుని మళ్లీ ఓసారి ఏరువంక పరకాయించి చూచాడు. అప్పటికే ఏరు లంకలో ప్రవేశించడానికి సిద్ధంగా ఉన్నది. ఈ యేటికి తనమీద ఎందుకింత కోపమో తన కర్థం కావడము లేదు. అవునుగాని ఈ గవర్నమెంటువాళ్లు పోనీ ఏరు ఊళ్లోకి రాకుండా ఏమన్నా చెయ్యరాదూ? అది వాళ్ల కసలే పట్టదు. వెంకయ్యకాపు గబగబా నడచి తన గుడిసె ముందుకు వెళ్లి నిలబడ్డాడు. కోడెదూడ గుంజకు కట్టిన తాడు తెంచుకొని వచ్చి కిందుకు తొక్కుతూ వచ్చి కాపుముందర నిలబడింది. కాపు దాని గంగడోలు తన చేతితో నిమురుతూ "ఏం...ఎందుకూ ... ఇంత కోపం ... తాడు తెంచావేం ..కొత్తతాడు ... ఆ... అదా... నిన్న అమ్మతానని వెంకయ్య నిన్న అన్నాడు. అది నీకు తెలిసిందా ?... నేను అమ్మనుగా... వెధవ వెయ్యి రూపాయలు ఎవరికి కావాలి! పదా..." అంటూ దాన్ని మరో పలుపుతో ఇంకో గుంజకు కట్టివేశాడు. ఒక జనుపకట్టె, కాస్తకొన్నదంటూ,కలిపి దానిముందర వేశాడు. అదిబుసబుసలాడుతూనే జనుపకట్టెనములుతోంది.

సమష్టి కుటుంబంలో ఉండగా వెంకయ్యకాపుకి నాలుగు ఆవు లుండేవి. అందులో పెద్దావు తాను మొదట కొన్నది. దాని దూడే యిది. ఇది పెద్దకొడుకు భాగంలోది. కాని వాళ్లకెవరికీ లొంగదు. అందుకని వాళ్లు వెంకయ్యకాపు దగ్గరే దాన్ని ఉంచి దాని సంగతి చూస్తుండమన్నారు.

పెద్ద కొడుకు నిన్న దాన్ని ఎవరికో వెయ్యి రూపాయల కమ్ముతున్నానని బేరం తీసుకు వచ్చాడు. వెంకయ్యకాపు "వెయ్యి రూపాయలకు ఎవరయినా తన కొడుకుని అమ్ముకుంటారా!" అని అడ్డం తగిలాడు. కొడుక్కి అమ్మాలని గట్టిగా ఉన్నది. అయినా తండ్రి అడ్డం తగిలేసరికి అయన్ను కాదని అమ్మే సాహసం లేకపోయింది.

ఆ దూడ ఒక ఎత్తూ మిగతా తన ఆస్తి అంతా ఒక ఎత్తూ వెంకయ్య కాపుకి. ఏరు అంతగా పొంగి వస్తోందని తెలిసినవాళ్లు సామాన్లూ అదీ జాగ్రత్త పరచు కుంటున్నారు.

గ్రామ మున్సబయిన వెంకయ్య పెద్దకొడుకు యింటికి ఓవర్సీర్ వచ్చి ఏరు చాలా ప్రమాదకరంగా ఉన్నదన్న సువార్త అందించాడు. పైగా దగ్గరనున్న లాకుల దగ్గరికిపోయి ఆయన కొన్ని బోట్లుకూడా తెచ్చాడు. కాని సగం రాత్రి లంకలోని వాళ్లెవరూ లంకను వదలి పొరుగు గ్రామాలకి పోవడానికి తెమలలేదు. కాని తొలి కోడి కూసేవేళకు లంకలోని కొన్ని ఇండ్లు మునగ సిద్ధంగా ఉన్నాయి. తప్పక చాలామంది తమ సామాన్లు వేసుకొని లంకనుండి బయలుదేరి అటు ప్రక్క వూరుకో ఇటు చావుకో వెళ్లిపోయారు. మనుషులు తమ ప్రాణాలు రక్షించుకునే హడావుడిలో ఉండటే చాలా పశువులు ప్రవాహంలో కొట్టుకుపోయాయి. ఈతవచ్చిన ఎద్దూ గిత్తలూ ప్రవాహంలో కొట్టుకుపోతూనే ఏదో ఒక గట్టుకి చేరుతున్నాయి. ఈతవచ్చికూడా వాలు తెలియని పశువులు అట్టాఅట్టా గిరగిరా తిరుగుతున్నాయి.

వెంకయ్యకాపు దగ్గరకి మునసబు వచ్చాడు. అప్పటికి తెల్లవారవస్తోంది. దాదాపు లంక అంతా మునిగిపోయినట్టే.

"అట్టా చూస్తావేం. పదా, ఆ నావలో ఎక్కు" అన్నాడు మున్సబు. వెంకయ్యకాపు వినిపించుకున్నాడో లేదో తెలియదు.

'ఏందే అట్టా చూస్తావు' అని మునసబు గదమాయించాడు. "ఆ...ఏం లేదు. అమ్మాయిలూ, కోడలూ, అందరినీ అవతలికి చేరేశావా!"

"అందర్నీ చేరేశాగాని నువ్వు కదలవేం! ఆ దూడను అద వదులు."

"అ...అట్లానే వదులుతాను. నువ్వు పదా" అన్నాడు వెంకయ్య కాపు ముఖం చిట్లిస్తూ.

మున్సయిబు ఒకసారి! అంటేత ఎటో పడి పోయాడు. వెంకయ్య కాపు తన చెమటూడ్చి కట్టిన గుడిసె పడిపోవడం చూశాడు. తనది అనేది ఈ విధంగా నాశనమయిపోతుంటే చూస్తూ సహించడం అతని అలవాట్లో లేదు. కాని చేసేదీ ఏమీ కనుపించలేదు.

రెండోకొడుకూ, మూడోకొడుకూ ఊళ్ళో లేరు. వాళ్ళ పిల్లాజెల్లలనూ, మూట దసకాలనీ నాలుగోకొడుకు అవతలికి చేరవేశాడు. తీరా నిలదొక్కుకొని చూసే సరికి తన నాయన ఇంకా లంకలోనే దూడను కావిలించుకుని కూర్చున్నాడన్న సంగతి గుర్తుకొచ్చింది. జరిగిన దానికి చాలా బాధపడ్డాడు. తన తండ్రి యీద లేదని కాదు. ఆయన గజ ఈతగాడు. బెజవాడ దగ్గిర క్రిష్ణ నిండా వచ్చినప్పుడు అటునుంచి ఇటూ ఇటునుంచి అటూ నాలుగుసార్లు ఈదిన ఆరడుగుల మనిషి. అయినా అతనికి ఎందుకో భయంగానే ఉన్నది.

గబగబా కట్టదగ్గరకు వచ్చి చూసేసరికి ఏటి మధ్యన ఒక చిన్న నావ కనుపించింది. అందులో తన తండ్రి ఉన్నాడేమో నని ఆశపడ్డాడు. కాని ఆ పడవ సరిగ్గా ఏటి మధ్యకి వచ్చే సరికి ఓ పెద్ద తుమ్మచెట్టు కొట్టుకు వస్తూ వస్తూ దానికి అడ్డంపడ్డది. ఇంకా ఏముంది అసలే చిన్న పడవ అందులో దాంట్లో ముప్ఫయిమంది మనుషులూ, కొంత సామాను. నిలువుగా పడవమునిగింది. అది చూస్తున్న వెంకయ్య నాలుగో కొడుకు శివ శివా అంటూ ఏటిలో మూకిలంకవైపు ఈదడం మొదలుపెట్టాడు. ఈతలో తండ్రికిఎంతమాత్రం తీసిపోడు.

కాస్తదూరం యీదేసరికి వాడికి ఓ పెద్ద తాటిచెట్టు అడ్డంతగిలింది. దాని నిండా అన్నీ పాములే. తెగ బుసకొడుతున్నాయి. తాడితప్పించుకుని ఎట్లాగో అవతలపడేసరికి ఎక్కడినుంచి వచ్చిందో ఆ పాము మొసలి అది వాణ్ణిలాక్కుపోయింది.

అవతలిగట్టున నిలబడ్డ వెంకయ్యకాపు దూడ సంగతి అదమరచాడు. అసలే భయానకంగా ఉన్నది. ఒకరిసంగతి ఒకరు పట్టించుకునేస్థితి పలుదప్పింది. ప్రాణాలు గుప్పిటలో పట్టుకుని ఎవళ్ళ గొడవలో వారున్నారు.

వెంకయ్యకాపుకి గొడవంతా కొంత ఆశ్చర్యంగానూ మరికొంత భయంగానూ ఉంది. ఈ ఏరు ఇట్లా పొంగాలిసిందేనా? ఈ విధంగా జనం అంతా అనర్థకపుచావు చావాలిసిందేనా! ఈ ఏటినిగురించేనా తను ఊళ్ళోని పడుచులు తియ్యని పాటలు పాడుతారు! ఏకో కానా దయ అనేది కనుపించకపోతే యీ మనుషులంతా ఏమయిపోతారు! తనకు దయ ఉన్నది. వీళ్ళందర్నీ ఈ ఆపద నుండి కాపాడాలని ఉన్నది. తనేం చేయగలడు?

ఇట్లా ఆలోచిస్తూనే నిలబడ్డాడు. దూడ చెంగు చెంగున పరుగెత్తుకుని వచ్చి అతని పై పంచ లాగుతోంది. ఆరోమయపు ఆలోచనలలో మునిగి తేలకుండా ఉన్న వెంకయ్యకాపుని నిద్రలేపినట్టు లేపింది. దూడపలుపును పట్టుకుని గబగబా అప్పుడేబయలుదేరనున్న నావదగ్గరికి వెళ్ళాడు.

"నువ్వయితే ఎక్కు. ఆ దూడకు చోటు లేదు." అని జనం అరిచారు.

"దూడకు చోటు లేదూ! అయితే నేనూ ఎక్కను" అన్నాడు వెంకయ్యకాపు. నావ కదిలిపోయింది.

వెంకయ్యకాపూ కోడిదూడా ఏటిలో ఈద మొదలుపెట్టారు. దూడ చాలా బలం గలది. దాన్ని వదిలివేస్తే అది గట్టుకు చేరగలదు. వెంకయ్యకాపు గజ యీతగాడు. దూడను వదిలితే కొంచెం ప్రయాసపడి అయినా అవతలి గట్టుకు హాయిగా చేరగలడు. కాని దూడ కాపును వదలలేదు. వదలదు. కాపు దూడ సంగతన్నా వదలలేడు.

ఏటి మధ్యకి వచ్చేసరికి పెద్ద తెప్పగా నీళ్ళు వచ్చినయి. వెంకయ్యకాపు కట్టుదలగొద్దీ యీదుతున్నాడు. దూడ వెనకబడ్డది. దాని పలుపును తన మొలతాటికి కట్టుకున్నాడు. ఓ పెద్దగాలి ఆరంభమయింది. దాంతోపాటు ఏరు వొరవడి జాస్తయింది. అయినా వెంకయ్యకాపు ఈదుతునే ఉన్నాడు.

అంతలో రెండుమూడు తుమ్మచెట్లు ఒకటిగా కొట్టుకు వచ్చినయి. వెంకయ్యకాపూ ఆయన దూడా వాటితో కొట్టుకుని పోయినారు. అక్కడ మునగడం ఎక్కడ తేలారో తెలియదు. అసలు తేలారో లేదో!

శాస్త్రపరిశోధనల తొలిరోజులు

# భారత విజ్ఞానాభివర్ధక సంఘం

# సర్. సి. వి. రామన్ విఖ్యాత పరిశోధనలు

ఎ. వి. ఎస్. రామారావు

(గత సంచిక తరువాయి)

తొలి రోజులలో భారత విజ్ఞానాభివర్ధక సంఘంయొక్క కార్యక్రమం ప్రయోగయుక్తమైన ఉపన్యాసాలతో విజ్ఞానమును జనాదరణీయమొనర్చుటయందే కేంద్రీకృతమై యుండెను. ధనలోపం చేతనైతేనేమి, పరికరములు, తగిన పొందిన పరిశోధకులు లేని హేతువుచేతనైతేనేమి అనాటి ఆ సంస్థ కార్యకర్తలకు నూతన శాస్త్ర పరిశోధనల ప్రసక్తి అంతగా పట్టించుకొనుటకు వీలు చిక్కలేదు. ఆధునిక విజ్ఞానంలో సరిక్రొత్త పరిశోధనలందుండు ప్రీతిలను సాదయు మేర్పరచుట, ప్రయోగములను చేయుటయందు వారి కభిరుచిని కలిగించుట-అనివే ఆ రోజులలో ఆ సంఘముయొక్క ముఖ్య కార్యకలాపము. తొలి రోజులలో డాక్టర్ సర్కార్, లెఫాంట్ పండితు లిరువురే నిర్దిష్ట సమయాలలో ఆసంస్థయందు భౌతిక శాస్త్రోపన్యాసాల నొసంగుచుండెడివారు. ఆ తరువాత తారాప్రసన్న రాయి, రసాయన శాస్త్రమందు గౌరవోపన్యాసకునిగా అందు ప్రవేశించినారు. అటు పిమ్మట క్రమంగా వేర్వేరు శాస్త్ర రంగాలలో ప్రత్యేక కృషిగావించిన విద్యావేత్తలు ముందుకు వచ్చి, ఆ సంస్థ అధ్వర్యమున జన సామాన్యానికి శాస్త్రోపన్యాసాల నొసంగుటకు సమ్మతిగల యభీష్టమును వెల్లడించినారు. వీరిలో డాక్టర్ జగదీశచంద్రబోస్, సర్ అశుతోష్ ముఖర్జీ, డాక్టర్ నీలరత్న సర్కార్ ప్రభృతులు ముఖ్యులు. ఇంతలో కలకత్తా విశ్వవిద్యాలయ విద్యా ప్రణాళికయందు శాస్త్ర విద్యకు స్థానము లభ్యంకాగా, ఇంటర్మీడియట్ - ఇన్ - సైన్సు (I. Sc.) పరీక్షకు భౌతిక, రసాయన, వృక్ష శాస్త్రములందు విద్యార్థులకు శిక్షణనిచ్చే కార్యక్రమాన్నికూడా సంఘం చేపట్టినది. కాని 1914 లో కలకత్తా విశ్వవిద్యాలయం ప్రత్యేకంగా 'సైన్సు డిగ్రీ కోర్సు'ల నేర్పరచి, వేర్వేరు కళాశాలలలో ఆ పరీక్షల కవసరమైనంతవరకు ప్రయోగయుక్తమైన శాస్త్ర విద్యాబోధ కవకాశములను కల్పింపజేసిన వెంటనే ఆ కార్యక్రమాన్ని విజ్ఞానాభివర్ధక సంస్థ తగ్గించుకొని, నూతన పరిశోధనలకేసి దృష్టిని కేంద్రీకరించినది. అయితే ఎన్నడుకూడ-అప్పుడే కూడ, నేడు కూడ-జనాదరణీయ శాస్త్రోపన్యాసాలు దాని కార్యకలాపమునుండి తగ్గించవేయబడలేదు.

భారత విజ్ఞానాభివర్ధక సంస్థ అధ్వర్యమున జరిగిన మొదటి పరిశోధనలు, వంగ ప్రభుత్వపు సహాయ రసాయన పరీక్షకుడయిన డాక్టర్ సరీలాల్ సర్కార్ చే 1902 లో, 'కాపర్ ఫెర్రో సైనైడ్' స్ఫటికాలపై గావింపబడినాయి. ఆ తరువాత 1906 నుండి రోజూ రెండుసార్లు భౌమ్యవాతావరణాన్ని పరిశీలించి, అందుకు సంబంధించిన వివరాలను ప్రచురిస్తూండేవారు. ఆ రోజులలో వాతావరణ పరిశోధశాలలు (Meteorological Observatories) లేని కొరతను ఆ సంస్థ కొంతవరకు తీర్చేదని మనం భావించవచ్చు. పిమ్మట కొంతకాలానికి కలకత్తా నగరంలో అమ్మబడుచున్న ఆహార పదార్థాలను రసాయనిక విశ్లేషణ గావించి, తత్ఫలితాలను ఆ సంస్థ అధ్వర్యాన్ని కరపత్రాల రూపంగా ప్రచురిస్తూండేవారు.

### క్రొత్త అధ్యాయం :

ఇట్లు దినదినాభివృద్ధిని గాంచుచున్న భారత విజ్ఞానాభి వర్ధక సంఘపు చరిత్రలో 1907వ

సంవత్సరమున క్రొత్త అధ్యాయం ప్రారంభమైనదని వచించవచ్చు. ఆ సంవత్సరంలోనే భారత ప్రభుత్వపు ఆర్థికశాఖలో పనిచేసే యువకుడు చంద్రశేఖర వేంకటరామన్ తన తీరిక సమయాలలో శబ్దశాస్త్రమందు పరిశోధనలు చేయుటకై ఆ సంస్థలో ప్రవేశించినాడు. ఆ తరువాత అనతికాలానికే రామన్ ఆధ్వర్యాన్ని ఆ సంస్థ ప్రయోగశాల ఎడతెరపి లేని పరిశోధనాగారంగా పరివర్తనమొంది, ప్రాచ్య ఖండంలో ప్రఖ్యాత విజ్ఞాన సత్యాన్వేషణ కేంద్రంగా పెంపొందినది. రామన్ శబ్దశాస్త్ర పరిశోధనలన్నియూ ఆ కాలంలో గావింపబడినవే. ఆనాడు రామన్ పర్యవేక్షణ క్రింద శబ్దశాస్త్రంలో పరిశోధనలు గావించి విఖ్యాతులైన వారిలో డే, బి. ఎన్. బెనర్జి, ఎస్. కే. బోస్, ఆర్. ఎన్. ఘోష్, ఎమ్. ఎన్. మైత్రా ప్రభృతులు గణనీయులు.

ఇంతలో 1917 వ సంవత్సరమున వేంకటరామన్ కలకత్తా విశ్వవిద్యాలయోపాధ్యక్షుడు సర్ అశుతోష్ ముఖర్జీ ఆహ్వానము నంగీకరించి, ప్రభుత్వోద్యోగానికి స్వస్తి చెప్పి కలకత్తా విశ్వవిద్యాలయంలో భౌతిక శాస్త్రాచార్యునిగా ప్రవేశించినాడు. అయితే ఆ నాటి విశ్వకళాపరిషత్ కళాశాలకు సమగ్రమైన ప్రయోగశాలలేదు. కాగా ఉన్నతాశయ మండితుడైన సర్ అశుతోష్, రామన్ పరిశోధనలు కడ్డు తగులుట కిచ్చగించక, విశ్వవిద్యాలయాచార్యునిగా విధిని నిర్వర్తిస్తూనే రామన్ విజ్ఞానాభివర్ధక సంఘపు పరిశోధనాగారంలో యథారీతి పరిశోధనలు సాగించుకొనుట కంగీకరించి, పైగా విశ్వవిద్యాలయ ప్రయోగశాలనుండి తన కవసరమైన శాస్త్ర పరికరాలను విజ్ఞానాభివర్ధక సంఘపు పరిశోధనాగారానికి తీసికొనిపోయి యథేచ్ఛగా వాడుకొనుటకుకూడ అనుమతించాడు. ఆ రీతిగా సమకూడిన విస్తృతావకాశాలతో రామన్ శబ్ద, తేజశ్శాస్త్రాలలో విరివిగా పరిశోధనలు చేసి, పరిమాణమునందే కాక ప్రామాణ్యమునందుకూడ ఉన్నతములైన తత్త్వములను పెక్కింటి నావిష్కరించినాడు. ఈ పరిశోధనల ఫలితమే—1928 లో ఆయన ఆన్వేషించిన రామన్ పరిక్షేపణ సిద్ధాంతము (Raman Effect) ఆ మహత్తర సత్యాన్వేషణ ఫలితంగా 1930 లో వేంకటరామన్ విజ్ఞానవేత్త కాంక్షించే ఉజ్జ్వలమై, ఉన్నతమైన నోబెల్ బహూకృతిని కైవసం చేసికొని విజ్ఞాన విశారదునిగా తాను కీర్తిని పొంది, తన్ను చేరదీసి, ఆశ్రయమిచ్చిన భారత విజ్ఞానాభివర్ధక సంఘానికికూడ విజ్ఞాన ప్రపంచంలో సుస్థిరమైన యశస్సును చేకూర్చినాడు. ఆ నాడు తేజశ్శాస్త్రంలో రామన్ ఆధ్వర్యమున పరిశోధనలు గావించి విఖ్యాతులైనవారిలో కె. యస్. కృష్ణన్, కె. ఆర్. రామనాథన్, ఇ. రామకృష్ణారావు, కే. బెనర్జి, రామచంద్రరావు, సి. మహాదేవన్, సూరి భగవంతం, కృష్ణమూర్తి, వెంకటేశ్వరన్ ప్రభృతులు ముఖ్యులు.

### ఇండియన్ జర్నల్ ఆఫ్ ఫిజిక్స్:

భారత విజ్ఞానాభివర్ధక సంఘమునందు శాస్త్ర పరిశోధనల నారంభించిన తొలిరోజులలో ఆ పరిశోధనల ఫలితాలను 'ఫిలసాఫికల్ మేగజీన్' 'ఫిజికల్ రివ్యూ', 'నేచర్' మున్నగు ఆంగ్ల విజ్ఞాన సంచికలలో ప్రచురిస్తూ, అందు ప్రచురితమైన వాటినే తిరిగి కరపత్రాలుగా భారత విజ్ఞానాభివర్ధక సంస్థ ఆధ్వర్యమున ప్రచురిస్తూండేవారు. 1912 వ సంవత్సరము నుండి ఈ కరపత్రాలలో, పాశ్చాత్య విజ్ఞాన సంచికలలో ప్రచురితమైనవే గాక, ఎందును ప్రచురితములుగాని క్రొత్త పరిశోధన పత్రములు కూడ కొన్ని ప్రకటితమగు చుండెడివి. ఇక 1914 నుండి విజ్ఞానాభివర్ధక సంఘముయొక్క సాంవత్సరిక నివేదికలలో "శాస్త్ర విజ్ఞాన పరిషత్తు వ్యవహారములు" (Transactions of the Science Convention) అనే శీర్షికతో ఆ సంస్థయొక్క పరిశోధనాగారముల నుండి వెల్వడిన విజ్ఞాన సంపద నంతను శాస్త్రప్రపంచమున కందించుచుండెడివారు. ఐతే దినదినాభివృద్ధినొందుచున్న పరిశోధనల ఒత్తిడికి ఇదికూడ తట్టుకొనలేక పోవుటచే, 1915 నుండి "భారత విజ్ఞానాభివర్ధక సంఘ కార్యకలాపము" (Proceedings of the Indian Association for the Cultivation of Science) అనే శీర్షికతో ఒక సంచికను అవసరమైనప్పుడెల్ల ప్రచురిస్తూండేవారు. ఇంతలో కలకత్తా

ఉన్న పరికరములను కొంతవరకు పెంపొందించిన, గాని ఆసంస్థ అభివృద్ధి కార్యక్రమము సక్రమముగా నెరవేరదు. అంతేగాక సంతతము సందడిగా ఉండు బౌ బజారు వీధిలో శాస్త్ర పరిశోధనలకు అవశ్యకమైన ప్రశాంతత కలకత్తా నగరమభివృద్ధి చెందినకొలది మృగ్యమైనది. అందుచే ప్రకృతమున్న సంస్థను మార్పుచేయుటగాక దానిని పూర్తిగా త్యజించి కలకత్తా నగరానికి అనతి దూరములో నున్న జాధవపురంలో దానిని నిర్మించుటకు పూనుకొనిరి. అందుకై వంగ ప్రభుత్వపు సహాయ సహకారములతో విశాలమైన ప్రదేశమును సేకరించి నూతన పరిశోధనాగారమునకై పశ్చిమ వంగరాష్ట్ర ప్రధాని డాక్టరు బిధాన్ చంద్రరాయ్ చే, 26 సెప్టెంబరు 194? నాడు, శంకుస్థాపనకూడ చేయించిరి. ఈ నూతన ప్రణాళికకు 30 లక్షల రూపాయిలవరకు ప్రారంభములో ఖర్చగునని, అంతటినుంచి ప్రతి యేడు మొదటి వత్సరము 3 లక్షలనుండి క్రమంగా కాలం గడిచిన కొలది 3-4 లక్షలవరకు వ్యయం పెరుగునని అంచనా వేయబడినది. ఇందు, భారత ప్రభుత్వం కొంత ధనమును, పశ్చిమ వంగ ప్రభుత్వం కొంత ధనమును మంజూరు చేసినవి. పాత భవనములను విక్రయించుటలో మరి కొంత ధనము సమకూరును. శేషించిన ధనముకై ప్రకృతము ఆ సంస్థ అధ్యక్షుడు, మేఘనాద్ సహా ఉదారులకు, విజ్ఞానప్రియులకు అభ్యర్థన చేశాడు.

ప్రకృతం భారత విజ్ఞానాభివర్ధక సంఘపు ఆధ్వర్యమున భౌతిక శాస్త్రమందే వివిధా పరిశోధనలు జరుగుచున్నట్లు మనకు ద్యోతకమగును. నూతన భవనములలో ఆరు వేర్వేరు పరిశోధన శాఖలు నెలకొల్ప నిశ్చయించబడినవి. (1) X కిరణములు, అయస్కాంతత్వము, (2) తేజశ్శాస్త్రము, (3) సిద్ధాంత భౌతికశాస్త్రం, (4) భౌతిక రసాయనశాస్త్రం, (5) సేంద్రియ రసాయనశాస్త్రం, (6) నిరింద్రియ రసాయన శాస్త్రము. వీటిలో ప్రతి పరిశోధనశాఖ ఒక ఆచార్యుని అధ్వర్యమున నుండును. వారి పర్యవేక్షణక్రింద వేర్వేరు రంగాలలో సాగించు పరిశోధకులు-భిన్న తరహాలవారు- పెక్కు రుందురు. వీరిందరికీ జాధవపురంలో పరిశోధనాగార మున్న స్థానమందే వసతి గృహాలు ఏర్పాటు చేయబడనున్నవి. (సమాప్తము)

శుభ్రమైన చలువ....



# ఉరుము చెప్పినది-

'వైరాగి'

చెమర్చిన మొగాలపైన కాగడాల రక్తకాంతి.
 ఉద్యానవనాల్లోని హైమావత ప్రశాంతి.
శిలా ప్రాంతాల యమయాతన,
అరుపులు, కేకలు, అరణ్యరోదన.
చెరసాల, రాచనగరి, ప్రతిధ్వని.
కుమార శైలశ్రేణిపై ప్రథమ మేఘ గర్జన.
బ్రతికి ఉన్నా నా డాక్టరు చనిపోయాడు.
బ్రతికి ఉన్నవాళ్ళం మనం చనిపోతున్నాం
కొంచెం ఓరిమితో.

ఇక్కడ త్రాగేందుకు నీళ్ళేవి? బండరాళ్ళు.
కటికరాళ్ళు. నీరెక్కడ? ఇసుకత్రోవ.
పర్వతాలపై చుట్టుక పోకే త్రోవ.
కుప్ప, ముప్పుడ శిలాసంకట శైలశ్రేణి.
నీరుంటే నేన తీరేవాళ్ళం త్రాగి.
బండలపై ఆలోచించటు మొగా అగి?
కడిమాడిన చెమట. ఇసుకలో మాడుకపోయే
[రాళ్ళు.
నీరుంటేనా? అవును! బండరాళ్ళు.
ఉమ్ము లేని పిప్పిపన్నుల గిరిముఖ సహ్యాగమ్యాన
[ము.
హర్మ్యసేందుకు అగ విక్రమించేందు కెక్కడ
[న్యాయమ్?
పర్వతాలలో ప్రశాంతం కూడ లేదు.
పొడుమ్మ విఫలవంధ్య మేఘగర్జన. వర్షపు
[కూడ లేదు.
కొండలలో ఏకాంతం కూడ లేదు.
పగిలి నెగిలిన మట్టియిళ్ళ బొరియల్లోంచి.
కరువబోతయ్ శోషంతో ఎర్రమూతులు వెక్కి
[రించి.
ఈ బండరాళ్ళ కాక నీళ్ళుంటే
ఈ బండరాళ్ళున్నా నీళ్ళుంటే

 నీరు! నీరు!
 ఒక నెలమేరు!

 రాళ్ళ మధ్య
 చిన్న దొరువు!

జల జల జల నీరుపారే శబ్దమున్నా
ఎండుగడ్డి చప్పుడు కీటక క్రేంకారం కాక
రాళ్ళమధ్య నీరుజారే శబ్దమున్నా
దేవదారు చెట్లమధ్య నీటిపక్షుల
కుహూ, కుహూ, కుహూ, కుహూ, కూజితా
[లున్నా
బావుందేది?
కాని ఎక్కడ? నీ వెక్కడ?
నీప్రక్క నడుస్తూ వెళ్ళిపోయాడు. ఎవ్వడా మాడో
[వాడు?
నీవు నేను మాత్రమున్నాం నే లెక్క వేసినపుడు
కాని శ్వేతమార్గంమీద ముందుకు చూసినపుడు
నీప్రక్క నడుస్తూంటూ వెళ్ళిపోయాడు ఇంకొకడు
ఊదారంగు దుప్పటిలో ముసుగు వేసుక
[పోకుతూ
ఆడవో, మగవాడో తెలియదు కాని
ఎవరది నీ కవలి ప్రక్కన?

ఎత్తుగా గాలిలో ఏమిటా మహాశబ్దం?
మాతృగర్భ శోకాల కలవరం
ఎవ్వరా ముసుగు పోతులు గుంపులు గుంపులుగా
అంతులేని మైదానాల్లో.
పరితప్త క్షితిజమాత్ర పరివేష్టిత
విదీర్ణ పథుభావక్షుం పైపడి లేస్తూపోతున్నారు?
ఏమిటా మహానగరం కొండలపైన?
పగుళ్ళు, మరమ్మతులు.
ఊదా వాయువులో విస్ఫోటాలు.
పతనోన్ముఖ గోపురాలు
జెరూసలేం, ఏథెన్సు, అలెగ్జాండ్రియా
వియెన్నా, లండన్.
మిథ్య.
ఒక స్త్రీ తన సుదీర్ఘశ్యామల కేశాలు గట్టిగా
[లాగిపట్టి

ఆ తంత్రులపై రహస్య సంగీతం పలికించింది.
నీలి వెలుగులో పసిపాపల ముఖాల గబ్బిలాలు
ఈలవేసి రెక్క లల్లార్చినవి.
తల్లక్రిందులుగా క్రిందకు ప్రాకినాయి నల్లని
[గోడలపై.
గాలిలో తల్లక్రిందు లైనాయి శిఖరాలు,
కాలాన్ని సూచించిన జ్ఞాపకాల గంటలు
[మోగిస్తూ
ఖాళీ తొట్లలోంచి, ఎండిన బావుల్లోంచి
పాడినాయి కంఠాలు.

కొండలమధ్య ఈ మరుభూమిలోన
పేలవెన్నెల, పాడుతున్న గడ్డిదుబ్బులు
శిథిల సమాధులమీద గుడిదగ్గర
అక్కడ ఒక పాడుబడిన గుడి ఉన్నది.
గాలిమాత్రం నివసిస్తున్నది.
ఆ గుడికి కిటికీల్లేవు. తలుపులు ఊగుతున్నవి.
ఎండుటెముక లెవరి నేమీ చేయలేవు.
కప్పు మూలదూలంపైన
ఒక పుంజుమాత్రం ఒంటిగా నిలుచున్నది.
'కొక్కొరకో' 'కొక్కొరకో'
మెరుపుల కాంతిలోన. అప్పు డొక తేమగాలి
తెచ్చింది వర్షాన్ని.
లోతుకుపోయినది గంగ. వాడు టాకులు
వేచియున్నవి వర్షంకొరకు. ఈ లోపున
సుదూర హిమవత్పర్వతంపైన
కారుమబ్బుల మేఘాలు క్రోడైనవి.
మహావనం పొంచియున్నది నిశ్శబ్దపు చీకటున.
అప్పుడే పలికింది ఉరుము,
ద.

దత్తా. ఏమిచ్చాం మనం!
నేస్తం! నా హృదయరక్త సంచలనం.
ఒక్క క్షణపు ఆత్మార్పణలోనున్న సాహసాన్ని
ఒక యుగపు వివేకమైనా మరలించ లేదయ్యా!
దీనివలన, దీనివల్లనే బ్రతికాం మనం.
కాని ఇది మన మృత్యుగాథల్లో
మేలుచేసే సాలీడు అలంకరించిన జ్ఞాపకాల్లో
మన ఖాళీగదుల్లో బక్కపలచటి న్యాయవాది
ముద్రలగొట్టే సీళ్ళలో పొందబడదు.
ద.
దయాధ్వం. ఒక్కసారి విన్నాను నేను, తాళంచెవి
తాళంలో తిరగటం, ఒక్కసారే.
అందరం తాళం చెవినిగురించి ఆలోచిస్తాం,
ఒక్కొక్కడూ తన చెరలో.
నిర్ధారణ చేస్తాడు ఆలోచనద్వారానే
ఒక్కొక్కడూ ఒక్క చెరను.
రాత్రిపూట మాత్రమే గాలిలోని గుసగుసలు
ఒక్కక్షణం మేల్కొల్పుతాయి భగ్నకోరి
[యోలెనస్‌ను.

ద.
దమయతా!
తెరచాపల, తెడ్డుపనిగతి తెలిసిన హస్తాలు
చెప్పినమాట వింటున్నది పడవ సంతోషంగా.
ప్రశాంత సముద్రంలో ఆహ్వాన మందినపుడు
నీ హృదయంకూడా సంతోషంగా
చెప్పినమాట వినేదిగదా! అదుపుగల
చేతులకు ఆజ్ఞానువర్తినిగా స్పందిస్తూ.
ఒడ్డున కూర్చున్నాను చేపలు పట్టుకొంటూ,
నా వెనుక ఎండినమైదానం.
ఇంక నా దేశాలను చక్కదిద్దుకోనేదా?
లండన్ వంతెన పడిపోతోంది! పడిపోతోంది!
[పడిపోతోంది!
ఈ తునకలు దరిజేర్చా నా ధ్వంసంతో పోరి.
ఇంకేం నేను నీకు చరిస్తా! మళ్ళా పిచ్చెత్తిందట
[హీరోని మోకి.
దత్తా! దయాధ్వం! దమయతా!

శాంతిః శాంతిః శాంతిః

(టి. యస్. ఎలియట్ వ్రాసిన 'వేస్ట్ లాండ్' చివరి భాగానికి అనువాదం)

10:సం॥ ల గ్యారంటీ
త్రిష్మా
గోల్డుకవరింగ్ ఆభరణములు ఉపయోగించండి.
ఉమాగోల్డుకవరింగ్ వర్క్సు
మచిలీపట్నం

నుండి పోయాను. మీకు నా పై.....వున్న దేమో! మరి నాడు రేయి నన్ను కారాగృహంలో బంధించుట కాజ్ఞనిచ్చి మీరు వెళ్ళినది మరువ లేదుకదా! మీరా రేయి యథాప్రకారముగ, నిశ్చింతగా సుఖనిద్రను పొందగలిగారా? మీ హృదయ సంక్షోభమును మీరు మరువగలరా రాజకుమారీ?"

"ఇవంతా నీవెలా గ్రహించగలిగావు కవీ!"

"కవితాహృదయంవల్ల రాజకుమారీ! అదంతా కవిత్వానుభవం...అదే తన వేదనను దూర దూరానికి వాయుమండలంలో వ్యాపింపజేసి మూలమూలలనుండి ప్రతిధ్వనింపజేస్తుంది. దీనిని మీరుకూడ అనుభవించి కవి ఆత్మానుభూతితో అనుసంధాన మొందాలి."

నీరజ అతడు చెప్పినదంతా గ్రహించింది. ఇదంతా సత్యమేనా?

ఆమె అడిగింది—'కారాగృహంలో నీవా రాత్రి ఎలా గడిపినావు ఆనంద్!"

"నేను చెప్ప నవసరమే లేదు. జవాబు మీకే తెలిసి వుంటుంది...ఏవస్తువునైనా చూడకున్నా గ్రహించ గలిగితే, ఆ గ్రహించడంలోనే ఆనందభూతుల నొందుతాను. మీరింకా నవయువ తులు..."

బొమముడి పాటుతో నీరజ—"నీ యీ మాటల కర్థమేమిటి ఆనంద్? నీ పరిమితిని రొంముకు దాటి వెళ్తున్నావు?

"నేను జంకుట లేదు నీరజాదేవీ! చెప్పవల సినదాన్ని చెప్పితీరుతాను...మీరు గురుముఖాన సైతం నేర్పులోలేని విషయాలను కవి దగ్గర నేర్చుకో గలరని తెలుసుకోలేదేమో... కవి జగద్గురువు దేవీ! ఆతడు జీవితాంతంవరకూ తన స్వార్థాన్ని ఆ తపః ఫలాన్నంతా హోమం చేసిన వాడు. అత డొకరికి లొంగి చెందక వుంటాడు. అతని పేరనా గీతికలను మీ రింతవరకూ విన లేదా?"

"ఈ మాటల్ని యెవరైనా వింటే ఏమను కుంటారు, ఆనంద్?"

"ఏమనుకొంటారు! ఉన్న దాన్నంతా అంద రికీ తెలియజేస్తాను. నా దగ్గర రహస్యాలేమీ లేవు."

నీరజ మౌనందాల్చింది.

ఆనందుడు లేచి నిలబడినాడు. ఒక నిశ్వా సంతో యిలా అన్నాడు-"నే నిక వెళ్ళిపోవాలి దేవీ! సమయం సమీపిస్తున్నది. అతిథిగృహంలో ఈ ఉత్తమ భోజనాలను భుజించడం గౌరవ ప్రదంకాదు."

నీరజ అతనివెంట నడుస్తూ—"నన్ను కవ యిత్రిగా చేస్తానని చెప్పావుకదా! అయితే ఓడిపోయావన్న మాట?"

'ఇప్పుడా విషయ మెందుకూ!"

నీరజ లజ్జాభరిత అయింది.

"అపురూపము, ఇవన్నీ స్వాభావికమే... ఈ అనురాగం ప్రతిజీవికీ సహజమే నీరజకుమారీ!" అన్నాడు ఆనందుడు.

నీరజ కుమారి అంతిపురానికి వెళుతూ తనలో అనుకున్నది-"నీవు వెళ్ళలేవు కవీ! నా ఆజ్ఞను జవదాటితే వంటే..."

తన వాక్యాన్ని అసంపూర్ణముగానే విడిచి అతనిపై దృష్టి నిగుడిస్తూ శుద్ధాంతం చేరింది నీరజ.

ఆనందుడు అతిథి మందిరంలో కవితను పాడడం ప్రారంభించినాడు.

చీకటి నలుదిక్కులా వ్యాపించింది. వనవాటి కలో ఒక అపూర్వ శిలపై ఆనందు డాసీనుడై ఉన్నాడు. స్వగృహం మరలుటకై ఆలో చిస్తున్నాడు. శిలకు సమీపంగా కుసుమగణాలు కమ్మతావులను ఘుమ్మని వెదజల్లుతూవున్నాయి.

కొలువున నాడినది మొదలు ఆనందుని రాజా మళ్లీ కలుసుకొనుటకు వలనుపడలేదు. నేడు యెకాయెకిని ఆనందుని చూచుటకు అతిథి గృహానికై పయనమైనాడు. అతిథి గృహ మందు ఆనందుడు లేకపోవడం చూసి వనాంతం ప్రవేశించాడు. అంధకారంలో ఆనందుని సమీ పించినాడు. ఆనందుడు పరధ్యానముగా ఉండ డం గమనించి అక్కడనే నిలబడినాడు. ఆనం దుడు వెనుతిరిగియైనా చూడలేదు. కొన్ని క్షణా లకు ఆనందుని భుజంపై రాజా హస్తం వ్రాలింది. హస్త స్పర్శను అనుభవించినా ఆనందుడు వెను దిరుగక యిట్లన్నాడు-"ఎందుకూ నిలబడినారు? ఇలా కూర్చోండి...ఈకారు చీకటిలో వచ్చు టకు మీకు భయం లేదా!"

అతడు నీరజ వచ్చినదని భావించినాడు.

"భయమా? భయ మెట్లాంటిదో మీకు తెలియందా కవీ? ...మీ కేదైనా వినిపిస్తారని బయలుదేరాను. మీ కవితను వినిపిస్తారూ?"

ఆనందుడు ఉత్తలపాటొందినాడు. లేచినిల బడి నమ్రతతో అన్నాడు-"మీ ఆజ్ఞలన్నింటినీ శిరసా వహిస్తాను ప్రభూ! ఇంతదూర మెందుకు వచ్చారు? మీవద్దకే నన్ను రమ్మనిన వచ్చి యుందునే?"

"నే నీసమయంలో రాజును కాను కవీ. నే నొక సాహిత్య ప్రియుడను. సరస్వతీ వరపుత్రుని ఆజ్ఞానువర్తిని. నీవు నాకంటె మహానుభావుడవు."

"అదేలా ప్రభూ?"

"ఆనంద్! కవి నిజంగా ప్రతి జీవి హృదయానికీ సమ్రాట్టు. నేను యెవ్వరి హృదయాన్నీ మారగొనలేక పోతూను ... బలపూర్వకముగా శాసించడం హింసా శాస్త్రం కదూ!"

"ఇది నిజమేనా!"

"అవును ఆనంద్. నేను కొద్ది రోజులుగా యిలాగే భావిస్తున్నాను. కొలువులో నాడు నీ వన్నదంతా సత్యం. దాని కనుకూలంగా నే నాచరిస్తాను కవీ! కవియొక్క ఆత్మ స్వచ్ఛంద మైనది. నా కెంత ఐశ్వర్యమున్నా, నే నన్ని వైభవాలతో తులతూగినా అంతా అన్నీ నిష్ప్రయోజనం."

రాజు పలుకులకు ఆనందుడు నివ్వెరపడినాడు.

రాజు యింకా అన్నాడు-"వీనుల విందుగా వినిపించు కవీ! నీ వాణిని నే నుపాసిస్తాను...నీవు మాతోనే వుండగలవా ఆనంద్?"

మందమరుత్తరంగం ఒకటి ఒక మూల నుండి మరొక మూలకు దూసుకొని పోయింది. తరు పత్రములు గలగల మన్నాయి.

"నీతో ఎన్నో విషయాల గూర్చి ముచ్చటింప కుతూహలంగా ఉంది, ఆనంద్. కాని వాటి కంతమే కనబడదు. ఇక నీ కవితను వినిపించగలవా?"

ఆనందుడు తన కవిత నాలపించినాడు. కొంత సేపటికి అకస్మాత్తుగా అవ్యక్త ఛాయ ఒక్కటి రాజు దృష్టి నాకర్షించింది.

"ఎవ రక్కడ?"- రాజు అన్నాడు.

ఛాయ మరలింది. గుబురు పొదరింట్లో పొంచింది.

ఆనందునికి తెలుసు ఆ ఛాయ యెవరిదైనదీ. నీరజ గాఢాంధకారంలో కూడా రాగలదు. అత డిట్లన్నాడు "ఎవరైన నేమి ప్రభూ? మీరు ప్రజా వందితులుగదా! మీపై క్రోధ మెవ్వరికుంటుంది?"

రాజు మౌనం దాల్చినాడు.

ఆనందుడు తన్మయత్వంతో స్నిగ్ధ కంఠమున కవితను వినిపించినాడు. దానినంతా పొదరిల్లు చాటున వున్న ఛాయ నిమీలిత నేత్రాలతో విన్నది. సమ్రాట్టు మంత్రముగ్ధుడైనాడు. ఛాయ తన్నుతా మరచింది.

పొంగిన ఆనందంతో రాజు-"నీ విక పోలేవు కవీ! నీ విచ్చటనే ఉండిపోవాలి. ఇది మా ఆజ్ఞ కాదు. వందనపూర్వక ప్రార్థన. మా ప్రార్థనను చెల్లింతువా కవీ?"

"ఆలోచిస్తాను ప్రభూ."

ఛాయ తన మనస్సులోనే యిలా అనుకొన్నది—"ఆలోచన యెందుకూ? నిన్ను నేను బంధిస్తాను కవీ! నీవు సదా నాతోనే వుండాలి. నన్ను విడిచి నీ వెక్కడికీ వెళ్ళలేవు ఆనంద్! నీ కవిత నా కెంతో హాయి నిస్తుంది!"

ఆనందుని కీమాటలు వినబడలేదు. కాని మాటిమాటికి ఆమె రాకకు గల కారణం గుర్తింపలేకపోలేదు.

రాజు వెళ్ళినాడు. ఛాయ అదనికిముందే మరలింది.

ఆనందుడు రాత్రంతా ఆలోచింప సాగినాడు.

నీరజ అంతఃపురంలో నిమీలిత నేత్రాలతో ఆనందుని గీతికలను పాడుకుంటూ వుంది. రాజు అకస్మాత్తుగా ఆమెను సమీపించినాడు. తండ్రి ఆగమనాన్ని ఆమె గుర్తింపనే లేదు. అతను కూడ ఆమెకు తెలియకుండానే గానాన్ని వింటున్నాడు. [illegible] శ్రావ్యగీతికలను కొన్నిటిని విన్న తరువాత నీరజను ఆమె స్వప్నాల నుండి మేల్కొల్పినాడు.

"ఈ గీతికలను నీ వెక్కడనుండి నేర్చుకున్నావు నీరజా?"

నీరజ తత్తరపాటుతో లేచి నుంచుంది. ఆమె [illegible] వోలె వణకిపోయింది.

[illegible] భయమే [illegible] డి నుండి నేర్చుకున్నావు [illegible] గీతికలను?"

"ఆనందుని చే వ్రాయించుకొన్న గీతికలివి, [illegible]......

"అతనిని కలుసుకొంటున్నావా ?"

నీరజ అవు ననలేక పోయినది.

"చెప్పమ్మా!"

"నే నానందుని కలుసుకొన్నాను నాన్నా"— ఆమె అరుణ కపోలాలపై స్వేదబిందులు కూడినాయి. సిగ్గుతో ఆమె తల వంచింది.

"ఎందుకు? సాహిత్యాన్ని వినుటకా తల్లీ?"

"అవును నాన్నా."

"మరి నీవు కవులను ఉన్మాదులుగా పరిగణించేదానివే! వారిని యేవగించుకొనుచుంటివే?"

"అది నామూర్ఖత తండ్రీ! కవుల నిప్పుడే గ్రహించాను."

"కవిత నల్లటం నేర్చుకొందువా?"

"నేర్చుకోలేను."

"ఎందుకూ?"

"అంతటి భావనాపటిమ నా కబ్బదు."

"పోనీ వినగలవా?"

"వినగలను"—నీరజ తన చూపులను పూర్తిగా క్రిందికి దించింది.

"కవిని యిక్కడే వుండమని కోరినాను తల్లీ"—అంటూ రాజా చింతా నిమగ్నుడయి కదలినాడు.

ఆతడు అతిథి మందిరం వైపుకు వెళ్ళినాడు. గృహబహిర్ద్వారం వద్దనే ఆనందుని అవలోకించినాడు. ఆనందుని మనస్సు విచారమగ్నమై యుండుటను ప్రస్ఫుటముగా పరికించినాడు. అతని భుజంపై తన హస్తాన్ని వుంచి అతన్ని విచారలోకంనుండి మేల్కొల్పినాడు.

"నీ విక వెళ్ళు కవీ! నీ విక బంధవిముక్తుడవు, నిన్ను బంధించి నాదరి నిల్పుకోలేను... స్వేచ్ఛా విహంగాన్ని పంజరంలో వుంచలేము. కాని నీ విప్పుడు వచ్చినా నీకు నా స్వాగతమే, సదా నీ అభిలాషినే"- వేదనా పూర్వకముగ రాజా అన్న మాట లివి.

"నేనూ వెళ్ళుటకు సిద్ధంగానే వున్నాను, ప్రభూ. ఇప్పుడే పయనమౌతాను. రాజకుమారి కొన్ని గీతికలను కోరింది. వాని నామెకిచ్చి వెడతాను. ఆమె నొకసారి కలుసుకోవాలి ప్రభూ."

'నిన్న రేయినుండి నీరజను అస్వస్థతగా వుంది. వైద్యు లామె యొద్దకెవనినీ రానీయుటకు నిరాకరించినారు. ఆమె ఉన్మాదం కవీ—"తన ముఖాన్ని రాజా అటువైపుకు త్రిప్పినాడు. ఆనందుని నిరాశాంకిత దృక్కులను అతడు చూడలేకపోయినాడు.

"మరి నే నామెను చూడలేనా?"

"లేదు కవీ!...ఆమె ఉన్మాదం..."

ఆనందుడు గృహాంతరానికి వెళ్ళి తారచించిన తాటాకులన్నీ మూటగట్టి బయటికి వచ్చినాడు. రాజాకు నమస్కరించి పయనమైనాడు.

ఆనందుడు దృష్టికి దూరమగు వరకూ రాజా అతనిని పరికించినాడు. అతని కనుకొలకుల్లో కన్నీటి బిందువులు కూడినాయి. ఉదయమైనా శయనాగారానికి బరువైన నడకతో మెల్లగా కదలినాడు.

సంధ్యాసమయం ... రాజా మళ్ళీ అంతఃపురాన్ని ప్రవేశించాడు. ఆమె యెక్కడికో వెళ్ళుటకు సిద్ధపడుతూవుంది.

"ఎక్కడికి వెళుతున్నావు నీరజా?"

"కవిని చూడ్డానికి నాన్నా. నేను కవిత్వమల్లుటను నేర్చుకోలేను. నేను కవయిత్రిని కాగలను!"

"కాని అతడు వెళ్ళినాడే?"

"ఎప్పుడూ?"

"నేడే."

"ఎక్కడికి?"

"తెలీదు."

"మరి మీ రుండమన్నారు కదూ?"

"అది నీకోసం మాత్రం. బలప్రయోగం. అతని బంధనాలనుండి విముక్తు గావించాను. కవి జగతి కంకితమైనవాడు నీరజా. అతనిపై మన కధికారం లేదు"

నీరజ స్తబ్ధీభూతురాలయింది.

"దుఃఖాన్ని దిగమ్రింగు నీరజా. అతడు మళ్ళీ రాగలడు"-అంటూ అతిభార హృదయంతో రాజా మెల్లగా వెళ్ళినాడు.

నీరజ తన్నుతానే మరచింది: తన హృదయాన్ని తరచితరచి ప్రశ్నించుకుంది: "ఆనందుడు మళ్ళీ రాగలడా?"...

దారివెంబడి నీరజను విస్మరిస్తూ కవి ఆనందుడు కావ్యాలోలుడై వెళుతున్నాడు.

[సమాప్తం. అనువాదం: ఆర్. సోమసుందరరావు.]




గొప్పవాడు అనబడే వాడెంత గొప్పవాడో, గొప్పవాడి పక్కవాడుకూడా అంత గొప్ప వాడే. ఎవరైనా కాదని వాదిస్తే అసలు గొప్ప వాడికంటే గొప్పవాడి పక్కవాడే గొప్పవాడని బల్లగుద్ది చెప్పి తప్పక ఒప్పించగలను. పక్కవాడు లేని గొప్పవాడు లేడు. ఈ మహాప్రపంచంలో ఏ మూలైనా అలాంటివాడున్నా ఎవరూ ఒప్పు కునేదిలేదు. అథవా ఒప్పుకున్నా ఆ పురుషుడు సజీవంగా లేకపోతేనే. నీడ లేనిమనిషిలా, పక్క వాడు లేని గొప్పవాడంటూ ఎవడూ ఉండబోడని మళ్ళీ మనవి చేస్తున్నాను. ఈ ప్రకటన కొంత మందికి ఆశ్చర్యం కలిగించవచ్చు. కుంచె లేని చిత్రకారుణ్ణి ఊహించుకోండి; కలం లేని కథకుణ్ణి ఊహించుకోండి. అలాగే పక్కవాడు లేని గొప్పవాడు. ప్రతిభని ప్రచారం చేసే సాధనం లేక పోతే ప్రతిభ ఎలా రాణిస్తుంది? గొప్పవాడి గొప్పతనం పక్కవాడికి తెలిసినంతగా ఎవరికీ తెలియదు; ఒకోసారి గొప్పవాడికి కూడా. అవునా, కాన్యూట్ రాజుగారి కథ జ్ఞాపకం తెచ్చుకోండి. కావాలంటే నవీనహిందూదేశ చరిత్రనుంచికూడా ఉదాహరణ లివ్వగలను. ఒక జిల్లాలో ఒక గొప్ప వాడున్నాడు—పేరెందుకు లెండి —నిజంగా గొప్పవాడే. అవునా, అటువంటివాడు జిల్లా బోర్డు ఎన్నికలకి నుంచోవచ్చునా; ఊహుం-నుంచోనంటాడే! "ఇంతమందిలో నా గొప్ప తనమేమిటి, నన్నెవ రెన్నుకుంటారు! నేను నిల బడను," అంటాడు. పక్కవాళ్లు- గొప్పవాడి గొప్పతనాన్నిబట్టి పక్కవాళ్ల సంఖ్యాబలం హెచ్చుతూ ఉంటుంది— ఉన్నారు కాబట్టి, "నువ్వు నిలబడవయ్యా, చాలు! నీ గొప్పతనం నీకు తెలియదుకాని నువ్వు నడుంకట్టావంటే అప జయమనేది లేదనుకో. అసలు నువ్వు ఎన్నికలకి నిలబడితే ఓట్లన్నీ వానకురిసినట్టు కురవ్వూ నీ పెట్టెలో!" అని ఆయన గొప్పతనం ఆయనకు తెలియచేసి ఎన్నికలకి నుంచోపెట్టారు. ఓ పది వేలు పోతేనేంగాక, తక్కినది ఆయన జిల్లాబోర్డు ప్రెసిడెంటుగా ఎన్నికోబడ్డాడు. చూశారా మరి, ఇలాంటి ఉదాహరణలు లక్షోపలక్షలు.

గొప్పవాడి పక్కవాడు హిజ్ మాస్టర్స్ వాయిస్; అంతేకాదు ఉస్‌కే, తన్, మన్, ధన్ జోర్ ప్రాణ్. కుర్బాను చెయ్యగలడు.

ఏ గొప్పవాడూ తనని గురించి తాను గొప్పగా చెప్పుకోడు. చెప్పుకోటం ఇష్టం ఉండ దనికాదు. అలా చెప్పుకుంటే ఏటవాలు బల్ల మీదనుంచి జారినట్టుగా పీఠంమీద నుంచి జారి పోవలసి వస్తుంది. అంచేత పక్కవాడు గొప్ప వాడి తరఫున వకాల్తా పుచ్చుకుని, గొప్పవాడి సొంత స్వరం కంటె పదిరెట్లు ఉచ్చైస్స్వరంతో అతని కంఠం కోరిక తీరుస్తాడు. "గొప్పవాడికి సొంతడబ్బా గిట్టదు. అంటే తన డబ్బా తనే వాయించుకునేటంత స్వార్థపరుడు కాడు. వాయించే వాళ్లుంటే తన డబ్బాని వాళ్లకి వప్పచెప్పగల విశాలహృదయుడు." అని చెప్పకనే చెబుతూ గొప్పవాడి కంఠానికి ప్రాతినిధ్యం వహిస్తాడు.

అసలు కొన్ని సమయాల్లో పక్కవాడే గొప్పవాడి "వాయిస్." గొప్పవాడికి ఎన్నో

పనులుంటాయి. ప్రతి పనికీ స్వయంగా హాజరు కావటం కష్టం. బీదవాళ్ళకి స్కాలర్ షిప్పులూ, కొద్దిగా దూరపు బంధువులకీ, స్నేహితులకీ, స్నేహితుల స్నేహితులకీ, వాళ్ళ బంధువులకీ, స్వజాతి వాళ్ళకీ, స్వస్థలవాసులకీ నెరవేర్చాలిసిన సిఫారసులు లాంటివి ఉంటాయనుకోండి. ఇవన్నీ పక్కవాడు చూసుకుంటాడు. ఎవరితో సిఫారసు చేయాలో ఆ ఉద్యోగి దగ్గరికి పక్కవాడు సిఫారసు చేయబడేవాళ్ళతో సహా వెళ్ళి, "అయ్యా, నేను ఫలానా గొప్పవాడి దగ్గర్నుంచి వొచ్చాను. ఈ పనేదో కాస్త చేసిపెట్టండి" అంటాడు. ఆ ఉద్యోగి కాస్త తటపటాయించాడా, పక్కవాడు ఆగ్రహావేశ పరవశుడై, "ఏమండోయ్, గొప్పవాడు చెప్పలేదనుకుంటున్నారేమో, గొప్పవాడి మాటా, నామాటా ఒక్కటే. ఆ మాట కొస్తే గొప్పవాడే నేను, నేనే గొప్పవాడు. నేను చెప్పిన ప్రతి అక్షరం గొప్పవాడు చెప్పినట్టే, గమనించారా? తర్వాత మీ ఇష్టం" అని బెదిరించి కోపంతో వెళ్ళిపోతున్నట్టు నటిస్తాడు. ఉద్యోగంమీద ఆశ వున్న ఉద్యోగి వెంటనే పక్కవాడి కోపోపశమనం చేయాలిసిందే.

"[illegible] మాస్టర్స్ వాయిస్" అనే బిరుదుప్రదానం చేస్తే మీలో ఏ ఒక్కరికీ కష్టంగా ఉండదని నా నమ్మకం.

ఈ రోజుల్లో ప్రతిరోజూ ఎక్కడో ఒక చోట విందు జరుగుతూనే ఉంటుంది — అకారణంగానే. (పేదవాళ్ళ కనుకనేరు! ఉన్నవాళ్ళకే. నిండువాళ్ళకి విందులు చేస్తే ఏమొస్తుంది?) పనా విందు చేయటం ప్రధానంగాని అందుకు కారణం ఉండటం ప్రధానం కాదు. గొప్పవాడికి రాని ఆహ్వానమంటూ ఉండదుగా. ప్రతి విందుకీ వెళ్ళటం గొప్పవాడికి అనవసర శ్రమ, అది కాక శరీరం మొరాయించటం కూడా కద్దు. ఇలాంటి సమయాల్లో పక్కవాడు గొప్పవాణ్ణి కనికరిస్తాడు. "గొప్పవాడికి తీరిక లేకపోయిందండీ. నన్నే తనని భావించుకోమన్నారు మమ్మల్ని" అని విందు తలపెట్టినాయనతో ముచ్చటగా అనేసి పక్కవాడు గొప్పవాడి శరీరానికి ప్రాతినిధ్యం వహిస్తాడు. ఇందుకు, విందుకు పిలిచిన పెద్దమనిషి నిరభ్యంతరంగా ఒప్పుకుంటాడు. ఎందు కొప్పుకోడు? పక్కవాడి ప్రభావం అయనకి తెలియదు గనకనా? పని గడిస్తే సరి, ఎవరయితేనేం?

గొప్పవాడు అతిగామాట్లాడడు. ఈ నియమం అతను విధిగా అమల్లో పెడతాడు. ఎంచేతంటారా? అతిగా మాట్లాడటం అనేక విధాల అరిష్టదాయకం. మనిషి శరీరంలో మాట్లాడటానికి అమర్చబడ్డ అవయవాలు బహు ప్రమాదకరమైనవి. వాటిని అదుపులో పెట్టుకోకపోతే అవి భస్మాసుర హస్తాల్లా పరిణమించగలవు. అసలు గొప్పవాడికి అతిగా మాట్లాడటానికి తీరిక, ఓపిక కూడా ఉండవు. అతని నోటినుంచి వొచ్చే ప్రతి మాటా ఎంతో విలువైంది. ఆ మాటల్లోని గొప్పతనం, వాటిలోని అంతరార్థం, భావ గాంభీర్యం ప్రతివాడికీ అర్థమయ్యేలా విప్పి చెప్పటం వాటిని వ్యాఖ్యానించటం గొప్పవాడి పక్కవాడి పని. పక్కవాడు ఎంతగొప్పవాడైతే గొప్పవాడి మాటలు అంత గొప్పగా మనకి అర్థమవుతాయి. పక్కవాడికి గొప్పవాడి మనస్సు కరతలామలకం. అందుచే గొప్పవాడి మాటల వెనకాల ఉండే గొప్పతనాన్ని మనకి విశదీకరించటంలో పక్కవాడి సహాయం మనకి అత్యవసరం. ఒక చిన్నసంఘటన జ్ఞాపకం వస్తోంది.

ఓసభలో ఉపన్యసిస్తూ ఒకానొక గొప్పవాడు ఇలా అన్నాడు: "నా అమూల్యమైన అభిప్రాయంలో..." "కొయ్య" అని వెనకాల కూర్చున్న ఓ కొంటె కుర్రాడు హెచ్చు స్థాయిలో అన్నాడు. "షెఫ్డ్" అని మరో విద్యార్థి అందుకున్నాడు. సభలో కలకలం బయలుదేరింది. గొప్పవాడి రుమాలు చెమటని అరికట్టటానికి ప్రయత్నించి దానికి లొంగిపోయింది. ఇంతలో గొప్పవాడి పక్కవాడు లేచి మేఘగంభీర స్వరంతో ఇలా అన్నాడు: "ఓ సభాసదులారా! మీరంతా మన గొప్పవాణ్ణి అర్థం చేసుకోలేక అలజడి ప్రారంభిస్తున్నారు. 'అమూల్యమైన అభిప్రాయం' అనే మాటల్ని మీరు అపార్థం చేసుకున్నారని నాకు తెలుస్తోంది. 'అమూల్యమైన' అనటంలో గొప్పవాడి అభిప్రాయం మీకు విశదపరుస్తున్నాను. అమూల్యము అంటే మూల్యం లేనిది. అంటే విలువ లేనిది. 'నా అభిప్రాయానికి విలువ లేదు' అని అతను వినయంగా మనవి చేశాడు. ఇది

అతని నిరాడంబరత్వానికి, వినయ విధేయతలకి తార్కాణం. 'అమూల్యమైన' అనటంలో గొప్ప వాడు ఇంకో అభిప్రాయాన్ని కూడా వ్యక్తపరిచాడు. మూల్యం లేకుండా అంటే ఉచితంగా నా అభిప్రాయాన్ని మీకు చెబుతున్నాను అని. ఇది అతని పరోపకార పారీణతకి అద్భుతమైన నిదర్శనం. ఇది మీరు గ్రహించకుండా, గొప్పవాడిని ప్రశంసించక, అభిశంసించటం మన మూర్ఖత్వాన్ని తెలియచేస్తుంది. గొప్పవాడిని హేళన చెయ్యటానికి సాహసించేటందుకు మనం ముందువెనుకలు బాగా ఆలోచించాలి."

సభలో వాళ్ళంతా తెల్ల మొహాలు వేశారు. గొప్పవాడు చిరునవ్వుతో పక్కవాడివైపు కృతజ్ఞతతో చూశాడు. పక్కవాడికి గొప్పవాడి ఊహాలు బాగా తెలుస్తాయి కనుక అతని తరఫున వకాల్తా వెంటనే పుచ్చుకోగలిగాడు. ఆ క్షణంలో పక్కవాడు ఉండబట్టి సరిపోయింది గాని లేకపోతే గొప్పవానికి ఎంత పరాభవం జరిగేది! గొప్పవాడు సర్వసాధారణంగా ఇలా సమాధానం చెప్పలేడా ఏమిటి? అని మీరు అనొచ్చు. గొప్పవాడికి మనసులో ఉంటే ఉండుగాక, వెంటనే అది నాలుకమీదికి రావొద్దూ? అది గాక గాభరాలో అసలు పని ఉద్దేశాలు మర్చి పోకూడదని ఎక్కడుంది?

గొప్పవాడి బుర్రెప్పుడూ పక్కవాడి చేతిలోనే ఉంటుంది. పక్కవాడిని కాస్త నిర్లక్ష్యంగా చూడటం సాగించాడంటే గొప్పవాడు చప్పున తలకిందులు కావలసిందే. పక్కవాడన బడేవాడు గొప్ప సమర్థుడని ముందే చెప్పాను. నిర్లక్ష్యంగా చూడబడ్డ పక్కవాడు గొప్పవాడి పతనం ఒక్క చిరునవ్వుతో సాధించ గలడు. ఓ నలుగురు పెద్దమనుష్యులు చేరి ఫలానా గొప్ప వాణ్ణి జరగబోయే మీటింగుకి అధ్యక్షుణ్ణిగా ఎన్నుకుందామని నిశ్చయించుకుంటూ ఉన్నారనుకోండి. పక్కవాడికీ సంగతి ముందే తెలుస్తుంది. ఎలా అంటారా? పక్కవాడి ప్రతిభ అటువంటిది. ఇంతకంటె నేనేం చెప్పగలను? ఆ పెద్దమనుష్యుల దగ్గిరికి వెళ్ళి పక్కవాడు ఏమీ తెలియ



జెమినీవారి తమిళచిత్రం "అపూర్వ సహోదరులు"లో ఒక సన్నివేశం.

నట్టుగా "మీటింగుకి అధ్యక్షు డెవరు?" అని అడుగుతాడు. సమాధానం విని ఒక చిన్న నవ్వు ఒలికిస్తాడు. వాళ్లు వింతగా చూస్తారు. "హాం... వాడా!" అని పక్కవాడు నవ్వుకుంటాడు. "ఏం?" అని ఆ పెద్దమనుష్యులు అడగటం సహజమే. పక్కవాడు యిచ్చే సమాధానం నవ్వే. అది చాలు. అసలు నవ్వు చేసే పని ఈ ప్రపంచంలో మరోటి చెయ్యలేదు. నవ్వు మాహాత్మ్యం తెలియని దెవరికి? ఒకవేళ నవ్వుతో పని అంత సానుకూలం కాకపోయినా పక్కవాడికి విజయం సాధించటానికి మిగతా సాధనలు ఉండనే ఉన్నాయి.

గొప్పవాడు కాస్త లోకువగా ఉంటే అతని రాజ్యమంతా పక్కవాడే ఏలుతాడు. ఓ గొప్పవాడు అధికారంలోకి వొచ్చాడనుకోండి. అతని పక్కవాడుకూడా అధికారంలోకి వొచ్చాడన్న మాటే. గొప్పవాడు కాస్త బద్ధకస్తుడైతే, లేక మొహమాటస్థుడైతే పక్కవాడి ఛాకకి ఎదురు లేదు. అతడి ప్రతిభ అప్రతిహతంగా వెలిగిపోతుంది. గొప్పవాడి అనుగ్రహం పొందాలంటే ముందు పక్కవాడి సమ్మతి పొందాలి. పక్కవాడికి ఆగ్రహం కలిగితే అభ్యర్థులకి శనిగ్రహం పట్టినట్టే భావించుకోవొచ్చు. పక్కవాడి కొన్ని చర్యల వల్ల గొప్పవాడి అధికారం పోవటం సంభవిస్తే అది గొప్పవాడి దురదృష్టం. కొందరి కుట్రలవల్ల అలాజరిగిందని పక్కవాడుతప్పక గ్రహించగలడు.

పక్కవాడు గొప్పవాడికి తరగని ధనం లాంటి వాడని అంటే అతిశయోక్తి ఎంత మాత్రం కాదు. ధనంసాధించ లేనిపనులు కూడా పక్కవాడు సాధించగలడు. ఇంత చెప్పిన మీదటగొప్పవాడి ప్రాణం పక్కవాడేనని మీరీపాటికి గ్రహించే ఉంటారు—ప్రాణమేమిటి, మానంకూడా.

గొప్పవాడికి ఇంతటి ప్రయోజన కారకుడయిన పక్కవాడిని తగురీతిగా ప్రశంసించటానికి మన తెలుగు భాషలో సాటి పదాలు దొరకటంలేదు. సూదనిరేడియోలా, తవ్వని ఖనిజంలా, పాతిపెట్టిన ధనంలా పక్కవాడు లేని గొప్పవాడి గొప్పతనం నిరర్థకం, అది అడవిని కాచిన వెన్నెల, పక్కవాయిద్యాలు లేని గాత్రం ఎంత గొప్పదైతేమటుకు ఏం రాణిస్తుంది?

గొప్పవా డనబడేవాడు ఎంత గొప్పవాడో గొప్పవాడి పక్కవాడుకూడా అంతగొప్పవాడే నని, లేక అంతకుమించిన గొప్పవాడేనని బుజువైంది. 'గొప్పవాడి పక్కవాడు కావటం మూలంగా గొప్పవాడైన ఆ పక్కవాడికి పక్కవాళ్లు ఉన్నట్టేనా'' అని తర్కం తెలిసిన కొందరు తమ సందేహం వ్యాఖ్యానంలో వెలిబుచ్చవచ్చు. ఆ, ఉన్నారు అన్న మాటే, పక్కవాడై గొప్పవాడైన ఆ పక్కవాడికి, వాడి పక్కవాడికీ, మళ్లీ ఆ పక్కవాడికీ—ఇలా. మరి లేకపోతే ప్రపంచంలో ఇంతమంది గొప్పవాళ్ళు ఎలా ప్రచారంలోకి వొచ్చారనుకుంటున్నారు! ఇదో రహస్యం చెబుతున్నా మీకు. పక్కవాడంటూ ఉంటే ప్రతివాడూ గొప్పవాడే. పక్కవాడు లేక పోబట్టి గాని—మనలో మాట నేను మాత్రం గొప్పవాణ్ణి కానూ? ఆ మాటకొస్తే మీలో గొప్పవాడు కాని వాడెవడు? కాని మనందరికీ కనీసం తలో పక్కవాడూ లభిస్తేగాని మన గొప్పతనం ఎవడూ ఒప్పుకోడు.

అందుకని గొప్పవాడికి ఎన్ని సన్మానాలు చేస్తారో పక్కవాడికికూడా అన్ని సన్మానాలు, అంతఘనంగానూ చెయ్యాలని నావాదం. పక్కవాడి ప్రతిభ బహుముఖమని మనవిచేశాను. ఈ పక్కవాడే లేకపోతే గొప్పవాడికి పుట్టగతు ల్లేవు. గొప్పవాడి పక్కవాడు పుత్ర, పౌత్ర, ఐశ్వర్యాభివృద్ధులతో ప్రవర్ధిల్లు గాక

(ఓ గొప్పవాడి పక్కవాడి సన్మాన సభలో చదివిన ప్రసంగవ్యాసం.)






(గతసంచిక తరువాయి)

నరసానాయకుడు విజయనగరమునుండి దండుతో గూడ తరలెను. మొదట తూర్పు ముఖముగ బ్రయాణముచేసి పూర్వ సముద్ర తీరమునకు బోయి యచట శత్రువు నోడించెను. ఆ శత్రు వెవ్వడో యిచటను జెప్పలేను. గజపతి ప్రతాపరుద్రుడై యుండవచ్చును. దక్షిణ దిగ్విజయార్థము బయలువెడలి యతడు క్రీ. శ. ౧౫౦౦ సంవత్సరమున కృష్ణాతీరమున విడిసియుండెకదా. ఒకవేళ నతడు తూర్పు తీరమందలి రాయ రాష్ట్రము నాక్రమించుటకు బ్రయత్నముసేయగా నరసానాయకు డతని నెదిర్చి పారద్రోలియుండ వచ్చును. తరువాత దక్షిణముఖముగ దిరిగి తీర ప్రాంతమున గూచివేసిపోయి ద్రావిడ దేశమును బ్రవేశించెను. కావేరీ తటదేశమును జేరువఱకును నతనికి శత్రువు లడ్డపడలేదు; అచట కోనేటి రాజుతో ఘర్షణగలిగి యుద్ధము పొసగినది; నరసానాయకు డతని రణక్షేత్రమున జిదుగబొడిచెను; అత డేలుచుండిన సీమలను జయించి వశపఱచుకొని విశ్వాసపాత్రులగు ననుచరులను పాలకులుగ నియమించి కావేరిని దాటెను. అచట రాజ్యముసేయుచుండిన ప్రభువు, మరవకుల సంభూతుడు, నరసానాయకుని మార్గము నరికట్టెను; ఘోరయుద్ధము సంప్రాప్తమైనది; రణమున నిహతుడై మరవరాజు సురవధూ మధురాధరముల జూఱగొన మహేంద్ర లోకమునకు బోయెను; తరువాత పాండ్యదేశముపై నడచి మధురాపురమును బాలించుచుండిన చోళవంశజుడగు మానభూషు నోడించి యా పట్టణమును స్వాధీనము జేసికొనెను. అటుపిమ్మట రామేశ్వర యాత్ర. ఈ యాత్ర సేగుచుండినప్పుడే మొ పాండ్య చేర భూపతులను నరసానాయకు డోడించినది. పై వేర్కొనిన విజయముల మూలమున నరసానాయకునికి ద్రావిడ దేశము సర్వమును సంపూర్ణముగ వశపడినది; అతని యధికారము నిర్వక్రముగ సాగ నారంభించినది.

దక్షిణ దిగ్విజయమును జయప్రదముగ తుదముట్టించి నరసానాయకుడు వెనుదిరిగెను; కాని రాజధానికి బోలేదు; దక్షిణ కర్ణాటమున బలగర్వితుడై విఱ్ఱవీగుచుండిన యుమ్మత్తూరు తలకాడు పాళెగాండ్రను శిక్షించుట యావశ్యకమాయెను; కావున కావేరీ తీరమును జేరినంతటనె పశ్చిమ దిశాభిముఖుడై దక్షిణ కర్ణాటముపై గూచి చేసెను. ఉమ్మత్తూరు పాళెగాండ్ర జలసంకటము గావేరీ మధ్యస్థములైన జలదుర్గములపై నాధారపడి యుండుటవలన సైన్యము నదీతటమున నడపుకొనుచు బోయి శ్రీరంగపట్టణమును జేరెను. వర్షాకాలము; నది యుభయతటములను దాకి యత్యంత వేగముగ బ్రవహించుచుండినది; నదిని దాటి కోటను సమీపించుట దుస్సాధమైన కార్యము; కాని నరసానాయకుడు నిష్ప్రహా

కందకలేదు; నది కట్టముగ సేతువును గట్టించి దాని మీదుగ సేనగుఱ్ఱములు పాదాతిదళములను దాటించుకొనిపోయి కోటను ముట్టడించెను. దుర్గాధిపతి మహాయత్నముగా పోరుచూచెను; కాని లాభము గలుగలేదు; నరసానాయకు డాతని జీవగ్రాహముగ బట్టుకొని బంధించెను. శ్రీరంగ పట్టణ పతనముతో గర్ణాటక విప్లవకారుల వెన్నెముక విఱిగినది. రాయల యాధిపత్యమును నొప్పుకొని కప్పముగట్ట నియకొనిరి. అంతట నరసానాయకుడు వారి సీమలయందు వారిని నిలబెట్టి జయోత్సాహ మతిశయింపగా విజయ నగరమునకు మరలిపోయెను.

సాళువ నరసింహరాయల పుత్రులు పేరునకు మాత్రమే సామ్రాజ్యాధిపతులని యింతకుముందు చెప్పియున్నది; సామ్రాజ్యమున కంతటికిని వాస్తవమైన యధిపతి నరసానాయకుడే. అతడు సామ్రాజ్యమునకు రక్షకకర్త; రాయల సర్వ సేనాధిపతి, మహాప్రధాని, కార్యకర్త. ఇన్ని పదవు లాతనియందు కేంద్రీకృతమైనను; సామ్రాజ్యపాలన యంతయు నాతని యాజ్ఞానుసారమే నడచుచుండినను; కావునని యతడు తన యజమానులను నలక్ష్యముచేయక రాజచిహ్నములను గ్రహించి వజ్రసింహాసనము నారోహించెను; రాయలను వెలయించుటకు సర్వాధికారముల నాక్రమించుకొని సామ్రాజ్యమున కంతటికిని తానె మొదటియని పలె పాలించుచుండెను; రాయలను బోలి ప్రజలచే 'స్వామి' యనిపించు కొనెను; కాని బూటకమును సంపూర్ణముగ త్యజించి, రాయలను దొలగించి యతని పద మాక్రమించుకొన లేదు. సాళువ నరసింహుని బోలి నరసానాయకుడును రాజకీయ పరిస్థితులను బట్టి యధికారము నాక్రమించుకొనుట యావశ్యక మైనది: సాళువ నరసింహు డసంపూర్తిగ జేసి చన్న కార్యమును నరసానాయకుడు కొనసాగించెను. దాదాపుగ సామ్రాజ్యము యొక్క పూర్వ పరిమాణముల వఱకును గల రాష్ట్రమును మరల జయించి స్వాధీనము జేసికొనెను; సంగమ రాజవంశ మంతరించిన పిమ్మట రాయల యధికారమును ధిక్కరించి స్వతంత్రులై యుండిన సామంతులను జయించి వశంవదులుగ జేసి కొనెను; అరాజకజాడ్య నిర్ముక్తమై తెక్కొను చుండిన రాయ సంస్థానము నారోగ్యవంతము గావించి, రాజ్యాంగములకు బుష్టినొసగి, సామ్రాజ్యమునకు నవయౌవనమును బ్రసాదించెను. నరసానాయకుడు క్రీ. శ. ౧౫౦౩ వ సంవత్సరమున రాయలను సామ్రాజ్యమును దన జ్యేష్ఠ పుత్రుడగు నిమ్మడి నరసానాయకుని కప్పజెప్పి శివసాయుజ్యము నందెను.

## ఇమ్మడి నరసింహరాయలు — వీరనరసింహరాయలు

(క్రీ. శ. ౧౫౦౩-౧౫౦౫)

నరసానాయకుడు మృతిజెందిన వెనుక నతని పెద్ద కుమారు డిమ్మడి నరసానాయకుడు రాయలకును రాజ్యమునకును రక్షణ కర్త యాయెను. ఇమ్మడి నరసింహరాయ లప్పటికి పెద్దవాడై, రాజకార్యములను స్వయముగ నిర్వహించుకొనగల శక్తి గలవాడైనను, నూతన రక్షణకర్త తన పదము విడిచి యజమానుని కతని యధికారముల నొప్పజెప్పి తన తండ్రివలెనే సేనాధిపత్యముతో దృప్తిపడి యుండు సూచన లెవ్వియు గానరావాయె; అట్లు సేయకపోవుటయే కాక, యిమ్మడి నరసింహరాయలను దొలగద్రోసి రాయ పీఠమును దానె యాక్రమించుకొన నిశ్చయించెను. ఇమ్మడి నరసింహరాయలు సజీవుడై యుండిన దన యుద్యమము నిరాటంకము గొనసాగదని తలచి, స్వామిద్రోహమునకు జంకక పెనుగొండ కోటలో నతని జంపించి, వీరనరసింహరాయ లను నామము వహించి తానె సామ్రాజ్యమునకు జక్రవర్తి నని ప్రకటించుకొనెను.

ఇమ్మడి నరసింహరాయ లదృష్టహీనుడు; దైవదుర్విపాకము వలన నతడు చిన్ననాటి నుండియు గడగండ్ల పాలై తుదకు దుర్మరణము నందవలసి వచ్చెను. తండ్రియు నన్నయు నతడు రాజ్యభారము వహించు సామర్థ్యము జాలని తరుణ వయస్సునందే మృతులగుట వలన, రాజ్యకాంక్షాపరులైన దురధికారుల చే జిక్కుకొనెను; రాజ్యాభిషేకము వలన నతడు పొందిన లాభమంతయు నిరంతర కారాగార నివాసమును నకాల దుర్మరణము ననుట యతిశయోక్తి కాదు. అతనితో సాళువరాయ వంశము తుదముట్టినది; తరువాత తుళువ వంశజాలు వజ్రసింహాసనాధిపతులై

వెంకటేశ్వర్లు కుర్చీ తీసుకొచ్చి వేశాడు. అతని ముఖంలో, "ఏమిటో ముఖ్యమయిన పని" అన్న ప్రశ్న కనిపించింది.

"అబ్బే, చాలా స్వల్ప విషయం. జానికమ్మ గారింట్లో నేను అతి చనువుగా, వాళ్ళింట్లో వాడుగా తిరుగుతూంటాను. సరోజతో నాకు పరిచయమూ, స్నేహమూ అయినాయి. ఆ అమ్మాయిని నాకిచ్చి పెళ్ళిచేయమని మిమ్మల్ని అడగటానికి వచ్చాను" అన్నాడు.

తను పెళ్ళిచేయవలసిన కూతురొకర్తె వుందనే విషయం వెంకటేశ్వర్లుకి ఆశ్చర్యాన్ని కలిగించింది. అతను ఏం జవాబు చెప్పాలోనని ఆలోచిస్తూంటే, శేషగిరి తనెవరో, ఏమి పని చేస్తున్నాడో, ఎంత ఆర్జించాడో మొదలైన వివరాలన్నీ చెప్పాడు. అత నా విషయాలు చెబుతూంటే వెంకటేశ్వర్లు ముఖం వికసించింది. అతను ఎంతో మర్యాద చూపించడం ప్రారంభించాడు. అతన్ని కట్నం అడగడు; పైగా అతనికే కొద్దిగా ముట్టేటట్టువుంది. వాళ్ళు చాలాసేపు మాట్లాడుకున్నారు.

వెంకటేశ్వర్లు పూర్తిగా దివాలాతీసి దరిద్రపు స్థితిలో వున్నాడు. విలాసిని అతని దగ్గర వున్నదంతా వూడ్చేసింది. అప్పులవాళ్ళంతా చాలా పేచీ చేస్తున్నారు. కొత్తగా అప్పు ఎక్కడా పుట్టడం లేదు. రోజురోజుకీ శక్తి క్షీణించి మిగతా జీవితకాలమైనా జాగ్రత్తగా గడుపుదామనే ఆశ పుట్టిస్తోంది. ఎక్కడికి పోవాలి అనే విషయంమీద అనేక ఆలోచనలు చేశాడు. అతని చెల్లెలు విషయం ఎత్తటానికి అతనికి జంకుపుట్టింది. ఆమె యీర్ష్యతోను, గర్వంతోను ఎత్తి పొడుపు మాటలని అతన్ని హేళన చేస్తుంది.

అతనిలో అహంభావం ఇంకా కొద్దిగా వుంది; చాలామట్టుకు చచ్చిపోయినా. అతని సేవకుడు సూరయ్యమాత్రం వెంకటేశ్వర్లుని వదిలిపెట్టిపోయే వరకూ చాలా అచంచలంగా వుండేవాడు. వెంకటేశ్వర్లుని దోచుకు తినడానికి అవకాశం ఉన్నన్నాళ్ళు అతను నమ్మకంగా వున్నట్టుగానే వుండేవాడు. వెంకటేశ్వర్లుదగ్గర యింక లాభించేదేమీ లేదనే నిశ్చయానికి రాగానే తను సంపాదించిన ధనంతో సుఖంగా ఉండటానికి ఒక రోజున చెప్పకుండా మాయమయాడు. వాడి గంభీరమైన నవ్వులో అర్థం చివరకి తెలిసింది. యంత్రంలాగ చెప్పినట్టు నడిచే ఆ ముక్తసరి మనిషి డబ్బు బాగా పోగుచేసుకొని నవ్వుతూ వుడాయించాడు. ఈరోజుల్లోకూడా పాపం బద్దలవక మానదంటారు నీతికోవిదులు. దొంగతనం నేర్పిన సూరయ్య విలాసినినికూడా తన యజమాని కందకుండా అపహరించాడు. ఒకరోజున విలాసినిని చూదామని వెళ్ళిన వెంకటేశ్వర్లుని బయట నిలబెట్టి తలుపులు పడాలున వేశాడు అతని జవాను.

శేషగిరి వచ్చి సరోజను తన కిమ్మని అడిగినప్పుడు అత నీ పరిస్థితులకు లొంగిపోయి వున్నాడు. తన కూతురువల్ల సొమ్ము చేసుకోవచ్చుననే ఆలోచన యింతవరకూ అతనికి తట్టలేదు. శేషగిరి కోరిక యీ ఆశను కలిగించింది. అత నిన్నాళ్లూ ఎక్కడ శరణుజొచ్చుదామా అని ఆలోచిస్తున్నాడు. అతని కిప్పుడా అవకాశం లభించింది. ఈ అవకాశంతో తన ముసలితనంలో హాయిగా ఒకమూల బతకవచ్చు ననుకున్నాడు. కూతురూ, అల్లుడి దగ్గరనుంచి కూడా అప్పుడప్పుడు డబ్బు సంపాదిస్తే తాను అనుకున్నంత అల్పజీవితాన్ని గడపనక్కరలేదనుకున్నాడు. ఎంతో పరువు ప్రతిష్ఠలుగల తండ్రిగా నటించాడు. అతను ఎక్కువ ఆత్రుతనుగాని, ఎక్కువ నిరుత్సాహాన్నిగాని ప్రకటించలేదు. ఈ పెళ్ళిమాట రాకపోయినా బాగుండునని అతను తనలో అనుకోకపోలేదు. సరోజ తనని ప్రేమిస్తోందని శేషగిరి అతనికి నమ్మకంగా చెప్పాడు. ఆ మాట అతని జంకును కొంత పోగొట్టింది. నిజంగా తండ్రి చూపించే ప్రేమ, బాధ్యత కనబరుస్తూ, ఆమె సౌఖ్యం తప్ప యింకేమీ తనకు ముఖ్యం కావన్నాడు. వాళ్ళిద్దరూ ఆ మర్నాడే బయలుదేరి సుబ్బారాయుడి ఎస్టేటుకు వెళ్ళి అక్కడే పెళ్ళిమాటలన్నీ అనుకుని వీలయితే వాళ్ళ చిన్నపట్నం వెళ్ళకుండానే పెళ్ళికూడా జరిగించేదా మనుకున్నారు. శేషగిరి వ్యవహారంపట్ల తొందరపడినందుకు విచారించలేదు. ఎందువల్లనంటే ఆ మాత్రం తొందర పడకపోతే మళ్ళీ అతనిబుద్ధి ఎలా మారిపోతుందో. అతని తొందరవల్ల ఏమైనా కష్టనష్టాలు వస్తే

అది భరించటానికి అతను సిద్ధంగానే వున్నాడు. వాళ్ళు సుబ్బారాయుడి ఎక్కటుకి వెళ్ళగానే పెళ్ళి విషయం ఆలోచించారు. సరోజనుకూడా సంప్రదించారు.

ఆ రాత్రి దాసు కంటిమీద కునుకు పేది లేదు. ఏది సమ్మోహంలో తెలియని ఆందోళన పరిస్థితుల్లో అతని మెదడు వుంది. కొంత సేపు శేషగిరి అబద్ధం చెబుతున్నా డనుకొన్నాడు; సరోజ అతని చెప్పటికే వివాహ మాడదని అతని విశ్వాసం. కాని వెంటనే ఆ పెళ్ళి తప్పకుండా జరుగుతుం దేమోననే భయం కలిగింది. అతని హృదయంలో బాధ బయలుదేరింది. సరోజనూ, శేషగిరినీ ఒకరి పక్క యింకొకరిని తన మనోవీధిలో చిత్రించు కొని అతను కోపంతో ఆవేశం చెందాడు.

తెల్లవారిన తర్వాత అతను శాంతి పొంద టానికి ప్రయత్నించాడు. ఇంతకూ శేషగిరి మాటలకంటె ఆ విషయంలో అతనికి ఆధారాలు దొరకలేదు. ఇంకా ఏమీ నిశ్చయమైనట్టు లేదు. అత నింకా నిదానించి చూడాలి. కొంతసేపు పోయాక అతను కిందికి వెళ్ళి అక్కడున్న వాళ్ళ ముఖాలలోని వైఖరిబట్టి అంతా గ్రహించగలి గాడు.

సుబ్బారాయుడి ముఖంలో కొత్తదన మేమీ లేదు. అతని విశాలముఖంలో ఏ చిహ్నాలూ కనిపించవు. వెంకటేశ్వర్లు చాలా ఆనందంగా వున్నాడు. తన కూతురు విషయంలో ప్రతీ చిన్న విషయానికీ ఎంతో శ్రద్ధ తీసు కుంటున్నాడు. ఇన్నాళ్ళకు ఆమె ఎంతో విలు వగా కనిపించింది.

జానికమ్మలో వేదనతో కూడిన నవ్వు కని పిస్తోంది. ఆమె కూడా రాత్రంతా బాధ పడి నట్టుగా వుంది. శేషగిరి నిర్ణయం ఆమెకు కోపం కలిగించింది. కోపం పోగొట్టుకొని తన్ను తాను సమాధాన పరచుకొందుకు ఎంతో ప్రయత్నిం చింది. సరోజ తనతో పోటీలో మిన్న అని ఆమెకు తెలుసు. అందుకని ఆమెను ఎంత త్వరగా వదిలించుకుంటే అంత మంచిదని ఆలో చించింది. అయితే శేషగిరి వంటి వాడు తనని మెచ్చుకొని, తన సౌందర్యాన్ని ఆరాధించే వాంఛ్యాలోంచి తగ్గిపోతాడు. తనకి పోటీగా, తన సౌందర్యానికి, అలంకరణకి పేరు రాకుండా చేసే సరోజ వంటిది దగ్గర వుండే కంటె, దూరంగా పోతే, శేషగిరి వంటివాడు తగ్గినా ఫరవాలే దనుకుంది. ఆమె యీ విధంగా తన్ను తాను సమాధాన పరచుకుందామని చూస్తోంది. కాని, కోపం తగ్గటం లేదు.

శేషగిరి సరోజలో మాధుర్యాన్ని గ్రోలు తున్నాడు. అతని హృదయం శాంతించి అస లైన ప్రేమికుడి పాత్ర ధరించాడు. తన విలువ తాను తెలుసుకొని, తన ప్రయత్నానికి ఏ విధ మైన దెబ్బా లేదనే ధైర్యంతో నిశ్చింతంగా కూర్చున్నాడు.

దాసు పరికించిన ముఖాల్లోకల్లా ఆత్రుతగా పరీక్షించినది సరోజ ముఖం. ఆమె తన పాత పద్ధతిలో చక్కగా అలంకరించుకుని ఠీవిగా, పెళ్ళికూతురులా కూర్చుంది. ఆమె శేషగిరి తన అందాన్ని ఆస్వాదించటానికి అంగీకరిస్తోంది. ఆమె శేషగిరి తన అందానికి సమ్మోహితుడై పోయాడనే ధైర్యంతో, ఆనందోన్మత్తతలో వుంది.

రామదాసు యిన్నాళ్ళూ, ప్రకృతిమీది వ్యా మోహంలో తన్ను తాను మరిచి విరికివాడుగా సంచరించినందుకు చాలా బాధపడ్డాడు. వాళ్ళిద్దరూ పడవషికార్లలో అంతంత సేపు గడిపినప్పుడు ఆ లంకల్నీ, ప్రకృతినీ పరిశోధించి ఆనందంతో మౌనంగా వుండిపోయారే గాని, ఆ సమయంలో తన హృదయంవిప్పి చెప్పివుంటే ఎంతో బాగుండే దనుకున్నాడు. ఇప్పుడు ప్రపంచం వాళ్ళిద్దరినీ మళ్ళీ వేరు చేసింది.

ఆ రోజుల్లో సరోజ పెద్దపిల్లలాగ ఆడు కుంటూ తన్మయత్వంలో కాలం గడిపేది. ఇప్పుడు శేషగిరి ఉనికి మళ్ళీ ఆమెను పాదుచేసి సింది. ఆమె కతను ఎంతో మంచివాడుగా, మర్యాద తెలిసినవాడుగా కనిపించాడు.

అతన్ని పెళ్ళి చేసుకోమని అతను కోరగానే,- ఆమె అనుకున్నట్టుగానే అతను కోరగానే, ఆమె వెంటనే ఒప్పుకొంది. పెళ్ళంటే తన సంసారం, తన యిల్లు వేరే వుంటాయని తప్ప-అంతకంటె ఎక్కువ అర్థం చేసుకున్నట్టు లేదు.

ఆమె చిన్న వయసులో ఏమి ఆలోచన లున్నాయోనని దాసు ఊహించటం మొదలు పెట్టాడు. అలా ఆలోచించినకొద్దీ అతని కోప

మొక్కవై. అటువంటి పెళ్ళి జరగకుండా చెయ్యాలని నిశ్చయించుకున్నాడు. పెళ్ళి మాట తలపడితే అతనికి ఆవేశం ఎక్కువౌతోంది. ఇంతకూ అతనికి ఒప్పగించబడిన కార్యాన్ని మరచిపోయాడు. రాజేశ్వరమ్మ చేసిన హితబోధ ప్రకారమే నడుచుకోవాలనే సంగతి మరచిపోయాడు. సరోజను శేషగిరినుంచి వేరుచేద్దామనే అతని ఆలోచన.

పగల్లా ఎంతో వ్యథపడ్డాక సాయంత్రం వేళ సరోజను గోదావరి గట్టుమీద కలుసుకున్నాడు.

"నువ్వు పెళ్ళి చేసుకోబోతున్నావా!" అన్నాడు అకస్మాత్తుగా.

"అవును" అంది అతని ఆవేదన చూసి ఆశ్చర్యపోతూ.

"శేషగిరిగురించి నీకు బాగా తెలుసునా?"

"చాలా బాగా తెలుసు."

"నేను అతన్ని పన్నెండేళ్ళక్రిందటే మొదటిసారి కలుసుకున్నాను. అతనంటే నాకేమీ గౌరవం లేదు."

సరోజ రోషంగా జవాబు చెప్పబోయింది. కాని ఆమె మాటను అడ్డువచ్చి యిలా అన్నాడు.

"నువ్వేమీ చెప్పొద్దు. నామాట నమ్ము. ఈ పెళ్ళి జరగటానికి వీలులేదు. అతన్ని నువ్వు పెళ్ళి చేసుకుందుకు నే నొప్పుకోను."

అతను యజమానిలాగ మాట్లాడాడు. పిల్లవాడిని మందలించే తండ్రిలాగ మాట్లాడాడు. సరోజ అతనివైపు అసహ్యంగా స్తబ్ధురాలై చూసింది.

ఆమెకు అసలు సంగతంతా చెప్పి, ఆమె తల్లి ప్రసక్తి ఎత్తి, శేషగిరిని పెళ్ళాడవద్దని బోధించితే ఎలాగ వుంటుందని దాను ఒక నిమిషం ఆలోచించాడు. కాని, ఈ విధంగా చెప్పినా ఆమె వింటుందనే ధైర్యం అతనికి లేదు. చివరకి అతను మెల్లిగా, ప్రతిమాలుతున్నట్టుగా అన్నాడు. "నామాట విని, నేను చెప్పిన విషయం ఆలోచించు. నన్ను నిరుత్సాహపరచకు."

సరోజ నవ్వటం ప్రారంభించింది. వాళ్ళ మామయ్య కార్యదర్శియొక్క ధైర్యం, చొరవ ఆమె కాశ్చర్యం కలగజేశాయి. చివరకి "అయితే మీరు నన్ను ప్రేమిస్తున్నారా?" అని సాహసించి ప్రశ్నించింది. అతని ఆరాధనకూ,



ప్రేమకూ చక్కెరలాలై నెమ్మదిగా యిలా అంది. "మనం తగవులాడుకొని విడిపోవటం మంచిది కాదు. మీరు ఏదైనా ఆలోచించి మాటలాడటం మంచిది." అని వెళ్ళిపోయింది.

ఆమె వెళ్ళిపోయాక దాసు నిశ్చేష్టుడై కుంగిపోయాడు. ఆమె అన్నమాటల్నే మళ్ళీ మననం చేసుకుంటూ నిలబడిపోయాడు: "అయితే మీరు నన్ను ప్రేమిస్తున్నారా!"

అతని బుర్రలో పెద్ద రొద బయలుదేరింది; అతని కేమీ వినిపించడంలేదు. అకస్మాత్తుగా ఏవాలుదేని తోటవైపు పరుగెత్తటం మొదలు పెట్టాడు: "ఆమె ఆమాట అంది. ఆ మాట అంది. నేను ప్రేమిస్తున్నాను." అనుకుంటూ వెళ్ళాడు.

అతనిలో అగ్నిజ్వాలలు లేచాయి; తాగిన వాడికి మల్లే తూలుతున్నాడు. కొంతసేపటికి చీకటిపడింది; వర్షంకూడా ఆరంభమైంది. అతను చీకటిలో లీనమై హృదయభారం తగ్గటానికి కొంతసేపు ఏడిచాడు. కొంత ప్రశాంతత ఏర్పడింది.

అతను సరోజను ప్రేమించాడు. అతను పట్టి అమాయకుడు. ఆమె అన్నమాటనే ఒక డజను సార్లు ఉచ్చరించాడు. అయితే అత నిస్వార్థగా ఆత్మవంచన చేసుకుంటున్నాడా? అతని స్వార్థ త్యాగమంతా యీ ప్రేమకోసమేనా? అతను ఆమెను శేషగిరినుంచి రక్షించదలుచుకొన్నది తన కోసమేనేమో. ఆ ఆలోచన రాగానే అతను సిగ్గుతో కుంగిపోయాడు. ఇక ఆమెకోసం దెబ్బలాడే ధైర్యం చచ్చిపోయింది.

ఇంతకూ అతను సరోజ కేమౌతాడు? స్నేహితుడుకూడా కాదే. అతను ఏ హక్కుతో ఆ కుటుంబంలో చొరబడి మాట్లాడ గలుగుతున్నాడు? అతని ఆజ్ఞలు వాళ్ళెందుకు పాలించాలి? తన శక్తిహీనత, ఆ యింట్లో తనకి స్థానబలం లేకపోవటం అతన్ని కుంగదీశాయి, దీనుణ్ణి చేశాయి.

శేషగిరి మంచివాడు కాదని తను నిర్ణయిస్తే దానికి దాఖలాలేమీ లేవు. తనకి రాజేశ్వరమ్మ అప్పగించిన పని గురించి తెలిస్తే అందరూ అతన్ని చూసి వెటకారం చేసి యింట్లోంచి తరిమేసి తలుపులు వేసేస్తారు. అతను ప్రేమ జ్వరంతోను, యీర్ష్యతోను బాధ పడుతున్నా డనికూడా అంటారు.

వాళ్ళు అలా అన్నా అది అసత్యం కాదు. సరోజకి ఆరుసంవత్సరాల వయసున్నప్పుడే అతను ప్రేమించాడు. అది అతను పూర్తిగా గుర్తించా డిప్పుడు. అతను నిఘంటు కార్యాలయంలో పని చేస్తున్నపుడు తన హృదయంలో ఏర్పడిన ప్రతిమను ఆరాధించేవాడు. ఆ తర్వాత యౌవనవతిగా వున్న సరోజను ఆరాధించేవాడు. నిజానికి అతనిలో కొంత యీర్ష్య వుంది. అందుకనే ఆమె హృదయాన్ని ఎవరైనా తమవైపు తిప్పుకుంటారేమోనని భయంతో ఆమె ఎక్కడికి వెడితే అక్కడికి వెంబడించేవాడు.

ఆ తర్వాత వాళ్ళు వెళ్ళిన పడవ షికార్లు, అడవి లోకి ప్రయాణాలు, అప్పు డతను పొందిన ఆనందానుభూతి జ్ఞాపకం తెచ్చుకున్నాడు. అతని తనే గుర్తుకు తెచ్చుకోలేని ఆ రోజు లెంత మధురమయినవి! ఎల్లప్పుడూ ఆమె నే కనిపెడుతూ, తన బాధ్యతంతా తండ్రి బాధ్యత వంటిదే అనుకోవటం ఎంత సుఖాన్ని కలుగజేస్తుంది!

అతని కిప్పు డంతా స్పష్టంగా గోచరిస్తోంది. పశ్చాత్తాపం అతన్ని కొరికి వేస్తుంటే, కోపం అతని హృదయాన్ని దహించేస్తోంది. అతను శక్తిహీనుడై నిలబడలేక, ఆ వర్షంలో చెట్టు కిందకూలబడ్డాడు. అతని ఆవేదనలో, అతని పశ్చాత్తాపంలో, అతని బాధలో, అవమానంలో- ఒక ఆలోచన తట్టింది—అది బాధకలిగించే, తోసిపారెయ్యటానికి వీలులేని ఆలోచన. అదేమిటంటే సరోజ యింకొకరిహక్కు అనే విషయం. ఆ ఆలోచనను తరిమివెయ్యటానికి వ్యర్థంగా ప్రయత్నించాడు. అతని మమకారాన్ని చంపుకోటానికి రాజేశ్వరమ్మను జ్ఞాపకం తెచ్చుకుందుకు ప్రయత్నించాడు. కాని చిరునవ్వు నవ్వుతూ శోకంగా చూస్తున్న సరోజా, శేషగిరులు అతన్ని వెక్కిరిస్తున్నట్టుగా అతని కనువీధిలో వున్నారు. అతని తల పగలటానికి సిద్ధమయినట్టూ, తిరుగుతున్నట్టూ, అతని చుట్టూ రక్తపాతం తప్ప యింకేమీ లేనట్టూ అతనికి గోచరించింది.

ఈ విధంగానే అతను రాత్రిలో చాలా భాగం గడిపాడు. ఈ పశ్చాత్తాపం తరువాత అతనిని పూర్తిగా నిరాశ ఆవరించింది.

ఇక అతని కా ఎస్టేటు ప్రాంతాల్లో తానుండవలసిన అవసరమేమీ కనుపించలేదు. యుద్ధం అయిపోయింది. అందులో అతను ఓడిపోయాడు. అతను యిదివరకు సాధించాననుకున్నదంతా పట్టిది; అంతా నాటకం అయిపోయింది. బాధలతోను, అపజయాలతోను విసుగెత్తిన అతని మనశ్శరీరాలు శాంతికోసం, విశ్రాంతికోసం తహ తహ లాడాయి. సుబ్బారాయుడి తాలూకు జనమంతా వచ్చేలోపల, కొన్ని గంటలైనా ముందుగా చెన్నపట్నం వెళ్ళటానికి నిశ్చయించుకొని బయలుదేరి వెళ్ళాడు.

అతను సరాసరి నరసింహం గదికి వెళ్ళాడు. అతను దాసు నేమీ ప్రశ్నలు వెయ్యలేదు. ఇన్నాళ్ళూ నరసింహం ఒక విధమైన బాధతో, నిరాశతో పని చేస్తున్నాడు. దాసు ఒకసారి జాగ్రత్తగాను వెళ్ళి సుబ్బారాయుడుదగ్గర సెలవు తీసుకుందామని అనుకొని వెళ్ళాడు. వెళ్ళి ఎప్పటికి నిశ్చయించాలో కనుక్కోకుండా వుండలేక పోయాడు. కాని ఆ విషయం తెలుసుకున్నక అతని బాధ యింకా ఎక్కువైంది. అతను రోజులు లెక్క పెట్టుకుంటూ వుండేవాడు. ఒక్కొక్క గంట గడిచి ముహూర్తం దగ్గరపడిన కొద్దీ అతనికి భార మెక్కువయింది.

పెళ్ళికి వెళ్ళకూడదని చాలా స్పష్టంగా నిశ్చయించుకున్నాడు. కాని మర్నాడు పెళ్ళనగా క్రిందటిరోజు రాత్రి అతనికి ఆవేదన ఎక్కువయి యింక వుండబట్టలేక వాళ్ళింటికి పరుగెత్తుకెళ్ళాడు. అక్కడ యమయాతన ననుభవించాడు. భయానక దృశ్యాన్ని దేన్నో చూస్తున్నట్టుగా భయపడి, ఒక స్తంభం చాటున నక్కి ఆ కార్యమేదో అయిందనిపించేసి అసంతృప్తితో, బాధతో అక్కడ నుంచి వెళ్ళిపోయాడు.

అతను యింటికి వెళ్ళగానే నరసింహం అతనెక్కడో తాగి వచ్చాడనుకొని పక్కమీద పడుకోబెట్టి చిన్నపిల్లాణ్ణి నిద్రపుచ్చినట్టు నిద్ర పోగొట్టాడు.

మర్నాడు, తనకు వచ్చిన రాజ్యమైనా లెక్కచేయకుండా, దాసు పక్కమీద నుంచి లేచి తను చెన్నపట్నం వదలి పెంటకోట సముద్రప్రాంతానికి పోయి అక్కడ హాయిగా ఒంటరి జీవితాన్ని సాగిస్తానన్నాడు. నరసింహం అతను వెళ్ళడానికి ఒప్పుకోలేదు. అతను చాలా నీరసస్థితిలో వున్నాడు. అయినా అతని కళ్ళలోని తీవ్రమైన పట్టుదల చూసి, తనని కూడా అతనితో రావటానికి సమ్మతించమని కోరాడు. గాని, అతని ప్రయాణం ఆపుచెయ్యడానికి సాహసించలేదు. రామదాసుకి కోపం వచ్చి తన కెవరి సహాయమూ అక్కరలేదన్నాడు. అతను ఏకాంత జీవితానికి [illegible] తున్నాడు.

నరసింహాన్ని, సందిగ్ధావస్థలోను, నిరాశలోను వుంచి రామదాసు వెళ్ళిపోయాడు. నరసింహానికి అతని బాధేమిటో అర్థం కాలేదు.

జన సమూహంలో ఉత్సాహంతో పొంగుతూ, ఆకాశాన్ని అందుకోవటానికి ప్రయత్నిస్తున్న సముద్రాన్ని చూసి దాసు శాంతించాడు; అయినా అతనికి బాధ పూర్తిగా తగ్గలేదు. అతను ఒక గది అద్దెకి తీసుకున్నాడు; ఆ కిటికీలోంచి విసుగు లేకుండా సముద్రంవైపే చూస్తూ కూర్చునేవాడు. అతను తను సంపాదించి మిగిల్చినంతా మెల్లిమెల్లిగా తినేస్తూ కూర్చున్నా అతనికి బాధగా లేదు. రోజు రోజంతా చలనం లేకుండా అలాగే సముద్రంకేసి చూస్తూ కూర్చునేవాడు. సముద్రపు ఘోష అతని హృదయంలో ప్రతిధ్వనించినట్టుగా వుండి అతని ఆలోచనలకు చక్కని ప్రోత్సాహమిచ్చేది. అతను ఒక్కొక్కప్పుడు సముద్రం ఒడ్డుకు వెళ్ళి అక్కడ రాళ్ళమీద ప్రశాంతంగా వీపు [illegible] కూర్చుని ఆనందంలో లీనమైపోయేవాడు. సముద్రపుటలలు అతని స్మృతిపథాలని ఆలోచనలను మాయం చేసి అతన్ని నిద్రపుచ్చినప్పుడు అతనెంతో సౌఖ్యం అనుభవించేవాడు. ఒక్కొక్కప్పుడు అచేతనంగా అలాగే వుండిపోయి కళ్ళు తెరిచే నిద్రావస్థలోకి వెళ్ళి అనిర్వచనీయమైన ఆనందాన్ని అనుభవించేవాడు.

కొన్నాళ్ళు ఒక విధమైన మనస్తాపంతో బాధపడేవాడు. సముద్రపు అలల వినోదం అతను యింకో విధంగా అర్థం చేసుకున్నాడు.

సముద్రం లేచి తనను తరుముతోందని భావించేవాడు, తనని అటూయిటూ ఉయ్యాలలో ఊపినట్టు ఊపుతోందనుకొనేవాడు. ఈ ఆలోచనల్లో, యీ అనంతమైన భ్రమలో అతనికి చిత్తశాంతి కుదిరేది. అతను ఒక్క క్షణమైనా బాధ ననుభవించకుండా, ఒక్క క్షణమైనా సరోజను తన ప్రియురాలుగా తలచకుండా గడిపిన రోజులున్నాయి. అతని గాయం మానిపోయింది, కాని ఆ ప్రదేశంలో కదుముకట్టినట్టు మాత్రం గట్టిగా వుంది. అతను పూర్తిగా స్వస్థత చెందినట్టు భావించాడు. అతను మెల్లిమెల్లిగా సాధారణ వ్యక్తిత్వాన్ని సంపాదిస్తున్నాడు. ఇన్నాళ్ళూ కుదిబట్టిన కాళ్ళు బాగా సాగేటట్టుగా కొండ ప్రాంతాల్లో పరుగులెత్తేవాడు. అతని పూర్వపు ఆలోచనలన్నీ ఒక్కొక్కటే మేల్కొంటున్నాయి. చెన్నపట్నంలో సంగతులేమిటో వ్రాయమని నరసింహానికి ఉత్తరం వ్రాశాడు. అతను అక్కడికొచ్చి సంవత్సరమైనా, యింకా ఆ ప్రదేశాన్ని వదులుదామని లేదు.

అతనిలో ప్రవేశించిన నూతన జవసత్వాలు అతన్ని బాధపెట్టసాగాయి. కొత్తగా వచ్చిన ఆ శేవగో ఏం చెయ్యాలో అతనికి తెలియలేదు. మళ్ళీ జీవిత సమరం సాగించటానికి, యింకా బాధలనుభవించడానికి, మళ్ళీ యుద్ధంలో ఓడిపోయినా సరే, హుషారయిన, కదలికగల జీవితం గడపటానికి అతను ఉరకలు వేస్తున్నాడు.

ఒకరోజు ప్రొద్దుట అతను కొంచెం మత్తుగాను, కొంచెం తెలివిగాను పడుకుని వున్న సమయంలో అతనికి చాలా సంవత్సరాల క్రిందట వినిపించిన గొంతుక — మరణశయ్యపై నున్న ఆమె కంఠం అతని కిలా వినిపించింది. "ఆమె పెద్ద అలవాట్లుగల వాణ్ణి భర్తగా స్వీకరిస్తే నువ్వింకా ఆమె కోసం పోరాడాలి; ఆమె నింకా రక్షించాలి; భార్యకు ఏకాంతవాసం చాలా బాధాకరమైనది; ఆమెకు తప్పుడుదారులు తొక్కకుండా వుండేటంతటి నైతికబలం, ఆత్మవిశ్వాసం వుండాలి. ఆమె కేం జరిగినా సరే. ఆమెను వదిలిపెట్టకు."

ఆ మరునాడు రామదాసు చెన్నపట్నం వెళ్ళాడు. అతని కిప్పుడు ఎక్కడలేని బలం, ధైర్యం వచ్చాయి.

(ఇంకా ఉంది)



ఉప ప్రధాని సర్దార్ వల్లభ్‌భాయ్ పటేల్ 74-వ జన్మ దినోత్సవం యిటీవల ఢిల్లీలో రాష్ట్ర కాంగ్రెస్ కమిటీ జరిపినప్పుడు తీసిన ఛాయాచిత్రం.

# మన చుట్టూ ఉన్న ప్రపంచం—

## పతాక శీర్షికల వెనువెనుకటి ప్రభావాలు

మేకా చక్రపాణి

చైనాలో కమ్యూనిస్టు ప్రభుత్వ స్థాపన జరగటం, నెహ్రూ అమెరికా ప్రయాణమై వెళ్ళి అక్కడ అత్యంత వైభవోపేతంగా సన్మానాలు పొందటం, జర్మనీలో పశ్చిమ జర్మను ప్రభుత్వానికి ఎదురుగా తూర్పు జర్మన్ రాజ్యాన్ని ప్రతిపాదించి రష్యా దాన్ని జర్మన్ కేంద్ర ప్రభుత్వంగా వ్యవహరించటం, ఇంగ్లండులో పౌను విలువను తగ్గించటాన్ని పురస్కరించుకొని కన్సర్వేటివ్ పార్టీ లేబరు ప్రభుత్వం మీద తీవ్రమైన అలజడి కలిగించటం, రష్యా తన వద్ద 1947 నుంచి యాటంబాంబున్నదని ప్రకటించటం—ఇవి యీసారి మన చుట్టూ వున్న ప్రపంచంలోని చంచల ఘట్టాలు.

* * *

చైనాలో కమ్యూనిస్టులు కాంటన్ నగరాన్ని, ఆయా ప్రాంతాల్ని వశము చేసికొన్నారు. సింకియాంగ్, చుంకింగ్ రాష్ట్రాల మీద కమ్యూనిస్టు సేనలు దాడి ప్రారంభించాయి. చైనా ప్రధానంగా జమీందారీ యుగంలో వున్న దేశం కనుక, ముఖ్యపట్టణాన్ని కమ్యూనిస్టులు ఆక్రమించగానే ఆయా రాష్ట్రాలన్నీ వారి చేజిక్కినట్లు మిలిటరీగా భావించబడుతూవుంది. చైనా కమ్యూనిస్టుల విజయ పరంపరలోని రహస్యమిదే. చైనాలో యీ లెక్కప్రకారం హెచ్చు భాగం కమ్యూనిస్టుల వశమైంది. సారవంతమైన భాగం కూడా వారి చేతుల్లోనే వుంది. కాని, ఆ ప్రాంతాలలో సరియైన పరిపాలన యేర్పడి శాంతి భద్రతలు కలిగి వుండాలంటే యింకా చాలా సంవత్సరాలు పడుతుంది. జాతీయవాదుల క్రిందవున్న భాగంలో కూడా శాంతి భద్రతల పాలన లేదు. పోతే యిప్పుడు ప్రధానమైన సమస్య ఏమంటే, కమ్యూనిస్టు చైనాను చైనాలోని శాస్త్రీయమైన పరిపాలనగా అంగీకరించటమా, లేదా! అనేది: కమ్యూనిస్టు ప్రభుత్వాన్ని శాస్త్రీయ ప్రభుత్వంగా అంగీకరించటం ప్రపంచ శాంతికి అవసరం. దీనివల్ల చైనా ప్రజలకు ఒక రకమైన యిక్కట్టు దాటిపోయి ఇరవై యేడు సంవత్సరాల నుంచి యుద్ధయాతనలకు గురియైన వారికి కొంత కొంత శాంతి యేర్పడుతున్న ఆశ ఒకటి—అదీగాక చైనా నవ్యనాయకుడు మావో-సే-టుంగ్ కొంత తనను గురించి తాను హెచ్చుగా భావించే వ్యక్తి. స్వతంత్ర పంథాను అనుసరించే నాయకుడు. అందువల్ల అతని ప్రభుత్వాన్ని గుర్తించడంతో, యాభైకోట్ల జనం తరఫున మాట్లాడగల తాహతు తనకు ఏర్పడుతుంది గనుక, అతను క్రమేపీ మాస్కో హుకుం ప్రకారం కాక, స్వతంత్రించి కూడా కొంత వ్యవహరించవచ్చు. అతను ఎంత స్వతంత్రించి వ్యవహరించితే, అంతగా ఆసియా దేశాలు శుభకరమైన మార్గాలలోకి పోవచ్చు. సర్వాన్ని జాతిపరం చేయాలన్న శ్రామిక నియంతృత్వ మార్గాన్ని వదలి సహకార ఆర్థిక విధాన ప్రజాస్వామ్య మార్గాన్ని అనుసరించ వచ్చు.

ఇండియా కమ్యూనిస్టు పార్టీ, మావో-సే-టుంగ్ కమ్యూనిజాన్ని యీ మధ్య దూయబట్టింది. అది మావో సే-టుంగ్ లోని స్వతంత్రతను వెల్లడిస్తుంది. అందువల్ల అతడు యుద్ధనాయకుడుగా కాక చైనాకు ఎటూ కావాల్సిన శాంతి మార్గ నాయకుడుగా పరిణమిస్తాడు. రష్యా, అమెరికా పోరాటాలకు, పశ్చిమంలో బ్రిటను వర్గం, తూర్పులో ఇండియా చైనాల వర్గం, తయారుచేయవచ్చు. దానివల్ల శాంతి కాముక రాజ్యాల బలం హెచ్చవయి, యుద్ధనివృత్తి జరుగవచ్చు.

పండిత నెహ్రూ అమెరికా వెళ్ళడం, అక్కడ బ్రహ్మాండమైన స్వాగతాలు జరగడం, దానితో ఇండియాలో ఒక స్వోత్కర్ష భావం యేర్పడటం మనం చూస్తున్నాము. అమెరికాకు నెహ్రూ ఎందుకు వెళ్ళారు? కేవలం విశ్రాంతికోసమా? దేశం చూడటానికా? పరిచయాల కోసమా? మరే మైనా నిగూఢ కారణా లున్నాయా?

ప్రపంచంలో రెండే వర్గా లున్నాయి; అమెరికావర్గం, రష్యావర్గం. అని విశేషప్రచారంలోవున్న భావం ఒకటి వుంది. అంటే, సిద్ధాంతరీత్యా, పెట్టుబడిదారీ విధానంకాని, కమ్యూనిజంకాని కాక మరో మార్గంలేదని. ఈ రెండు వర్గాలు ఇతర దేశాల్ని తమవైపుకు మళ్ళించుకోటానికి తీవ్రతర కృషి చేస్తున్నాయి.

పండిత నెహ్రూ ప్రయాణంవల్ల ఇండియా మధ్యవర్గాన్ని వదలి, అమెరికా కూటమికి చెంది పోయిందా? ఇన్నాళ్ళనుంచి తన విదేశాంగ నీతి శాంతి మార్గమనీ, రెండు శక్తుల మధ్యగా వుంటామనీ, యుద్ధాన్ని వ్యతిరేకిస్తామనీ, మన దేశంమీద ఎవరైనా పడితేతప్ప యుద్ధానికి దిగమనీ, అందరియెడల మిత్రత్వం మన కర్తవ్య మనీ నెహ్రూ పదేపదే చెప్పారు.

కాని అమెరికాలో వారి వుపన్యాసాలు తన విదేశాంగ నీతిలో కొంతమార్పును సూచిస్తున్నాయి. 'మానవుని స్వేచ్ఛకు ఎక్కడ విరోధం వున్నా, ఏమూల ఎవరి స్వాతంత్ర్యం భంగపడినా, దానికై పోరాడుటకు మేము సిద్ధంగా వున్నాం'' మన్న ప్రవచనాన్ని నెహ్రూ చెప్పారు. భావం విశాలంగా కనపడినా, తన విధానంలో మార్పు విదితం.

"అమెరికా వారి పారిశ్రామి కానుభవంవల్ల మేము శ్రేయస్సు పొందుతాము, మీ పెట్టుబడి మాకు కావాల'' న్నారు. దీన్ని పూర్వ వృత్తాంతాన్ని బట్టి అర్థం చేసికోవాలి. ఉదకమండలంలో ప్రపంచ ఆహారశాఖల మహాసభ జరిగినప్పుడు అమెరికా ప్రతినిధి గ్రేడీ "మా దేశంనుంచి పెట్టుబడి రావటానికి సిద్ధంగా వుంది; అది మీ షరతుల ప్రకారం కాద''న్నాడు. ఆ నాడు నెహ్రూ కూడా సభలో వున్నారు. తర్వాత మన దేశ పెట్టుబడిదార్లు అమెరికానుంచి పెట్టుబడికోసం అర్రులు చాస్తున్నారు. నాలుగునెలల క్రితం బిర్లా న్యూయార్కులో మాట్లాడుతూ "మా ప్రధాని కొద్దినెలల్లో అమెరికా వస్తాడు; వచ్చినప్పుడు మీ పెట్టుబడిదార్లకు తగిన హామీ యిస్తా"డన్నాడు.

ముందుగా బిర్లా యీ మాటలు చెప్పడం వల్ల నెహ్రూ ప్రయాణాన్ని వారే నిర్ణయించారన్న ప్రచారం కూడా లేకపోలేదు. నెహ్రూ ప్రయాణంవల్ల ఇండియా అమెరికా కూటమిలో చేరినట్లేనని రష్యా పత్రికల వ్యాఖ్యానం.

ప్రధాని నెహ్రూ అమెరికాలో మాట్లాడుతూ ప్రపంచంలో రెండువర్గాలున్నై; పెట్టుబడిదారీ విధానం, కమ్యూనిజం అన్నారు. ఈ నిర్వచనం గనుక వారు చేసినదని రుజువైతే ఇంతకన్న నెహ్రూ అమెరికాలో చేసిన విచిత్ర ప్రకటన లేదు. తాను కమ్యూనిస్టు కాదు; తన దేశం కమ్యూనిస్టు దేశంకాదు. కాబట్టి తనదేశం పెట్టుబడిదారీ దేశమని వారంగీకరించినట్లే గదా! అప్పుడు తాను అమెరికా కూటమిలో నున్నట్లే గదా? అటువంటప్పుడు రష్యా అన్న దానిలోని తప్పేమిటి? ఈ విషయాన్నిగురించి పండిత నెహ్రూ కాని, వారి మంత్రివర్గం కాని, జాతీయ కాంగ్రెసు కాని విపులీకరించవలసి ఉంది.

ప్రపంచంలో రెండువర్గాలే అన్న వాదన ఇటు రష్యా, అటు అమెరికా దేశాలు చేస్తున్నాయి. అది తప్పు అని ఇతర ప్రపంచ మేధావులు, భారతదేశంలో హ్యూమనిస్టులు, వాదిస్తున్నారు; ఆమూడో వర్గమైన శాంతి వర్గం కోసం తాపత్రయపడుతున్నారు; తీవ్రంగా కృషి చేస్తున్నారు.

అమెరికాలోని పండిత నెహ్రూ ప్రకటన ఈ మూడో మార్గవాదాన్ని నిరాకరించింది. ఇక్కడే ఆయన తప్పటడుగులు వేసినది. ఈ మార్గం తప్పనిసరిగా యుద్ధమార్గానికి లాగుతుంది. కమ్యూనిస్టు వ్యతిరేక వర్గంలోకి నెట్టి వేస్తుంది. ఈ ప్రకటనలు నెహ్రూజీ అమెరికాలో ఎందుకు చెయ్యాలి!

అసలు మన ప్రశ్న, నెహ్రూ అమెరికానుంచి బాకీలు తెచ్చుకోకుండా దేశ ఆర్థికతను బాగు చేయ వీలులేదని భావించినట్లేనా? ఇటు పెట్టుబడిదారీ అటు కమ్యూనిస్టు ఆర్థికవ్యవస్థలు తప్ప

మరో మార్గం లేనట్లు ఆయన భావించినట్లేనా? సహకార ఆర్థిక వ్యవస్థా మార్గాన్ని ఆయన శోధించటానికి ప్రయత్నించ లేదా? ఈ ప్రశ్నలు ప్రతి ప్రజాస్వామ్యవాదిని బాధించక తప్పదు. తన దేశాన్ని అమెరికా పెట్టుబడులతో నింపి చాంగ్ కైషేక్ ఏమి వుద్ధరించాడు, అనే అనుభవైక వేద్యమైన ప్రశ్న రాకతప్పదు.

అమెరికా సెనేటులో నెహ్రూ ఒక ప్రసంగం చేశారు. అది ముందుగా తయారు చేసికొన్న వ్రాత ప్రతిగా కనిపిస్తుంది. ఆ వుపన్యాసంలో మాటలను తూచి వాడారు. ధర్మమార్గాన్ని అనుసరిస్తామన్నారు. తమకు ప్రమాదం సంభవిస్తే తాము తప్పకుండా రక్షణ చర్యలకు దిగుతామన్నారు. అమెరికా వారికి ధర్మమైంది రష్యా వారికి ధర్మం కాదు. రష్యా వారికి ధర్మమైనది అమెరికా వారికి ధర్మం కాదు. ఒకరికి స్వేచ్ఛా వ్యాపారంలో విశ్వాసం. రెండో వారికి కమ్యూనిజంలో విశ్వాసం. వీరిద్దరికీ చుక్కెదురు. ఈ స్థితిలో నెహ్రూ తాను ధర్మ పక్షాన వుంటానని సెనేటులో వుపన్యసిస్తే దాని అంతరార్థం ఏమవుతుంది? అమెరికనులు నెహ్రూ తమ పక్షానే వుంటాడని భావిస్తారు. నెహ్రూ ఆ భావనను వ్యక్తీకరించటానికి ఆవిధంగా ప్రసంగించారు. న్యూయార్కులో భారతీయులిచ్చిన సన్మాన సభలో మాట్లాడుతూ తాను అమెరికాకు బిచ్చమెత్తటానికి రాలేదన్నారు. అదే సభలో అమెరికా పెట్టుబడి భారత దేశానికి అవసరమన్నారు. ఇలాంటి వైరుధ్యమైన వుపన్యాసాలు అమెరికను ప్రజలలో, ప్రపంచ ప్రజలలో అల్లకల్లోలాన్ని లేవదీస్తాయి. భారత దేశంలో పత్రికలు ఎంత ప్రచారం ఇచ్చినా యీ వైరుధ్యపు చిక్కులు గోచరిస్తూనే వున్నాయి. సెనేటులో ఒక రకపు వుపన్యాసం, బయట ఇంకొక రకపు వుపన్యాసం—యీ విధానాన్ని అనుసరించటం దేశభవితవ్యానికి ఎటువంటి శ్రేయస్సు చేకూరుస్తుంది?

* * *

పశ్చిమ జర్మన్ ప్రభుత్వం మిత్రరాజ్యాల చేత అంగీకరించబడింది. దానికి ఎదురు దెబ్బగా తూర్పు జర్మనీని అసలు జర్మను కేంద్ర ప్రభుత్వంగా అంగీకరించి అధికారంలో రష్యా కూర్చోబెట్టింది. చైనాను అంగీకరించిన వాళ్లు ఈ తూర్పు జర్మను ప్రభుత్వాన్ని అంగీకరిస్తే బాగుండదా అన్న ప్రశ్న వేస్తారు.

న్యాయానికి యీ ప్రశ్నకు అర్థం లేదు. దేశానికొక పరిపాలన పెట్టి కూర్చుని, మేము స్థాపించిన పాలననే అంగీకరించమంటే తలా తోకా లేకుండా పోతుంది. అసలు జర్మనీలో ఎవడికిష్టమొచ్చిన భాగాన్ని వాడు తన క్రింద వేసుకుని కూర్చోవడంలో నీతి ఏమాత్రం లేదు. ఈ యుద్ధానంతరం జరిగిన మహాకుట్రలలో జర్మనీ పాలనావిభాగం ఒకటి. ఇటు, మిత్రరాజ్యాలు గాని, అటు రష్యా గాని అనుసరించే విధానాల్ని సమర్థించటం చాలా అసంభవంగా వుంది. పోట్స్‌డాం సమావేశంలో జరిగిన అవకతవకలే దీనికి కారణం. ఆనాడున్న ఆతురతగాడ్డి హెచ్చు ప్రాధాన్యం రష్యాకివ్వటానికి ఆంగ్లో, అమెరికన్ దేశాలు సమ్మతించాయి. అట్లా సమ్మతించడం తప్పు. కాని, ఇప్పుడు ఆ తప్పును దిద్దుకోవాలన్న తాపత్రయంలో ఇంకా కొన్ని తప్పులు చేస్తున్నారు. యుద్ధానంతరం జర్మనీ భవిష్యత్తు తప్పుల తడకగా తయారయింది. అధికార మోహంలో పడి కాంగ్రెస్, లీగులు ఇండియాలో పోట్లాడినట్లే జర్మనీ విషయంలో కూడా పశ్చిమ దేశాలు, రష్యా, వివాద పడుతున్నాయి.

* * *

జర్మనీ గొడవ విస్తృతంగా సాగుతూ వుంటే యుగోస్లావియాలో యుద్ధోద్రిక్తి సాగుతోంది. ఈమధ్య రష్యా, యుగోస్లావియాలకి జరిగిన వాదోపవాదగ్రస్త ప్రకటనల వల్ల రష్యా నియంతృత్వ ఆధిపత్య సామ్రాజ్య మార్గం తేటతెల్లమయింది. యుగోస్లావియా ఇంతవరకూ తట్టుకోవటం శుభదాయకం. యుగోస్లావియా బలంగా నిలబడే సరికి బల్గేరియాలో స్లావ్ జాతీయవాదం విజృంభణ కొంత రేగి రష్యాకు తలనొప్పి కలిగిస్తున్నదని వార్తలు వస్తున్నాయి. రష్యాకు తలనొప్పి హెచ్చిన కొద్దీ మంత్రులను తొలగింపు, మరణశిక్షలు, హింసాకాండ, నాల్గు పక్కల చెలరేగుతున్నాయ్. ఈ రగడ ఎంత కాలం జరుగుతుందో, ఎన్ని దేశాలకు ప్రాకుతుందో నిలకడమీద గాని తెలియదు. దీని

పొడిగింపు సూచనలే గ్రీసుదేశంలో కొంతకు కొంత కనబడుతున్నాయి.

* * *

మిలిటరీ గొడవల్లో మునుగుతూ ఉన్న జగత్తులో కల్లోలం ఇట్లా ఉంటే, ఇంతకన్నా మించి ఆర్థికరంగంలో రగడలు సాగుతున్నాయి. అమెరికా వత్తిడికి లోబడి స్టెర్లింగు ప్రాంత దేశాలన్నీ తమ తమ కరెన్సీల విలువల్ని తగ్గించుకున్నాయి. పెట్టుబడిదారీ దేశాల్లో ఆర్థికముసలం ఉద్భవమైనదని, మాస్కో ఆర్థికశాస్త్రజ్ఞులు మీసాలపై చేతులు వేస్తున్నారు. ఇదే అదునని చర్చిల్ తన పార్టీని బలవత్తరం చేసుకోటానికి ప్రయత్నాలు చేస్తున్నాడు. తిరిగి "వేసై తేనా" అంటున్నాడు. లేబరు ప్రభుత్వం కటకట లాడుతోంది.

ఈ భాగోతం ఇట్లా ఉండగా పాకిస్తాన్ ప్రభుత్వానికి తగినంత గౌరవ ప్రతిష్ఠలు జరగడం లేదని న్యూనతా భావాన్ని పొందినట్లు కామన్‌వెల్తు మహాసభల నాటినుండి కొంత కనబడుతుంది. ఈ ధోరణి కనిపెట్టి మాస్కో రాజకీయవేత్తలు పాకిస్తాన్ ప్రధానిని మాస్కోకు ఆహ్వానించారు. ఇండియా ప్రధానిని అమెరికావారు ఆహ్వానించినందున, దానికి ఎదురు ఎత్తుగా మాస్కో పాకిస్తాన్ ప్రధానిని ఆహ్వానించింది. ఇదీకాక, సుమారు ఏడెనిమిది సంవత్సరాల నుంచీ రష్యా రాజకీయాలు ముస్లిం దేశాలకు విరుద్ధంగా ఉన్నాయి. ముస్లిం దేశాలలో ఉన్న ఈ మనస్తత్వాన్ని రష్యా తుడిచి వెయ్యకపోతే, ఒకవేళ మూడో ప్రపంచ యుద్ధమే గనక వస్తే, రష్యాకు ఇబ్బందులు జాస్తి అవుతాయి. అందుకనే రష్యా ఈ ఎత్తు ఎత్తింది. పాకిస్తాన్‌ని కొంచం దగ్గరకు లాగి ముస్లిం దేశాలలో కొంచం సానుభూతి పెంచుకుని అమెరికాలో కొంత అలజడి కలిగించి, మరీ తక్కువగా ఉన్న తమ తాలూకు పంచమాంగదళ కమ్యూనిస్టు వర్గాలకు ఆయాదేశాల్లో కొంత ఆస్కారం చిక్కించుకోడానికి వీలవుతుందని భావించి ఈ ఎత్తు ఎత్తింది.

పాకిస్తాన్ ఇండియాల మధ్య కాశ్మీరు విషయంతో జరిగే మిలిటరీ యుద్ధానికి తోడు, ఇండియా రూపాయి విలువ తగ్గించటం వల్ల, పాకిస్తాన్ తన రూపాయి విలువ తగ్గించనందున రెండు దేశాలమధ్య ఆర్థిక సమరం సంక్లిష్టం అవుతోంది. పాకిస్తాన్ 100 రూపాయలు ఇండియా 144 రూపాయలకు సమానం. ఇది మిత్రద్రోహం అని ఇండియా అంటే, అది స్వామిద్రోహం అని పాకిస్తాన్ అంటుంది. ఎవరి లాభాలకోసం వారు వ్యవహరించేటప్పుడు ఈ ప్రచారానికి అర్థం లేదు.

* * *

నార్వేలో మొన్న ఎన్నికలు జరిగినాయి. లోగడ పార్లమెంటులో కమ్యూనిస్టులకు తొమ్మిది సీట్లు ఉండేవి. ఆ తొమ్మిదీ ఊడినాయి. లేబరు పార్టీకి లోగడ పూర్తి మెజారిటీ ఉండేది. అది ఇంకా ఈసారి పెరిగింది. ఎన్నికలు, మార్షల్ ప్లాన్ క్రింద సహాయం పొందటం తప్పా? రైటా? అన్న ప్రచారంమీద జరిగినాయి. ఆ దేశస్థితినిబట్టి ఒప్పని ఎన్నికలు తేల్చినాయి. దీనివల్ల అష్టరాజ్య కామిన్‌ఫారం నిర్మాణం సహేతుకమైనది కాదని తేలింది. ఈ ఫలితాలే ఇంగ్లండులో వచ్చే ఎన్నికలలో కూడా తేల్చబడతాయా? లేక దేశదేశానికి అనుభవము వేరని తేల్చబడుతుందా?

నార్వే ఎన్నికలవల్ల యూరపియన్ పార్లమెంటు నిర్మాణం ఆవశ్యకతకుకూడా కొంత నైతికబలం చిక్కినట్లుగా ఉంది. యూరపియన్ పార్లమెంటు దేశాలన్నీ ఒకే పారస్పర్య విధానాన్ని అనుసరించి, మొన్న మొన్న బెల్జియం, డెన్మార్కు, లక్జెంబర్గు దేశాలు చూపిన ఆర్థిక ఐక్యతామార్గాన్ని నడిస్తే, యూరోపా పార్లమెంటు తిరిగి యూరపుకు నాయకత్వాన్ని ఇవ్వటమేకాక ప్రపంచానికికూడా నూతన అంతస్తులో రాజకీయ వ్యవస్థా నిర్మాణాన్ని చూపినట్లవుతుంది.



# జనవాక్యం

సంపాదకునికి ప్రకటనార్థం పంపించిన లేఖలు యీశీర్షిక క్రింద ప్రచురిత మవుతాయి. లేఖలు స్పష్టంగా, కాగితానికి ఒక పక్క వ్రాసి పంపాలి.

---

### ఆహార ధాన్యాలు : పంపకం

ప్రస్తుత ఆహార పంపిణీ విధానములో అనేక లోపాలున్నాయని ప్రతికల్లో ప్రచురించగా చూస్తున్నాం. అందులో ముఖ్యంగా ఈ క్రింది లోపాలు ఉన్నాయి.

1. కొంతమందికి మిశ్రమాహారం, కొంత మందికి సంపూర్ణంగా బియ్యం ఇస్తున్నారు. ఈ వర్గాల విభజన సరిగా చేయలేదు.

2. పల్లె ప్రాంతాలలో రేషనింగు కార్డులు ఇవ్వటం, లేదా సంఖ్యలు మార్పు చేయటం, ఈ అధికారాలు ఫిర్కా సప్లయి ఆఫీసర్లకు ఇవ్వడం వల్ల చాలా అనుమానం కలుగుతూవుంది.

3. ధాన్యము మొదట నిర్ణయించటం తూకంలోనూ, తరువాత పంచడంలో లతలలోనూ, అయినందువలన ప్రజలకు నష్టం కలుగుతూవుంది.

4. ఇచ్చే ఆహారం పల్లీయులకు చాలదు.

ఈ లోపాలు సవరించడానికి ప్రభుత్వం వారు హృదయ పూర్వకంగానే ప్రయత్నిస్తున్నారని నమ్ముతున్నాం వారికి తోడ్పడే దృష్టితోనే పై సమస్యలను పరిష్కారము చేయ డానికి, ఈక్రింది పద్ధతులను సూచిస్తూవున్నాము.

1. కొంతమందికి మిశ్రమాహారము, కొంద మందికి సంపూర్ణంగా బియ్యము ఇవ్వడంలో ప్రభుత్వమువారు సంఘానికి ఒక ఘోరమైన అపచారము చేస్తున్నారని గమనిస్తూ? వున్నట్టు లేదు. ఈ పద్ధతివల్ల నిష్కర్షగా రెండు చీలికలు ఏర్పడుతాయి. మిశ్రమాహారము తీసుకునేవారు సంపూర్ణంగా బియ్యం తినగలిగే వాళ్ళను తప్పక ద్వేషిస్తారు. ఈ పద్ధతి తీసివేసిన దానివల్ల నష్ట మేమి? పైగా ఇప్పుడు బియ్యం తీసుకునేవాళ్లు కొంత ధనవంతులనే కదా ఊహ. ఆ ధనవంతులు మిశ్రమాహారంలో యిచ్చే యితర ధాన్యములను రుచికరంగా వక్వం చేసుకునే అవకాశాలు లేవా?

2. ఫిర్కా సప్లయి ఆఫీసరు ఏ గ్రామానికి ఎప్పుడు వస్తాడో తనకూ, భగవంతునికి తప్ప ఎవరికీ తెలీదు. కూలీ నాలీ చేసుకునే జనం అతనిరాక ఎట్లు తెలుసుకొన గలరు? ఈ అధి కారం గ్రామరెడ్డిలో లేక కరణానికో ముందు స్పష్టే యేల అప్పజెప్పకూడదు? ఫిర్కా సప్లయి ఆఫీసర్లు మాత్రం అధికార దుర్వినియోగం చేయ రని యేమి నమ్మకం?

3. తూకంలోనే నిర్ణయించిన ధాన్యాన్ని తూకంలోనే యివ్వరాదా? దీనికి ప్రయత్నం చేస్తున్నామని ప్రభుత్వంవారు ప్రకటించారు. దీనికి ఎంత ప్రయత్నం కావలెనో తెలియదు. ఉత్తర యిండియాలో యీ పద్ధతి అమల్లో ఉంది. గెలుచుకుంటే మనమూ యీ పద్ధతి శీఘ్రంగానే అమలులో పెట్టవచ్చు.

4. పల్లీయులలో నూటికి తొంబది మంది బాగా కాయకష్టం చేసి జీవించేవారు. వీరికి చిరుతిండి పొకర్యాలు పట్టణాల్లో వున్నట్టు లేవు. తమూరు చేసుకోవడానికి వ్యవధి అసలే వుండదు. ఈ సందర్భంలో వారికి మరి రెండో న్సుల ఆహారం ఎక్కువ యిస్తే గాని సరిపోదు.

అదగొండ

కె. యస్. చారి
ఏ. ఆర్. శర్మ

## ఎయిడెడ్ స్కూళ్ళ నెలసరి గ్రాంట్లు

ఉపాధ్యాయ సంఘాల ఆందోళనా ఫలితంగా ప్రభుత్వం ఎయిడెడ్ స్కూల్ టీచర్లకు నెలసరి గ్రాంట్లు మంజూరు చేసింది. స్వల్ప వేతనాలతో జీవితం గడుపని ఈ నిర్భాగ్యపు పంతుళ్ళకు మూడు మాసాలకు ఒక పర్యాయం గ్రాంటు వచ్చుటకన్నా నెలవారీ గ్రాంట్లు కొంత పుపకరిస్తాయని ఆశింపబడెను. కాని ఆచరణలో ఈ నెలసరి గ్రాంట్లు నిష్ప్రయోజకంగా పరిణమించినవి. మూడు నెలలు పనిచేస్తే ఒకనెల జీతంమాత్రమే ముట్టుట జరుగుచున్నది. ఉదాహరణకు ఈ జిల్లాలో ఆగష్టు జీతం అక్టోబరు 26వ తేదీన పోస్టాఫీసుకు వచ్చింది. పోస్టాఫీసులో పైకంలేక మరికొన్ని రోజులు ఆలస్యం జరుగుతున్నది. అదేమి కర్మమోగాని బ్రాంచి ఆఫీసులకు సబ్ ఆఫీసు నుండి మనిఆర్డర్లకు తగినంత పైకం పంపకపోవడం ఆచారమైనది. ఇక పోస్టులేని గ్రామం టీచర్లకు నవంబరులో ఆగష్టు జీతం ముట్టుట జరుగగలదు. నెలసరి గ్రాంట్లవంటి చిన్నస్కీముకూడా ఆచరణలో యెందుకిలా విఫలమగుచున్నదీ ప్రభుత్వము, విద్యాధికారులు యోచించాలి. లోపమున్నచోట సవరించి సకాలములో గ్రాంట్లు అందేలాగ చూడాలి.

మనిఆర్డర్ కమిషన్ టీచర్ల జీతాలలోనే పట్టుట ఈ స్కీములోవున్న మరొక దుర్భర విషయం. ప్రభుత్వంలోని ఏ ఉద్యోగులకు కడకు విద్యాశాఖలోని ఇతర ఉపాధ్యాయులకు కూడాలేని ఈ పద్ధతి ఎయిడెడ్ వారియెడ అవలంబించడం చాలా అన్యాయం. ప్రతినెల ప్రతి టీచరు తన జీతములోనుండి రూ 0—10—0 మనియార్డరు ఫీజుక్రింద చెల్లించవలసి వస్తున్నది. జీతాలు హెచ్చింపబడకపోయి ఈ విధంగా యిస్తున్న స్వల్ప జీతాలలో తగ్గించటం దారుణ విషయం. కావున మనియార్డరుఫీజును ప్రభుత్వమే భరించి నెలగ్రాంట్లు మరుసటినెల 15 తేదీలోగా ఖచ్చితంగా అందునట్లు ఉత్తర్వు చేయవలెను.

పెంపల్లె　　　　వి. విజయరామరాజు

---

## తుపాను: ప్రభుత్వం: సినిమాతారలు

ఆంధ్రదేశం ఒకే నెలలో రెండు తుపాను దెబ్బలకు గురి అయింది. మొదటి తుపానుకంటె రెండవది విపరీతనష్టం కలిగించింది. పర్యా[illegible] ఆంధ్రులగతి కునుకు నక్కమీద తాటిపండు ప[illegible]నట్టయింది. శ్రీకాకుళం మొదలు తెనాలివరకూ పంటలకూ, పశుసంపదకూ అపారమైన నష్టం కలిగింది. స్త్రీ పురుషులుకూడా చావగా మిగిలి[illegible] వాళ్లు గుప్పెట్లో ప్రాణాలు పెట్టుకుని జీవిస్తున్నారు. ఫలసాయానికి వచ్చిన పంటలు పూర్తిగా పాడయిపోగా, నిలవవున్న ధాన్యాదులుకూడా కొట్టుకుపోయాయి.

ఆంధ్రుల కష్టాలు యిలా వుండగా ఆప[illegible] సమయంలో ధైర్యంగా అండ నిలుస్తామనే ఉ[illegible]న్యాసం ఒక్కనాయకుడు కూడా చెయ్యలేదు. ప్రకాశం పంతులుగారు, రంగాగారు కొంతవరకూ సానుభూతి చూపించారు. భారత దేశంలో ఆంధ్రులగతి ఎవరికీ పట్టకపోయినా, దక్షిణ భారతంలోనైనా ఒక్క నాయకుడూ ఆంధ్రుల ఆపద సమయంలో ప్రజలు చెయ్యవలసి[illegible] సహాయంగురించి హెచ్చరిక చెయ్యలేదు. మద్రాసు మంత్రులంతా శాంతి సమయాల్లో ఉపన్యాసాలు చేసి, విందులు పొందే వారేగాని కష్టకాలంలో తగిన సహాయం, ధైర్యం యిచ్చే వారుగా కనిపించరు. ఏడుకోట్ల రూపాయల నష్టం కలిగిన ప్రాంతాల్లో నలభై వేల రూపాయలు మంజూరు చేస్తే ఎందుకు చెయ్యకపోతే ఎందుకు? ఇటువంటి అల్పసహాయాలు చేసి ప్రజ[illegible]చేత ఉద్ధరించామనుకోవటం హాస్యాస్పదం. ప్రకాశంగారు ప్రభుత్వానికి సలహా యిచ్చి[illegible] ఏభై లక్షల రూపాయలు కూడా ఒక జిల్లాలో అమితంగా దెబ్బతిన్న బీద, సాదలకు, రైతులకు కొంత సహాయం మాత్రమే యివ్వగలదు. కాబట్టి ఒక్కొక్క జిల్లాకు మద్రాసు ప్రభుత్వం ఎ[illegible] లక్షల రూపాయలైనా మంజూరు చెయ్యడం కనీస ధర్మం.

ఈ సమయంలోనే లక్షలాది ఆర్జించిన మన సినిమా తారలు విరివిగా విరాళా లివ్వాలి. ఆంధ్ర ప్రేక్షకుల ఆదరాభిమానాల్ని, తద్వారా అమితమైన ధనాన్ని ఆర్జించిన [illegible] సినిమా తారలు తుపాను బాధితులకు [illegible] చెయ్యటం వారి విధిగా తలచాలి.

మద్రాసు　　　　ఉ. వెం.

విభక్త కుటుంబం



ప్రత్యేకాంధ్రరాష్ట్ర నిర్మాణంపట్ల
అన్ని వర్గాలవారు తమ ఆమోదం
తెలిపారు.

# తెలుగు స్వతంత్ర

సంపుటి-2 | నవంబరు 25, 1949 | ప్రచురణ:
సంచిక-17 | | ప్రతి శుక్రవారం


## లోపించిన సౌహార్ద్రం

అవతరించనున్న ఆంధ్రరాష్ట్రం గురించి నేడు వెలువడుతున్న ప్రకటనలు, జరుగుతున్న వాదోపవాదాలు, నాయక ప్రముఖు లభయహస్తం చాచి యిస్తున్న హామీలు, బహుళ సంకీర్ణమైనవే కాక, కొన్ని వేళల కేవలం వినోదకరంగా పరిణమిస్తున్నాయి. యుగయుగాల పూర్వాంధ్ర వైభవం పునఃప్రతిష్ఠితం తక్షణమే చెయ్యాలనే కనీసపు కోర్కె నుండి, పంపక సమయంలో న్యాయముగా మనకు రావలసిన ఆస్తిపాస్తులన్నీ అప్రమత్తులమై రాబట్టుకోవాలనే వివేకవంతమైన సలహావరకూ. నేడు మనకు వినవస్తున్న అపూర్వ హితోక్తు లనేకానేకం. కొందరి కిది స్వంత సుషిర ప్రయోగించడానికి అమూల్యమైన వేళ. పరిస్థితుల ప్రభావంవల్ల మనకు కార్యకర్తలుగా వ్యవహరించవలసిన వారు జాగరూకతతో వ్యవహరిస్తారో లేదోనని ఆందోళనపడే సహృదయులు తమ శక్తివంచన లేకండా, ముందు చెయ్యవలసిన వాటిగురించి హెచ్చరిస్తూనే ఉన్నారు. వాటిని శ్రద్ధగా పాటించవలసిన బాధ్యత కార్యకర్తలది. రానున్న మన ప్రత్యేక రాష్ట్రం సూక్ష్మంగా పరిశీలిస్తే అవ్యాజమైన సర్వతోముఖ సౌహార్ద్ర వాతావరణంలో జనించడం లేదు. కల్పింపబడిన అవరోధాలన్నీ కల్పింపబడిన తర్వాత, జరగవలసిన విభీషణ యత్నాలన్నీ జరిగిన తరవాత, వీటన్నిటినీ నిష్ఫలం చేయగల్గిన ఆంధ్రుల ఆందోళనా ఫలితంగా, ప్రత్యేకరాష్ట్రం ఏర్పడుతున్నది.

అంతమాత్రాన సంకుచిత దృష్టితో వ్యవహరించాలనిగాని, ఆంధ్రత్వపు పొలిమేరలవరకూ మన ఉద్రేకం స్థాయీభావం పొందాలని కాని ఎవరూ వాదించరు: మనం ప్రత్యేకమైన రాష్ట్రం కోరడానికి కారణం ఏవిధమైన సంకుచితవర్గతత్వమూ కాదు. కేవలం ప్రాంతీయమైన కొన్ని వ్యత్యాసాలు మినహాయిస్తే, మనమూ భారతీయులమే కాని, ప్రత్యేకమైన జాతి కాదు: భారతీయ సంస్కృతి అనేది ఏదైనా ఉంటే, మనదీ ఆ సంస్కృతే. అయితే యిక రాష్ట్రం దేనికి? అనే ప్రశ్న రావచ్చును. పరిపాలనా సౌకర్యం కోసం: భారతదేశంలో తక్కిన ప్రాంతాల వలెనే ఆంధ్రదేశం సైతం అభివృద్ధి చెందడానికి అవకాశాలు కల్పించుకోవడం కోసం. ఇన్నాళ్లూ మన పొరుగువారికి విశాలదృష్టీ, సఖ్యభావం లోపించి, ఆంధ్రదేశాన్ని అన్నివిధాలా

చిన్నచూపు చూశారు. అంతే కాక, రాష్ట్రప్రభుత్వంలో వాళ్ళ ప్రాభవం ఎక్కువవడం వలన యింతవరకూ అన్ని విషయాలలోనూ తెలుగు జిల్లాలు వెనక్కు నెట్టబడ్డాయి. వ్యవసాయాభివృద్ధికీ, పరిశ్రమల అభివృద్ధికీ, రాష్ట్రప్రభుత్వపు సహాయం అంతా తమిళ దేశానికే తరలించబడింది. అనేక దశాబ్దాల నుండి జరుగుతూన్న యీ అన్యాయాన్ని అరికట్టడానికి మనం ప్రత్యేక రాష్ట్రం కోరినది.

అందువల్ల ఆస్తిపాస్తుల పంపకం విషయంలో అవన్నీ లెక్కలోకి తీసుకోబడాలి. ఉమ్మడి ఆదాయం నుండి యింతకాలమూ ఖర్చుపెట్టబడిన మొత్తాలకు ఉచితమైన పరిహారం ఆంధ్ర రాష్ట్రానికి రావలసివుంది; ఆ విషయమై నిపుణులైన అర్థశాస్త్ర వేత్తలను నియోగించి, ఉమ్మడిరాష్ట్రపు ఆదాయ వ్యయాలను ఆయా నిష్పత్తిలో రెండు రాష్ట్రాలకూ పంచవలసి ఉంటుంది. ఇవన్నీ సక్రమంగా జరగడానికి రెండు వర్గాలవారూ సామరస్యం ప్రదర్శించి కేంద్రప్రభుత్వ పర్యవేక్షణ క్రింద వర్తించాలి. వెలువడుతున్న ప్రకటనల బట్టి చూస్తే, కేంద్ర ప్రభుత్వం తనకి తానే పూనుకుని యీ విషయం పరిష్కరించడం మాని,ఆ కర్తవ్యం ఉభయపక్షాల వారికే వదలివేయ దలచినట్లు గోచరిస్తున్నది. అంతే కాక, ఏర్పడనున్న ఆంధ్రరాష్ట్రానికి కేంద్ర ప్రభుత్వం నుండి ఏ విధమైన ఆర్థిక సహాయమూ లభించదని వార్తలు. కారణాలు వివరించలేదు. ఇదే నిజమైతే, యీ మన స్వత్వాన్ని ఏమనాలో తెలియదు. కేంద్రప్రభుత్వం నుండి ఆంధ్ర దేశం సహాయం ఆశించడంలో అసంగతం ఏమీ లేదు. తక్కిన భారతదేశం నుండి విడిపోయి మనం స్వాతంత్ర్యం ప్రకటించబోవడం లేదు. ఒక రాష్ట్రం రెండు రాష్ట్రాలుగా విడదీయబడినంత మాత్రాన రెండో రాష్ట్రం ఎందుకు ఆ అర్హత గోల్పోతుంది! ఇటీవల విశాఖ జిల్లాను రెండుగా విభజించడానికి ఏర్పాట్లు జరుగుతున్నాయి. విభజన పూర్తయాక ఉత్తర విశాఖకు ఏ విధమైన సహాయమూ రాష్ట్ర ప్రభుత్వం చెయ్యకూడదనడం ఎంత సమంజసమో, ఆంధ్రకు కేంద్రప్రభుత్వ సహాయం లభించదనడమూ అంతసమంజసమే. కేంద్రప్రభుత్వాదాయానికి ఆంధ్ర దేశమూ తన వంతు యిస్తున్నది.అటువంటప్పుడుమనం వాంఛించే సహాయం ధర్మభిక్ష కాదు.

పోగా, ఆంధ్రరాష్ట్రానికి రాజధాని ఎక్కడుండాలి అనే ప్రశ్న తేలేవరకూ నూతన ప్రభుత్వం మద్రాసులోనే ఉండాలనే విషయంలో వివాదానికి తావు లేదు. అయినా కొందరు ఆంధ్రేతరులు అందుకు వ్యతిరేక ప్రచారం చేస్తున్నారు. ఆంధ్రులకు ఎలాగూ మద్రాసుపై హక్కులేదన్న తరవాత, ఆ విషయం ఆంధ్రనాయకులు అంగీకరించిన తరవాత తాత్కాలికంగా మద్రాసు ఆంధ్రులకు రాజధానిగా ఉండడానికి అభ్యంతరం దేనికి? ఇవన్నీ చూస్తూంటే, యిటు మన పొరుగువారికిగాని, అటు కేంద్ర ప్రభుత్వానికిగాని, ఆంధ్రరాష్ట్రం పట్ల హృదయ పరివర్తన కలిగినట్లు లేదు. ఆంధ్రనాయకులు ఇది గమనించి నిర్నిద్రమైన జాగరూకతతో వర్తించడం ఎంతైనా అవసరం.

# అఖిలాంధ్ర సంస్కృతి పరిషత్తు

మల్లంపల్లి సోమశేఖర శర్మ

మన ఆంధ్రరాష్ట్రము రాగానే సరికాదు. మన దేశమునకు రాష్ట్రగౌరవము చేకూరవలెనంటే దానిలో జాతీయ పునర్నిర్మాణానికి ఆవశ్యకములయిన ఎన్నో సంస్థలు ఉండాలి. పారిశ్రామిక, ఆర్థిక, సాంఘిక, సాంస్కృతిక సంస్థలులేని రాష్ట్రము చెట్లు చేమలులేని బోడి కొండవలె బోడిగానే ఉంటుంది. ఇటువంటి సంస్థలుంటేనే కాని రాష్ట్రము ప్రయోజనకరమూ, అధికోపయోగకరమూ కాదు. ఇట్టి సంస్థ లన్నిటినీ స్థాపించడానికి మనం ప్రభుత్వంమీద భారంవేసి చేయికట్టుకొని కూర్చోవడం భావ్యం కాదు. తమ ప్రయోజనానికీ, తమ యుపయోగానికీ, తమ యభ్యుదయానికీ ఏయేవిషయా లవసరమో ముందు ప్రజలే యోజించి, గుర్తించుకొని, కార్యారంభానికి నడుంకట్టాలి. ఆటు తరువాత ప్రభుత్వ సాహాయ్యం అర్థించాలి. ఇది ప్రజాస్వామికయుగం; ఆరంభోత్సాహం ప్రజలనుంచే రావాలి ముందు; ఆటుతరువాతనే ప్రభుత్వం పూనుకొంటుంది. ఈ నాటి విషమ విషాదకర పరిస్థితులలో ప్రభుత్వ బాధ్యత లనంతములుగా ఉన్నవి; ప్రభుత్వం పరిష్కరింపవలసిన సమస్యలూ అనేకంగా ఉన్నవి. వీటి నిర్వహణలోను, పరిష్కారములోను ఇంకా ఒక తోవ తెన్నూ గానక ప్రభుత్వం ఉక్కిరి బిక్కిరవుతోంది; దానికున్న కార్య భారంతో అది తలమునక లవుతున్నది. ఇట్టి కార్యముల కన్నిటికి అది ఎప్పుడో పూనుకొంటుందని సర్వమూ దానికే విడిచిపెట్టి చేతులు ముడుచుకొని కూర్చోవడం వివేకం కాదు. ప్రజ లందరికీ ఉండ నిల్లూ, కట్ట బట్టా, తిన తిండీ సమకూర్చడమే సాధ్యంకాక ప్రస్తుత ప్రభుత్వం పిల్లిమొగ్గలు వేస్తున్నది. ఈ కడగండ్లలోనుంచీ, ఈ సాము గరిడీలలోనుంచీ అది తేరుకొని తలయెత్తి బయట పడినప్పటిమాట - అదెప్పటికో. అప్పుడు కాని ఇతర విషయాలనుగురించి ఆలోచించడానికి దాని కవకాశం దొరకదు. అంతవరకు ఆయా విషయాలనుగురించి ప్రజలే నడుంకట్టి ముందుకు వచ్చి కొంత కృషి సాగించాలి. దైనిక అవసర కార్య సాధనము, దైనందిన పరిపాలనములతో పాటు జాతీయ పునర్నిర్మాణ కృషికూడా సరి సమానంగా సాగుతూండాలి. ముఖ్యంగా మన సంస్కృతికి సంబంధించిన కృషి. కళాశాలలలోను, విశ్వవిద్యాలయాలలోను సైన్సుకు అధిక ప్రాధాన్యం ఇచ్చి ఆర్ట్సును కుంచింపజేస్తున్నట్టే ప్రభుత్వంవారు తాత్కాలిక అవసర సమస్యల విషయములోనే తమ దృష్టినంతను కేంద్రీకరించి సంస్కృతి సంస్థల విషయమున అంత ఎక్కువ శ్రద్ధ వహించకుండా ఉన్నారు. ముందంజవేసి ఈ లోపమును తీర్చవలసినవారు ప్రజలు.

ఇంతవరకు మనం రాష్ట్రంకోసమే అత్యంతమూ ఆందోళన చేస్తూవచ్చాము. కాని మన సంస్కృతికి సంబంధించిన అవసరాలను గుర్తించనూ లేదు; వాటినిమిత్తం అంతగా కృషి చేయనూ లేదు. జాతి సర్వతోముఖమైన వికాసం పొందడానికి రాష్ట్రం వచ్చేనాటికి మనం ఇతర విధాలకూడా అభివృద్ధిపొందాలి. రాష్ట్రం వచ్చిన నాటినుంచే మనం ఆధునికార్థంలో ఒక జాతిగా రూపొందబోతున్నాం; మనకు ప్రత్యేక రాష్ట్రం ఇంతవరకు లేదు గనుకనూ, ప్రభుత్వం ప్రత్యేకం మన దొక్కరిదే కాదు గనుకనూ మనలో పరిపాలనశాఖలలో కాని, ఇతర ఆర్థిక, రాజకీయాది రంగాలలో కాని అఖిలభారత ప్రసిద్ధి వహించినవారనేకులు లేకపోవడం తటస్థించింది. మన జాతిలోని ప్రతిభనూ, ప్రజ్ఞనూ, ప్రావీణ్యమునూ గుర్తించి ఊత యిచ్చి ముందుకు త్రోయుటకు మనదన్న ప్రభుత్వమే లేకపోయె; మనకు రాష్ట్రమే లేకపోయె. ఇటువంటి విషమ పరిస్థితులలోకూడ అఖండ భారతవిఖ్యాతి, విశ్వ విఖ్యాతి ఆర్జించినవారు ఏ కొందరో కనబడు

కున్నారంటే అది మనజాతి శక్తియుక్తులకూ, పటిమా ప్రాభవాలకే తార్కాణం. ఇప్పుడే రాష్ట్ర లాభముతో దేశమునకు వ్యక్తిత్వం వచ్చింది. మనలో జీవితం అన్ని రంగాలలోను గొప్పవారు ఇంతటి నుంచే బయలుదేరాలి; మన జాతిలో ఏ కళలో, ఏ విద్యలో, ఏ శాస్త్రములో— దేనిలో ఏమాత్రం పాటవమున్నా, ప్రజ్ఞయున్నా అది యిప్పుడింక పైకి రావాలి, వెల్లడి కావాలి. ఏయే రంగాలలో ఏయే విధంగా కృషి చేస్తే మనదేశం అభివృద్ధి పొందుతుందో, మన జాతి కభ్యుదయం కలుగుతుందో-వీరు వారనక భావుకు లందరూ తమ కభిమానమైన విషయాలనుగురించి, తమకు పరిచయమున్న విషయాలనుగురించి ఎవరికి వారాలోచించి, సూచనలు చేసి, పథకములు వేసి కార్యనిర్వహణమునకు పూనుకోవాలి. జీవితము బహుముఖమయినది; సర్వతోముఖమైన అభివృద్ధి కలిగినప్పుడు కాని జాతి వికాసం పొందదు. విద్యావిషయంగా ఆలోచించాలి; పరిశ్రమల విషయం ఆలోచించాలి; అన్నిటిని మించి సంస్కృతి విషయం ఆలోచించాలి.

ఆహార, వస్త్రసంపన్నత మనజాతి సమర్థతనూ, ప్రజ్ఞాపాటవాన్ని తెలియజేస్తే మన సంస్కృతి శోభ మనజాతి బుద్ధి విశేషాన్ని, ప్రతిభావిదగ్ధతనూ నిరూపిస్తుంది. జాతికి ఘనతను కూర్చేది సంస్కృతే. అందువల్ల ఆహార, వస్త్ర క్షామం తొలగించడానికి తీవ్రమయిన కృషి ఎంత యావశ్యకమో జాతిని సంస్కార సంపన్నం చేయడానికి సైతము అంతటి గొప్ప కృషి అవసరం. జాతి భౌతిక దేహపోషణకు ఆహార, వస్త్రము లెంత యవసరమో జాతి చిత్త వికాసమునకును సంస్కృతి (సంస్కారము) అంతే యవసరము. రెండును సరిసమానముగ సాగవలసిన కృషులు. ఒకదానిని కృశింపజేసి రెండవ దానిని పెంపొందించుట భావ్యమూ కాదు; శ్రేయమూ కాదు. మనకు తిన తిండీ, కట్ట బట్టా లేనప్పుడు సంస్కృతి విషయం తొందర వచ్చిందా అని కొందర నాలోచితంగా అని వేయవచ్చు. అది వివేచనాపరు లనదగిన మాట కాదు; ఆలోచనలేని మాట. ఆహారవస్త్రముల విషయంలో దేశములో ఎంత కొరత యున్నప్పటికీ అందరూ ఎల్లప్పుడూ అనుదినమూ అనునిమేషమూ ఇతర కార్యప్రవృత్తి మాని ఒక్క ఆ విషయాలనుగురించి మాత్రమే కృషిచేయరు. అందరూ మగ్గములు పెట్టి నేతనేయుట కాని, అందరూ దుక్కి దున్ని సేద్యముచేయుట కాని సాధ్యమూ కాదు, అసహజము కూడాను. జాతీయ సంపద అంటే ఒక్క ఆహార, వస్త్రాదికములు మాత్రమే కాదు, తదితరములును ఉన్నవి. సంస్కార విషయకమైన కృషి ఎక్కువగా జరిగినప్పుడే జాతి మనసూ, దృష్టీ విశాలమవుతుంది; రాజకీయాధికార లాభంతో వచ్చే అనర్థకాలం అన్నీ కాకపోయిన మానె, కొన్నయినా తగ్గడానికి అవకాశం కలుగుతుంది. అనాగరిక స్థితి నుంచి, ఆటవిక జీవితంనుంచి మానవు డీనాటి నాగరికస్థితికి వచ్చి సభ్యుడయినా డంటే దానికి కారణం వేలువేలు కాలాలలో జరిగిన అఖండ సాంస్కృతిక కృషే. ఆధునిక కాలంలో పరస్పరమూ జాతులమధ్య వ్యాపించివున్న యుద్ధ భయాన్ని నివర్తింపజేసి పరస్పరమూ ప్రేమ సౌహార్దములను నెలకొల్ప గలిగేది సాంస్కృతిక కృషే. మానవుడు మానవుని, జాతి జాతిని ప్రేమించి గౌరవింపజేసేదీ, పరస్పరమూ ఒండొరుల బాధ్యతలను గుర్తింపజేసి, విశ్వకల్యాణానికి తోడ్పడ ప్రేరేపించేదీ సంస్కృతే.

సంస్కృతి ఆత్మకు సంబంధించిన విషయం. మన ప్రాచీన మహర్షులు ప్రధానంగా ఆత్మవిద్యావిశారదు లవడంవల్లనూ, ఆధ్యాత్మిక తత్వవిచారశీలు రవడంవల్లనూ అనాదికాలం నుంచి మన జాతి చేసిన కృషి అంతా సంస్కృతి పరమైనదే. "ఆత్మవత్సర్వభూతాని" అన్న సూక్తి మన దేశంలోనే పుట్టగలిగింది; మనిషిలోనే కాదు, చెట్టులోను చేమలోను, గట్టులోను పుట్టలోను, రాతిలోను, రప్పలోను ప్రాణం ఉందనే సిద్ధాంతం మన దేశమే ప్రతిపాదించగలిగింది. కీర్తికాయుడయిన జగదీశ చంద్రబోసు ఆ సిద్ధాంతాన్నే విశ్వవిఖ్యాత భౌతిక శాస్త్రజ్ఞుల పరీక్షల కాగిన పరిశోధనా ప్రయోగముల ద్వారా నిరూపించి, దానికి భౌతిక శాస్త్రీయమయిన మర్యాద చేకూర్చినాడు. ఒక్క తోటి మనిషినే కాకుండా సర్వజీవులను, ప్రకృతిని సైతము ప్రేమించుమన్న మహాదర్శ మీ భారత పవిత్రక్షేత్రంలోనే ప్రారంభిత మయినది. అందు

వల్లనే అహింసే పరమధర్మ మన్న ధర్మసూత్రి మీగడ్డనే వినవచ్చింది. అటువంటప్పుడు, ఆశ్చర్య మేముంది అహింసా ప్రధానములైన జైన, బౌద్ధ మతాలు ఈ మహాదేశంలో జననం పొందడంలో? చివరికి గాంధీమహాత్ముని జీవిత కృషి కూడా ప్రధానంగా సాంస్కృతిక మయినదే. ప్రాచీనకాలంలో మన పూర్వులీ సంస్కృతినే, ప్రేమాత్మక సందేశాన్నే దేశ దేశాలకు గొనిపోయి పైరు పెట్టారు; ఈ ప్రేమామృతాన్నే పంచిపెట్టారు. ఎవరికీ సందేశాన్ని వినిపించారో, ఎవరికి దానిని పంచిపెట్టారో వారిని తరింపజేశారు; తాము తరించారు. ఈ విధంగా మన పూర్వులు భారతదేశ సీమావధులను దాటి స్థాపించినది ఖడ్గవిజిత రక్తారుణ సామ్రాజ్యము కాదు; ప్రేమ విజిత పరిపూత సంస్కృతి సామ్రాజ్యము; వారు బ్రతికారు; ఇతరులను బ్రతుకనిచ్చారు: వారు ప్రేమించారు. ఇతరులను ప్రేమింపజేశారు; వారు సంస్కారులయినారు; ఇతరులను తరింపజేశారు. ఇంతటి కృషికీ వారికి సంస్కృతే సాధనమయింది. యుద్ధభయ ప్రచండ ఝంఝానిలక్షుభితమయిన ఆధునిక కాలంలో జగదవన సమర్థమయినది సంస్కృతే, సాంస్కృతిక కృషే.

వారలమాట అటుండగా మన ఆంధ్రదేశంలోనే వివిధ విభాగాలలో నివసిస్తున్న ఆంధ్రుల మధ్య పరస్పరమూ విభేదాలూ, వైషమ్యాలూ ఉన్నవన్న విషయం వేరే చెప్పనవసరం లేదు. ఈ విభేదాలను తొలగించుకోడానికైనా యువకులందరు నడుంకట్టి సాంస్కృతికకృషిలో ప్రవృత్తులు కావాలి; ఒక విభాగంలోనివారు మరివక విభాగంలోని వారిని, వారి సమస్యలను, అవసరాలను బాగా అర్థం చేసుకొనేటందుకు కృషి జరగాలి; రాజకీయాధికార వ్యామోహం పరస్పరమూ స్వార్థపరతను పెంపొందించి విభేదాలు పెంచుతుంది కాని సాంస్కృతిక కృషి ఒండొరులను దరకు చేర్చి పరస్పరమూ వారిలో ప్రేమ, సౌహార్దములు అభివృద్ధిపొందిస్తుంది. అందువల్ల సంస్కృతి విషయంలో సంతతమూ గొప్ప కృషి చేయడానికి ఆంధ్రదేశంలో ఒక సంస్కృతి పరిషత్తు (cultural academy) ఒకటి స్థాపించాలి. ఈ పరిషత్తు సంస్థాపనలో రాయలసీమవారూ, తెలంగాణా వారూ, మధ్యాంధ్రదేశీయులూ (కోస్తా జిల్లాలవారూ) సరిసమానంగా పాల్గొని కృషి చేయాలి. ఇందుకు భావుకులైన యువకు లందరూ పూనుకోవాలి; స్వార్థపరతతో కాని, తాత్కాలిక లాభాపేక్షతో కాని, హ్రస్వదృష్టితో కాని కృషి చేస్తే అసలు మొదటికే మోసం వస్తుంది. మనం ఏ పని చేసినా, ఏ విషయమునుగూర్చి ఆలోచించినా మహాంధ్రమును, సమగ్రాంధ్ర దేశమును దృష్టిలో నుంచుకొని పాటుపడడం నేర్చుకోవాలి. కేవలం ఒక్క రాయలసీమ కాని, ఒక్క తెలంగాణా కాని, ఒక్క మధ్యాంధ్రదేశం కాని కాక మన ప్రయత్నాలకూ, మన ప్రయత్నాలకూ, మన కృషికీ సర్వాంధ్రదేశమూ లక్ష్యం కావాలి. ఈనాడు మహాంధ్ర నిర్మాణం సాధ్యం కాకపోతే పోవుగాక. ఏనాటికయినా అదే మన లక్ష్యం; మనం ప్రతివిషయంలోను చేసే కృషిఅంతా దానికనుగుణంగా ఉండాలి. స్థాపితం కావలసిన సంస్కృతి పరిషత్తుకు ఆంధ్రదేశంలోని మూడు ప్రధాన విభాగాలలోను మూడు ప్రధాన కేంద్రము లుండాలి. ఒక్కొక్క కేంద్రాన్ని కనుబంధించి ప్రతి విభాగంలోని గ్రామాలలోను శాఖ లుండాలి. ఆధునిక కాలాను గుణంగా ఆంధ్రసంస్కృతి నుద్ధరించి దానికి క్రొత్త తీర్పు తీరువ లియ్యడానికి అందరు పూనుకోవాలి.

ఈ సందర్భంలో హైదరాబాదు ఆంధ్ర సారస్వత పరిషత్తును ప్రత్యేకంగా అభినందించడం అవసరం. సారస్వత పరిషత్తు అనే పేరు పెట్టుకొన్నప్పటికీ ఈ హైదరాబాదు సంస్థ పూజ్యులయిన శ్రీ మాడపాటి హనుమంతరాయ ప్రభృతుల నాయకత్వాన తెలంగాణాలో ఆంధ్రసంస్కృతి పునరుజ్జీవనంకోసం గొప్పకృషి చేస్తున్నది. శ్రీ దేవులపల్లి రామానుజరావు, శ్రీ పులిజాల హనుమంతరావుగార్లు కార్యదర్శులుగా ఉండి ఈ సంస్థకు ప్రజాదరం సంపాదించడానికి బహువిధాల కృషి చేస్తున్నారు. కడచిన ఫిబ్రవరిలో తూప్రాన్‌లో జరిగిన ఈ పరిషత్తు వార్షికసమావేశం దర్శించినవారికి ఇది అప్పుడే తెలంగాణా ప్రజల ఆదరాభిమానాలు ఎంత విశేషంగా చూరగొంటున్నదీ తెలుస్తుంది. ఆ

మహాసభ సందర్భంలో పరిషత్తువారు చిత్రకళా ప్రదర్శనము, పత్రికా ప్రదర్శనములే కాక గ్రామ వాసులకు విజ్ఞానప్రదములయిన అనేక యితర ప్రదర్శనములను, మ్యాజిక్ లాంతరు ఉపన్యాసము లనుకూడా ఏర్పాటుచేశారు. ఇప్పుడు పరిషత్తు వారు తెలంగాణాలో ప్రతి జిల్లాలోను ఊరూరా పరిషత్తు శాఖలు స్థాపించి గొప్పకృషి చేస్తు న్నారు. ఇందుకు పరిషత్తువారును, కార్యనిర్వా హకులుకూడ ప్రశంసాపాత్రులు.

హైదరాబాదు ఆంధ్రసారస్వత పరిషత్తు వారివలెనే ఏకీభావముతోను, దూరదృష్టితోను సమగ్రాంధ్ర దృష్టితో కలిసి పనిచేసే యువకులు కావాలి. అప్పుడే అఖిలాంధ్ర సంస్కృతి పరి షత్తు ఆంధ్రాభ్యుదయకరమైన సంస్థగా వరిల మించగలదు. ఇంతవరకు ఆంధ్రదేశంలో సంస్కృ తికి సంబంధించిన వేరువేరు విషయాలలో కొందరు కొందరు వ్యక్తులూ, కొన్ని కొన్ని సంస్థలూ విడివిడిగా తమకు చేతనైన రీతిని కొంత కృషి సాగిస్తున్నప్పటికీ సంస్కృతి శాఖలు అన్నిటికీ వర్తించే, మహాంధ్రమును లక్ష్యంలో ఉంచుకొని పాటుపడే సమగ్ర సంస్కృతి మహా సంస్థ ఏర్పడినప్పుడే మన సంస్కృతికృషి జవమూ బలమూ సిద్ధించి, దానికి రూపురేఖ లేర్పడగలవు.



## మన పూర్వుల కళాదృష్టి

మన పూర్వులకున్న కళాదృష్టి మనలో కానరాదు. చిలుకనో పువ్వునో చెక్కని చెంబు బోడిచెంబే! అంచులేని యుడుపుల ధరించుట అమంగళమని తలంచిరి. ఇండ్లగోడలపై చిత్తరువులు వ్రాయిస్తూ వుండిరి. ద్వారముల చౌకట్లపై చక్కని జంత్రపు పని యుండెడిది. బట్టలపై అద్దకముతో బొమ్మలను వేయుచుండిరి. ధనికులు పటములను వ్రాయించెడివారు. కాకతీయుల కాలములో చిత్తరువులు జనసామాన్యమందును ఆదరణీయముగా నుండినట్లు కానవచ్చును. ఇండ్లముంగిళ్ళలో ముగ్గులతో చాలా చక్కని చిత్రములను పడుచులు తీర్చుచుండెడువారు. ప్రతాపరుద్రుని యుంపుడుగత్తె యగు మాచల్దేవి యింటి నెట్లలంకరించినదో గమనించుడు:

"చందనంబున కలయంపి చల్లినారు
ముగ్గు లిడినారు కాశ్మీరమున ముదమున
వ్రాసినారిందు రజమున రంగవల్లి
కంజముల దోరణంబుల గట్టినారు"

ఎందుకనగా, మాచల్దేవి "చిత్రశాలా ప్రవేశంబు చేయుచున్నయది. పుణ్యాహవాచనకాలంబు." ఏ విధముగు చిత్తరువులు వ్రాయుచుండిరో అవియు తెలియవచ్చినవి. దారుకావనములోని శివుడు,గోపికా కృష్ణులు, అహల్యాసంక్రందనులు, తారా చంద్రులు, మేనకా విశ్వామిత్రులు మొదలైనవి వ్రాయిస్తూ వుండిరి.

—(సురవరము ప్రతాపరెడ్డి)




(11-11-49వ సంచిక తరువాయి)

## కృష్ణదేవరాయలు

క్రీ. శ. ౧౫౦౯-౧౫౩౦

వీరనరసింహరాయలు స్వర్గస్థుడై నపిమ్మట అతని జ్యేష్ఠమాతురుడగు కృష్ణదేవరాయలు వజ్ర సింహాసనము నధిష్ఠించెను. శకాబ్దము ౧౪౩౧ వ సంవత్సరమున శ్రీజయంతి నాడు అనగా క్రీ. శ. ౧౫౦౯ ఆగష్టు ౮ వ తేదీన నతని పట్టాభిషేక మహోత్సవము జరిగెనని విజయనగర సామ్రాజ్యము నందు జెప్పియున్నది. ఇది వాస్తవము గావచ్చును. కాని యతని యధికారము సామ్రాజ్యమంతం టెల్లయెడలను చెల్లుబడికాలేదు. వీర నరసింహరాయలు దనపై ప్రతిఘటించిన సామంత నాయకవర్గమును జయించి వారి యాధిపత్యముక్రింద నుండిన సీమలను స్వాధీన పఱచుకొనెనని చరిత్రకారులు వ్రాసియున్నను, కొందఱు పాళెగాం డ్రింకను రాయలను ధిక్కరించియేయుండిరి. మఱియు రాయల యేలుబడి క్రింది రాష్ట్రమునందుగూడ నతని యాజ్ఞ నిర్వక్రముగ సాగక యుండెను; అమరనాయకులు రాయల యాజ్ఞను శిరసావహింపక పలుమారు యథేచ్ఛగ వర్తించుచుండిరి; వారిని దగురీతిని శిక్షించి రాయల యాజ్ఞ వములకు దెచ్చుటకు కేంద్రప్రభుత్వమునకు శక్తి చాలదాయె. సామ్రాజ్యమందలి స్థితిగతు లివి. వానికితోడు రాయరాష్ట్రము నాక్రమించుకొని సుస్థిరులై యుండిన పరదేశ ప్రభువుల నోడించి తఱిమి వేసి నష్టమైపోయిన సామ్రాజ్య భాగములను మరలజయించిస్వాధీనపఱచుకొనవలసియుండెను. తీరాంధ్రమంతయు గజపతి క్రిందనుండెను; బహమనీరాజ్య మున్నన్నపోయినను, ఉత్తర దిక్కున మహమ్మదీయుల యొత్తిడి తగ్గలేదు; బహమనీ రాజ్యమునుండి యున్నన్నమైన నూతన సంస్థానముల పాలకులు విజయనగర రాష్ట్రమును జయించి తన్మూలమున దమ రాజ్యవైశాల్యమును బెంపొందింప నెడతెగని ప్రయత్నము సల్పుచుండిరి. వారిలో ముఖ్యుడు బిజాపుర సంస్థానస్థాపకుడగు యూసుపు ఆదిల్ ఖానుడు. ఇతనికి సమకాలికాంధ్ర గ్రంథకర్తలు సపాదుడని పేర్కొనిరి. ఇతడు రాయరాష్ట్రమునాక్రమించుకొనుటకు గట్టి ప్రయత్నములు సేయుచుండెను. గోల్కొండ ప్రభువు కుతుబు-ఉల్- ముల్కు గూడ రాయరాష్ట్రముపై గన్నువేసి సమయ మనుకూలపడినపుడెల్ల దండయాత్రలు సాగించు చుండెను. మఱియు క్రీ. శ. ౧౫ వ శతాబ్దాంతమున వర్తకము కొఱకు దక్షిణ భారతదేశమునకు వచ్చిన పాశ్చాత్య పోర్చుగీసులు క్రమక్రమముగ పశ్చిమ సముద్రతీరమందలి కరపట్టణముల నాక్రమించుకొని ప్రబలజొచ్చిరి. పోర్చుగీసులు సామాన్యముగ రాయలతో మైత్రి నెఱపి

వర్తించుచుండెను, గాదా చిక్కుముగ వైరస్యము జూపుచుండిరి. కావున కృష్ణదేవరాయలు సామ్రాజ్యమును పాలించిన ఇరువదేండ్లును నెవ్వడైననొక శత్రునితో పోరాడవలసివచ్చెను.

రాజ్యాభిషేకము వడసి పేమిపై నాటియు నాటిక మునుపే కృష్ణదేవరాయలకు పరభూమీశ్వరులతో యుద్ధము గలిగినది. క్రీ. శ. ౧౫౧౦ వ సంవత్సరమున వ్రాయించిన రాయల శాసనమున సుల్తాను గజపతుల నిరువుర నోడించినట్లు చెప్పియున్నది; దీని సత్యము కొంత వఱకు 'అఫ్ఫానోస్ ఆల్బుకెర్క్' కామెంటరీలను సమకాలిక పోర్చుగీసు గ్రంథము వలన రుజువగుచున్నది. అతడు క్రీ. శ. ౧౫౧౦ వ సంవత్సరమున దక్కను సుల్తానుతో యుద్ధము చేయుచుండెనని వ్రాసియున్నాడు. దక్కను సుల్తానుతోడి యుద్ధమును కృష్ణరాయలు కోరి తెచ్చిపెట్టుకొన్నది కాదు. వీరిరు ఒడంబడికె ప్రకారము సుల్తాను ఇమ్మడి మహమూదుశాహు, ప్రాయశః యూసుపు ఆదిల్ ఖానుని ప్రేరితుడై, క్రీ. శ. ౧౫౧౯ వ సంవత్సరాంతమున విజయనగర కాఫరులపై జిహాదు ప్రకటించెను. పేరునకైనను నాతని యాధిపత్యము నంగీకరించి యుండిన యమీరోమ్రాలు మున్నగు సర్దారులెల్ల నతనితోడి దండయాత్రకు సంసిద్ధులైరి.

బహమనీ సుల్తాను బృహత్సేనా సమేతుడై విజయనగర సామ్రాజ్యముపై దండయాత్ర వెడలెను. అతనితో గూడ మల్లిక్ అహమదు బైరీ, నూరీఖాన్ ఖ్వాజా-ఇ-జహాను, ఆదిల్ ఖాను, కుతుబ్-ఉల్-ముల్కు, దస్తూరీ మమాలిక్, మిర్జా లుత్ఫుల్లా మొదలగు సుప్రసిద్ధులగు నమీరులును, సర్దారులును, దొరలును పెక్కండ్రుగూడ యుద్ధమునకు నడచిరి. విజయనగర గడిప్రదేశమునందు దోని యను స్థలమును జేరునప్పటికి రాయరాణువ వారి కడ్డపడి మార్గము నరికట్టెను. భయంకర రణము సంప్రాప్తమైనది. మహమ్మదీయులు ఘోర పరాజయమును బొందిరి; సుల్తానునకు బలమైన గాయములు దగిలినవి; అమీరులు సర్దారులు మున్నగు నతని యనుచరులు, జయోత్సాహముతో నుప్పొంగి పైకొను హిందూభటుల ధాటికి తాళజాలక వెన్నిచ్చి కోవిలకొండ దుర్గము వైపు బఱువిడ నారంభించిరి; కాని కృష్ణరాయలు లంతట ధర్మద్వార బట్టించి యుద్ధము మానుకొనలేదు; పాఱిపోవుచున్న తురకదండును వెన్నంటి తఱుమ నారంభించెను; కోవెలకొండ పరిసరములు చేరగనే బహమనీ దళములు నిలువబడి పోటు చూపినవి. మఱియొకమారు యుద్ధమారంభమైనది; మరల జయలక్ష్మి రాయరాణువనే వరించినది. దోని యుద్ధము కంటె కోవిలకొండ రణము వలన తురకల కెక్కువ హాని కలిగినది; నిజస్వాతంత్ర్యమును ప్రకటించినప్పటి నుండియు రాయసామ్రాజ్యమును జయింప నెడతెగక ప్రయత్నములు సల్పుచుండిన యూసుఫు ఆదిల్ ఖానుడు కోవెలకొండ రణక్షేత్రమున నిహతుడై వీరస్వర్గమును జూఱగొనెను; అతనిచే స్థాపితమైన బిజాపుర సంస్థానము ప్రారంభదశయందె దీక్షత్రైన్య కలవరపడెను.

పై రెండు రణక్షేత్రములందు తురకలను నిర్జించి విజయుడై కృష్ణదేవరాయలు విజయనగరమునకు మరలిపోయెను; బహమనీ రాజ్యముతోడి యుద్ధమంతటితో సమాప్తము గాలేదు. యూసుఫు ఆదిల్ ఖానుడు మృతినందిన పిమ్మట, నతనిపుత్రుడు ఇస్మాయిల్ ఆదిల్ ఖానుడు సంస్థానాధిపతి యాయెను; ఇస్మాయిలు బాలుడు; రాజ్యకార్యముల నతడు స్వయముగ నిర్వహించుటకు శక్తి చాలకుండెను, నతని తండ్రికడ సేనాధ్యక్షుడై యుండిన కమాలుఖానుడు బిజాపుర రాజ్యమునకు సంరక్షకుడాయెను; తన యజమానుడగు యూసుఫు ఆదిల్ ఖానుని రాజ్య విస్తారణ పద్ధతుల ననుసరించి కమాలుఖాను ఇరుగుపొరుగు రాజ్యముల నాక్రమింపదలచెను. ప్రప్రథమమున బహమనీ సుల్తానుల ప్రాచీన రాజధానియైన కలుబరిగె యతనిదృష్టి నాకర్షించినది. అది యప్పుడు మల్లిక్ దస్తూరు దీనారను హబిషీ సర్దారుని యాధిపత్యముక్రింద నుండినది. బిజాపుర సేనలతో గదలిపోయి కమాలుఖానుడు కలుబరిగె కోటను ముట్టడించెను; అతనిధాటికి తాళజాలక దీనారు కలుబరిగెను త్యజించి బీదరునకు బాఱిపోయి సుల్తాను ఇమ్మడి మహమూదుశాహునకు ప్రధానమంత్రియైన బరీద్-ఇ-మమాలిక్ నాశ్రయించెను; ఏలన పేరునకు ఇమ్మడి మహమూదుశాహే సుల్తా

జ్ఞానము, బీదరు రాజ్యమునకు వాస్తవమైన యధిపతి బరీదు; రాజ్యమందలి సర్వాధికారములును నతనియందే లగ్నమైయుండెను. సుల్తా నతని చేతి బంత్రపుబొమ్మ. దీనారువచ్చి యాక్రమించ గనె బరీ దాతని కథయవాస్తమిచ్చి, సేనల గూర్చుకొని, సుల్తాను దనతో గూడ దోడ్కొని కలుబరిగెపై నెత్తివచ్చెను; కానియతడు కమాలుఖానుని చే రణరంగమున నిర్జితుడై పాఱిపోయెను; సుల్తా నిమ్మడి మహమూదుశాహు కమాలుని చే జిక్కెను; బరీదును జయించినపిమ్మట కమాలుఖానుడు బీదరుపైబడి యాపట్టణమును సాధించి దుర్గమును లగ్గలుపట్టి స్వాధీన పఱచుకొనెను. ఇమ్మడి మహమూదుశాహును బీదరు దుర్గమున నతని మందిరమునందే చెఱయుంచి, యజ్మల్-ఉల్-ముల్కును సరదారు నతనిపై గాపుంచెను. బీద రిట్లా దిల్ ఖానునికి హస్తగత మగుటవలన నతని బలము హెచ్చినది; అందువలన బహమనీ సామంతు లందఱికిని భయము గలిగినది; ఆదిల్ ఖానుని యధికార బలము లభివృద్ధినందిన, నతడు క్రమక్రమముగ బహమనీరాజ్యము నంతటి నాక్రమించి తమ స్వాతంత్ర్యమునకు ముప్పు దేగలడని వారు తలచిరి; కావున మల్లిక్ అహమదుభైరీ, కుతుబ్-ఉల్-ముల్కు, బరీద్-ఇ-మమాలికు, దస్తూరుదీనారు మొదలగు దొరలాదిల్ ఖానుని యధికారమును గూలద్రోయ నేకమైరి. ఆరంభమున వారి యుద్యమము జయప్రదముగ సాగినది. బీదరు వారికి స్వాధీనమైనది; కలుబరిగెయు హస్తగతమైనది; సుల్తాను ఆదిల్ ఖానుని చెఱనుండి విముక్తుడాయెను; కాని చివరకు వారు కమాల్ ఖానుని చే నిర్జితులై యాదిల్ ఖానుని రాష్ట్రమును జయింప దలపెట్టిన కార్యమును మానుకొని యెవ్వరి స్థానమునకు వారేగిరి. విజాపుర రాజ్యమును జయింప నేకమై వచ్చిన శత్రుసమూహము చెదిరి పాఱిపోయినందువలన కమాలుఖానుని కీర్తిప్రతిష్ఠ లతిశయించెను; అతని హృదయమున దురాశపొడమి రాజద్రోహచింత యంకురించెను; కావున నతడు ఇస్మాయీ లాదిల్ ఖానుని రాజకుటుంబముతో గూడ చెఱ పెట్టి సింహాసనము నాక్రమించుకొనుటకు సమకట్టెను; కాని రాజమాతయొక్క కుట్రచే ప్రాణమును గోల్పోయెను. కమాలుని వధ వలన నిస్మాయీ లాదిల్ఖానుడు విముక్తుడై స్వయముగ రాజ్యాధిపత్యమును వహించినను నతని యధికారము నిరాటంకముగ సాగలేదు. రాజ్యమునం దసంతృప్తి ప్రబలియుండెను. కమాల్ఖానుడు జాతిచే పారశీకుడు; ఆదిల్ ఖానుని కొలువునందుండిన పారశీక ఖురాసాని మహమ్మదీయ సర్దారుల కెల్ల నాయకుడు; రాజమాత కుట్రచేసి యతని జంపించుట వలన వారు ఇస్మాయీ లాదిల్ఖాను కెడ విముఖులై యతని యాధిపత్యము నంగీకరింపక రాజద్రోహము జింతింప నారంభించిరి. విజాపుర రాజ్యమిట్లు కలతనంది యుండుటను గని యదియె కృష్ణా తుంగభద్రల మధ్యదేశమును జయించి స్వాధీనపఱచుకొనుట కనుకూలమైన సమయమని గుర్తించి కృష్ణదేవరాయలు దండెత్తిపోయి రాయచూరు ముద్గలు దుర్గములను సాధించి దేశమును స్వాధీనపఱచుకొనెను; తరువాత కలుబరిగెపై నెత్తిపోయి, బరీద్-ఇ-మమాలికును యుద్ధమున నోడించి కోటను స్వాధీనము గావించుకొనెను; తదనంతరము బరీదును వెన్నంటి తఱుముచుపోయి బీదరుకడ మఱియొక పర్యాయ మతని నిర్జించి పట్టణమును బట్టుకొనెను. కృష్ణదేవరాయ లంతట నిమ్మడిమహమూదు శాహును సింహాసనముపై ప్రతిష్ఠించి, రాజ్యమును మరల నతని కొసగి యవనరాజ్యప్రతిష్ఠాపనాచార్య యను బిరుదును వహించెను. ఇమ్మడి మహమూదు శాహును కృష్ణరాయలు వినోదముకొఱకు సింహాసనముపై నెక్కించి యతని రాజ్యమందు పునః ప్రతిష్ఠితుని గావింపలేదు; రాయలు గొప్ప రాజ్యతంత్రజ్ఞుడు; మహమూదు శాహును బరీదుచేతినుండి తప్పించి రాజ్యాధిపత్యమును మరల నతనికి స్వాధీనము జేసినందుకు గారణము లేకపోలేదు. ఎంతటి సత్త్వహీనుడైనను బహమనీసుల్తా నొకడు శత్రువైయున్నంత కాలమును బహమనీ సామంతులకు సంపూర్ణ స్వాతంత్ర్యము లభింపదు; మఱియు సుల్తానును వశపఱచుకొని యతని పేర దక్కనుపై దమ యధికారమును సాగించుటకొఱకు వారి కొండొరులతో పోరాట తప్పదు. అంతఃకలహములయందు నిమగ్నులై యుండునంత కాలమును మహమ్మదీయులకు విజయనగరముపై నెత్తిరాగల శక్తియుండదు; కావున కృష్ణదేవ

రాయ లిమ్మడి మహమూదుషాహా నతని రాజ్యమున బునః ప్రతిష్ఠించి తురకలపై దండయాత్రను పాలించి విజయనగరమునకు మరలి పోయెను.

**ఉమ్మత్తూరు** :- ఉత్తర దిక్కున మహమదీయులపై దండయాత్ర సాగించుకాలముననే కృష్ణరాయలు దక్షిణమున నుమ్మత్తూరు పాళెగాండ్రను జయించుటకొఱ కొక సైన్యము నంపెను. సింహాసనము నెక్కినపిమ్మట నొక్క సంవత్సరకాలము కృష్ణరాయలు సేనలను గూర్చుకొనుచు విజయనగరమున నుండెననియు, నేండ్లకాలదియు సమరనాయకులు జెల్లింపక యెప్పు పెట్టియుండిన కప్పమును కుమారుడు దమయొద్దనున్న దొనగ గుఱ్ఱము గొల్లలమును రాయలకు హవాలా చేసినపిమ్మట ఉమ్మత్తూరుపై దండు వెడలెననియు రాయవాచక కృష్ణరాయ విజయములందు చెప్పియున్నది. ఉమ్మత్తూరు పాళెగాని బలమంతయు నుమ్మత్తూరు శివనసముద్ర దుర్గములపై నాధారపడి యుండినది. అప్పుడా దుర్గములను పాలించుచుండిన గంగరాజు కృష్ణరాయలు దనపై దండెత్తిరాగలడని యూహించి, శివనసముద్ర జలదుర్గమును దనకు ముఖ్య స్థానముగ జేసికొని కోటకొత్తళములను బాగుపఱచి దళములఁగూర్చి, ఫిరంగులు మొదలైన ఆగ్నేయాయుధ విశేషములను బురుజులపై నెక్కించి యుద్ధసన్నద్ధుడై రాయరాజువ రాకను బ్రతీక్షించుచుండెను.

ఉమ్మత్తూరు దండయాత్ర రెండేండ్లకాలము సాగినది. మొట్టమొదట కృష్ణరాయ లుమ్మత్తూరు దుర్గమును ముట్టడించి దానిని నేల మట్టమునకు బడను గావించెను. తరువాత శివనసముద్రముపై నడచెను; కాని యా దుర్గమంత సులభముగ వశపడలేదు. ఒక సంవత్సరమంతయు పోరాట నడచినది; తుదకు కృష్ణరాయ లా దుర్గమును సంపూర్ణముగ నరికట్టెను; కోటలోని వారికి బహిఃప్రపంచముతో సంబంధము లేక పోయినది; వెలుపలినుంచి కోటలోని కెవ్వరికిని ప్రవేశము లేకపోయినది. గంగరాజునకు రాయలను నిల్వరించు శక్తి నశించిపోయినది; నిలుపోటక నతడు నదీమార్గమున పాఱిపోవుచుండ నొక మడుపునబడి మునిగిపోయెను. అంతట శివనసముద్రము కృష్ణరాయలకు హస్తగతమైనది. ఉమ్మత్తూరు దుర్గమును బోలె శివనసముద్రమును ధ్వంసము జేసి యచటినుండి శ్రీరంగపట్టణమునకు బోయి దానిని వశము జేసికొనెను. శత్రువుల యేలుబడిక్రింద నుండిన రాష్ట్రమును సర్వమును జయించి, శ్రీరంగపట్టణము ప్రధాన స్థానముగ నొక నూతన రాజ్యమును నిర్మించి విశ్వాసపాత్రులగు నధికారులకా రాజ్య పరిపాలన నప్పగించి కృష్ణదేవరాయలు జయజయధ్వానములు మెలగ మహావైభవముతో విజయనగరమునకు బోయి చేరెను.

**కళింగమర్దనము**:- కృష్ణదేవరాయలు సామ్రాజ్యపదమున సుప్రతిష్ఠితుడాయెను; బహమనీయులపై విజయములవలన తురకల యాటోపము డిందుపడినది. సుల్తాను బలము భగ్నమైనది; పెర్వోదగ్రుడగు నాదిల్షాహుని ప్రతాపము సన్నగిలెను; తుళువవంశజులతో ప్రతిఘటించి దక్షిణ కర్ణాటకమున స్వతంత్రరాజ్య స్థాపనకు ఆస్థిభారము వేసిన ఉమ్మత్తూరు పాళెగాండ్ర నిర్మూలమైపోయిరి. అంతశ్శత్రుభయము దొలగిపోయినది; ఇక కృష్ణదేవరాయలు సాధింపవలసిన శత్రులలో గజపతి యొక్కడే మిగిలియుండెను. గజపతి ప్రతాపరుద్రుడు ప్రబలుడు; పెక్కు సమరములయందు శత్రునిషూదన మొనర్చి కీర్తి బొందిన శూరాగ్రేసరుడు; గంగానదికి మధ్యస్థ పూర్వసముద్రతీర దేశమున కధిపతి; అతని బలిమికలుముల యాధిక్యమును విశేషించి వర్ణించి చెప్పుటకు వశముగాదు. అశ్వపాయదళముల నూటనటుండనిచ్చి, గజపతియొక్క గజబలము భరతఖండమున సుప్రసిద్ధి జెందినది. కావున కృష్ణదేవరాయలు దలపెట్టిన యుద్యమము సులభసాధ్యముగాదు.

కృష్ణరాయల కళింగ విజిగీషకు పెక్కు కారణములు గలవు. సంగమవంశజులనాటినుండియు దరతరమభివృద్ధియై వచ్చుచుండిన వైరమొకటి. విజయనగర సామ్రాజ్యాంతర్గతములైన యుదయగిరి కొండవీటి మండలములను పెంటిని గజపతులు జయించి తమ రాజ్యమున గలుపుకొనియుండిరి; కృష్ణరాయలకు ముందు ప్రసింహాసనాధిష్ఠితులైన రాయలెవ్వరును వానిని మరల స్వాధీనపఱచుకొనజాలకయుండిరి. సాళువ నరసింహ

రాయల మరణశాసనము మఱియొక కారణము. అతను రాయసామ్రాజ్యమునకు చెందియుండిన యుదయగిరి కొండవీడు రాయచూరు దుర్గములను విజయనంతరము రాయపదము నధిష్ఠించువారు జయించి వశపఱచు కొనవలసినదని యాదేశించి యుండెను. కృష్ణదేవరాయలు మహమ్మదీయులను జయించి రాయచూరు దుర్గమును స్వాధీనము చేసికొనెను; తక్కిన రెండు దుర్గములును గజపతి యధీనమందుండినవి. కావున గజపతితో సమరము కృష్ణరాయల కవశ్యము కర్తవ్యమాయెను.

కృష్ణదేవరాయల కళింగ దండయాత్రయందైదు ముఖ్యఘట్టములు గలవు. మొదటి ఘట్టముదయగిరి విజయముతో ముగిసినది. క్రీ. శ. ౧౫౧౩ వ సంవత్సరము జనవరి మాసమున కృష్ణరాయలు వెలిగుహారము చేసి విజయనగరమునుండి దండు వెడలిపోయి యుదయగిరిని ముట్టడించెను; ముట్టడి పదునెనిమిది మాసములు సాగినది. ప్రతాపరుద్ర గజపతి పినతండ్రి యగు తిరుమల రాహుత్తరాయలు దుర్గమును చేవ్వతో సంరక్షింపుచు విజయనగర దళములను కోట గోడలను జేరనీయక దఱుము గొట్టుచుండెను; కాని రాయ సైన్యములు దుర్గమును విడిచిపోక ముసరుకొనుచుండినవి. రానురాను దుర్గ సంరక్షకుల స్థితి దుర్భరమగుచు వచ్చినది; అనేక పదార్థములు దుర్లభములై పోయినవి. వారి స్థితిని తెలిసికొని ప్రతాపరుద్రగజపతి ముట్టడిని బాపుటకై పెద్ద సైన్యముతో నెత్తివచ్చెను: కాని కృష్ణరాయ లతని నెదిర్చి యుద్ధమున బరాభూతుని గావించి కొండవీటి పర్యంతము దఱుము కొనుచు పోయి మరలివచ్చి యుదయగిరి జేరెను; ముట్టడి మునుపటికంటె నెక్కుడు దార్ఢ్యముతో నడువసాగినది. కోటచుట్టును కృష్ణదేవరాయలు వేణత పెట్టించెను.* బండలను గొండలను పగులగొట్టించి తన భటులు కోటగోడలను నిరాటంకముగ జేరి లగ్గలు పట్టుట కనుకూలమగునట్లు విశాల మార్గములను నిర్మించెను. తిరుమల రాహుత్త రాయని కిక కోటను సంరక్షించుటకు సాధ్యము గాకపోయెను; విజయనగర సేనలు నేల యీనినట్లు ప్రబలి యన్నివైపుల కోటగోడలెక్కి లోపల ప్రవేశించినవి; ఒడ్డెవారు పోటుకానోపక శరణు వేడిరి; తిరుమల రాహుత్తరాయలు కృష్ణరాయలకు బట్టుపడి బందీకృతుడాయెను. ఉదయగిరి యొడ్డెవారి చేతి నుండి దుసికిలిపోయినది. కృష్ణరాయ లుదయగిరి విజయమును సగర్వముగ నిట్లు దన యాముక్తమాల్యద యందు వర్ణించుకొని యున్నాడు.

'ఇది కర్ణాటధరాధృతి స్థిరభుజాహేవాక
లబ్ధోద్ధరా
దుదయాద్రీశ్వర తత్ప్రత్యర్థ్యకృతిసహస్రాయ
నోక్షిపర
త్కృతకృత్యంచత్కృత కృష్ణరాయ వసుధాధ్యక్షో
జితాముక్తమా
ల్యదనాకావ్యము హృద్యపద్యముల నాద్యం
తై మహింబొల్పగున్.'

ఇది గజపతిపై కృష్ణరాయల ప్రథమ విజయము. రానున్న విజయములకు శుభసూచకము. ఉదయగిరిని స్వాధీనము చేసికొని రాయలు సేనలను కొండవీటివైపు నడిపించి తన యిష్టదైవమగు శ్రీ వేంకటేశ్వరస్వామిని దర్శించి యా దేవునికి కృతజ్ఞతాపూర్వక నమస్కృతులను సమర్పించుటకు తిరుపతికి బయనమై పోయెను. దేవునికి కానుకల నర్పించి చిరంతరము తన భక్తిని బ్రకటించుటకా దేవుని సన్నిధిని చిన్నాదేవి తిరుమలదేవి సహితముగ తన ప్రతిబింబము నచట నిలిపి విజయనగరమున కేగెను

(సశేషము)

---

* కొన్ని శాసనములలో 'మేణత వేయించి' అని యున్నది. 'వేణత' కాని 'మేణత' కాని యాంధ్ర నిఘంటువులలో గానరాదు. కన్నడ శాసనములలో 'వేణతవే యించి' అనుదాని బదులు 'విడియవనూ హాకి' అని యున్నది 'విడియవు' కిట్టెలు నిఘంటువున లేదు. కానితమిళ లెక్సికనునందు 'వేణకై' యను మాటకలదు దీనికి 'surrounding wall;outer fortification' అని యర్థము. అరవములోని 'క' తెనుగున 'త' గ మారును. కావున 'వేణత' యరవ 'వేణకై' యొక్క రూపాంతరమనుట తెల్లము. వేణతయన్నను మేణత యన్నను 'చుట్టుగోడ' యని యర్థము చేసికొనవలయును.




# స్త్రీలు : కార్మికోద్యమం

మన దేశంలో ఆడవారు మగవారితో పాటు యింటా బయటా అనేక రంగాల్లో కలిసి పని చేస్తున్నారు. పరదా మనదేశంలో ఒక వున్నత స్థానాన్ని ఆక్రమించి వుంది. దీన్ని గూర్చి అనేక మంది అనేక విధాలుగా ప్రచారం చేశారు; చేస్తున్నారు. పరదా వారు భారతదేశంలో వున్న ఆడ జనాభాలో కొద్దిమంది మాత్రమే. ఆస్తి పాస్తులు బాగా వుండి, గోటుగా పెద్దరికముతో బ్రతుకుతున్నామనే వారిలోనే యీ పరదా అలవాటు కనిపిస్తుంది. భారతదేశం మొత్తం మీద చూస్తే యీ అలవాటు యీ తరగతికి చెందినవారిలో కూడా కొందరిలో కన్పించటం లేదు. ఆర్థికావసరం, విజ్ఞానం, ప్రబోధం, యీ పరదాను అనేకచోట్ల స్త్రీలను దూరం చేసినై. అనేకలక్షలమంది స్త్రీలు యీపరదాక్రింద నలిగి కృశించి, పరిసర జ్ఞానం లేకుండా అమాయకులుగా, అజ్ఞానులుగా, సనాతనాచార సంపన్నులుగా నలిగిపోయారు. పరదాను దాటి బయటి ప్రపంచాన్ని చూస్తే పాపమని తలిచారు. వ్యక్తిత్వాన్ని వమ్ము చేసుకున్నారు. పేదరికంతో మలమల మాడి కృశించారు. ఇందుమూలంగా క్షయ, మున్నగు ఘోరాతిఘోరవ్యాధులకులోనై విపరీత బాధలుపడ్డారు. ఈ అనుభవం వుత్తర దేశంలో వుంటే బాగా కలుగుతుంది. ఈ కాలంలో అనేకమంది వుత్తమ తరగతికి చెందిన స్త్రీలు బయటకువచ్చి విద్యాభ్యాసము చేసి వుద్యోగాల్లో చేరుతున్నారు. ఇంతవరకూ యీ స్థానాలు మగవారివేనని, ఆడవారు ప్రవేశించ కూడదని ఆంక్ష వుండేది. స్త్రీలు ఫ్యాక్టరీల్లోను, తోటలలోను, పంట భూములలోను, యంత్రాగారాలలోను, గనులలోను పని చేస్తున్నారు. వీరి సంఖ్య లక్షల్లో, కోట్లలో వుంటుంది. అన్ని రంగాల్లోను పనిచేసే ఆడవారి సంఖ్య దొరకటం అసంభవంగా వుంది. కాని కొన్ని రంగాల్లో శ్రమించే స్త్రీల లెక్కమాత్రం దొరుకుతుంది. ఈ లెక్కకూడా సవ్యమైనది కాదు. ఈ వివిధ రంగాల్లో పనిచేసే వారి సంఖ్య కావాలంటే 1931 జనాభా లెక్క చూడవలసిందే. అదే మనకు శరణ్యం. దొరికే లెక్కలు నేటికి సంబంధించినవి కావు. ఒక పాతికతరం గడిచిపోయింది. ఆ సంవత్సరంలో 49 మిలియనుల కుటుంబాలు శ్రమచేసి, దాని ఫలితంమీదే బ్రతికేవి. అందులో 29 మిలియన్లమంది జంతువులమీదను, పండ్ల కూరగాయల తోటలమీదను ఆధారపడి బ్రతికారు. యంత్రాగారాల్లో 4,51,426 మంది ఆడవారు పని చేసేవారు. అనేకరంగాల్లో మగవారికంటె ఆడవారే ఎక్కువమంది పనిచేసి బ్రతుకుతున్నారు. అంటే ఆ పనులలో ఆడవారికే యెక్కువ స్థానం లభించింది. అస్సాం టీ తోటలలోను బీహార్, సి. పి. యంత్రాగారాలలోను యీ విధంగా పని చేసి బ్రతికేవారు యెక్కువమంది యున్నారు. కాఫీ, తేయాకు, పండ్ల తోటలలో మొత్తం సంఖ్యలో శాతంలో చూస్తే 25% ఎక్కువ ఆడవారే, యంత్రాగారాల్లో, దూది పరిశ్రమలో, జనపనార పరిశ్రమలో, యింకా యీనాటి యితర పరిశ్రమలలో వీరే యెక్కువ కనిపిస్తారు. అన్నిరంగాల్లో కన్న గృహ సంబంధమైన సమస్యల తీర్చే పట్ల వీరిదే పైచేయి. వీరే యెక్కువ మంది. యంత్రాగారాల్లో పనిచేసే వారితో పోలిస్తే వీరు రెండింతలు యెక్కువ. యంత్రాగారాల్లో పనిచేయటం తేలికగాదు. మృదువైన పనిగాదు.

ప్రధానంగా పనిచేసే స్త్రీలకు కొన్ని ముఖ్య సమస్యలున్నై. ప్రకృతే వారిపట్ల కొంత వుదాసీనత చూపింది. శారీరకంగా స్త్రీ బలహీనురాలు. పిల్లల్ని పెంచవలసిన బాధ్యత ఆమెమీదే పడింది. పురుషుడు యీ అదను చూచుకొని సంఘంలో తనకు ఒక విశిష్టస్థానాన్ని యేర్పరచుకున్నాడు. పిల్లల్ని పెంచే బాధ్యత తనకేగాకుండా భర్తకు, ప్రభుత్వానికి కూడా వుంది. కాబట్టి, ఆ బాధ్యతలో వున్న కష్టాన్ని అందరూ పంచుకోవాలి. స్త్రీ సంఘంలో ఒక యెత్తుకెదిగిన, వ్యక్తిత్వం గల భాగంగానే యెంచబడాలి. ఆ విషయంలో స్త్రీ, పురుషుడు ఒకటే. పశ్చిమదేశాలు అనేకం యీ బాధ్యతను గ్రహించి కొంతవరకు తమ కర్తవ్యాన్ని నెరవేరుస్తున్నై. అంతర్జాతీయ లేబరు సంఘంలో భారతదేశం కూడ ప్రతినిధిగా వుంది. 1919 లో ఆ సంఘుయాజమాన్యమున, "Child birth convention" జరిగినది. దానిప్రకారం యంత్రాగారాల్లో, వ్యాపార సంస్థల్లో పనిచేసే స్త్రీలకు కొంత మేలు జరిగింది. ఈ రంగాల్లో వారికే యిది వర్తిస్తుంది. ఈ సమావేశంలో నిర్ణయించిన దాని ప్రకారం స్త్రీ ప్రసవించటానికి ముందు ఆరువారాలు, ప్రసవించిన తరువాత ఆరువారాలు పని చేయనవసరం లేదు. పనిచేయటానికి వీలుకూడా లేదు. ఈ సంఘ యాజమాన్యాన ఒకవేళ ప్రసవించిన స్త్రీకి యేదైనా ప్రమాదం జరిగితే సెలవు పొడిగించుకునే హక్కు, ప్రజల సొమ్మునుండి సహాయముపొందే హక్కు లభించింది. ఇదే రకమైన సలహా 1921 లో జరిగిన I. L. O. మహాసభలో పొలాల్లో పనిచేసేవారిని గూర్చి పంపబడినది. ఈ సంఘంవారు నిర్ణయించిన సూత్రాలు అంతయెక్కువగా అమలు జరుపబడలేదు. ప్రభుత్వం గాని, భూస్వాములు గాని, యీ శ్రమజీవులపట్ల వుదారభావం చూపలేకపోయారు. అమలులో కూడా అంతగా పెట్టలేకపోయారు. సాధారణంగా ప్రసవించిన స్త్రీకి ఎనిమిది వారాలకన్న యెక్కువ సెలవ లభించలేదు. గనులలో పనిచేసేవారికి పదహారు వారాలు మాత్రం సెలవు లభిస్తుంది. యంత్రాగారాల్లో పనిచేసేవారికి సక్రమమైన పోషణ యిస్తే ధనం అధికంగా ఖర్చవుతుందని పెట్టుబడిదార్ల భయం. ఇవ్వకుండా యీ సూత్రాలను అమలులో పెట్టకుండా వుంటే స్త్రీలకు నష్టం. ఒకవేళ సక్రమంగా యీ సూత్రాలను అమలు పర్చుకుంటే పని లేకుండా మానవలసి వస్తుందేమోనని స్త్రీలు భయపడుతున్నారు. చైతన్యం కూడా అంతగా లేదు. పైవారు పెట్టే నియంతృత్వాన్ని యెదిరించే ధీశక్తి గూడ అంతగా లేదు. వీరు చిందరవందరగా వుండిపోవటం, ఆర్థికబాధవల్ల అజ్ఞానంలో వుండిపోవటం ముఖ్య కారణం. కాబట్టి, సక్రమమైన మందుమాకులు లేక, తిండితిప్పలు లేక స్త్రీలు బాధపడుతున్నారు. ప్రసవించిన తరువాత బిడ్డని ఒక అదనపుబాధ్యత. పనిచేసుకు బ్రతికే స్త్రీకి యిది సమస్యల్లో పెద్ద సమస్య. ఈపసిబిడ్డలను పెంచటానికి, విద్యనేర్పటానికి కావలసిన సౌకర్యాలను ప్రభుత్వంగాని, మిల్లు యజమానులుగాని యేమీ తీసుకోలేదు. ఏదైనా జరిగియుంటే అది చాలా కొద్ది మాత్రమే.

సాధారణంగా ప్రభుత్వంచేసే చట్టాల ధోరణినిబట్టి ఆ దేశంయొక్క సాంఘిక జీవితాన్ని తెలుసుకోవచ్చు. పెత్తనంలో వున్నంతమాత్రాన చేయగలిగింది మృగ్యం-గొప్పచట్టాలు నిర్మించి వాటినిగూర్చి పొగుడుకున్నంత మాత్రాన యేమీ ప్రయోజనముండదు. సమాజంలో ఘనీభవించిన భావాలను అర్థంచేసుకొని సాంఘికంగా యే మార్పుతెస్తే సామాజిక వ్యవస్థ మారుతుందో గ్రహించి, తదనుగుణంగా సంకల్పబలంతో, అవరోధాలను యెదిరించి ముందుకు నడవగలిగినప్పుడే యే చట్టమైనా విజయవంతం అవుతుంది. చరిత్రలో గొప్పగా పొగుడుకున్న అనేకచట్టాలు భగ్నమై పోయినై. జర్మనీలో వీమియర్ చట్టం, రష్యాలో 1936లో స్టాలిన్ చేత నిర్మింపబడినచట్టం భగ్నమైనై. భారతదేశంలో శ్రామికుల రక్షణకోసం అనేక చట్టాలు ప్యాసుచేయబడినై. సాంఘిక మనస్తత్వం మృగ్యం కావటంతో ఈచట్టాలు విజయవంతం కాలేకపోయినై. ప్రధానంగా స్త్రీలకు ఒకవర్గనిర్మాణం లేకపోవటంవలన చట్టాలువారికి అంతగా ప్రయోజనకరం కాలేకపోయినై. సాంఘికంగావున్న వ్యత్యాసాలేకాకుండా, అనేక సమస్యలు స్త్రీని క్రుంగదీసినై. పేదరికం, అవిద్య, జబ్బులుయింకా స్త్రీకి అనేకం అడ్డంకులు తయారైనై. పేద

రికం అన్ని జబ్బులకు, సాంఘిక తిరోగమనానికి మూలకందం. డబ్బు లేని కారణంచేత విద్యశూన్య మౌతుంది. కనీసపు విద్యకూడా లేకపోవటం చేత యంత్రాగారాల్లో పనిచేయటానికి వీలు లేకుండాపోతుంది- విద్య లేనిదే అనుభవంరాదు. పనిముట్టును వాడేపద్ధతి తెలియదు. యంత్రాగారాల్లో పనిచేసేపద్ధతి తెలిస్తే జీతం పెరుగుతుంది. విజ్ఞానగరంలో కృషిచేయటానికి ఆస్కారం యేర్పడుతుంది. విశ్రాంతితీసుకోటానికి, విజ్ఞానాన్ని పొందటానికి, వ్యక్తిత్వాన్ని పెంపొందింప జేసుకోటానికి పరిస్థితులు యేర్పడతై. మగవారు యే సమస్యలతో కృష్టి, కృశించి, నిర్జీవమైపోతున్నారో, భారతదేశంలో ఆడవారు అదే సమస్యలతో అజ్ఞానాంధకారంలో దోవ, తెన్నులు తెలియక బాధపడుతున్నారు. యీ విషమావస్థనుండి యిద్దరూ బయటపడాలి.

యీ విష వాతావరణాన్నుండి బయటపడాలంటే ప్రభుత్వం, ప్రజలు కలిసి సహకారయుతంగా పనిచేయాలి. యే రూపంలో యెక్కడ విషబీజం కనిపించినా దానిని చంపాలి. ప్రభుత్వం యెంతవుదాత్తమైనా సిద్ధాంతాలను తయారుచేసి తాను యేదో వుపోగానంలో గొప్పలు చేస్తానని కూర్చుంటే ప్రయోజనం మృగ్యం. విజ్ఞానవంతమైన మానసిక శక్తులతో కూడిన సహాయాన్ని స్త్రీలవద్దనుండి ప్రభుత్వం పొందాలి. ట్రేడ్ యూనియన్లు పనిచేసే ఆడవారిని ఒక స్థితినుండి యింకొక వున్నతస్థితికి తెచ్చేవిగా వుండాలి. భారతదేశంలో విద్యాప్రబోధన కేంద్రాలు తక్కువ. ప్రభుత్వం తన విద్యుక్త ధర్మాన్ని నిర్వర్తించలేని విషాదస్థితిలో వుంది. యీ సమయంలో ట్రేడ్ యూనియన్లు యెంతో పురోగమన పాత్ర నిర్వహించాలి. ట్రేడ్ యూనియన్ వుద్యమ అవసరం నేడు యెంతో ద్విగుణీకృతమైంది. ట్రేడ్ యూనియన్ వుద్యమం గడచిన 30 సంవత్సరాల నుండి స్త్రీ సమస్యలపట్ల యీ భావం వహించింది. ట్రేడ్ యూనియన్ల మొత్తం సభ్యత్వంలో స్త్రీలు అయిదవవంతుమాత్రమే. యింత తక్కువ సభ్యత్వమే వారితక్కువ స్థితిని తెలుపుతుంది. 1927 తరువాత సభ్యత్వం 1168నుండి 65 వేలవరకు పెరిగినది. 1939లో ఫాక్టరీలలో పని చేసే మొత్తం జనాభాలో 13.7% ఆడవారు- 1948లో 10.8%-ఆడవారి సంఖ్య క్రమేపీ యంత్రరంగంలో తగ్గిపోంది. ఈ తగ్గుదల ట్రేడ్ యూనియన్ వుద్యమానికి దెబ్బ తీస్తుంది. వుద్యమబలాన్ని కుంగదీస్తుంది. ఆడవారిలో ట్రేడ్ యూనియన్ భావాలు పెరగకపోవటానికి అనేక కారణాలున్నై. కొన్ని కారణాలను యిదివరకే పేర్కొన్నాము. (1) సక్రమంగా వర్గనిర్మాణం లేని యంత్రాగారాల్లో పనిచేయటం. (2) సాంఘికంగా వున్న సనాతన ఆచారాలు. (3) యింతక్రితం పని దొరకదనే భయం, యంత్రాలలో పని చేయటానికి తగిన విజ్ఞానం లేకపోవటం.

అసలు ట్రేడ్ యూనియన్ వుద్యమం యీ దేశంలో సక్రమమైన పునాదులమీద పెరుగలేదు. యూరప్‌లో పెరిగినట్లు శాస్త్ర పద్ధతుల మీద పెరుగలేదు. ఈ పైగతా కారణాలవల్ల ట్రేడ్ యూనియన్ వుద్యమం యీ దేశంలో దెబ్బతినిపోయింది. ప్రభుత్వం దీని పురోగమనానికి చేసిన అనేక సూత్రాలు ఆచరణలోకి రాక కాగితం రూపంగానే యీకారణమువలనే వుండిపోయినై. చైతన్యవంతమైన పనివారు దొరకకపోయినందువలన ప్రభుత్వమునుండి లభించే లాభంకూడా వుపయోగరహితమైంది. కాబట్టి ప్రతిస్త్రీ వ్యక్తిత్వంతో ముందుకు వచ్చి చైతన్యవంతంగా తన భవిష్యత్తును తాను నిర్ణయించుకున్నప్పుడే తన భావి సుగమమౌతుంది.

మేకా చక్రపాణి

ఒక పురుషుడికి చదువుచెప్పిస్తే, ఒక వ్యక్తినే విద్యావంతుణ్ణి చేసినట్లవుతుంది. ఒక స్త్రీకి చదువు చెప్పిస్తే, ఒక కుటుంబం యావత్తూ విద్యావంతం అవుతుంది.

## కొత్త పద్ధతులు

# ఆర్త సహాయం

కొండయ్య మామయ్యగారికి మేనల్లుడు నలకయ్య వ్రాయగల చిన్న పాలు చేసి ఉభయ కుశలోపరి తెలియజేసిన విషయం ఏమంటే, మొన్నటి తుపానులో నలకయ్యగారి ఇల్లూ దొడ్డీ, గొడ్డూ గోదా, చెంబులూ తప్పాలాలూ సమస్తమూ కొట్టుకుపోయాయి, నలకయ్యకూ, నలకయ్య భార్యకూ, నలుగురు పిల్లలకూ తిన తిండిలేదు, కట్ట గుడ్డలేదు, ఉండ పంచలేదు. పరిస్థితులు నానాభీభత్సంగా ఉన్నాయి. కనక కొండయ్యగారు, స్వర్గస్థురాలైన నలకయ్య తల్లిని స్మరించి అయినా, యథాశక్తి నలకయ్యను ఆదుకున్నట్టయితే... కొండయ్య పేరుబడ్డ గాంధీ భక్తుడూ, మంచి హోదాలో ఉన్నవాడూ, ఏ రూపేణా అయితేనేం ఇంకా బతక ఉన్నవాడూ కూడా కనక...

ఉత్తరం సాంతం చదవాలనే ఉత్సాహం కొండయ్యకు కలగలేదు.

కొండయ్య తనలో తానే నవ్వుకున్నాడు. పాపం, తన మేనల్లుడు ఏవిధంగానన్నా తన నుంచి సహాయం ఆశించటానికని ఎంత కాలం నుంచి పొంచి ఉన్నాడో! ఈనాటికి ఈ తుపాను వాడికి బహు చక్కగా ఉపకరించింది!

కొండయ్య కనుబొమలు ముడేశాడు. తనకిటువంటి పద్ధతులంటే తగని అసహ్యం. సహాయం కావాలంటే నలకయ్య మగసిరిగా డబ్బు కావాలని రాయకూడదూ? ఇటువంటి దీన అరుపులు అరుస్తాడా! చెంబూ తప్పాలా కూడా పోయిందనీ, తిండికి కూడా లేదనీ, కట్టుకునే బట్ట అయినా లేదనీ రాస్తాడా? తన మేనల్లుడు అటువంటి స్థితికివస్తే తనకు నామోషీ అవుతుంది గదా అని! ఛీ, వెధవ యాచనాబుద్ధి! అడుక్కుతినేవాళ్లు మొండి చేతులూ, పుళ్లూ ప్రదర్శించినట్టు!




తుపానువల్ల కాస్తోకూస్తో నష్టం అయి ఉండవచ్చు—కొండయ్య ఒప్పుకుంటాడు. పూరిగుడిసె కనక కప్పు కారిందేమో! గొడ్డూ గోదా తప్పించుకు పోయిందేమో! ఈ మాత్రానికి విల విలలాడే మనుషులేం మనుషులు!

"మేమంతా ఇట్లా జావ గారిపోతే మాతో మహాత్ముడు సత్యాగ్రహం సాగించి ఉండేవాడే! పెళ్లాల్ని వదిలాం, పిల్లల్ని వదిలాం, ఆస్తులు వదిలాం, సత్యాగ్రహ జ్వాలల్లోకి ఉరికాం. మహాత్ముడు ఉరకమన్నాడు! ఉరికాం! అంతే గాని ఇట్లా వాపోయామా?" అని కొండయ్య తనను తాను ప్రశ్నించుకుని "ఎన్నే!" అని సమాధానం చెప్పుకున్నాడు.

తాను జైలునుంచి తిరిగి వచ్చినాక తన భార్యా పిల్లలూ, ఆస్తులూ ఎప్పటిలాగే ఉన్న సంగతి కొండయ్యకు స్ఫురణకు రాలేదు. గాంధీ మతం పుచ్చుకోవటంవల్ల కొండయ్యకు స్ఫురించని విషయాలింకా చాలా ఉన్నాయి. (ఇటువంటి చిక్కులు ఏ మతం పుచ్చుకున్న వారికైనా ఉండేవే ననుకోండి.)

ఉదాహరణకు: కొండయ్య సత్యంతప్ప అడడు కనక ఇతరులు, అందులోనూ తన మేనల్లుడివంటి గాంధీ విమర్శకులు, నిజమే చెప్పవచ్చునన్నది కొండయ్యకు స్ఫురించదు. తనకన్న అహింసాతత్పరులూ, ప్రజాసేవకులూ, ధర్మనిరతులూ, నిర్మాణ కార్యక్రమ దీక్షా తత్పరులూ ఉన్నారా అంటే ఉండవచ్చునని కొండయ్య ఏనాడన్నా ఒప్పుకుంటాడుగాని నిజంగా, ప్రత్యక్షంగా ఉన్నారంటే భరించలేడు, నమ్మలేడు! అదేమిటని మీరడగగలరు. అది అంతే!

చెప్పవచ్చిన ముఖ్యవిషయమేమంటే కొండయ్య నలకయ్యకు డబ్బు పంపలేదు. తన మేనల్లుడు తన రాజకీయ విశ్వాసాలను పాటించడని కాదు. నలకయ్యకో పది రూపాయలు

పంపితే ఇంతలో కొండయ్య కొంప తరుగుతుం దనీ కాదు. బడలేదు. అంతకన్న ఇంకేమీ లేదు. తనకు తెలీకుండటం జరిగింది. ఒకటి రెండు రోజులు ఆదివారమయింది. ఒక రోజు తప్పక పంపుదామంటే పెద్దనోటుకు చిల్లర లేక పోయింది. ఇంతలో, ఇట్లా చూస్తుండగానే నలకయ్య ఉత్తరం వచ్చి పది రోజులో పన్నెండు రోజులో అయి ఊరుకుంది. ఈ లోపల నలకయ్య గొడ్లు దొరికే ఉంటాయని, తప్పు మళ్లా అల్లించి ఉంటాడనీ, ఇంత ఆలస్యంగా పంపితే తనను చూసి నవ్వుతాడేమోననీ, అసలే తన మీద గౌరవం లేనివాడు అఘాయిత్యంగా ఉత్తరం రాస్తాడేమోననీ కొండయ్య డబ్బు పంపే ప్రమేయం మానేశాడు. అది అంతటితో జరిగిపోదని పాపం కొండయ్య కలగన్నాడా!

ఒకరోజు ఎరిగినాయన ఒకడు కనిపించి, "పాపం నలకయ్య కెంత గడ్డురోజులొచ్చాయో! ఇంకా అదృష్టవంతుడు! ఆ పెళ్ళాం చచ్చి బతికింది!" అన్నాడు.

"ఆదేం?" అన్నాడు కొండయ్య పిచ్చి మొహం వేసి.

"మీరు వినలా? డబుల్ న్యూమోనియా! రాదూ? తడిగుడ్డలతో రెండురోజులల్లా నానితే? ఎవరో ధర్మాత్ములు గుడ్డలేవో ఇచ్చారు. అవన్నీ పిల్లలకు కప్పింది. మొగుణ్ణి కూడా తడిగుడ్డతో ఉండనిచ్చింది కాదు. తన సంగతి ఏమను కుందో!...ఇల్లాలంటే అట్లా ఉండాలి!"

"పాపం, నయమయిందా?"

"ఆ, ఆడాక్టరు ధర్మాన! తనే స్వయంగా పెనిసిలిన్ గాని ఇంజెక్షనిచ్చాడు. అతను నలకయ్యతో కలిసి చదువుకున్నాట్ట! నిజంగా స్నేహితుల్ని చెప్పాలండీ!"

"అట్లా చెప్పకులే!"

"చెప్పకేంటా లేమిటి? మా వాడున్నాడా! వాడు నలకయ్య ఉత్తరం చూస్తూనే నలుగురి దగ్గిర చేబదుళ్లు పుచ్చుకుని నలభై రూపాయలు పంపాడు. నిన్ననే వచ్చింది నలకయ్య దగ్గిర్నుంచి మా వాడికి ఉత్తరం. ఎంతమందో స్నేహితులు డబ్బు పంపారట. మళ్లీ కొంపవేసు కొన్నాట్ట. తెంబుతప్పేలా అమర్చుకున్నాట్ట! నిజంగానే అదృష్టవంతుడు."

"మాకారా, నాకేవిషయమూ లేమీ రాశాడే కాదు!" అన్నాడు కొండయ్య, నిష్కల్మష మైన హృదయంతోనే.

"తన కొంపపోయిన మాటన్నా రాశాడు కాదా ఏమిటి? ఇదేమిటండీ కామధేనువల్లే మిమ్మల్ని పెట్టుకుని ఉత్తరమైనా రాయక పోవటం!" అన్నాడా పెద్ద మనిషి.

ఆ పెద్దమనిషి అపోహపడ్డాడని కొండయ్యకు అర్థమయింది. కాని అంత గాంధీ భక్తుడికీ, అంత సాహసంతో సత్యాగ్రహాల్లో ఉరికిన ధీరుడికీ, నలకయ్య తనకొక ఉత్తరం రాశాడని చెప్పటానికి ధైర్యం చాలలేదు...

తరవాత రెండు రోజులకు కొండయ్యకు ఆలోచన వచ్చింది. నలకయ్యకొక వంద పంపిద్దామని. అది అట్లాగే పోతున్నది. ఏదీ! ఒకపనా? ఒక వేళమా? డబ్బున్నప్పుడు జ్ఞాపకం ఉండదు; జ్ఞాపకం ఉన్నప్పుడు డబ్బుండదు! ఏమిటో!

---

ఈ క్రింది ఊళ్లలో ఇంగ్లీషు, తెలుగు 'స్వతంత్ర' పత్రికలు అమ్ముటకు
ఏజెంట్లు కావలెను:

ఆమలాపురం, చోడవరం, బళ్లారి, శృంగవరపుకోట,
కైకలూరు, పొన్నపల్లి అగ్రహారం

వివరములకు :—

మేనేజరు, 'స్వతంత్ర',
160 లాయిడ్స్ రోడ్, రాయపేట. మదరాసు-14.

**నేతాజీ యింకా సజీవుడుగా ఉన్నాడా? అన్న ప్రశ్నపై పత్రికల్లో తర్జన భర్జనలు ఉండుండి జరుగుతూనే ఉన్నాయి. నీలివార్తల్లోని నిజం ఎంత? ఈ రచయిత అంచనా ప్రకారం, నేతాజీ కమ్యూనిస్టుచైనాలో ఉన్నాడట. "విపులాచ పృథ్వీ" అన్నారు.**

# నేతాజీ యింకా సజీవుడేనా?

వి. యల్. సుందరరావు

(అఖిలభారత ఫార్వర్డ్ బ్లాక్ కార్యదర్శి)



నేతాజీ ఉనికి, ఆయన అంతర్ధానం, గురించి అనేక ప్రకటనలు, వక్తల ప్రసంగాలు సామాన్యప్రజల్ని కలవరపరుస్తున్నాయి. అనుచరుల పార్టీ ప్రచారమని కొందరు, నేతాజీపై అంతర్జాతీయ నిషేధాజ్ఞలు ఉన్నాయని కొందరు యింకా యింకా అనేక అభిప్రాయాలు, ప్రచారం కనిపిస్తుంది. ఆయనపైగల అపార ప్రేమ వాహినులు అతిశయోక్తులనుకూడ కల్పిస్తున్నాయి. పొందికలేని యీ వార్తలను ఆధారంచేసి అనేక విపరీత విమర్శలుకూడ చేస్తున్నారు కొందరు. అజాద్ హింద్ ఆరవ వార్షికోత్సవంనాడు, అక్టోబరు 21-వ తేదీ నేతాజీ రేడియో ప్రసంగం వినాలని దీపావళి పండుగనుకూడ మరిచిపోయి ప్రజానీకం, యావత్ భారత దేశమంతా తహతహలాడింది. పల్లెలనుండి 30, 40 మైళ్ళు నడిచి రేడియో ఉండే స్థలం చేరి ఆసాంతం ప్రజలు నేతాజీ ప్రసంగంకొఱకై యెదురుచూశారని అమధ్య కలకత్తాలో మిత్రుడొకడు చెప్పాడు.

ఉత్తర హిందూస్థాన్ పత్రికల్లో ప్రకటించినవి, శ్రీ శరత్ చంద్రబోసు, మేజర్-జనరల్ షా నవాజ్, అఖిలభారత ఫార్వర్డుబ్లాక్ వారు సేకరించిన భోగట్టా ఆధారంచేసుకొని మన మద్రాసు పత్రికలు నిరాదరణగా వదలిన నేతాజీకి సంబంధించిన వార్తలను యీ వ్యాసంలో కూర్చి వ్రాస్తున్నాను.

"నేతాజీవెంట నేను విమానంలో ప్రయాణం చేయలేను. ఇప్పటి రాజకీయ పరిస్థితులను బట్టి కల్పించిన కట్టుకథ నేను యిండియావచ్చి చెప్పాను. నేతాజీ ఏ మార్గాన, ఎక్కడకు వెళ్ళింది ప్రస్తుతం యెక్కడ ఉన్నది నాకు తెలియదు." అని పాకిస్థాన్ వెళ్ళిన కర్నల్ హబిబుర్ రహమాను ప్రకటన చేశాడు.

"అమెరికా, ఇంగ్లండు ప్రభుత్వాలు నేతాజీ విమానప్రమాద పరిశీలనకై నియమించిన కమిటీలు అంతర్జాతీయ న్యాయస్థానానికి రిపోర్టు దాఖలు చేశాయి. ఆ రిపోర్టులలో నేతాజీ విమాన సంఘటన ఒక కల్పితగాథ తప్ప యథార్థం గాదని స్పష్టపరిచారు." అని ఇండియాతరఫున న్యాయమూర్తిగా వెళ్ళిన కలకత్తా హైకోర్టు ప్రధాన న్యాయమూర్తి రాధా బినోద్ పాల్ మే మాసంలో బహిరంగ ప్రకటన చేశారు.

"భారతదేశనాయకుడు దూరప్రాచ్యములో

ఉన్నాడు. ఆయన అఖండనాయకత్వం భారత ప్రజలకు తిరిగి లభించగలదు. ఆయన సమయం కోసం ఎదురు చూస్తున్నా"నని 1949 ఫిబ్రవరి మాసంలో ఒక రహస్య రేడియో ప్రసంగ సారాంశమని ఉత్తర హిందూస్థాన్ పత్రికలు ప్రకటించాయి.

తదుపరి మాసం రోజులకు (మార్చి మాసంలో) నేతాజీ దూర ప్రాచ్య ప్రజాఉద్యమాలకు, విప్లవోద్యమాలకు దోహదంగా పని చేస్తున్నాడని, ఆంగ్లో - అమెరికన్ కూటమికి వ్యతిరేకంగా యిండియా దేశంలోని విప్లవోద్యమానికి యెదురు చూస్తున్నాడని, కాలనిర్ణయం మాత్రం యిప్పుడు చేయలేమని లండన్‌లోని పత్రికలన్నీ విపరీతంగా వ్రాశాయి. ఈ వార్తల నాధారం చేసుకొని కేంద్ర ఎసెంబ్లీలో శ్రీ హరివిష్ణు కామత్ గారు ప్రశ్న పరంపరలు గుప్పించటం జరిగింది.

శ్రీ శరత్ చంద్రబోసుగారు, యూరప్‌నుండి తిరిగి వచ్చిన వెంటనే నేతాజీ సజీవుడుగా ఉన్నాడని ప్రకటన చేశారు. తదుపరి రెండవ ప్రకటనలో ఎర్రచైనాలో ఉన్నట్టు రూఢీ అయిందని స్పష్టం చేశారు.

నేతాజీ చైనాలో ఉన్నట్టు ఇండియా విదేశాంగ కార్యాలయానికి వార్త అందింది. ప్రధాని నెహ్రూ తన ఆత్మీయ జ్యోతిష శాస్త్రజ్ఞుని పిలిపించి సంప్రదించాడు. అంచనాలు చాలా ఆశాభంగం కలిగించాయి. నెహ్రూజీ ఆలోచనాగ్రస్తుడయ్యాడని నాగపూరు 'హితవాద' పత్రిక ప్రకటన చేసింది.

అక్టోబరు 21 వ తేదీ నేతాజీ ప్రసంగం చేస్తాడని ఇండియా విదేశాంగ కార్యాలయానికి చేరిన వార్త ఢిల్లీలోని 'నేతాజీ' పత్రిక సేకరించి ప్రకటించింది. అక్టోబరు 16 వ తేదీ నుండి 24 వ తేదీ వరకూ 9 గం॥ల నుండి 10-30 గం॥ల వరకు బెంగాలీ భాషలో "నేతాజీ సుభాస్ భారత ప్రజానీకంతో మాట్లాడాలనే వాంఛను వెలిబుచ్చాడు." అనే ఒక వాక్యాన్ని పీకింగు నుండి ప్రసారం చేశారు. 16 మిల్లిమీటర్ల షార్టువేవ్‌లో ప్రసారం జరిగింది. మీటరు మాత్రం 'నేతాజీ' పత్రిక తప్పు యిచ్చింది. ఈ వార్త కలకత్తాలో చాలమంది ముఖ్యులు విన్నారు. కాని అదే సమయంలో, ఆ మీటరుమీద పీకింగు, మాస్కో, టోకియో రేడియోలు ప్రసారం చేస్తుంటాయి. ఏ కేంద్రం నుండి వచ్చిందీ వివరాలు తెలుసుకోవడానికి ప్రయత్నాలు జరుగుతున్నాయి.

నేతాజీ ఎర్రచైనాలో ఉన్నాడనేది రూఢి అయిన వార్త. అవసరమని తోచినపుడు శ్రీ శరత్ బాబు యీ వార్తయొక్క ఆధారాన్ని కూడ స్పష్టం చేయగలడు. నేతాజీ భారతదేశాన్ని విడిచి వెళ్ళిన పూర్తి వివరాలు యీనాటికీ కూడ ప్రజలకు చెప్పటం జరగలేదనే విషయం మరచిపోవద్దు. నేతాజీకి యీ బ్రహ్మాండ ప్రయత్నంలో తోడునీడయై కాబూలుచేర్చిన రహమత్ ఖాను ఆత్మబలిదానం చేసిన కథమైనం యీనాటికీ ప్రజానీకానికి తెలియదు కదా!

నేతాజీ భారతదేశం యింకా రాలేదే, ఆయన ఉనికి తెలియటం లేదే అని భారత ప్రజానీకం పడే తహతహలు పంచుకొంటున్న వాళ్ళల్లో నేనొకణ్ణి. కాని, మనం భ్రాంతి యింగ్లండు, అమెరికా ధనికకూటమి మతావరణంలో ఉండి వారి పత్రికా ప్రచార ప్రభావానికి బానిసలమై దేశపరిస్థితులు, ప్రపంచ పరిస్థితుల గమనాన్ని అర్థం చేసుకోలేకుండా ఉన్నాము.

చెంకై-షేక్, దక్షిణచైనా, టిబెట్టు పరిస్థితులు పూర్తిగా తేలిపోయాక, దూరప్రాచ్యంలో అమెరికా పతనం జరిగిన తరువాత, నేతాజీ వ్యూహాలు, ఉనికి, స్పష్టంగా ప్రకటించుకో గలమని ఆయన అనుయాయులు అందరూ విశ్వసిస్తున్నారు. మన దేశపరిస్థితులు మనకన్నా ఎక్కువగా ఆయన అవగాహన చేసుకుంటున్నాడనీ, ఆయన దేశంలో కాలూనబోవునపుడు ఏవిధంగా తన ప్రజానీకానికి హెచ్చరికలు చేసుకోవాలో తెలుసునన్న విషయం మనం మరువరాదు.

పరిస్థితులను అవగాహన చేసుకోలేని సామాన్యప్రజల్లో నిరుత్సాహం సహజమే! కాని, ఒక దేశచరిత్ర కాలగమనంలో నాలుగు సంవత్సరాలు విశేషం కానేరవు. నేతాజీ కొద్దికాలంలోనే మనలను కలుసుకోగలడని, ఆయన నాయకత్వాన తిరిగి సోషలిష్టు సమాజం స్థాపనచేసే కాలం త్వరలో రానున్నదని, ఆశిద్దాం.

# డివేల్యూయేషన్




## 1949 సెప్టెంబర్ 19వ తారీకు డివేల్యూయేషన్ : ఇంగ్లండు

నుండి స్టెర్లింగ్-డాలర్ మారకపువిలువ 1 పౌను=4.03 డాలర్ల నుండి 1 పౌను=2.80 డాలర్లకు తగ్గించబడినది. ఆ రోజువరకు ఇంగ్లండులో ఒక పౌనుఖరీదు కలిగిన వస్తువును అమెరికా పంపిస్తే బ్రిటిష్ వ్యాపారస్తునకు ఒక పౌను ముట్టడానికి గాను దానిని అక్కడ 4.03 డాలర్లకు అమ్మవలసివచ్చేది. ఆ రోజునుండి దానిని అక్కడ 2.80 డాలర్లకు అమ్మితే చాలు, బ్రిటిష్ వ్యాపారస్తునికి 1 పౌను వస్తుంది. అంటే ఒక పౌనును కొనడానికి అమెరికాలో 4.03 డాలర్లకు బదులుగా 2.08 డాలర్లను చెల్లిస్తే చాలు. పౌను విలువ నూటికి 30.5 వంతున తగ్గినది; డాలర్ల విలువ హెచ్చినది. ఆ విధంగానే అంతకు పూర్వం అమెరికాలో 4.03 డాలర్లు ఖరీదు కలిగిన వస్తువును కొనడానికి 1 పౌను చెల్లించవలసి ఉండేది, అప్పటినుండి సుమారు 1.44 పౌనులు చెల్లించవలసి ఉన్నది, అంటే, ఈ డివేల్యూయేషన్ ఫలితంగా అమెరికాలో బ్రిటిష్ సరకుల ధర తగ్గినది; ఇంగ్లండులో అమెరికా సరకుల ధర హెచ్చయినది.

బ్రిటిష్ స్టెర్లింగ్ విలువలో తగ్గింపు బ్రిటన్ సంతోషపూర్వకంగా చేసినది కాదు. చిరకాలం నుండి స్టెర్లింగ్ కేవలం బ్రిటిష్ కరెన్సీ మాత్రమే కాకుండా ఒకవిధంగా అంతర్జాతీయ కరెన్సీ కూడాను. ఎంచేతంటే ప్రపంచంలోని వివిధ దేశాలు తమ వ్యాపారాలకు సంబంధించిన లావాదేవీలను స్టెర్లింగ్ లోనే పరిష్కరించుకుంటూ ఉండేవి. అన్ని దేశాలకూ బ్రిటిష్ స్టెర్లింగ్ విలువ స్థిరత్వంలోనూ, బ్రిటన్ ఆర్థికాన్నత్యంలోనూ అపరిమితమైన నమ్మకం ఉండడమే దీనికి కారణం. ప్రపంచాధిపత్యం అమెరికా సంపాదించిన ఈ రోజులలో బ్రిటిష్ స్టెర్లింగ్ విలువలో తగ్గింపు ఈ నమ్మకాన్ని పూర్తిగా సడలించి వేస్తుందనే భయం మూలంగానే, ఇంతకాలం అలాటి తగ్గింపుకు బ్రిటన్ ఇష్టపడలేదు. కాని బ్రిటన్ ఆర్థిక పరిస్థితిని బట్టి, ఈ తగ్గింపు తప్పనిసరిగా జరిగితీరాలని అమెరికాలోని ఆర్థికవేత్తలూ ప్రభుత్వోద్యోగులూ అంటూవచ్చేరు. చివరకు అంతర్జాతీయ ద్రవ్యనిధి కూడా తన నివేదికలో ఈ సలహాను ఇచ్చినది. బ్రిటిష్ కోశాధ్యక్షునకు ఈ సలహా పాటించక తీరినదికాదు. అందువల్ల నష్టకారణమైన పరువుకోసం స్టెర్లింగ్ విలువను యథాపూర్వంగా నిలబెట్టడానికి ప్రయత్నించకుండా, యథార్థ పరిస్థితులను గమనించి స్టెర్లింగ్ విలువను తగ్గించడమే యుక్తమని బ్రిటిష్ ప్రభుత్వం గుర్తించి, ఈ డివేల్యూయేషన్‌కు పూనుకున్నది.

స్టెర్లింగ్ విలువను తగ్గించడం బ్రిటన్‌కు ఎందువల్ల తప్పనిసరి అయిందో తెలుసుకోడానికి బ్రిటన్ ఆర్థిక పరిస్థితిని ఒక్కసారి సింహావలోకనం చెయ్యవలసి ఉంటుంది. ఈ డివేల్యూయేషన్ నిర్ణయం జరిగిన వాషింగ్‌టన్ సమావేశ సందర్భంలో సర్ స్టాఫర్డ్ క్రిప్స్ బ్రిటన్‌కు సంబంధించిన నేటి ఆర్థిక సమస్యలు ప్రథమ ప్రపంచ మహాసంగ్రామమునుండీ ప్రారంభం అయేయనీ, రెండు యుద్ధాలలోనూ బ్రిటన్‌లో జరిగిన విచ్ఛిత్తి వీటికి కారణం అని అన్నాడు. రెండు యుద్ధాలలోనూ ప్రముఖనాయకత్వం వహించడం మూలాన బ్రిటన్ ఆర్థికంగానూ రాజకీయంగానూ చితికిపోవడంలో ఆశ్చర్యం లేదు. యుద్ధంలో విశేషంగా పాల్గొన్న ప్రతిదేశంలోనూ ఉత్పత్తి విచ్ఛిన్నం అయిపోయి, ప్రజల అవసరాలను సరిపోకుండా పోయింది. ఫలితం—ఆ దేశాల ప్రజలు తమ జీవిత సౌభాగ్యాన్ని చాలవరకు పోగొట్టుకున్నారు. బ్రిటన్ విషయంలో ఇది మరింత నిజం. ఈ రెండు యుద్ధాలకూ పూర్వం బ్రిటన్ ఇతరదేశాలలోని పెట్టుబడులమీద వడ్డీ రూపంలో ఎంతో ఆదా

రూన్ని పొందుతూ ఉండేది. నేడు ఆ పెట్టుబడిఅంతా పూర్తిగా మాయం అయిపోవడమే కాకుండా పైపెచ్చు బ్రిటన్‌కు ఇతరదేశాలకు బాకీపడ్డది. దానివల్ల బ్రిటన్‌కు ఆదాయంవచ్చే ఒక ఆధారం ఇంకిపోయింది. తన ప్రజల ముఖ్యావసరాలను తీర్చడానికి అత్యవసరమైన దిగుమతుల నిమిత్తం కావలసిన విదేశ కరెన్సీలను సంపాదించడానికీ, తన ఆర్థిక పునర్నిర్మాణ కార్యక్రమాన్ని సాగిస్తూ ఉత్పత్తి సాధనాలను ద్విగుణీకృతంచేసి, విశ్వప్రయత్నం చెయ్యవలసి వచ్చినది.

బ్రిటన్ ప్రయత్నానికి అమెరికా సంపూర్ణంగా సహకారం చేసినది. కొంత ఉచితంగా, కొంత ఋణరూపంగా బ్రిటన్‌కు ఎంతో ధన సహాయం అమెరికా చేసినది. మార్షల్ ప్రణాళిక ఈ ధనసహాయానికి ప్రత్యక్షనిదర్శనం. బ్రిటన్‌కూడా అతిత్వరితకాలంలో తన ఆర్థిక పరిస్థితిని చక్కబెట్టుకున్నది. 1948 నాటికి బ్రిటన్ ఉత్పత్తిశక్తి 1938 నాటికంటె నూటికి 25 వంతున పెరిగినది. 1949 సంవత్సరంలో మొదటి ఆరునెలలలోనూ 1938 కంటె ఎగుమతులు నూటికి 50 వంతున పెరిగినవి. అంతర్జాతీయ వ్యాపారవిషయంలో బ్రిటన్ వ్యాపార సుముఖత్వాన్ని సాధించగలిగినది.

కాని అన్ని దేశాలతోనూ వ్యాపారాన్ని లెక్కలోకి తీసుకుంటే బ్రిటన్ వ్యాపారసుముఖత్వాన్ని సాధించగలిగినా, అమెరికా విషయంలో మాత్రం బ్రిటన్ దిగుమతులే ఎగుమతులకంటే ఎక్కువ. ఈ డాలర్ల కొరత ఒక్క బ్రిటన్‌కే కాకుండా ప్రపంచానికంతకీ తీరని సమస్య అయిపోయినది. ప్రస్తుతం మార్షల్ ప్రణాళిక అమలులో ఉన్నది కనక ఈ సమస్య బ్రిటన్‌కూ, ఇతర ఐరోపా దేశాలకూ అంత ఎక్కువగా లేదు. కాని మార్షల్ ప్రణాళిక అంతమయే 1952 సంవత్సరం మధ్యప్రాంతానికైనా బ్రిటన్ అమెరికా ఆధారం లేకుండా స్వశక్తిమీద ఆధారపడవలసి ఉన్న అగత్యం ఉన్నది. ఈ పరిస్థితుల అన్నిటి ఫలితమే ఈ డీవేల్యుయేషన్.

డివేల్యుయేషన్ ఆశయాలు: మొదటిది, అమెరికన్ మార్కెట్లో బ్రిటిష్ సరకులు పోటీచెయ్యడానికి అవకాశాలను కల్పించడం. రెండవది, బ్రిటన్ నుండి అమెరికాకు ఎగుమతులు హెచ్చించి, దిగుమతులను తగ్గించడం. మూడవది, బ్రిటన్ నుండి ఎగుమతి అయిపోతూన్న బంగారాన్ని, డాలర్ రిజర్వులనీ అరికట్టడం. నాల్గవది, అమెరికానుండి దిగుమతి చేసుకునే సరకుల పరిమితిని తగ్గించి, అక్కడా ఇవతలా ఆర్థిక మాంద్యాన్ని కలుగచెయ్యడం కంటే అంతర్జాతీయ వ్యాపారాన్ని పెంపొందించి, తద్వారా బ్రిటన్‌లోనూ అమెరికాలోనూ ఉత్పత్తి సాధనాలను పూర్తిగా వినియోగించడానికి అవకాశాలు కల్పించడం.

అమెరికన్ మార్కెట్లో బ్రిటిష్ సరకులు పోటీచెయ్యాలంటే వాటి ఖరీదు అమెరికా సరకుల ఖరీదు కంటే తక్కువగా ఉండాలి. అందుకు, ఆ సరకులను తయారుచెయ్యడానికయే ఖరీదు తగ్గించాలి. ముడిపదార్థాలను దిగుమతి చేసుకోవాలి కనక, వాటిఖరీదులను బ్రిటన్ నిర్ణయించలేదు. సామ్యవాద సిద్ధాంతాలను ఆచరణలో పెట్టడానికి ప్రయత్నించే బ్రిటిష్ కార్మికప్రభుత్వం కార్మికుల వేతనాలను తగ్గించడానికి ప్రయత్నించలేదు. అందువల్ల డివేల్యుయేషన్ వినా అమెరికాలో బ్రిటిష్ సరకుల ఖరీదుని తగ్గించే అవకాశాలే లేవు.

ఈ సందర్భంలో ఒక్క విషయం జ్ఞాపకం ఉంచుకోవాలి. బ్రిటన్‌లోని కార్మికులూ తదితరులూ తమ తమ వేతనాలలోని తగ్గింపులను సహించరు, నిజమే. కాని డివేల్యుయేషన్ ద్వారా వస్తువుల ధరలు హెచ్చి తీరుతవి. రొట్టె, గోధుమల ఖరీదు మూడవ వంతు అప్పుడే పెరిగినవి. అంటే బ్రిటిష్ ప్రజల ఆదాయాలలో లెక్కకు ఏ విధమైన మార్పు లేక పోయినా, నిజానికి వారికొనుగోలుశక్తి తగ్గిపోయినది. బ్రిటన్ ఇంతకాలంనుండీ స్వదేశ ఆర్థిక పరిస్థితుల మార్పును గమనించకుండా తన ఆదాయానికి మించిన జీవితసౌభాగ్యం అనుభవిస్తున్నది. డివేల్యుయేషన్‌వల్ల జీవిత సౌభాగ్యం అసలుపరిస్థితికి అనుగుణంగా మారుతున్నది.

అయితే డివేల్యుయేషన్‌ద్వారా అమెరికన్ మార్కెట్లో బ్రిటిష్ సరకుల ధరలను తగ్గించడం సాధ్యమౌతుందా? అనేది సందేహాస్పదం. బ్రిటన్

ముడిపదార్థాలకూ, ఇతర పదార్థాలకూ అమెరికామీద ఆధారపడి ఉన్నది. డివేల్యుయేషన్ వల్ల బ్రిటన్‌లో అమెరికన్ ముడిపదార్థాలధర హెచ్చుతుంది. అందువల్ల దీర్ఘకాలంలో బ్రిటన్‌లో పారిశ్రామిక పదార్థాల ఉత్పత్తి ఖరీదు హెచ్చి, బ్రిటన్‌కు డివేల్యుయేషన్‌వల్ల సంక్రమింపగల లాభాన్ని హరించవేయవచ్చును. అంతేకాక, గిరాకీ తగ్గడం మూలాన అమెరికన్ సరకుల ధరలుకూడ తగ్గిపోవచ్చును. అప్పుడు బ్రిటన్ అమెరికాతో పోటీచెయ్యడం కష్టం కావచ్చును. కాని అద్యతన భావిలో బ్రిటన్‌కు అమెరికా సరకులతో పోటీచెయ్యడం విషయంలో కొంతలాభం ఏర్పడుతుందని నిస్సందేహంగా చెప్పవచ్చును.

ఇక, డివేల్యుయేషన్ రెండవ ఆశయం అమెరికాకు బ్రిటిష్ సరకులను విరివిగా ఎగుమతి చెయ్యడానికి అవకాశాలు కల్పించడం. డివేల్యుయేషన్‌వల్ల ఈ అవకాశాలు కలిగినా, అమెరికాకు ఎగుమతులు చెయ్యడానికి చాలా ప్రతిబంధకాలున్నాయని మనం గుర్తించాలి. అందులో ముఖ్యమైనది అమెరికా దిగుమతి సుంకాల విధానం. కొన్ని కొన్ని వస్తువులమీద ఆ సుంకాలు నూటికి 30—40 వరకూ ఉన్నాయని మనం గుర్తిస్తే, అమెరికా బ్రిటన్ చేసిన ఈ డివేల్యుయేషన్‌ను ఆశీర్వదించి ఈ సుంకాలను రద్దుచేస్తే తప్ప బ్రిటన్ అనుకున్నంత ఎక్కువగా ఎగుమతులను వృద్ధిచేయలేక పోవచ్చును. ప్రస్తుతం ప్రపంచంలో ఏర్పడిన డాలర్ కొరతకు ముఖ్యకారణం అమెరికా ఇతరదేశాలకు ఎగుమతి చెయ్యడమే తప్ప, అక్కడనుంచి సరకులను దిగుమతి చేసుకోకపోవడం. ఆ కారణంగా అమెరికా విధానంవల్ల ఏర్పడిన డాలర్ కొరతను తీర్చడానికి అమెరికాకు కూడా జవాబుదారీ ఉన్నది. అమెరికాలో దిగుమతి సుంకాలను రద్దు చెయ్యడం మూలంగా ఈ సహాయాన్ని అమెరికా చెయ్యవచ్చును.

డివేల్యుయేషన్ మూడవ ఆశయం బ్రిటన్ నుండి ఎగుమతి ఐపోతూన్న బంగారం, డాలర్ రిజర్వులను అరికట్టడం. ఇంతవరకూ బ్రిటిష్ స్టెర్లింగ్ విలువ అసలుకంటె ఎక్కువగా ఉంటటం మూలాన, కొందరు "డాలర్"వంటి ఇతర కరెన్సీలలోనికి తమ ధనాన్ని మార్చుకోవడం ప్రారంభించేరు, ఇప్పుడు తిరిగి ఆ ధనం బ్రిటన్‌కు వచ్చేస్తుంది. అంతేకాక, డివేల్యుయేషన్ మూలంగా అమెరికాతో బ్రిటన్‌కు వ్యాపార సుముఖత్వం ఏర్పడితే, డాలర్ రిజర్వుల ఎగుమతి అరికట్టబడుతుంది.

నాల్గవ ఆశయం అంతర్జాతీయ వ్యాపారాన్ని, ముఖ్యంగా దిగుమతులను, నిరోధించడం ద్వారా వ్యాపారసుముఖత్వాన్ని సాధించడం కంటే, డివేల్యుయేషన్ ద్వారా సాధించడం మంచిది. ఎందువల్లనంటే దిగుమతులను తగ్గిస్తే పారిశ్రామిక కృషి తగ్గి ఆర్థికమాంద్యానికీ, నిరుద్యోగానికీ దారితీయవచ్చును. అది ప్రపంచార్థిక స్థితినే తారుమారు చేస్తుంది. డివేల్యుయేషన్ వల్ల అలాంటి ప్రమాదం సంభవించదు. అది బ్రిటన్ సరకులఎగుమతి ఎక్కువ అయి, బ్రిటన్‌లో పూర్తి ఉద్యోగానికి దారితియ్యగలదు. తద్వారా సంపాదించిన అమెరికన్ డాలర్లతో అమెరికా సరకులను బ్రిటన్ కొనగలిగినట్లయితే, అమెరికాలో కూడా ఉత్పత్తి సాధనాలు పూర్తిగా ఉపయోగింపబడతవి.

పైన వివరించిన విధంగా డివేల్యుయేషన్ ద్వారా అద్యతన భావిలో కొంతలాభం పొందగలదు. కాని దీర్ఘకాలంలో అది సహాయకారిగా ఉంటుందా అనే విషయం నిర్ధారణగా చెప్పడం కష్టం. అందువల్ల దీర్ఘకాలంలోకూడా నమ్మకంగా ఫలితాలను ఇచ్చే విధానాన్ని బ్రిటన్ అన్వేషించవలసి ఉన్నది; డివేల్యుయేషన్ ఈ గారడీని సాధించలేదు. అలాంటి విధానం ఉత్పత్తి ఖరీదులను తగ్గించడం అధికకృషిద్వారా ఉత్పత్తిని హెచ్చించడం. దేశంలోని జీవన సౌభాగ్యాన్ని మారిన పరిస్థితుల ఆదాయానికి అనుగుణంగా మార్చుకోవడం యుద్ధానికి పూర్వం బ్రిటన్ విదేశాదాయాన్ని సంపాదించగలిగి ఉండేది; యుద్ధం తరవాత ఆ ఆదాయం తగ్గినది. దానికి తగినట్లుగా బ్రిటన్ తన జీవన సౌభాగ్యాన్ని తగ్గించుకోవలసిఉన్నదని ఎంత తొందరగా గుర్తిస్తే అంత మంచిది.

ప్రపంచ రాజకీయాలలో నేడు అటు అమెరికా పెట్టుబడిదారీ విధానమూ కాదు; యిటు సోవియట్ రష్యా నిరంకుశ విధానమూ కాదు; మూడో పంథా—ప్రజాస్వామిక సామ్యవాదం కావాలి. అయితే దానికి సంబంధించిన సాహిత్యం మాటేమిటి?

# ఏది నిజమైన సాహిత్యం?

• వి. యస్. అవధాని

మనం పంచభూతాత్మకమగు యథార్థ జగత్తులో నివసిస్తున్నాం. మన మేధ పంచభూతాల కలయికకు సంబంధించిన వస్తువుతో నిర్మితమయింది. ఈ పంచభూతాలు అనేకరకాల సంవేదనలను కలిగిస్తున్నాయి. ఆ సంవేదనలను మానవ మేధ ఇంద్రియాల ద్వారా గ్రహిస్తున్నది. గ్రహించిన సంవేదనను (Stimulus) ఎట్టిమార్పు లేకుండా మొదట పాతవాటినుండి విడదీసి తరువాత మానసిక చిత్రాన్ని అలవఱచి తదుపరి మానవమేధ ఈసంవేదనను అవగాహనగా స్వీకరించుకుంటోంది. తిరిగి మొదటి సంవేదనలాంటి సంవేదనను పరిసరాలలో గాంచినప్పుడు మానవమేధ జ్ఞాననాడుల స్వభావాన్నిబట్టి సులభమగు (easy) ప్రతీకారచర్య కివ్వగలుగుతోంది.

ఆ ప్రతీకారచర్య మానవఅంతస్థులలో అనేకరకాలుగా ఉంటుంది. ఒక్కొక్కసారి తనకు కలిగిన సంవేదనను ఒక బొమ్మరూపాన చిత్రించవచ్చు. ఇంకొకరు ఒక పద్యరూపాన, మరొకరు ఒక గేయం రూపాన, ఇంకొకరు కథారూపాన...

ఇదే సాహిత్య నిర్మాణానికి మూలకందం. అయితే వివిధ దశలలోనూ ఈ సాహిత్య నిర్మాణం ఒక ఉద్దేశ్యాన్ని కలిగి ఉన్నది. ఆదికవి వాల్మీకి రామాయణ గ్రంథాన్ని ఉద్దేశ్యపూర్వకంగా వ్రాయలేదని అనగలమా? వ్యాస కృత పురాణాలు ఉద్దేశ్యరాహిత్యమని అనగలమా? తెలుగున కవిత్రయం చేసిన కృషి ఉద్దేశ్యరాహిత్యమని అనగలమా? సాహిత్యకృషి ప్రాయికంగా ఉద్దేశ్యాన్ని అనుసరించే గతంలోనూ ఈనాడూ జరుగుతోంది.

కోయిల పాడుతూంటుంది. అది ఒకఋతువులోనే బాగా పాడుతూంటుంది. ఎందుచేత? ఆ ఋతువులో కోకిలకు ప్రకృతి ఇచ్చే సంవేదన దాని శరీరంలో ఆవేదనను కలిగిస్తుంది. ఆ ఆవేదనను పాటరూపంగా వ్యక్తపరుస్తోంది. అయితే మానవేతర అంతస్థులలో ఇచ్చే ప్రతీకారాలు కేవలం యాంత్రికంగా ఉంటాయి. సహజంగా ఉంటాయి. ఏ మార్పూ వాటిలో కనుపించదు. మానవ అంతస్థులలో కలిగిన సంవేదనలను మిళిత పరచి పరిసరాలలో పరివర్తన మొందించడం సాధ్యం అవుతోంది. ఇక్కడే ఉద్దేశ్యం-అవసరం-ఆరంభమవుతున్నది.

పదాల తత్వమూ, వాటి స్థానమూ అవి ఉపయోగించిన తీరూ పూర్తిగా గ్రహించ గలిగినప్పుడు వ్యక్తి పొందే ఆనందానికీ, సాహితీ ఖండంగా, మొత్తంగా ఇవ్వగలిగిన ఆనందాన్ని అనుభవించే తీరులోనూ తేడా ఉంటుంది. ఒక పద్యం అర్థంపూర్తిగా తెలియకుండా దానిసౌరస్యాన్ని ఆస్వాదించగలగడం సాధ్యం కాకపోవచ్చు. మనకు రాని హిందీభాషలో వస్తున్న చిత్రాలను చూసినప్పుడు కన్ను కలుగజేసే ఆనందం మాత్రమే మనం పొందగలుగుతాం. దాన్నిబట్టి మొత్తపు టానందాన్ని ఊహించుకుని ఊహాగా ఆనందించ గలుగుతాం. అట్లాకాక ఆ భాష వచ్చి, చిత్రంలోని వివిధ సన్నివేశాలలోని సంభాషణలను పూర్తిగా అర్థం చేసుకుని అవగాహన చేసుకో గలిగినప్పుడు మనం పూర్తిగా రసాస్వాదన చేయగలుగుతాము. కాబట్టి సాహిత్యకృషి యొక్క విలువను కట్టాలిసినప్పుడు వ్యక్తి కొంతగా సాహితీ కృషి చేయవలసిఉంటుంది. అంటే కృషి

చేయనివారు ఆనందం పొందలేరని భావంకాదు. ఆ ఆనందం వీలయినంత ఎక్కువగామాత్రం ఉండదని అంటాను. ఇవ్వాల్సిన ఆనందం ఇవ్వకపోవచ్చు. కాబట్టి ఏ కవినయినా విమర్శించేటప్పుడు (అట్లాగే ఏకళాకారుణ్ణయినా) అతని కృషిని వీలయినంత సానుభూతితో తర్కించుకుని విమర్శ సాగిస్తే అది కొంత ప్రయోజనకారి అవుతుంది.

అసలు భావ విషయంలోనే ఒక పెద్ద సమస్య ఉన్నదని ఒక భావన ఉన్నది. మనకు కలుగుతున్న సంవేదనలను మనకు లభించిన యీ సంకేతాలు ఎంతమటుకు పూర్తిగా వ్యక్తపరుస్తున్నవని ఒక అనుమానం లేకపోలేదు. భాషాశాస్త్రాన్ని తిరిగి సింహావలోకనం చేసుకుని సరిదిద్దుకోవాల్సిన అవసరం ఒకటి కనిపిస్తున్నది. ఇంతవరకూ (కొంతమంది కృషి చేశాననుకొంటే) సక్రమమగు భాషాచరిత్ర తెలుగులో కనిపించడం లేదు. అది అట్లా ఉంచి సాహిత్య కృషి ఎట్టిదిగా ఉండాలి అనే ప్రశ్నను వీలయినంతమటుకు చర్చించుకుందాం.

మన మేధ ఎప్పుడూ శూన్యంగా ఉండదు. దానిలో అనేక సంక్లిష్ట విషయాలుంటాయి. అవి వ్యక్తికి తెలిసినప్పుడుఆ వ్యక్తికి చైతన్యం ఆరంభం అవుతుంది. కాబట్టి నిష్పాక్షిక విమర్శ లేక చప్పి, అన్నప్పుడు పూర్వవాదిని వీలయినంత పూర్తిగా అర్థం చేసుకోవడం మాత్రమే అవుతుంది.

ఉద్దేశ్యపూర్వకమై అన్వయయుతంగా నున్నది సాహిత్యకృషి. ఆ ఉద్దేశాన్ని గురించే యీనాడు ఇన్ని సాహిత్య సంస్థలు బయలుదేరినాయి. ఏ సాహిత్య వ్యవస్థనూడా ఒక ఉద్దేశ్యాన్ని కలిగి ఉండలేదు అని చెప్పడం తమ కార్యక్రమాన్ని ఏ కారణంచేతనయినా సరే మరుగు పరుచుకోవడమే అవుతుంది. ఇక్కడే అసలు చిక్కు, తమరు నమ్మిన తాత్వికత తమకు ఆనందం కలుగచేయవచ్చు. అదీ ఎంత వరకు సాధ్యం అనే విషయం ఆటుంచండి. దాన్ని తెలియచేస్తూ వ్రాసే రచనలే అభ్యుదయ రచనలో లేక ప్రచారరచనలో లేక నవ్యసాహితీ రచనలో అనడంలో వస్తోంది సమస్య.

సాహిత్యానికి వెనుక తాత్విక కార్యక్రమం ఉండి తీరుతుంది. అనేక కారణాలవలన ఆ సంగతిని ఆయా రచయితలు బహిరంగంగా అంగీకరించడం లేదు. ఈ అసహజ కారణాలను వదలి ఈనాడు రచయితలు తమతమ తాత్వికతలను నిష్పాక్షికంగా విమర్శించుకో గలగాలి. అట్లా విమర్శించుకున్నప్పుడు ఈ 'అభ్యుదయమూ'' మొదలయిన లేక అనవసరమయి ఏ సాహిత్యం ఎటువంటిదో సువ్యక్తము కాగలదు.

ఈనాటి ఈ సంఘర్షణలు సాహిత్యాకారాన్ని గురించా, లేక స్వరూపితమగు విషయాన్ని గురించా? ఈ రెండూ వేరుకావు. ఒకే విషయాన్ని పద్యంగానూ, గద్యంగానూ, ఇంకా అనేక రూపాలలో చెప్పడం సాధ్యమే. ఐనా విషయం మాత్రం మారదు. పోతే ఆయా రచయితల వ్యక్తిగత అభిరుచులనుబట్టి వ్యక్తిగత కృషిని బట్టి ఒక విషయాన్ని ఒక రూపంలో చెప్పగలిగినట్లు మరోరూపంలో చెప్పలేకపోవచ్చు. ప్రయత్నించిన ఆయా రచయితలు తాము చెప్పదలచుకున్న విషయాలను వివిధరూపాలలోనూ సువ్యక్తం చేయగలరు.

ఇహపోతే చెప్పవలసిన విషయం సంగతి. రచయితను నువ్వు ఈ విషయమే చెప్పు, అని నిర్బంధించడం సాధ్యంకాని పని. కూడని పని. రచయిత పూర్తియగు వికాసమునందినప్పుడు తన తాత్వికతను వ్యక్తిగతము చేసుకొనును. అది అతని సాహిత్యంలో వ్యక్తమగును. నీ తాత్వికతతో నాకు సంబంధం లేదు. నాకు కావాల్సిన రచన ఇట్టిది. అది రాస్తేనే నువ్వు ప్రజాకవివి-అభ్యుదయకవివి. లేకపోతే నువ్వు అభ్యుదయ నిరో "ధకుడివి'' అని అనడం ఏమన్నా అవుతుంది కాని సాహిత్య సేవకి మాత్రం లక్షణం కాదు

ప్రపంచం అంతా ఇట్లా నడవాలి, అని ఎక్కడా రాసిపెట్టలేదు. విశ్వసూత్రాలను అవగాహన చేసుకొనడానికి విశ్వమే సహాయపడుతుంది. ఆ విశ్వసూత్రాన్ని ఒక తార్కిక వాదనతో ముడివేయ చూడడం ప్రపంచాన్ని సాధించిన దానికన్న నువ్వు పెరగరాదు అని అనడం మాత్రమే అవుతుంది. నియమాల సాయంతో తెలుసుకునే అవకాశం ఉన్నా [illegible] చెప్పేటంత పరి[illegible] చాలమంది ఇంతవరకూ పొందలేదు. తెలిసినదానిని బట్టి రాసన్నదానిని

తెలుగు విశ్వవిద్యాలయము
గ్రంథాలయం

ఊహించగలశక్తిని దుర్వినియోగం చేయరాదు.

సాహిత్యానికి లక్షణాలేమిటి? ఎటువంటి రచన సాహిత్యం అనిపించుకుంటుంది? అనే విషయాలు అలంకారికులు చెప్పగలరు. అలంకారశాస్త్రం కళాస్వరూపాన్ని సామాన్యంగా చిత్రించ గలుగుతుంది. ఆ లక్షణాలను సూక్ష్మంగా ఇక్కడ చెప్ప ప్రయత్నిస్తాను.

అంతకు ముందు సామాజిక వ్యవస్థను రెండు తెగలుగా విభజించి సాహిత్య సమన్వయం చేయడం న్యాయం కాదనీ, అట్లా చేయడం మానవుడొకప్పుడు ఒకతీరున ప్రవర్తించాడు కాబట్టి ఎప్పుడూ అట్లానే ఉంటాడు అనే వితర్కానికి దోహదం అవుతుందనీ అంచేత సాహిత్య కృషికి బదులు మరో అనర్థదాయకమగు కృషి ఆవిర్భవిస్తుందని మనవి చేయాల్సి ఉంది. మానవుని భావాలనుబట్టి అర్థం చేసుకో యత్నించాలి, కాని కేవలం అతని ఉనికీ, పరిసరాలూ, ఉత్పాదక పరికరాలూ—వీటివలన యథార్థ మానవ చరిత్ర లభ్యంకాదని కూడా గుర్తుంచుకోవాలి.

సాహిత్యానికి, అనన్యతా, వివేకమూ, ఆనందమూ, నిర్లిప్తతా, సంపూర్ణత్వం స్వయంపోషకత్వం, లక్షణాలుగా అనుకోవచ్చు. ఇందులో ప్రతిఒక్కదాన్ని గురించీ కొంచెకొంచెం చెప్తాను.

క్రొత్తగా చేయనున్న సాహిత్యపుకృషి (ఒక పద్యమే అనుకోండి) ఆదివరకు ఆ విషయాన్ని గురించి ఇతర్లు వ్రాసిన పద్యాలకంటె భిన్నమయి ఉండాలి. అంటే ఏదో ఒక్కవిషయంలోనైనా అది అపూర్వం అయిఉండాలి. లేకుంటే ఒక విషయాన్ని గురించే వివిధ వ్యక్తులు పద్యం వ్రాయడంలోని భావం ఏమిటి? ఇది ప్రబంధ కవులలో కొంతకు కొంకగా కనిపిస్తుంది. ఆ పద్యం రచయిత బోధిస్తున్న వివేకాన్ని— అది కార్యకారణ సంబంధం అయితే మంచిదే—వ్యక్తపరచాలి. ఆ వివేకం అడుగున ఎక్కడో మాటుమణిగి యుండి పదాడంబరం చూపితే అది పాండిత్య ప్రకర్ష అవుతుందేమో కాని సాహిత్య లక్షణం మాత్రంకాదు. అవశ్యమైన వివేకవంతమగు కళాఖండం వ్యక్తిని ఆనంద పరుస్తుంది. ఆనందం వ్యక్తితో మారినా ఆనందపు విలువ అందరికీ ఒకటిగానే ఉంటుంది. అది ఎట్లా సంభవం అనే విషయం ఇంకొక వ్యాసంలో మనవి చేస్తాను. ఈ ఆనందం మొత్తపుటానందం అవుతుంది. పద్యంలోని వివిధ భాగాలూ ఏ భాగాని కాభాగం స్వయం పోషకమై ఉండాలి. ఏ భాగాని కాభాగం రానున్న భాగానికి ఆస్కారం చూపుతూ సమగ్రంగా ఉండాలి. అప్పుడు అపద్యం నిర్లిప్తతను (detachedness) సూచిస్తుంది. ఇట్టి కళాఖండం జీవితం పట్లనొక నిర్దిష్టమగు వైఖరి నివ్వగలుగుతుంది.

ప్రజాసమస్యలను చిత్రించినా, నూతన పంథాను సూచించినా పై నియమాల ననుసరించి చేయు కళాకృషి-కథ అయినా సరే, వ్యాసం అయినా సరే, పద్యం అయినా సరే, సాహిత్య వీథులలో విహరించగలుగుతుంది.

సాహిత్యప్రయోజనం ఏమిటి? జీవిత ప్రయోజనమే సాహిత్య ప్రయోజనం. జీవితాన్ని ఆనందపరిచేది స్వేచ్ఛ ఐతే సాహిత్యప్రయోజనం కూడా అదే. ఈ స్వేచ్ఛ వర్గ స్వేచ్ఛ కాదు. వ్యక్తి అనుభవంలోకి వచ్చే స్వేచ్ఛ. పారమార్థికమని మోక్షము కాంక్షించి చెడే స్వేచ్ఛ కాదు. ఈ జన్మలో ఈ జగత్తులో అనుభవంలోకి రావాల్సిన స్వేచ్ఛ.

ప్రపంచ రాజకీయాలలో మూడో పంథా కనిపిస్తోంది. అటు అమెరికా సహాయాన్ని పొందుతూ తమ వ్యక్తిత్వాన్ని భంగపరచుకో కుండా, ఇటు రష్యన్ విప్లవం నుంచి కొన్ని గుణపాఠాల్ని గ్రహించుకుని పార్లమెంటరీ డెమాక్రసీతోనే సోషలిస్టు వ్యవస్థను నిర్మించ ప్రయత్నాలు సాగుతున్నాయి అని యథార్థ వాదులగు చరిత్రకారులు అంటున్నారు. అట్లా జరుగుతోంది. మూడో పంథా లేదనడం నాకు తెలియనిదంతా లేదనడం మాత్రమే అవుతుంది. మూడో పంథా అంటూ ఉన్నపుడు దానికి సంబంధించిన సాహిత్యం కూడా ఉంటుంది. ఆ సాహిత్యం జీవితం అంటే ఆరాటమూ కాదు పోరాటమూ కాదు సమన్వయ సహకారం అని ప్రచారం చేస్తుంది. ఆ ప్రచారానికి ఏ "లేబిలూ" తగిలించుకోకుండా అవసరసందర్భాలలోనది ప్రత్యక్షమవుతోంది. [illegible]తుంది. మీరూ నేనూ కాదన్నా అయినది కాకపోదు. అనుభవం ఇస్తున్న పాఠాన్ని గ్రహించకపోతే మనం కాలానికి వెనుకబడతాం—అంతే.







ఈరంకి వెంకటరావు

## 13

రామదాసు సరోజకి క్రిందివిధంగా రాశాడు.

"నన్ను క్షమించు, నేనిక ఆట్టే కాలం మౌనం వహించలేను; నా హృదయం నీకు విప్పి చెప్పాలి. నేనెవరో నీకెన్నటికీ తెలియదు. నిన్ను ప్రేమిస్తున్నానని నీకు చెప్పనిదే ప్రేమించటానికి సాహసించలేని ఒక పిరికివాడు, నీకు తెలియనివాడు చెప్పే వాక్యాలివి. నేను నిన్ను కోరేదేమీ లేదు. ఈ ఉత్తరం పూర్తిగా చదివితే– నీకు చాటుగా, నీ సుఖదుఃఖాలు పంచుకొనే వ్యక్తి ఒకడున్నాడని నీకు తెలుస్తుంది. ఇంకొకరితో కలిసి దుఃఖిస్తే విచారంలో వున్న బాధ కొంత తగ్గుతుంది. కన్నీరు మాత్రమే కార్చ గలిగిన నేను దుఃఖంతో బెంగటిల్లే జీవులకు ఏకాంతం ఎంత భారంగా వుంటుందో ఎరుగుదును.

నేను ఓదార్పు వాంఛించటంలేదు, దుఃఖభారంలో పెరగటానికే నేను జీవించివున్నాను. నాకు వీలయితే నీ జీవితాన్ని అత్యంత సుఖదాయకంగా చేసి, దయాస్వరూపులు, సత్పురుషులూ అనుభవించే శాంతిని కలుగజేదామని వుంది.

నేను నిన్ను ప్రేమిస్తున్నానని తెలియ చెయ్యడానికీ, నీవు ఒంటరిగా లేవనీ, నిరుత్సాహ పడవద్దనీ తెలియచెయ్యడానికీ నేను యీ వుత్తరం వ్రాస్తున్నాను. ఒంటరి జీవితంలోగూడా ఎటువంటి మాధుర్యం వుంటుందో నీ వెరుగవు. నేను నిన్ను యింకో జీవితంలో ప్రేమిస్తున్నాననీ, నీవు విశాల స్వప్నజగత్తులో నాదానివేననీ, నాకు తెలుసు. నా రహస్యాన్ని ఎవరూ తెలుసుకోలేరు. లోభివాడు బంగారాన్ని దాచుకున్నట్టు నా ప్రేమను నేను పోగుచేశాను. నిన్ను ప్రేమించేవాణ్ణి నేనొక్కణ్ణే, నిన్ను ప్రేమిస్తున్నానని తెలుసుకున్న వాణ్ణిగూడా నేనొక్కణ్ణే.

ఆరోజు రాత్రి నువ్వు చాలా విచారంగా కనిపించావు నాకు; కాని నీకు నేను సుఖాన్ని కలుగచెయ్యలేక పోయాను. నేను నీకేమీ అవను; నేను కనే కలల్లో కనపడమని నిన్ను ప్రార్థించటానికికూడా నాకు ధైర్యంలేదు. నీవు ఉత్కృష్ట స్థానం పొందు–యింకా ఔన్నత్య దశలోకి వెళ్ళు. ఆ ఉన్నత స్వాప్నిక జగత్తులో నేను నివసించే ప్రపంచాన్ని చూడగలవు.

నా హృదయంలో భావాలు పైకి పొంగకుండా చేదామని ఎంతో ప్రయత్నించాను, కాని నాకు సాధ్యంకాలేదు. అందుకనే నీదగ్గర మోకరిల్లుతున్నాను — భక్తుడు ఆనందపారవశ్యంలో ఆరాధిస్తున్నట్టుగా. నేను ఏ ప్రయోజనానికి జన్మించానో తెలియదు—నిన్ను ప్రేమించడానికే నేమో. కాని నేనింకా మౌనంగానే వుండవలసి వచ్చింది—ఎల్లప్పుడూ మౌనంగానే వుండాలేమో. నువ్వు నిత్యమూ వాడే ఏదైనా వస్తువుగా నేను జన్మించినా బాగుండేది—కనీసం నీ కాలిక్రింద నలిగే ధూళిగా వుండినా బాగుండేది.

నేను విచారంతోను, సిగ్గుతోను క్రుంగిపోయి శోకిస్తున్నాను. నీవు బాధతో క్రుంగిపోతూ

ఒంటరి జీవితం గడుపుతున్నావని, హృదయంలో నిరంతరం పోరాడుతున్నావని నే నెరుగుదును. నేనుగూడా ఒంటరిగా బాధ పడుతున్నాను, నాకు నీయందుండే వాత్సల్యాన్ని తోసి పారేస్తా వేమోనని అనుమానం కలిగినప్పుడు నా బాధ ఎక్కువవుతోంది. నన్ను నీవు అర్థం చేసుకుంటున్నావు గదూ! నాహృదయం. నాజీవితం అపాయస్థితిలో వున్నాయి.

నేను హాయిగా ఉన్నతమైన స్వాప్నిక జగత్తులో నివసిస్తున్నాను. అనంతమైన ఆ సోపానా లెక్కి మనమిద్దరమూ ఒకరినొకరం ప్రేమించుకుంటూ అనిర్వచనీయానందా న్ననుభవిస్తూంటే ఎంత హాయిగా వుంటుంది!

* * *

అదే పద్ధతిలో రామదాసు అలాగే వ్రాశాడు. అవే మాటలు, అవే భావాలు మళ్ళీ మళ్ళీ దొర్లాయి. అతని మెదడులో ఒకటే ఆలోచన వుంది—అతను సరోజను ప్రేమించాడు, సరోజ మరొకరిని ప్రేమించే పరిస్థితిలో వుంది. అతని ఉత్తరంలో అదే అభిప్రాయం వేరువేరు తరహాలుగా తన ఆరాధన, ప్రార్థనలతో జోడించి వ్రాశాడు. అలా వ్రాయటంగూడా ఒక ప్రేమ కలాపమే.

సరోజకు అప్పుడప్పుడు సెంట్లూ, అత్తరు సీసాలతో పెట్టెలుగూడా వచ్చేవి. ఎవరో ఒక పెద్దమనిషి వాటిల్లో తన హృదయాన్నిగూడా పెట్టి పంపించేవాడు. ఈ ప్రేమలేఖలను మొదటి రెండుమూడు వాక్యాలను చదవగా నే చించి వేసేదామె. ఆమెకు ఏ విధమైన ఆనందాన్ని యిచ్చేవిగావవి. గత రోజున ఎంతో బాధ ననుభవించి, రాత్రంతా ఆ బాధతోనే గడిపి, మరుచటిరోజున గూడా అదేజీవితాన్ని గడపాలనుకునే నిరుత్సాహంలో వున్నపుడు రామదాసు ఉత్తరం ఆమె కందింది. ఆ ఉత్తరంలో మొదటి కొద్దివాక్యాలు చదివి ఆమె ఎంతో చలించింది. ఆమె చేతిలో ఉత్తరం వణికింది. కళ్ళవెంబడి నీళ్లు కారాయి.

ఆమెలో కలిగిన ఆనందానికి, శాంతికీ కారణ మేమిటో ఆమె తెలుసుకో లేకపోయింది. ఆమె ఆనందంలో చివరిదాకా చదివింది; తను మంచి పని చేస్తోందో పెద్దపని చేస్తోందో ఆమెకే తెలియదు.

ఆ ఉత్తరం ఆమెకు ప్రాణాన్నిచ్చింది. ఆ ఉత్తరంలో మోహావేశం, ప్రేమ నిజస్వరూపం వెల్లడిచేయబడి వున్నాయి. సరోజకు తాను చదువుతున్నట్టు లేదు: చాటుగా వున్న ఆ ప్రేమికుడు దుఃఖభారంతో చదివి వినిపిస్తున్నట్టుగా వుంది. ఆ ఉత్తరంలో ప్రతీ మాటలోను, ప్రతీ వాక్యంలోను హృదయం చేసే శబ్దం వినిపిస్తోంది. ఆ కాగితం రక్తంతోను, కన్నీటితోను పూర్తిగా తడిసినట్టుగా ఆమెకు కనిపించింది. ఆమెదేహం వణుకుతోంది, ఆమె ఆలోచనలు ఎక్కడో వున్నాయి. ఎక్కడనుంచో వచ్చిన ఆ విజ్ఞప్తికి ఆమె హృదయం సమాధాన మిస్తోంది. రామదాసు గొంతుక వినిపించిన ఆ శాంతియుత వాతావరణం చేరుకోవడానికి ఆమె ప్రయత్నిస్తోంది. ఆమె ఆ అంతస్తుకి వెళ్లి ఉన్నతమైన ప్రేమ, త్యాగాలతో పునీతమైంది.

తన పిరికితనానికి సిగ్గుపడి, ఆమె ఒంటరిగా వుండ నవసరంలేని ఆ ఉన్నతపథం చేరటానికి అంగీకరించింది. సరియైన మార్గంలో నడవాలనే కుతూహలం ఆమె నావేశించింది. ఆమెను ప్రేమించిన ప్రియుడి శ్వాస వేడిగా ఆమె నుదుటికి తాకినట్టయింది. ఆమెకిప్పుడు ఒకటే ఆలోచన, ఒకటే కోరిక—అవి ఆమెను దుఃఖాన్ని కలిగించినా సరే ఆమె హృదయాన్ని మాత్రం చీల్చివెయ్యలేవు. ఆమెలో ఆశ, శాంతి దృఢంగా వున్నాయి.

ఆమె అమితానందంతో తన్ను తాను ఓదార్చుకొంది—ఆమె యిప్పుడు ప్రేమించబడుతోంది; ఆమె హృదయం నిరాశతో కుమిలిపో నక్కరలేదు. ప్రపంచం ఆమెకు చాలా దూరంగా వున్నట్టుగా కనిపించింది. ఆమె తన ఊహాప్రపంచంలో తనకు శాంతిని, సహాయాన్ని యిచ్చిన ప్రియుణ్ణి ఊహించుకుంటోంది.

ఆ ప్రియుండెవరూ కాదు. అతని ఆత్మకు దేహం లేదు. అతనిని ఛాయామాత్రంగానే చూస్తోంది. అతను ప్రేమరూపుడు, అతనొక గంధర్వకుమారుడిలా వచ్చాడు, ఆమెను వెలుగులోకి తీసుకెడుతున్నాడు, ఆమె తనని తీసుకెళ్లే శక్తి ఎటువంటిదో, ఏవైపు తీసుకెడుతోందో

తెలియకుండానే ఆ శక్తికి లొంగిపోయింది. ఆ శక్తి స్వర్గమార్గంగా తీసుకెళుతోంది.

రామదాసు వారం రోజులవరకూ మళ్లీ శేషగిరి యింటికి వెళ్లడానికి సాహసించలేకపోయాడు. వేలకొద్దీ ఆలోచనలు పిచ్చిగా అతని బుర్రలో తిరిగాయి. సరోజ యింకా పూర్వపు ప్రేమతాపంలో వుందేమోనని అతని భయం; ఆమె అలాగే గనక వున్నట్లయితే అతనికి చచ్చిపోవడం కంటె వేరుమార్గం గోచరించడం లేదు.

చివరకి తాను ఆమెదగ్గరకి వెళ్ళటానికే నిశ్చయించాడు. అతనితోకూడా బయలుదేరిన నరసింహానికి ఆవేళ పండగలా వుంది. సరోజ ఒక్కర్తే యింట్లోవుండగా వారు వెళ్ళిన ఆవేళ మంచిది. వ్యాపారం పనిమీద శేషగిరి బొంబాయి వెళ్ళాడు. అతనికి వ్యాపారం గురించి చాలా ఆందోళనగా వుంది. సరోజ నవ్వుతూ ఆనందంతో వాళ్ళని ఆహ్వానించింది.

ఆమెను ఆ విధంగా చూడగానే రామదాసు హృదయం ఉప్పొంగింది. సరోజ మారిపోయినట్టుగా అతనికి కనిపించింది. ఆమె తెల్లని కాశ్మీరు పట్టుచీర ధరించింది. ఆమె పెదవులు వణకటం లేదు. ఆమెహృదయం శాంతించిందని దాసు గ్రహించాడు.

ఆమె వాళ్లిద్దరినీ చాలా సేపు వుంచింది యింట్లో. ముగ్గురూ కులాసాగా, ఆనందంగా ఎన్నాళ్ళబట్టో పరిచితులులాగ కబుర్లు చెప్పుకుని చాలాకాలం వెళ్ళబుచ్చారు.

తాను ఆ వుత్తరం వ్రాసినట్టుగా ఆమె గ్రహించలేదని దాసు తెలుసుకున్నాడు. అందువల్ల సరోజ ముఖంలోని ప్రశాంతతను చూసి ఆనందిస్తూ కూర్చున్నాడు. ఆమె కంఠస్వరంలో చాటునున్న ప్రియుడి గురించి ముచ్చటిస్తున్నట్టుగా అతనికి తోచింది. ఆమెకళ్ళల్లోని చల్లటి వెలుగు చూసి ఆమె తనకు తెలియని ప్రియుడి గురించి పొందుతున్న ఆనందం చూసి అతను తన్మయుడై పోయాడు.

తను పొందిన ఆనందంతో తృప్తిచెందుదామని అతను నిశ్చయించుకున్నాడు. అతను ఉత్తరం వ్రాశాడని తెలిస్తే సరోజ ప్రేమించదు. ఆమెకు తన సంగతంతా తెలిస్తే ఎలా వుంటుందోనని ఆలోచించి అతను భయపడ్డాడు. ఈ సంగతంతా భావిజీవితానికి సంబంధించినది; వర్తమానంలో అతను ఆనందసాగరంలో వున్నాడు. సరోజ నిర్మలంగా, నిశ్చయంగా, అతనామెకు చూపించిన స్వాప్నిక జగత్తులోని ఆనందాన్ని విరజిమ్ముతూ వుంది. ఆమెను చూస్తూ మైమరచి వున్నాడు దాసు.

నరసింహం కూడా సమ్మోహింప బడ్డాడు. ఆమె అతనితోనే ఎక్కువగా మాట్లాడుతోంది. దాసు తానెక్కువగా మాట్లాడితే తన స్వప్నం చెదిరి పోతుందని భయపడ్డాడు. అతనలా మౌనంగా కూర్చుంటే సరోజ నరసింహం వ్రాసిన గ్రంథాల గురించీ, చేసిన పరిశోధనల గురించీ అడిగింది. వాళ్ళిద్దరూ కులాసాగా కబుర్లు చెప్పుకుంటున్నారు.

చివరికి మిత్రులిద్దరూ ఆమెదగ్గర సెలవు తీసుకొని మళ్ళీ వస్తామని వాగ్దానంచేసి వెళ్ళిపోయారు. ఇద్దరూ వారి హృదయాల్ని ఆ యింట్లో వదిలేశారు.

తరువాత మూడు నెలలపాటు రామదాసు స్వర్గ సుఖాన్ననుభవించినంత ఆనందంగా జీవించాడు. ఈ మానవ జగత్తుకి అతీతంగా, ఎక్కడో, ఊహాప్రపంచంలో జీవించేవాడు. అతని చిరాకు, దుఃఖం, కోరికలు అన్నీ పోయాయి. అతనికి వున్న ఒక్కకోరికా ఎప్పుడూ యీ ప్రేమసీమలో తిరుగుతూ వుండాలని, అతని ప్రేమ గుర్తింపబడక పోయినా, సంతృప్తిపరుచబడింది.

సరోజకి ఉత్తరాలు వ్రాయకుండా వుండాలనే నిశ్చయంతో అట్టే కాలం వుండలేకపోయాడు. అతని ఉత్తరాలిప్పుడు దయతోను, శాంతిమార్గాలతోను నిండివుండేవి. "మనం యిలాగే జీవించుదాం, నేను శక్తి స్వరూపిణి శక్తిగా నీతో వుంటాను. నిరంతరం ప్రార్థిస్తూ, ఆరాధిస్తూ, ప్రేమిస్తూ వుంటాను." అని ఒకసారి వ్రాశాడు. ఈ ప్రాపంచిక బాధల్ని దాటి మధురమైన జీవితం గడపడం ఎలాగో వ్రాశాడు.

సరోజ అతను వ్రాసినవన్నీ జాగ్రత్తగా పాటించేది. మానవుడి స్థలంలో ఆమె ప్రేమను చిత్రించుకుని దాన్నే ఆరాధిస్తూవుండేది. అతనిని తనకు రక్షకుడుగా, చెడిపోకుండా రక్షించి

కాపాడి, అజ్ఞాతంగా వున్న మహానుభావుడుగా స్వీకరించింది.

రామదాసు తరుచుగా సరోజ యింటికివెళ్ళి తను అత్యద్భుతంగా సృష్టించిన వాతావరణాన్ని చూసి మురిసిపోయేవాడు. ఉత్తరం వ్రాసిన ప్రతి సారీ ఆమె ముఖలక్షణాలు, భావాలు ఎలా వున్నాయోనని పరీక్షించటానికి వెళ్లేవాడు. ప్రేమ ఆమెలో తెచ్చేమార్పుచూసి పొంగి పోయేవాడు. తాను ఆమెకు తెలియాలని ఆత్రుతపడేవాడుగాదు. ఆమె అతన్ని ప్రేమించింది, ఆమె అతని ఆదేశాల ప్రకారం నడుస్తోంది—అంతేచాలు. తన పేరుచెప్పినా, తను తెరచాటునుంచి బయటికి వచ్చినా, ఆమె తనకు దూరంగా వెళ్లిపోవచ్చు. అతనిలో యింకా పిరికితనం పోలేదు. అతను చాలా సున్నితమైనవాడు, తీక్ష్ణమైన ప్రకాశానికికూడా తట్టుకోలేడు. అతనికిలా రహస్యంగా ప్రేమించడమే సరిపడింది.

ఇప్పుడతను నరసింహాన్నికూడా తనతో రమ్మని కోరుతున్నాడు. సరోజతో తను ఒంటరిగా వుండడానికి సాహసించటంలేదు. ఆమె తనని ఎక్కడ కనిపెడుతుందోనని భయంతో మాటలాడేటప్పుడు సిగ్గుపడి, తత్తరపడేవాడు. అదీగాక నరసింహం వుంటే తను మౌనంగా కూర్చోవచ్చు. అతనామెకు వినోదం, కాలక్షేపం కలిగిస్తూంటే, తను ఆమెని చూస్తూ కూర్చోవచ్చు.

ఈ మూడు నెలల వ్యవధిలోనూ నరసింహం తాను మోహావేశంలో పడకుండా వుండటానికి ఎంత ప్రయత్నించినప్పటికీ, సరోజను ప్రేమించకుండా వుండలేకపోయాడు. అతని హృదయంలో సంగతి ఎవరికీ తెలియకుండా దాచాడు. దాసుకికూడా తెలియదు, అసలు సరోజకే తెలియదు. అతనికి తాను సరోజను ప్రేమిస్తున్నానని తెలిసేటప్పటికి, తన హృదయాన్ని తిప్పుకోవటానికికూడా శక్యంకాలేదు. అతను జీవితంలో మొట్టమొదటిసారి ప్రేమించినవ్యక్తికి వశమవటానికే నిశ్చయించుకున్నాడు. ఆమె యింటికి అతను తరుచూ వెడుతూవుండేవాడు. కొన్ని గంటలు అక్కడ గడిపేవాడు; సర్వనాశనం ఏమవుతుందో ఆలోచించటానికికూడా అతనికి ధైర్యంలేదు.

ఒక్కొక్కప్పుడు సరోజ అతని ముఖంలోకి గంభీరంగా, నిశ్చలంగా చూసేది. అతని హృదయంలోకి అడుగంటాచూచి అక్కడవున్న భావాలేవో కనిపెట్టాలని ఆమె ప్రయత్నం. ఆమె అలాగచూస్తే అతను కంగారు పడేవాడు; అతని కంగారుచూచి ఆమె పెదవులమీద చిరునవ్వు తాండవించేది. ఆ చిరునవ్వు ఎంత సున్నితంగా వుండేదో అంత బాధకలిగించేది.

ఒకరోజున యిద్దరు మిత్రులూ వెళ్లగానే వాళ్ళకు అకస్మాత్తుగా దుర్వార్త తెలిసింది— శేషగిరి అప్పుడే బొంబాయిలో చనిపోయాడు. వాళ్లు చాలా కలతచెంది యింటికి వెళ్ళిపోయారు. వారు శేషగిరికోసం ఏడవలేకపోయారు. వాళ్లు ఆలోచించినదల్లా శేషగిరి యింట్లోకి కొన్నాళ్ళ వరకూ ప్రవేశంవుండదనే సంగతే. వారుప్రేమించిన స్త్రీకి ఆ చావుస్వేచ్ఛను కలుగజేసిందిగాని. వీళ్లిద్దరికీ ఆశకన్న భయం ఎక్కువైంది. వాళ్లు యిన్నాళ్లూ జీవితం సాఫీగా గడుస్తోందనుకున్నారు, అలవాటుపడిన జీవితాలకు ఏం అవాంతరాలు వస్తాయోనని యిద్దరూ భయపడ్డారు. ఒకరి హృదయంలో ఏం వుందో మరొకరికి వాళ్లు చెప్పుకోలేదు. వాళ్లు మామూలు జీవితాల్నే గడుపుతున్నారు; కాని ఎవరి రహస్యాలు వాళ్లుదాచుకుని కాలక్షేపం చేస్తున్నారు.

కొన్ని వారాలుపోనిచ్చి వాళ్లు సరోజ యింటికివెళ్ళారు. వాళ్ళకేమీ మార్పు గోచరించలేదు. సరోజ విధవైనా వాళ్లని మామూలు ఆదరణతోనే చూసింది. ఆమె పాలిపోయివుంది. నరసింహంతోమాత్రం ఆమె ముక్తసరిగావుంది. ఈసారి ఆమెను సంభాషణలో పెట్టి కాలక్షేపం చెయ్యవలసిన బాధ్యత రామదాసు మీద పడింది.

శేషగిరి తప్పు అంచనాలవల్ల సొమ్మంతా వ్యాపారంలో పెట్టి నష్టపోయాడు. చనిపోయే నాటికి కొద్ది ఆస్తిమాత్రం వుంది.

అల్లుడి యింట్లోవుండి అతని సంపాదన మీద బతుకుతున్న వెంకటేశ్వర్లు శేషగిరి చనిపోతే చాలా సంతోషించాడు. డబ్బు అంతగట్టిగా పట్టుకు కూర్చున్న అల్లుడంటే అతనికి రాను

రాను అసహ్యమేసింది. అతనికి భోజనం, బట్ట, ఆ యింట్లో వుండటంతప్ప పైన ఒక పావలా డబ్బులైనా ఎప్పుడూ కిట్టలేదు. శేషగిరి వచ్చి పోగానే డబ్బుకోసం సరోజను బాధించాడు. ఆమె తనకు కావలసినవి, తను చూచుకోగలవీ, ఆస్థిపాస్థు లుంచుకొని భారంగా వున్నదంతా తండ్రి కిచ్చేసింది.

రామదాసు సంగతులన్నీ విని ఆమె ప్రవర్తనకు చాలా సంతోషించాడు. రోజురోజుకీ ఆమెమీద గౌరవం అతనికి అధికమవుతోంది. రాజేశ్వరమ్మ అంతిమ కోరిక సఫలీకృతం అవుతోందని సంతోషించాడు. ఒక రోజున బాగా ప్రేమ మైకంలోవుండి సరోజకు యింకో వుత్తరం వ్రాశాడు.

మర్నాడు వెంటనే తనని కలుసుకుందుకు రమ్మని సరోజ వ్రాసిన ఉత్తరంచూసి తత్తరపాటు చెందాడు. అతను నరసింహంతో ఏమీ చెప్పకుండా సుడిగుండంలో పడి వెళ్ళినట్టుగా, పిచ్చివాడిలాగ పోయాడు ఆమె దగ్గరికి. ఆమె పూర్వం తన భర్తతో కాపురంచేసే భవనంలో వుండటం లేదిప్పుడు. ఆమె ఒక యింటిలో మేడమీద భాగం అద్దెకు తీసుకుని వుంటోంది. పెద్ద అలంకరణలూ అవీ లేకుండా సాధారణంగా వున్న ఒక గదిలో దాసుని కూర్చోబెట్టింది. అతని వెర్రిచూపునికూడా ఆమె గమనించలేదు. అతనికి శ్వాస ఆడటం లేదు, ఒక్క మాటకూడా ఆడకుండా కూర్చున్నాడు. ఆమె కూడా యింకో కుర్చీలో కూర్చుని బాగా పరిచయంతో యిలా మాట్లాడింది :

"మీరు నాకు చాలా ముఖ్య స్నేహితులు. అసలు మీరొక్కరే నా స్నేహితులు. ఇన్నాళ్ళూ మీ అభిమానాన్ని నేను మన్నించలేదు. మీరు నన్ను క్షమించాలి." అని కన్నీళ్ళు కార్చింది. మళ్ళీ యిలా అంది. "మీరు నన్ను ప్రేమిస్తున్నారని నాకు తెలుసు. నాకొక రహస్య ముంది, మీరు ఆ విషయంలో సాయం చెయ్యాలి."

రామదాసు తెల్లబోయాడు. అతనికి వికారం మళ్ళీ కలుగుతోంది. ఆమెకు ఉత్తరాల సంగతంతా తెలిసిపోయిందనీ, ఆమె ఆ విషయమే మాట్లాడబోతోందనీ అతని భయం.

"సరే చెప్పు." అన్నాడు అతి కష్టంమీద.

"నాకు చాలా నెలలబట్టి ఉత్తరాలు వస్తున్నాయి. అవి ఎవరు వ్రాస్తున్నారో మీకు తెలుసు. ఆ విషయంలో నిజం చెబుతారని మీ మీద నమ్మకంతో వున్నాను."

రామదాసు మూర్ఛపోవటానికి సిద్ధంగా వున్నాడు. అతని మొగమంతా రక్తంతో కంది పోయింది.

"మీరు జవాబు చెప్పరా? మీ స్నేహితుడి రహస్యం బయట పెట్టడానికి మీకు యిష్టం లేదేమో! అలాగయితే నేనే చెబుతాను. ఈ ఉత్తరాలు నరసింహంగారి దగ్గరనుంచి వస్తున్నాయి. ఆమాట అబద్ధం అనకండి, నాకంతా తెలుసు. ఆయన కళ్ళల్లో ఆ ప్రేమ చూశాను. ఆయనతప్ప యింకెవరూ అలాగ వ్రాయలేరని నాకు తెలుసు."

ఆమె యింకా ఏం చెప్తారో అని ఆలోచిస్తూ ఆగింది. రామదాసు నోటంట మాటరాక ఆమె కేసి తెల్లబోయి చూస్తున్నాడు.

"మిమ్మల్ని నా సోదరుడుగా భావిస్తున్నాను. మీతో సంగతంతా చెప్పి నా హృదయభారం పోగొట్టుకో దలచుకున్నాను. మీ స్నేహితుడు నిన్న మళ్ళీ వ్రాశాడు. ఇంక ఆయన అలా రాస్తూ కూర్చుంటే లాభంలేదు; ఆ వుత్తరాలింక యిప్పుడు అనవసరంకూడాను. నేను మళ్ళీ మీకు చెబుతున్నాను-నా కంతా తెలుసు. ఆయ నింకా అలాగ వ్రాస్తూవుంటే అందులో రసికత్వం, మాధుర్యం చచ్చిపోతాయి. మీ స్నేహితుడితో రమ్మన్నానని చెప్పండి. మీరుకూడా రండి." ఆమె ఆవేశంగా చూసింది. ఆ చూపుల్లోవుంది-సరోజ నరసింహాన్ని ప్రేమిస్తోందని.

దాసు గడ్డకట్టిపోయాడు. ఎక్కడలేని ప్రశాంతతా వచ్చింది. అతని ఆత్మ హరించి పోయినట్టుగావుంది; అతని దేహంమాత్రమే జీవిస్తోంది.

నరసింహంగురించి సరోజతో ఆవేశం లేకుండా నెమ్మదిగా మాట్లాడాడు. సోదరుడుగా ఆమె వప్పగించిన పని నిర్వర్తిస్తానని వాగ్దానం చేశాడు.

తరువాత అతను ఏదోలాగున యింటికి వెళ్ళిపోయాడు. అప్పటికి ప్రాణశక్తి మేల్కొంది; అతనిలోని నిరుత్సాహం, ఆవేదన అధికమయాయి.

రామదాసు చివరికి తిరుగుబాటు చేశాడు. అతని మనస్సు త్యాగానికి ఒప్పుకోలేదు; అతని దేహం ఎదిరించింది. తన సౌఖ్యం మరుగుపరచుకోవటానికి అతనికి మనస్కరించటంలేదు. అతనెప్పుడూ చాటునే జీవించాడు, అతనెప్పుడూ వెనక్కిపోయి మౌనంగానే జీవించాడు. అతనికి యింతా త్యాగం చెయ్యగల శక్తి వున్నట్టుగా తోచలేదు. తన ప్రేమ చాటకుండా చనిపోవటం యిష్టంలేదు.

ఏమిటి, తన్ను తాను మరిచిపోయి యింత దూరం ఆలోచించాడా? సిగ్గుతో, రోషంతో వెకిలిగా నవ్వాడు. ఇన్ని నెలలుగా అతను తనకు చెందని ప్రేమ ననుభవించాడు, సరోజ ఆలోచనల్లో, ఆమె ఆరాధనల్లో తన్ను తాను మరచిపోయాడు. సరోజ హృదయం మరొకర్ని గురించిన ఆలోచనలతో నిండిపోయింది. మళ్ళీ యింకోసారి సరోజ పూర్వపు భవనంలో ఆమె ముఖాన్ని పరిశీలిస్తూ, ఆమె చూపుల్ని తన కోసమే భావించుకుంటూ, ఆమె చిరునవ్వులు తనకోసమే ననుకుంటూ ఉత్సాహంతో, ఆశతో వెర్రినమ్మకంతో గడిపిన రోజులు జ్ఞాపకం తెచ్చుకున్నాడు. అంతా అబద్ధం, బాధను కలిగించే వినోదం, పచ్చి మోసం! ఆ ప్రేమ చూపులు, ఆ చిరునవ్వులు అన్నీ నరసింహం కోసం. సరోజను ప్రేమించిన వాడతను, సరోజలో ప్రేమ, దయ అభివృద్ధి చేసిన వాడతను. ఆమె బాగానే చెప్పింది. "నా చుట్టుపక్కల వారందరి గురించీ ఆలోచించాను. నరసింహం గారు తప్ప మరెవరూ నాకు అలా వ్రాయలేరు." అతను-రామదాసు ఆమె దృష్టిలో జీవించిలేదు. అతను ఒక పనిముట్టుగా వున్నాడు, చాటుగుండా వున్నాడు. అతని ఆరాధన, ప్రేమ అన్నీ దొంగలించబడ్డాయి; అతన్నింకా నాశనం చేస్తున్నారు. అతని కింకేమీ మిగలలేదు. అతని కన్నీళ్ళు, ఒంటరి జీవితం తప్ప.

అన్నిటికన్నా ముఖ్యమయిన దేమిటంటే సరోజ తన సంగతంతా చెప్పటానికి రామదాసు నెంచుకోవటం; తనని, యింకొకరి కర్పించటానికి ఆమె యితన్ని ఏర్పాటుచేసింది. ఇంతకన్నా బాధకలిగించే విషయం మరొకటి వుండదు; యింతకంటె హాస్యాస్పదం యింకొకటి వుండదు. అయితే వాళ్ళంతా అతనికి హృదయ మున్నదే లేనంత అసహ్యంగా వున్నట్టు నిర్ణయించారా? అతన్ని వాళ్ళు నమ్మకమైన యంత్రంగా ఉపగించుకున్నారు. ఈ యంత్రానికి ప్రేమ, ప్రాణం దానికుండే హాళ్ళల్లో వున్నాయనే విషయం అనుమానంలాగనైనా తట్టలేదా? అయితే అతను జీవించకూడదు, ప్రేమించకూడదు.

రాజేశ్వరమ్మ సంగతి అతని కిప్పుడు జ్ఞాపకం వచ్చే సమయంగాదు. రామదాసు తన పాత్రధారణతో విసుగెత్తి పోయాడు-ఎప్పుడూ సోదరుడే, ప్రియుండెప్పుడూ గాదు. ఆ ఆలోచన అతనికి వెగటుగా వుంది.

ఈ సంకటస్థితి చాలసేపు వుంది. అనుకోకుండా తగిలిన దెబ్బ అనుకోనంత బలంగానూ వుంది. సరోజ, నరసింహం అటువంటి ఆలోచన చేసి తనని బాధ పెడతారని రామదాసు ఎన్నడూ అనుకోలేదు. ప్రపంచంలో తను ప్రేమించే వ్యక్తులు వారిద్దరే, వారే తనకి మతి పోయేటట్టు ప్రవర్తిస్తున్నారు. క్రిందటిరోజు ఎంతో ఉత్సాహంగా వున్నాడు—యిప్పుడు! గడచిన సంవత్సరం అతనికెంతో ఆనందాన్ని కలుగజేసింది. అతను జీవితంలో ఆనందంగా వున్నది ఆ ఒక్క సంవత్సరమే. ఆ ఆనంద శిఖరాలనుంచి అతను తలక్రిందుగా ఒక్కసారి తోయబడ్డాడు, ఆ దెబ్బతో అతను ముక్క ముక్కలయాడు. ఆ తోసిన చేతులు నరసింహానివీ, సరోజవీ అని గుర్తించాడు.

ఒక్కొక్కప్పుడు అతను శాంతించేవాడు. ఇంతలోనే మళ్ళీ విచారం అతన్ని ఉక్కిరిబిక్కిరిగా చేసేది. అతనిలో తిరుగుబాటు శక్తులు మేల్కొన్నాయి. అతనిలో అగ్ని రగుల్కొంది, అల్లకల్లోలం ఆరంభమయింది. అతనేం చెయ్యాలో తన్ను తాను ప్రశ్నించుకున్నాడు. అతనిలోవున్న రాక్షసత్వం తిరుగుబాటుచేసి ఎవరిమీద దూకుదామా అని ఆలోచిస్తోంది.

ఆ తరువాత అతను చాలా సిగ్గుపడిపోయాడు. తలవంచి చలనం లేకుండా కూర్చుని, నెమ్మదిగా ఆలోచిస్తూంటే అతని హృదయం మెల్లిగా విజ్ఞాపన చేసుకుంటోంది. అతను రక్తంలోని, నరాల్లోని తీవ్రత తగ్గటానికి వేచివున్నాడు.

రామదాసు సూర్యకాంతి తన మీదపడి బాధించకుండా తెరలు దగ్గిరగా లాగేశాడు. చలనం లేకుండా నిశ్శబ్దంగా చీకటిలోకి చూస్తూ కూర్చున్నాడు. అతనికి కన్నీళ్ళు కారటం లేదు. దేహం వణకటం మానింది. అతను శాంతించడానికి ప్రయత్నిస్తున్నాడు.

అతని ఆత్మలో ఎటువంటి వికారం కలుగుతుందో ఎవరు చెప్పగలరు? మానవ సమూహాన్నించి వేరుపడి దూరంగాపోయి కామవాంఛలేని ప్రేమశిఖరాలు పరికిస్తున్నాడు. అక్కడ అతనికి అంతా సన్మార్గం, త్యాగం కనిపించాయి. అతని హృదయం మెత్తబడింది; అతని దేహం తేలికపడొచ్చింది. అతనింక ఆలోచించడం మానివేశాడు. నిజమైన పవిత్రమైన ప్రేమ అతని దేహంలో పరుగులెత్తుతోంది, అతను ఆ ప్రవాహాన్ని అనుగమించటానికి అంగీకరించాడు. ఆ ప్రవాహం గొప్ప కార్యాన్ని చేస్తుంది. ఆ ప్రేమప్రవాహం అతని మనస్సును పూర్తిగా మార్చింది, అతను భారంగా ఒక చిరునవ్వు నవ్వాడు. అతను ప్రపంచంలోని చెడు పనులనుగురించి ఇంక కలనైనా తలచలేడు. రక్తమాంసాల శక్తిని జయించాడు, అతని ఆత్మ ఇంక పురోగమించడంలో ఆలస్యం చెయ్యదు.

కొద్దికొద్దిగా రాజేశ్వరమ్మ రూపం కనిపించటం ప్రారంభించింది, అతను ఆ మరణించిన ఆమె కోరికను నెరవేర్చటానికి సిద్ధంగా ఉన్నాడు. అతని నేత్రాలు నిర్మలంగా, గంభీరంగా మారుతున్నాయి, అతని మనస్సు పరిస్థితులన్నీ స్పష్టంగా గ్రహిస్తోంది. అతని ఆత్మ త్యాగం చెయ్యమని ప్రోత్సహిస్తోంది.

అతను లేచి నరసింహంకోసం వెళ్ళాడు. అతన్ని చిరునవ్వుతో అభినందించాడు. అతనిలో అంతా స్పష్టత ఏర్పడింది. నరసింహం సరోజను ప్రేమిస్తున్నాడని అతనికి తెలుసు. తెర తొలగించబడింది; పూర్వం తాను అర్థం చేసుకోలేక పోయిన అనేక చిన్న విషయాల కిప్పుడు అర్థం స్పష్టంగా తెలుస్తోంది. ప్రేమతో, విశ్వాసంతో మాట్లాడాడతను. అతను తనంతట తానే తన ప్రేమను చంపటానికి సిద్ధమయ్యాడు.

"నరసింహం! నేను నీకిప్పుడు నాజీవిత రహస్యాన్ని చెప్పగలను" అన్నాడు. ఆ తర్వాత అతను తన త్యాగజీవితగాథంతా ఆడంబరం, గర్వం లేకుండా చెప్పాడు. సరోజకు తాను తండ్రిగాను, సోదరుడుగాను ఉన్న సంగతి చెప్పాడు. వాళ్ళిద్దరూ కొత్తగా కలుసుకొన్న రోజుల్లోను, ఆ తర్వాత సరోజ ఇటి వదిలిపెట్టి వచ్చేవరకూ తాను సెలవు రోజుల్లో ఆకస్మాత్తుగా ఎక్కడికి పోయేవాడో ఆ సంగతి, సుబ్బారాయుండి దగ్గర కార్యదర్శిగా వుండడం, తన పెంపుడు కూతురు శేషగిరిని పెళ్ళాడే ముందు తానుభవించినబాధ ఇవన్నీ చెప్పాడు. ఈ పనంతా తాను రాజేశ్వరమ్మకు కృతజ్ఞత, విశ్వాసం చూపించదలచి వాగ్దానం చేశానన్నాడు. తను ప్రత్యుపకారం కాంక్షలేని రక్షకుడుగా ఉన్నట్లూ పని చేశానని, తనలో ఉన్నట్టి మానవుడిలోవుండే దౌర్బల్యం చంపుకొని పని చేశానని చెప్పాడు. నరసింహం కొంచెం ఉల్లాసంగా ఇలా అన్నాడు: "ఈ వేళతో నా కర్తవ్యం పూర్తయింది. నా పెంపుడు కూతురికి ఈ వేళ ఒక మంచి వరుడినిచూసి పెళ్ళిచేస్తున్నాను. నేను ఇంక ఈ జీవితానికి స్వస్తి చెప్పాలి... నే నెవరిని ఎంచానో నీకు తెలుసా!"

నరసింహం ఇంతసేపూ తన స్నేహితుడి చరిత్రవిని సంతోషంతో పొంగిపోయాడు.

"నా పని నువ్వు పూర్తిచెయ్యి. ఆమెకు అన్ని విధాలా సుఖం కలుగజెయ్యి. నా కర్తవ్యం నీ కప్పజెప్పుతున్నాను. నువ్వు సరోజను ప్రేమిస్తున్నావుగదా, ఆమె చనిపోయిన తల్లికి ఆత్మశాంతి, సంతోషం కలుగజేసే బాధ్యత నీది... సరోజ నీ కోసం వేచివుంది."

నరసింహం సంతోషంతో వెర్రివాడయిపోయాడు. అతనొక్కమాటకూడా అనలేకపోయాడు. ఆమె తండ్రిలాగానే దాసు అతనికి కనిపించాడు, అతనంటే ఎంతో మర్యాద, గౌరవం ఏర్పడ్డాయి. మానవాతీతమైన ఔన్నత్యం ఏదో దాసులో కనిపించిందతనికి.

అంతకంటె ఎక్కువ బాధకలగక పోవడం

దానికి ఆశ్చర్యంగా వుంది. అతనాడిన అబద్ధంలో ఒక విధమైన రహస్యానందం వుంది. తన జీవితం లోని మోహాన్ని తనంతతాను నిరాకరించి తప్పించుకున్నాడు. తను సరోజకి వ్రాసిన ఉత్తరాల గురించి నరసింహానికి చెప్పాడుగాని అంత స్పష్టంగా చెప్పలేదు. అతని హృదయం వేగంగా కొట్టుకోవడం మానేసింది. తాను ఆమెకు ఏమి వ్రాశాడో వాటి ప్రసక్తి దూరంగా వుంచాడు. అతని కా సమయంలో ఆమెకేం రాశాడో సరిగా జ్ఞాపకంకూడా లేదు.

నరసింహం ఏమీ అనుమానించలేదు. అతను చిన్నపిల్లాడిలా ఆనందిస్తున్నాడు. సరోజగురించి గొప్పగా మాట్లాడాడు. ఆమెను సుఖపెడతానని వాగ్దానంకూడా చేశాడు, ఆమెతో ఎలా ఆనందించబోతాడో, ఎలా కాలంగడుపుతాడో అదికూడా ఊహించి చెప్పాడు. రాబోయే రోజులు ఎంత ఆనందంగా గడుపుతాడో వాటి గురించి ఉత్సాహంగా చెప్పాడు.

రామదాసు చిరునవ్వు నవ్వుతూ విన్నాడు. తాను త్యాగం చూపించే అంత్యసమయంలో అక్కడ వుండటానికి తగిన ధైర్యం వుండదేమోనని భయపడ్డాడు. కొంతసేపు యిద్దరూ మాట్లాడుకున్న తర్వాత నరసింహంతో యిలా అన్నాడు:

"ఇప్పుడన్ని ఏర్పాట్లూ జరిగిపోయాయి గాబట్టి నేను వెళ్లి విశ్రాంతి తీసుకుంటాను. నేను వెంటనే వెళ్ళిపోతాను." నరసింహం తన ఆనందంలో పాల్గొనకుండా అతను వెళ్లిపోవడమూ అని అడ్డుచెప్పబోయాడు.

"వద్దు-నేనొక అంతరాయం మీకు, ప్రేమికులు ఒంటరిగా ఉండాలనుకుంటారు, నన్ను వెళ్లనియ్యి. మీరువచ్చి ఒకసారి నన్ను చూడాలి," అన్నాడు దాసు.

మర్నాడు అతను వెళ్ళిపోయాడు. అతని హృదయంలో బాగా నీరసం ఏర్పడింది. మృత్యువును సమీపించే వారు మాత్రమే పొందగలిగే ఆ ప్రశాంతతలో అతను క్షీణించి పోతున్నాడు.

(వచ్చేసంచికతో అఖరు)



కథానిక

# అప్రయోజకుడు

వి. వి. సూర్యనారాయణ

ఆనందించడానికి నోచుకున్న అదృష్టవంతులు మొదటాట సినీమా చూసి యింటికి పోయే సమయం అదే. రోజంతా అమ్మకం వల్ల వచ్చిన ధనాన్ని లెక్కచూచుకొని లాభనష్టాలు జేరీజు వేసికొనే షావుకార్లు డబ్బుని యినప్పెట్టెల్లో బిగించి దుకాణాలు మూసే సమయమూ అదే. పగలంతా ఆఫీసులో చేసిన పని చాలక, యింటివద్ద కూడా వ్రాయడానికి గాడిద బరువు కాగితాలను మోసుకొని, అరిగిపోయిన అతుకు చెప్పుల్ని యీడ్చుకుంటూ హృదయభారంతో ప్రకాశరావు రోజూ బసకు చేరుకునే సమయమూ అదే. ఆఫీసులో పని చేయవలసిన నియమితకాలం పదకొండు గంటల నుండి సాయంత్రం ఐదు గంటల వరకే. కాని. తెల్లవారేసరికి, అతడలా నోట్లో కాఫీనీళ్లు పోసుకుని యిలా ఆఫీసు చేరుకోవాలి. వెళ్ళిన తర్వాత రాత్రి తొమ్మిదీ అయ్యేవరకూ కదలడానికి అవకాశం లేదు. ఇది వాళ్ళ యజమాని చేసిన ప్రతిసృష్టి. తను గుమాస్తాగా జీవనం సాగించదల్చుకొన్నన్నాళ్ళు అధికారుల అధీనంలో బానిసలాగా ఉండక తప్పదు.

ప్రకాశరావు జీవితము ఒక విధంగా యీ రకమైన బానిసత్వానికి అంకితమైపోయిందంటే దానికి తనెంతవరకూ బాధ్యుడో తనకే తెలియదు. తనూ చదువుకొనే సమయంలో, ఆశయాలూ ఆవేశాలూ గలవాడే. తన తండ్రి

గుమాస్తాగా ఎంతవరకూ సుఖపడ్డాడో తనకు తెలుసు. అధికార్ల నిరంకుశత్వానికి తన తండ్రి ఆత్మ ఎంతగా క్షోభించిందో తనకు ప్రత్యక్ష నిదర్శనమే! వేరే తెరువు లేనప్పుడు వ్యక్తిత్వాన్ని చంపుకొనే గుమాస్తాగా బానిసత్వం అనుభవించేకన్న ఆత్మహత్య మేలని తనెన్నో సార్లు అనుకున్నాడు. తను పట్టభద్రుడై కాలేజీ ఆవరణ దాటివచ్చిన తర్వాత మానవసేవతో యేమాత్రమైనా సంబంధం గల జీవితాన్ని గడుపుదామని మనసారా కాంక్షించాడు. కాని యీనాడు తన వాంఛలన్నీ స్వాప్నికములే అయిపోయాయి. తానే రకమైన జీవితాన్ని హేయంగా పరిగణించేడో, ఎటువంటి వృత్తికి సాధ్యమైనంత దూరంగా ఉండాలనుకొన్నాడో, దాని గుప్పిట్లోనే చివరకు యిరుక్కుపోవలసిన అగత్యం కలిగింది. ఈ పరిణామానికి కారణం అతని అసామర్థ్యం కాకపోయినా, తన తండ్రి మాటకెదురాడలేని మనోదౌర్బల్యం అనిమాత్రం చెప్పాలి.

తను బి. ఎ. పరీక్ష రెండవ తరగతిలో ఉత్తీర్ణుడైనట్లు తెలిసిన రోజున తండ్రి అన్నాడు:

అబ్బాయీ! ఇంతవరకూ ఎల్లాగో రెక్కల కష్టంమీద నిన్ను చదివించేనన్న సంగతి నీకు తెలుసును కదా. ఇకపైన చదివించగలిగే శక్తి కూడా నాకు లేదు. అందుచేత వెంటనే నువ్వేదైనా ఉద్యోగంలో ప్రవేశిస్తే మంచిది. అట్లా చేస్తే కుటుంబానికి కొంత భారం తగ్గినట్లూ ఉంటుంది. ఏమంటావ్!

'అలాగేనండి నాన్నగారూ! ఏదైనా అనువైన ఉద్యోగం దొరికితే తప్పకుండా మీరు చెప్పినట్టే చేస్తాను.' అన్నాడు తను.

ఆ మాటమీద తండ్రి చేసిన కృషిఫలితంగా ప్రకాశరావుకి త్వరలోనే ఉద్యోగం లభించింది. బెజవాడలో ఒక ఆఫీసులో గుమాస్తా పని ఖాళీగా ఉందని తెలిసి, తనకు తెలిసిన ఒక స్నేహితుని ద్వారా అది ప్రకాశరావుకి వచ్చేటట్లు చేయగలిగేడు అతని తండ్రి. కాని తాను చేయబోయేది గుమాస్తాపని అని తెలియగానే ప్రకాశరావు నిర్మించుకొన్న ఆశాసౌధాలు ఒక్కసారి కూలిపోయాయి. 'ఇంతకాలమూ పెద్ద కబుర్లు చెప్పి యిప్పుడు బానిసత్వానికి దాసోహం చేస్తున్నావా?' అని అతని బుద్ధి హేళన చేసింది. 'అప్రమత్తులైన అధికారాంధుల అడుగుల క్రింద పడి నలిగిపోతావుసుమా!' అని ఆత్మ పరిహసించింది. 'ఏ వృత్తినైనా స్వీకరించుకో, గుమాస్తాగా మాత్రం జీవితాన్ని స్థిరపరుచుకోవద్దు.' అని అతని యువక హృదయం ప్రతిఘటించింది.

ఆ ఉద్రేకంలోనే తండ్రిదగ్గరకు వెళ్ళి చెప్పేడు, తానా ఉద్యోగం చెయ్యడానికి అంగీకరించలేనని.

'ఏమోయ్! ఏమొచ్చిందా ఉద్యోగానికి? పిలిచి పిల్లనిస్తే యేదో అన్నాట్ట నీలాటివాడే.'

'ఆ పదవి స్వీకరించడం నా ఆశయాలకు విరుద్ధం నాన్నగారూ!'

'ఆశయాలట. ఆశయాలు! ఏమిటి నీ ఆశయాలు? మింగ మెతుకు లేదుగాని, మీసాలకు సంపెంగ నూనెట! ఈ వేళకాని కబుర్లు కట్టిపెట్టి ప్రయాణానికి సిద్ధంకా. ఎల్లుండే ప్రవేశించాలి పనిలో.'

'అదికాదు...'

'అది అవునో కాదో నాకు తెలుసులే. ఉద్యోగం చెయ్యకపోతే అడుక్కుని తింటావా యేం? దారి చూపించినప్పుడైనా నీ పొట్ట నువ్వు పట్టుకుని పోవాలిగాని, ఎన్నాళ్లిలా వాళ్లమీద వీళ్లమీద ఆధారపడి ఉంటావు?' ఈ మాట ప్రకాశరావుకి హృదయంలోంచి దూసుకుపోయినట్లయింది. ఆమాటలు తన తండ్రి—కన్నతండ్రి—నోటినుండి వచ్చినందు కాశ్చర్యపోయాడు. ఆ మాటే మరొకడంటే, అంతగా బాధపడి ఉండడేమో! తనను భరించడం ఎంత కష్టం కాకపోతే అలా అనగలడు తనతండ్రి. తన వ్యక్తిత్వం యికముందు అలాటి దూషణలకు తల ఒగ్గడానికి నిరాకరించింది. తత్ఫలితంగా అతనిప్పుడు ఆత్మాభిమానాన్ని చంపుకొన్న గుమాస్తా! తన అధికారి చేతిల్లో కీలుబొమ్మ!

ఆరోజు ప్రకాశరావు బసకు చేరుకొని తలుపు తియ్యగానే తలుపు సందులోంచి పోస్టుబంట్రోతు పడేసిన ఉత్తరం కనుపించింది. కవరు మీది వ్రాత అక్షరాలు చూడగానే తన తండ్రి దగ్గరనుండి అని తెలిసింది. కవరు చించకుండానే ఊహించుకున్నాడు, ఆ ఉత్తరంలో ఏముంటుందో! ఉత్తరంలో పంక్తులనూ, తన ఊహనూ

ఈ. చ. తప్పకుండా సరిపోయింది. అందులో తన తండ్రి వ్రాసినదంతా నిజమే! తనను ప్రతి నెలా ముప్ఫయి రూపాయలకు తక్కువ కాకుండా యింటికి పంపమన్నాడంటే అట్లా అడగడానికి తన తండ్రికి సంపూర్ణమైన హక్కుంది. తమ రక్త మాంసాలోడ్చి బి. ఏ. వరకూ చదువు చెప్పించారే తన తల్లిదండ్రులు. ఆ కాలంలో వాళ్లు రెండు పూటలా భోజనమైనా చేశారో, లేదో! అటువంటప్పుడు అడిగించుకోకుండానే తనకై వాళ్లు చేసిన ఖర్చు వడ్డీతో సహా తీర్చవలసిన బాధ్యత తనయందుంది. తనకూ ఉద్యోగంలో చేరింది మొదలు శక్త్యానుసారం ప్రతి నెలా కొంత డబ్బు వెనకేసి యింటికి పంపాలనే ఉంది; కాని ఎప్పటికప్పుడే విఫలుడౌతున్నాడు. బెజవాడలాంటి బస్తీలో తనకు వచ్చే జీతం యింటద్దెకూ భోజనానికే సరిగా చాలదు. అందులోనే మిగిల్చి యింటికి పంపడమనేది సాధించలేని సమస్యగా తోచింది, ప్రకాశరావుకి.

'ఉద్యోగం అన్నతర్వాత యింతో అంతో పైగా దొరుకుతుంది. అదీ జీతమూ కలిపి, అంతా నీ షోకులకే ఖర్చు చేస్తే, యింకా ప్రయోజకులు కావలసిన నీ తమ్ముళ్లూ, పెళ్లిళ్ళు కావలసిన నీ చెల్లెళ్లూ ఉన్నారు. వాళ్ళగతేం కావాలి? నిన్ను చదివించి ప్రయోజకుణ్ణి చేసినందుకు, కుటుంబానికి చేదోడుగా ఉంటావనుకొన్నాము. కాని యిట్లా వెడమొహం పెడతావనుకోలేదు.' ప్రకాశరావు పైని చదవలేక పోయాడు. కళ్లల్లో కన్నీటిపొరలు కమ్మాయి. ప్రకృతి అంతా అలుక్కుపోయినట్లు కనిపించింది. చదువుతూన్న లేఖ అప్రయత్నంగా చేతిలోంచి జారిపోయింది. తనను గురించి తండ్రి అర్థంలేని అపోహ పడుతున్నాడు. ఆయన చెప్పినట్లు, అవసరాన్ని వినియోగించుకునే ప్రజలను పీడించి డబ్బు వసూలు చేయడం అట్టే కష్టమైన పనికాదు. తోడి గుమాస్తాలు అట్లా సంపాదించడం తను రోజూ చూస్తూనే ఉన్నాడు. కాని అవిధమైన ధనార్జనకు ప్రకాశరావు మనస్సెంతమాత్రమూ మొగ్గలేదు. అందు చేతనే తన తోడి గుమాస్తాలతన్ని 'అప్రయోజకుడ'న్నారు. అదే మాట యీనాడు తన తండ్రికూడా అన్నాడు. కాని అతని హృదయం 'అప్రయోజకుడు' అనిపించుకున్నందుకు క్షోభించలేదు. చిన్నతనంనుండీ తన వరవడికను చూసి గుర్తెరిగిన తండ్రి యీనాడు కారణ రహితంగా తన్నుగూర్చి అపోహ పడ్డందుకతని మనస్సు అపరిమితంగా పరితపించింది. ఈ సంక్షోభానికి కారణం తండ్రి అడిగే మొత్తాన్ని నెలనెలా పంపడానికి తాను అశక్తుడు కావడమే! ఇక ముందైనా ఆయన కోర్కెను సాధ్యమయినంతవరకూ నెరవేర్చాలి. ఐతే అది యెట్లా కొనసాగుతుంది? అన్యాయార్జితం పేరు చెప్తేనే భయపడి ఆమడదూరం పారిపోయే ప్రకాశరావు కదోక పెద్ద సమస్య అయిపోయింది.

ఈ పరిస్థితిలో, కాలేజీలో తన సహాధ్యాయుడుగా ఉండే వెంకట్రావు సలహా తనకు కొంతవరకూ ఉపయోగించిందని చెప్పాలి. బందరులో బి. ఎల్. పాసయి బార్ కౌన్సిల్ లెక్చర్లకు మద్రాసు వెళ్తూన్న వెంకట్రావుని యథాలాపంగా కలుసుకున్నాడు ప్రకాశరావు. రెండు సంవత్సరాలుగా మిత్రులిద్దరూ ఒకరొకరు చూసుకోలేదు. గడచిన యీ రెండు సంవత్సరాల్లోనూ పత్రికాలోకంలో రచయితగా పేరు సంపాదించాడు వెంకట్రావు. అతని రచనల్ని చదివి తన్మయత్వం పొందిన వారిలో ప్రకాశరావొకడు. మిత్రుని రచనా నైపుణ్యాన్ని మెచ్చి, అవగాహన చేసికొని వినోదించిన వారిలో అతడు ప్రథముడు. 'బహు కాలానికి స్నేహితుణ్ణి చూసినందు కతని మనస్సానాడు చంద్రదర్శిత సాగరంలాగా ఉప్పొంగింది. మాటల సందర్భంలో ప్రకాశరావు పరిస్థితి నర్థం చేసుకొన్నాడు వెంకట్రావు. తనకు తోచిన సలహాకూడా యివ్వకుండా ఉండలేకపోయాడు.

"ప్రకాశరావ్! నువ్వేమీ తెలివిమాలిన వాడవికావు. మన మిత్రబృందం అంతటిలోనూ ఎక్కువ సాహిత్య జ్ఞానం కలవాడవు. ప్రయత్నిస్తే నువ్వు సాధించలేని పని ఉండదేమో. నీలో అజ్ఞాతంగా అణగి ఉన్న భావాల్ని, శక్తుల్ని పైకి తీసుకొనివస్తే, నువ్వుకూడా పత్రికా ప్రపంచంలో ఒకనాడు ఉన్నత స్థానాన్ని ఆక్రమించగలవని నా దృఢవిశ్వాసం.

తద్వారా రచనా వ్యాసంగంలో పడి కొంత వరకూ నీ మనస్సును కలత పెట్టే ఆలోచనలకు దూరం కావచ్చు. ఇది నే ననుభవం మీద చెబ్తూన్న మాటలు."

మిత్రుని వచనాల్లో ప్రకాశరావుకి కొంత సత్యం గోచరించింది. అతడు చెప్పినట్లుగా త నెందుకు చెయ్యకూడదూ?... తన మస్తిష్కంలో మారుమూల దాగియున్న భావాలకు ఒక రూపాన్నిచ్చి వెలుగులోకి తీసుకొని వస్తే, హృదయం తేలికపడుతుందేమో! 'ఉన్నట్టుండి కలంపట్టుకుంటే రచయితను కాగలనా?' అని అతని అంతరాత్మ అడ్డగించింది. 'అందరూ పుట్టగానే పేరు మోస్తున్నారా?' అని సమాధానం చెప్పుకున్నాడు. తన తొలిప్రయత్నాలు విఫలమైనా తనకు ఖాతరు లేదు. విఫలయత్నాలే మనకు అనుభవాన్ని కల్గిస్తాయి. కృషి చెయ్యడం తన వంతు. ఆపైన అదృష్టాన్ని తీర్చిదిద్దేవాడు వేరే ఉన్నాడు.

ఆ రోజే తన నూతన ప్రయత్నానికి నాంది వాక్యం పలికేడు. రాత్రి ఆఫీసునుండి రాగానే భోజనం వగైరాలు ముగించుకొని కునుకుతూన్న కిరసనాయిలు దీపాన్ని పెద్దదిచేసి, కలం చేత పుచ్చుకుని కాగితాలముందు కూర్చున్నాడు. రాత్రి రెండు ఝాములవరకూ మేల్కొని పూర్తిచేసిన తన తొలి రచనను చదువుకొనేసరికి అతనికే వెగటనిపించింది. రచనలో పటుత్వం లేక చించి పోగుచేసిన నిష్ఫల యత్న చిహ్నాలు తన్ను చూసి పళ్ళు యికిలిస్తున్నట్లు గోచరించింది. దానితో అతడు విసుగు చెందేవాడే కాని, సాయంత్రం తాను 'నిష్ఫల యత్నాలే అనుభవాని కాధారం' అని ధైర్యం చెప్పుకొన్న మాటలు జ్ఞాపకాని కొచ్చేయి.

ప్రతిరోజూ రాత్రి తొమ్మిది మొదలు, సగమురాత్రి గడచేవరకూ కథారచన చెయ్యడ మతనికి కాలక్షేపమైపోయింది. కొన్నాళ్ళ వరకూ అతని అన్ని రచనలకూ పత్రికలు స్వాగత మివ్వలేకపోయినా, కొన్నిరచనలపైనా మెచ్చుకొని ప్రకటించేవి. ప్రకటింపబడిన రచన లతనికి ప్రోత్సాహాన్నిచ్చేవి. ఆ ప్రోత్సాహం క్రొత్త రచనలకు దోహదమిచ్చేవి. ఇట్లా కొద్ది రోజుల్లోనే అతడు పత్రికాలోకంలో పరిచితుడై పోయాడు.

ఇప్పుడతని రచనలు ప్రకటించబడక పోవడం లేదనేకంటె, అతని రచనల్లో ప్రకటనార్హం కానివి లేవనడం సమంజసంగా ఉంటుంది. ఇది యిప్పుడతనికి మరొక విధంగా కూడా ఉపకరిస్తోంది. అతని రచనలకు సరిగా విలువ కాకపోయినా, పత్రికాధిపతులు అప్పుడప్పుడు కృతజ్ఞతా పూర్వకంగా పంపే చిన్నచిన్న మొత్తాలతని చేతికి వచ్చేవి. తన్మూలకంగా యిప్పుడు తండ్రికి కొద్దిగానో గొప్పగానో డబ్బు పంపగలుగుతూన్నాడు. తన రచనా వైచిత్రిని చూసి ప్రజలు ముగ్ధులై హర్షించిన కొద్దీ అతనిలోని యేదో వాంఛ సారస్వతంలో యితోధిక కృషికి ప్రోత్సహించడం మొదలు పెట్టింది. తనకు కూడా కృషికి తగిన ఫలితం ఉన్నందున అతడా ప్రోత్సాహాన్ని నిరాకరించ లేడు.

ఈ కొద్ది కాలంలోనూ అతడు ఉత్తమ శ్రేణికి చెందిన రచనలను వ్రాయడానికి మేల్కొని శ్రమించిన రాత్రులు వేళ్ళమీద లెక్కింపతగినవి కావు. పగలు తీరిక లేక, రాత్రులు నిద్రలేక, అతని ఆరోగ్యం బాగా దెబ్బతింది. అతన్ని పరీక్షించిన డాక్టరు, నిద్రలేనివల్ల కల్గిన 'న్యూరాస్థినియా' అని రోగ నిర్ణయం చేశాడు. సగినం నిద్రా, విశ్రాంతీ రోగికి ముఖ్యావసరాలుగా పాటించాలని, లేకపోతే చాలా ప్రమాదమనీ హెచ్చరించేడు. ఇప్పుడు ప్రకాశరావుకి మరొక సమస్య యెదురైంది.



తన మానంగా జాగ్రత్త చెయ్యకలిగిన కొద్ది మొత్తాన్ని డాక్టరుకు ఫీజు క్రింద యివ్వడానికి మినహాయిస్తే యింక మిగిలే దేముంది!

అయితే తండ్రికి పంపడమెలా? మళ్ళా నిష్ఠురోక్తులతో నిండిన లేఖ రాకకోసం ఎదురు చూస్తూ ఉండవలసిందేనా? ఈ ఆలోచన లతని మనస్సును కొంతవరకూ కలవర పరిచాయనే చెప్పాలి. ఆ సమయంలో వెంకట్రావు వద్ద నుండి వచ్చిన ప్రోత్సాహకరమైన ఉత్తరం అతనికి కొంత ఉత్సాహాన్ని కల్గించింది. వెంకట్రావు తన రచనల్ని చదివినట్లూ, అవి చాలా ఉత్తమంగా ఉన్నట్లూ మెచ్చుకున్నాడు. ఒక సాహిత్య పరిషత్తువారు జరుపబోయే కథారచన పోటీలలో తనను పాల్గొనమనే సూచనకూడా ఉంది, ఆ ఉత్తరంలో. ఆ సూచనను అర్థం చేసుకున్నాడు, ప్రకాశరావు.

కథను వ్రాయడానికి భావసామగ్రిని కూర్చుకొనే సరికే కొన్ని దినాలు పట్టిం దతనికి. డాక్టరు చెప్పిన మాటలను మరచి, ఒకే దీక్షతో నడి రాత్రి దాటేవరకూ తన రచనల్లో మునిగి ఉండడంవలన అతనికి నరాల్లో పూర్తిగా బలహీనత వచ్చేసింది. నిల్చుంటే కాళ్ళు వణికి కూలబడి పొయ్యే పరిస్థితికి వచ్చింది, అతని ఆరోగ్యం. కథలను పంపవలసిన నిర్ణీతదినం దగ్గరకొస్తున్నాది. కాని అతడు కలంపట్టే స్థితిలో లేడు. అంత వరకూ అద్భుతంగా తయారైన తన రచనను ఆ స్థితిలో వదలిపెట్టడానికి అతని మనస్సంగీకరించలేదు. ఇక నొక్కరాత్రి కూర్చుంటే దానిని పూర్తిచెయ్యవచ్చు ఎట్లాగైనా ఆ తన రచనను సంపూర్తిచేయ నిశ్చయించుకున్నాడు. అనుకున్నట్లే పూర్తిచేయగల్గేడు కూడా.

తాను వ్రాసిన దాన్ని ముందతను చదువుకొని తృప్తిపడితేనేగాని ప్రకటనార్థం పంపడం అలవాటులేని అతను మొట్టమొదటిసారిగా చదువుకున్నప్పుడు తనే ముగ్ధుడు కాకుండా ఉండలేకపోయాడు. అతని రచన భావచిత్రిలో లోపం కనబర్చలేదు. పాత్రపోషణలో పటుత్వం తప్పలేదు. కల్పనాశక్తిలో కల్ల కనబర్చలేదు. ఇక తుదిరంగం చదవడం పూర్తి చేయాలి. అంత రాత్రివరకూ మేలుకొనడంవల్ల అప్పటికే కళ్ళు జ్యోతుల్లా తయారయాయి! నరాల్లో పూర్తిగా శక్తి నశించింది. పటుత్వం తప్పిన వేళ్ళల్లోంచి చదువుతున్న కాగితాలు జారి క్రిందపడి, గాలికి రెపరెప కొట్టుకున్నాయి. కిరసనాయిలు అయిపోయిన దీపం ఒక్కసారి విజృంభించి ఆరిపోయింది. ఉదయాన్నే తెలివివచ్చిన తర్వాత కథను పోస్టుచేసి, చికిత్సకోసం ఆ దారిని అలాగే హాస్పిటలుకు వెళ్ళి అక్కడే చతికిలపడ్డాడు. డాక్టరు హాస్పిటల్‌లో చేర్చుకొన్నాడే కాని పెదవి విరువకపోలేదు.

* * *

"కథారచన పోటీలో ప్రథమ బహుమతి నందిన శ్రీ ప్రకాశరావుగారు కీర్తిశేషులైనందున దానిని తండ్రిగారైన మీకు పంపడమైనది. దీనితో జతచేసిన అయిదువందల రూపాయల బ్యాంకు చెక్కు, మీ కుమారుని తరఫున మీరు స్వీకరించవలెను."

ప్రకాశరావు తండ్రికి, తన కుమారుడి మృతిని జ్ఞప్తికి తెచ్చింది. తన కన్నీటిలో తడిసి కరిగిపోయిన చెక్కుమీది అలుక్కుపోయిన అక్షరాలు తన భావిజీవితాన్ని సూచిస్తున్నట్లు తోచింది. తన కుమారుని జీవనజ్యోతి వలెనే ఖర్చయిపోయిన దీపంలాగా అంత్యక్షణాల్లో ఒక్కసారి విజృంభించి ఆరిపోయింది. చేతుల్లో నుండి జారిక్రిందపడిపోయిన బ్యాంకు చెక్కు ముందడుగువేసిన అతని పాదాల క్రిందపడి నలిగిపోయింది ప్రకాశరావు జీవితానికి మల్లే.



ఎవరైనా నాలుగుబాటల కూడలి దగ్గరికివచ్చి, అన్ని దారుల్లోంచీ ఒకేసారి నడవడానికి ప్రయత్నిస్తూంటే, అతడొక రాజకీయవేత్త అని తెలుసుకోండి.

స్కెచ్

# వైవాహికము

పి. యస్. దేవి

"నుదుటన్ వ్రాసిన వ్రాలు తప్పగలదే, నూరేండ్లు చింతించినన్!" నా నుదుటి వ్రాతను మించి యెక్కువ రమ్మంటే యేదైనా యెలా వస్తుంది? నా జీవితములో సుఖమనేది గగనకుసుమమేనా? నా పెండ్లిఅయి, అయిదు సంవత్సరాలైంది. ఈ అయిదుసంవత్సరాలలో నే ననుభవించని కష్టమంటూ లేదు. చిన్నతనములో అమ్మ నాన్నలచాటున పెరిగినన్నాళ్ళు యేం సుఖం అనుభవించానో కష్టమనేది లేకుండా. అంతే.

అసలు నాన్నదే పొరపాటేమో! దూరాలోచన లేకుండా, ఇల్లాంటి సంబంధం చెయ్యడం! నిజానికి ఆయన తప్పు యేముంది, ఒక్కగాను ఒక్కకొడుకు. కావలసినంత ఆస్తి వుంది. నా అల్లుడు ఉద్యోగము చేసినా చెయ్యకపోయినా రాజాలాగా జరుగుతుంది, అనే ఉద్దేశ్యముతో ఉన్న నాలుగు ఎకరాలపొలమూ అయినకాడికి తెగనమ్మి, ఆరువేల రూపాయలు కట్నం పోసి ఐదురోజులు అతి వైభవంగా పెండ్లి చేశారు. నేనూ నా భర్తా కారులో షైర్లు కొడుతూవుంటే కవతోటి గుమాస్తాకో ఆ పెళ్లిమాటలలో వున్నాయన నా అల్లుడని చెప్పి, ఆయన మీ అంత అదృష్టవంతుడు లేడండి. వజ్రపు తునకలాంటి అల్లుడండి, అని పొగుడుతూంటే గర్వపడదా మనుకున్నాడు నాన్న. నా భావిజీవితములో యే లోగతా లేని సుఖమనుభవిస్తున్నానని ఊహించాడు ఇంత ఆస్తి వున్న సంబంధం చేశానుగదా! డబ్బువుంటే అన్నీ వాటంతటవే లభిస్తాయనే భ్రమపడ్డాడు. ఇంత డబ్బున్నవాళ్ళు వరకట్నముకోరకై అంత పట్టుదలకట్టి, ఆరువేలకు చిల్లిగవ్వ తక్కువయినా సంబంధం పొసగదు. అని (పెండ్లికి ముందు) మా మామగారు, మాట్లాడిన మాటలనుబట్టి అయినా గ్రహించలేదు నాన్న, ఆయన పరమ లోభి అని.

పెండ్లిలో లాంఛనాలు సరిగా జరుగలేదని, మా అత్తగారి, మామఅన్న భార్యకు, అప్పగింతల చీర ఇవ్వలేదని, ఇల్లాంటి స్వల్పకారణాలు మా అత్తగారు మరచిపోకుండా, నేను కాపురానికి వచ్చింది మొదలు నా మూలమున అవన్నీ జరిగినాయని, నాలాంటి దరిద్రురాలు మరి వుండబోదని, హీనాతిహీనంగా, ఇల్లాంటి బాధలు పెడతారని, నాన్న కలలోనైనా అనుకున్నారా? ఎన్నడో, పెండ్లిసమయములో, తెలిసో, తెలియకో, నా తల్లిదండ్రులు లాంఛనాలు సరిగా జరుపని నేరానికి, నేను ఆ జన్మాంతము ఇల్లాంటి బాధలు అనుభవించ వలసిందేనా? నన్ను గురించి నాన్న, అమ్మ, యెంత కుమిలిపోతున్నారో? అమ్మ, నాన్న, నన్ను చూడటానికి నాలుగునెలల కొకసారి వస్తే, మా అత్తగారు అమ్మతో మాట్లాడితే గౌరవలోపమని పలుకరించనయినా, పలుకరించరు. ఇక నాన్న విషయం చూద్దామా అంటే, మా మామగారు నాన్నను చూడగానే యేం పనిమీద వచ్చారు! అని అడుగుతారు. పోనీ, నా భర్తయినా ఇంటికి వచ్చిన నాన్నను ఆప్యాయంగా పలుకరించి, మర్యాద చేస్తారాఅంటే, వాళ్ళ తల్లిదండ్రుల ఆజ్ఞ లేకుండా, యేపనీ చెయ్యటానికి స్వతంత్రంలేదు. అమ్మ, నాన్న ఈ పరిస్థితులన్నీ చూసి మరుబండికి తిరిగి వెళ్తారు. "వెళ్లొస్తా నమ్మా ధైర్యంగా వుండు, దిగులుపడొద్దు" అని హెచ్చరించి వెళ్ళితే, అమ్మ వెళ్ళిన గంట వరకూ నాకు ఆపుకున్నా ఆగకుండా దుఃఖమొస్తుంది.

ఈ విషయం మా అత్తగారు కనిపెట్టి, ఆతల్లి వచ్చి యేమేమో నూరిపోసింది. ధైర్యంగా వుండమని హెచ్చరించటానికి ఇక్కడ యేమంత

రాసి, రంపాన పెట్టుతున్నామనీ, అల్లాంటి మాటలు మాట్లాడాలి. తన భాగ్యానికి, తన మొగుడు దర్జాకు, సిగ్గులేకుండా మాట్లాడ వస్తుంది. నా సాటివాళ్ళతో నా వియ్యపురాలని చెప్పుకోటానికి గూడా సిగ్గుగా వుంటుంది. ఇంతకూ మా దురదృష్టముకొద్దీ దొరికింది ఈ సంబంధం. నేను మొదట్లోనే ఈ సంబంధం వద్దని చెబితే ఆయన విన్నాడుగాదు. పిల్ల అందమయినదనీ, చదువుకున్నదనీ, మోజుపడ్డారు ఆయన. ఆవతల సోమయ్యగారు, యెనిమిదివేల రొక్కమూ, తక్కిన లాంఛనాలు, అన్నీ జరుపుతానంటే, పిల్ల నలుపనీ, చెముడుందనీ. వప్పుకోలేదు ఆయన అప్పుడు. అందమంటే, కొరుక్కు తింటున్నామా? అని వడగండ్ల వర్షము కురిపిస్తారు.

అమ్మ వెళ్ళిందన్న విచారమూ, ఆమె అన్న మాటల కష్టమూ, ఒక గంట స్వేచ్ఛగా నాలో నేను యేడిస్తేగాని తగ్గవు.

ఇవన్నీ, నా భర్తవద్ద మొరపెట్టుకుంటేనన్ను అంటేనే మారుచెప్పటానికి, నాకు స్వాతంత్ర్యము లేదు. అల్లాంటప్పుడు, నిన్ను అన్నదానికి, యేంచెయ్యమంటావు? నేను స్వాతంత్ర్యంగా జీవించగలిగినవాడను, వాళ్ళమాటను యెదురు చెప్పటానికి సాధ్యమౌతుంది. ఆ రోజువరకూ నేను నన్నుగురించి నీవు సహించివుండవలసిందే నని సమాధాన పరుస్తారు. ఇప్పుడెప్పుడూ ఆయనతో చెప్పినందువలన ప్రయోజనం శూన్యమని, నాలో నేనే కృశించిపోతున్నాను.

నాలాంటిఆడపిల్లలనుగన్న తలిదండ్రులందరూ ఇలా పిల్లలను పెంచి, పెద్దచేసి, శక్తికి మించిన వరకట్నాలుపోసి, వరులను తెచ్చి వివాహం చేస్తే యేదో పెండ్లిలో చిన్న లోపములు జరిగినయ్యనో, తమ అబ్బాయికి ఈ సంవత్సరం, ఆరువేలు ఇచ్చి పిల్లనిస్తే. తమ ప్రక్కింటి, ఆమె కొడుక్కు మరుసంవత్సరంలో తొమ్మిది వేలుఇచ్చి పిల్లనిస్తే, అయ్యో ఈ సంవత్సరం ఆగితే మనకుగూడా తొమ్మిదివేలూ వచ్చేవే, మూడు వేలరూపాయలు నష్టమే, అనే దురాశా పూరితులైన వరుల తలిదండ్రులచే ఇలా హేయాతి హేయంగా చూడబడవలసిందేనా? ప్రపంచం అంతా ఇలాగే వుందా? లేక నా పూర్వపుణ్యఫలమా ఇది.

అసలు దీనికంతకూ, నా భర్తే ముఖ్యకారణము. తనకు స్వాతంత్ర్యజీవనమునకు తగినపరిస్థితు లేర్పడకముందే తండ్రి ఆస్తిమీద ఆధారపడి, తనకు దూర సందులేదు మెడకొక డోలు అను సామెతను సార్థకపరుస్తూ నన్ను పెండ్లాడటమనేది, యెంతయినా పొరపాటు. ఆయన యెన్నడయినా, ఇలా సునిశితంగా ఆలోచించారా నా పరిస్థితులను గురించి ? స్వార్థ ప్రపంచము.

అయినా ఒకరి ననవలసిన పనేముంది. నా దురదృష్టానికి చింతపడవలసిందేగాని తక్కువ నోములు నోచి యెక్కువ ఫలము రమ్మంటే యెలా వస్తుంది. ఏనాటికైనా మంచి రోజు లంటూ వున్నయ్యా నా జీవితములో ? అని లక్ష్మి తన గత జీవితఘట్టాలలోని దృశ్యాలు కళ్ళకుకట్టినట్లు భావప్రపంచములో కనిపిస్తూంటే వాటిని విస్మరించ శక్తిలేక వాటినే తిరిగి తిరిగి మననంచేస్తూ దుఃఖిస్తున్నది.

ఇంతలో లక్ష్మి అత్తగారైన శాంతమ్మ "ఏమే లక్ష్మి ఇంకా ఆ పనిలోనే వున్నావుటే. గంటన్నర అయింది మొదలుపెట్టి. ఇలా పనులు చేస్తే కాపురాలు యెలా గడుస్తాయి? ఎంత చెప్పినా వినవు. ఎంత అనకుండా వుందామన్నా నాచేత యేదోకటి అనిపించటానికే చేస్తావు. నా మంచి దక్కుతుందేమోనని. లే, కళ్ళు వప్పగించి అలా చూస్తావేం, ఆరుగంటలయింది. చీకటిపడుతోంది. ఆ బియ్యం నాకిచ్చి వంట ప్రయత్నం చెయ్యి."

అత్తగారి వురుముల వర్షంతో లక్ష్మి మనసులోని గత దృశ్యాలన్నీ వర్షము వెలిసిన తదుపరి మేఘశకలాలల్లే విచ్చిపోయినయి. లక్ష్మి భారమైన హృదయంతో వంట ప్రయత్నంలో మునిగిపోయింది.

# విప్లవవాదికి ఇంకో ఉత్తరం

'భవదీయుడు'

నా క్షేమానికంటే యీసారి యిక్కడి పరిస్థితు లేమిటో తెలుపమన్నావు. బహుశా ఆ పరిస్థితుల్లోనే నా క్షేమం కూడా యిమిడి వుంటుందని వూహించి వుంటావు. బాగుంది. నీ వూహ యథార్థమైందే.

అయితే- యిక్కడి పరిస్థితులను వ్రాయడంలో రెండు రకాలున్నాయి. వెనుకటికి- యుద్ధవార్తలు, నిజమైన యుద్ధవార్త లన్నట్టు అసలువార్తలూ, నీలివార్తలూ అనే రకాలున్నాయి. నీకు నీలివార్తలు తెలిపి మభ్యపెట్టే కన్న ఏమీ తెలుపకుండా మౌనం వహించడమే మంచిది. ఇక- అవికాకుండా యథార్థ విషయాలు వ్రాయాలంటే ఈ సందిగ్ధ సమయంలో చాలా సాహసమే కాకుండా ప్రమాదకరమని కూడా భావిస్తున్నాను. అయితే- యథార్థాల వల్ల వచ్చే ప్రమాదాలకన్న మౌనమే మరీ ప్రమాదకరమేమో (దేశం బాగుపడాలనే దృష్టి వుంటే) ననే వుద్దేశంతో ఏమైనా కానిమ్మనే ధైర్యంతోటే (బాధ్యత గుర్తించే) దీనికి పూనుకుంటున్నాను.

అంత ప్రమాద మేమిటని నీ వనొచ్చు. దానికి సూటిగా సమాధానంకన్న రెండుముక్కలు చెబితేనేగాని మరీ తేలికగా అర్థం కాదనుకుంటాను.

మన సోదరుల హత్యాకాండ, లూటీలు, గృహదహనాలు, చిత్రవధలు, మానవత్వాన్ని మరిపించే యీ ఘనకార్యాలన్నీ ఏనాడో శ్రుతి మించి రాగాన పడ్డాయని యిదివరకే తెలిపాను. ఇక- వారి బాధలనుండి కాపాడడం మన రక్షక వర్గపు ముఖ్యకర్తవ్య మన్నది అందరికీ తెలిసిన విషయమే. అందుకనే అనేకచోట్ల రక్షణ క్యాంపులు పడ్డాయి.

అయితే- చాలా దురదృష్టకరమైన, విచారకరమైన విషయమేమంటే- మన రక్షకభటులు హింసావాదుల రూపుమాపడానికి పూనుకోవడం కన్న సామాన్యప్రజలపై దౌర్జన్యాన్ని ఎక్కువ చూపుతున్నారని తెలుపవలసిన గతి పట్టడమే.

ఇక- యిక్కడి పరిస్థితులు యింత అధ్వాన్నంగా వున్నప్పుడు నే నెలా యథార్థాలు వెల్లడించాలో ఆలోచించు. సోదరుల హత్యాకాండను గురించి చెప్పడం 'ప్రజాద్రోహం'. రక్షక వర్గపు దౌర్జన్యాలు తెలుపడం 'రాజద్రోహం'. ఈ రెండూ తెలుపకుండా నోరుమూసుకొని పడి వుండడం 'సత్యద్రోహం'. కనుక- ఏ ద్రోహమూ చేయకుండా హృదయం గల మానవుడెవరూ బ్రతకలేడు. బ్రతికినా అది అర్థంలేని బ్రతుకనీ, జీవిత పరమావధి అదికాదనీ నా వాదం. అందుకనే నేను వ్రాసేదాన్నిబట్టి ఏ ద్రోహానికి తల పెట్టలేకుండా వున్నానో విశదమవుతుం దనుకుంటా.

సోదరులు- ఎప్పుడో చప్పున ఆయుధాలతో వచ్చి- అడ్డుపడ్డ ప్రజలందర్నీ చావమోది, తడవకు కొందరు 'ప్రజాద్రోహుల' చొప్పున అనాగరిక పద్ధతులతో హతమార్చి, ఆస్తులు లూటీచేసి సిమిహాల్లో మాయమై పోవడం అలవాటు.

వారటువెళ్ళగానే రక్షకవర్గం వస్తుంది. ఇక వారికి కనబడేదల్లా గ్రామప్రజలు. (ప్రజలన్న వారిలో అంతా అమాయకులనుగాని, అజ్ఞానులనడంలో దోషంలేదు). ఈ ప్రజలపైబడి, ఆ దుర్మార్గుల నెందుకు రానిచ్చారని మళ్లీ చావ చితుకగొట్టడం, అవమానించడం లంచాలు లాగడం నోరున్నవాణ్ణి ఏదో నేరంతో కొట్లోకి నెట్టడం.

ఇదీ పద్ధతి! ఈ ఘోర భయంకర ప్రమాదకర (నీ యిష్టమొచ్చిన మాటలు వాడుకో!) వాతావరణం ఎలావుంటుందో గ్రహించు.

సోదరులూ ప్రజలనే చంపుతున్నారు. రక్షకవర్గమూ ప్రజలనే హింసిస్తున్నది. (అసలు కావా

లనే స్త్రీలు చిక్కడం అరుదు) అంతా స్త్రీలకు సేవచేయడమే. ఇవేళ సేవంటే యిదే నేమో! సోదరుల హత్యాకాండ ఎంత ఘోరమైందో, అదే పద్ధతిని మనవాళ్ళు నుసరిస్తే మాత్రం మంచిదని ఎలా కళ్ళుమూసుకొని మూర్ఖంగా అనాలో తోచదు. అయితే దుర్మార్గుల సంహరించడంలో యీ బాధలు తప్పని సరనీ, యిదే మార్గమనీ కొందరంటారు కాని-నేను నమ్మలేకుండా వున్నాను. ఈ మార్గం సరియైందికాదనీ, దీనిద్వారా ముమ్ముందు సుఖపడే వాళ్ళ ఏమాత్రం లేదనే సందేహిస్తున్నాను. నా సందేహం సందేహంగానే వుండిపోతుందేమో! తప్పుకు తప్పు, చావుకు మరోచావు. ఎన్నాళ్ళీ తప్పుల తడక?

ఇంత అన్యాయ మేమిటని మన రక్షకవర్గాన్నడిగితే "సరే! మాకేం? మీ అవస్థలు మీరు పడండి. మేము వెళ్ళిపోతా" మని బెదిరించడమో, లేకుంటే "దెబ్బకు దెబ్బే శిక్ష" అని సమాధానమివ్వడమో జరుగుతుంది.

కాని—తప్పుచేసేది ఎవరో కొందరు దుర్మార్గులయితే, శిక్ష ననుభవించేది మరెవరో! అందరూ సన్మార్గులు! ఈ సమస్య నెవరు పరిష్కరిస్తారు? ఎలా లేకుంటే-యీ విధాన మెక్కడికి దారి తీస్తుంది? నిజంగా నేటి దౌర్జన్యాల్లో నిరాయుధుల పాత్ర ఏమీ లేదనే చెప్పాలి. అయితే-సంబంధమే లేదా అంటే వుంది. ఆయుధమే అన్నిసంబంధాలు చేకూరుస్తున్నది. రెండుపక్షాలవారూ ఆయుధాలతోటే బలవంతపు సంబంధాలు కల్పిస్తున్నారు. న్యాయంగా ఆయుధాలన్నా పోవాలి. లేదా-ఆయుధాల వారికే యుద్ధం జరగాలి. కాని-యీ పోట్లాటలో మామూలు ప్రజలేం?

అయితే, మన రక్షకవర్గానికితో ప్రజలంతా సహకరించాలనేది ఎవరూ కాదనరు. కాని-నిరాయుధులైన ప్రజల సహకారమన్న దానిమీద వారికెంత నమ్మకమున్నదో ఎవరూ చెప్పలేరు.

ప్రజల ధన, మాన, ప్రాణరక్షణావసరాల కన్న-వారి ఆయుధాల సిద్ధాంతాల మీదనే ఎక్కువ నమ్మక మున్నట్టుంది-యీ ఆయుధధారులకు. అసలీవేళ ఆయుధాలే ప్రజలను పరిపాలిస్తున్నా యనడం అతిశయోక్తి కాదు. ఈ ఆయుధ కర్మాగారపు రొదలో-నీ నా మానవత్వం హృదయం, ప్రాణం అనే పిలుపు-అరుపులు ఎవరికి వినబడతాయి?

తప్పుడు సిద్ధాంతపు సోదరుల వల్ల మానవనైతిక విలువలు నశిస్తున్నాయంటే ఏడవడంతప్ప ఏమీ చేయలేక పోయాం. ఈ దుఃఖాన్ని, కష్టాన్ని పోగొట్టుకోటానికే రక్షకవర్గంతో హృదయపూర్వకంగా చేతులు కలిపినా యింకా బాధలు తప్పడంలేదు. ఏమిటీ గ్రహచారం? ఇప్పుడు ప్రజ లేమనుకుంటున్నారో తెలుసా?

"సోదరుల బారినుండి కాపాడడానికి వీరిని తెచ్చుకుంటే-వీరి ప్రవర్తనుండి కాపాడుకోడానికి మరెవరిని తెచ్చుకోవాలి!" అని.

చూడు! ఎంత నిరాశ, నిస్పృహ అలముకొన్నదో! కష్టాలకు తట్టుకొనే ఓపికపోయింది-ప్రజలకు. ప్రజల బాధ గ్రహించే నాథులెవరూ కనబడరు. అంతా అవసరానికి వినియోగించుకోవడం కొల్లగొట్టడం చెడుకార్యాలు చేయించడం, అది ఎదురు తిరిగితే పశ్చాత్తాపపడడం ప్రజలంటే నమ్మకపోవడం, మళ్లీ వాళ్లనే బాధలు పెట్టడం ఇదీ-అజ్ఞానులకిచ్చే విజ్ఞానం.

మనం-మనబాపూ, నెహ్రూ, పటేల్ అని ఎంతగా ప్రేమించి, గౌరవించి, ఆనందంలో మైమరచి మనదేశ భవిష్యత్తునుగూర్చి ఎలాంటి మహోన్నతమైన కలలు కంటున్నామో-అవన్నీ యిక్కడి పరిస్థితులు చూస్తుంటే - ఆ కలలన్నీ విచ్చుకొనిపోయి ఎడారి, అంధకారమే కనబడుతోంది. పొరపాటున యీ బాధల్లోపడి మన నాయకుల మరిచిపోతానని భయపడుతున్నాను. "వద్దు! భగవాన్! వద్దు! ఎన్ని కష్టాలన్నా పడ్తాను. నా నాయకులను నా దేశాన్ని మరువనివ్వకు. వారి అడుగుజాడల్లోనే నడిపించు! ఈ కష్టాలనుండి కడతేర్చు" అని విలపిస్తున్నాను-యీ లోకంగాని లోకంలో.

ఇదంతా వేదాంత మంటావు - తప్పున. వేదాంతమన్నా ఆధ్యాత్మికమన్నా (ఇవే అవయితే) నీకు గిట్టవని తెలుసు. కాని-ఏదో ముందడుగు, నవ్యజగత్తు అనే మైకంలోపడి ఎలాంటి అయోమయ వాతావరణంలోకి లాగబడ్డామా అనిపించి యిలా పిచ్చికేక లేస్తాను.

అయితా-నేనూ ఏకీ మూర్ఖంగా నమ్మననేది సీకు తెలియందికాదు. దేనికైనా శాస్త్రయుక్తమైన హేతువాద సిద్ధాంతం మూలం కావాలనే నేనూ వాంఛిస్తున్నా ననేది నీకు మరిచిపో లేదనుకుంటాను

అయితే-మనం పాతపద్ధతుల నన్నిటినీ తేలిక గానే ఈసడించి, తెంచుకొని గొప్పవాళ్ళమై పోయ్యామని యిదివరకు సంతోషించాం. కాని-యీవేళ ఆలోచించుకుంటే, స్థిరమైన సత్యమైన నాలుగు కాలాలపాటు మనగల ఏ క్రొత్త సిద్ధాంతాన్ని మాత్రం చేపట్టలేదేమోనని సిగ్గు పడుతున్నాను. అప్పుడే నీవు నన్ను-దిగజారానని, వెనక్కు చూస్తున్నాననీ అనడానికి సాహసిస్తావుగాని 'ముందుకు' అనే మూర్ఖంతో ఏ అగ్నిగుండంలోకో దూకి ఆహుతై పోవడమే ముందుకు కర్థమని నే ననుకోవడం లేదు. ఇవేళ మన సోదరులు చేసిన బుద్ధి తక్కువ పనికూడా అదే ననిపిస్తున్నది. ఏదో సాధిద్దామనే వుద్దేశంతో ఆవేశానికిలోబడి (పైగా-అదియుధ్ధమే ననుకు లోబడ్డవనే ప్రగల్భాల్లో నాకింకా నత్యం కనబడలేదు) అనవి మనుష్యులాగా హాంతకు లయ్యారు. ఇవేళ తికమికపడుతున్నారు. ఏనా వెనక్కుచూసుకొనే పరిస్థితికూడా మించిపోయిం దనుకున్నారేమో ముందుకే చూస్తున్నారు. కనుక తమ సిద్ధాంత విధానం మంచిదనే మూర్ఖంతోటే సమర్థించుకుంటూ అలాగే కార్యక్రమాన్ని కొనసాగించుకుంటూ పోతున్నారు. ఏదీ గమ్యం? ఎక్కడ? లేదు! భూమి గుండ్రన! కనుక...

ఇంతకూ చెప్పొచ్చిందేమంటే-మనం మంచి చేస్తేనే మంచి ఫలితాలు; చెడు చేస్తూ సత్ఫలితాలు కావాలనడం వెర్రి, అవివేకం. అయితే-మన పూజ్యనాయకులు మన మంచినే కోరుతున్నారు. మనమూ వారి శుభాన్నే కోరుతున్నాము. సందేహం లేదు. కనుక ఫలితాలు కూడా మంచివే కావాలి, ఆ పద్ధతిలో. కాని-యిక్కడి పరిస్థితులు చూస్తేనో?

దీనికి రాజకీయ జ్యోతిష్యులే సమాధానం చెప్పాలి. అదీ అవసర మనుకుంటేనే.

# అతడిగురించి నాకు తెలిసినది—

## విలియం సారోయన్

అతడు చాలా సరదా అయిన మనిషి. చాలా కష్టపడి పనిచేసేవాడుకూడా. వయస్సుమళ్ళిన వాడే-అక్కడ పనిచేస్తున్న టెలిగ్రాఫ్ ఆపరేటర్లతో అంత లావైనవాడు మరొకడు లేడు. ఇక ముందుండడుకూడా.

అప్పట్లో నేను ఆఫీసు మెసెంజర్ గా వుంటూండే వాణ్ణి. నన్ను అంతా మెచ్చుకునేవారు, చాలా చురుకుగా పని చేస్తానని. నన్ను అంతా 'వేగం' అని పిల్చేవారుకూడా. మరెందుకూ కాదు తక్కిన మెసెంజర్లకన్నా త్వరితంగా పనిముగించుకొని వచ్చేవాణ్ణి. అతడు నేను తక్కినవాళ్ళకన్నా తెలివైనవాణ్ణి అనికూడా అనుకునేవాడు.

అతడు మరో వూరినుంచి వచ్చాడిక్కడికి. చాలా రెగ్యులర్ గా పని చేసేవాడు. మంచివాడు. అందువల్లే నాకెంతో యిష్టం.

అతడు టేబిల్ దగ్గర కూర్చుని పనిచేశాడంటే అంత త్వరితంగా పనిచెయ్యగలిగేవాడే లేడు. ఇద్దరం ఆ ఆఫీసులోకే-హెచ్చుగా పని, పనంటే అభిమానం మాకే వుండేది. హెచ్చు అభిమానంతో పని చేసేవాడు.

—నాకు యంత్రాలమీద నమ్మకం లేదు. అసలు యంత్రాల్లా పని చేసే మానవులుంటే లాభం లేదు. రక్తం పిండి, వృద్ధినొందే యంత్రాలతో పనే లేదు. అటువంటివాటితో లాభం లేదుకూడా.

ఒక యంత్రంవల్ల డబ్బు వచ్చిందీ అంటే—ఆ డబ్బు దానిక్రింద బానిసలా పని చేసేవానికే వెళ్తుంది. అది నా నమ్మకం.

అతణ్ణి చూస్తే—నాకెంతో ఆనందం-ఎంతో చక్కగా నవ్వుతాడు. ఎంతో హాయిగా వుం టుంది అతనితో. ఇంకో సంగతి. 'లంచ్' తీసు కువెళ్ళేటప్పుడల్లా—'మెనూ' జాగ్రత్తగా చూసి 'ఆర్డర్' చేస్తాడుకూడా.

నన్ను అంతా మెచ్చుకుంటారు. ఎందువల్ల నంటే—నాకు ఆఫీసు 'రొటీన్' అంతా తెలుసు కాబట్టి. లేటుకూడా తెలుసు. టెలి గ్రాములు 'రిసీవ్' చేసుకోడం తెలుసు. చాల మందికి తెలియని విషయాలెన్నో తెలుసు.

నేను మెసెంజరునే అయినప్పటికీ—క్రింద మెట్టునుంచి పై మెట్టువరకూ పర్యవేక్షించే వాణ్ణి. 16వ ప్రెసిడెంటువరకూ,అదే పై మెట్టు- ఆఫీసులో అతని ఫోటో వుంది—కాని ఒకసారి కూడా మా ఆఫీసుకు రాలేదే—

మా వూరు అంత చక్కనిది మరొకటి లేనే లేదు. ఎన్నో వేలాది మనుష్యులు వస్తూ మా సుందరసీమను సందర్శిస్తూనే వుంటారు. భాష తెలియని చాలమంది, మా వద్దకు రావడం మూలాన మేం నమ్రతతో సంభాషించడం చాలమందికి ఎంతో సంతోషం మేం అంటే—

పెద్దపెద్ద వాళ్ళంతా వచ్చే ఒకే ఒక పెద్ద హోటలు వుంది. అందులోనే ఒక బ్రాంచి పెట్టేరు. నేనూ అతనూ అక్కడే-అలా మూడు సంవత్సరాలు నడిచింది.

ఆ తర్వాత అతడూ వుద్యోగం వదలి స్టీమర్లో పని చేసేవాడు. అందులోనే అమితంగా డబ్బు గడించాడు. ఆ తర్వాత మరో మూడు సంవత్స రాల కతన్ని చూడ్డం జరిగింది. చక్కటి 'పాకార్డ్' కారు ... డబ్బుతో శరీరంకూడా లావెక్కింది. జుత్తుకూడా వూడ్డం మొదలైంది. ఎంతకాలం డబ్బు అలా పాతుక వుండిపోతుంది? ఎగుమతి దిగుమతి నష్టాలతో క్రమేపీ ధనం క్షీణించసాగింది.

మరోసారి అతణ్ణి ఓ రెస్టరెంటులో చూట్టం జరిగింది. ఇంకా లావెక్కివున్నాడు. మొదట్లో చూసిందానికి రెండింత లున్నాడు. ఒంటిమీద దుస్తులు లేవు. కారణం? చెమటతో స్నానం అయిపోతున్నాడు.

అతనికి ఊపిరి పీల్చడమే కష్టం అయిపో తుంది. అతడు కొద్దిగా అస్వస్థతగాకూడా వున్నాడు.

చాలా లావయినా డతడు. దానిగురించే అతనికి వ్యాధికూడా.

నడవలేనట్టు, ఊపిరి పీల్వలేనట్టు ఫీలవ సాగేడు అతడు మాట్లాడుతున్నంత సేపున్నా- తెలీకుండా వుంది. దీని గమనించే ఇతను చని పోతాడేమో?

నాకేం పాలుపోలేదు.

కూల్ డ్రింక్స్ తీసుకున్నాం. చాల బల హీనంగావున్నాడు. అంత లావుపాటిమనిషికి బల హీనం ఏమిటి? అత డీమధ్య నిద్రపోడమే లేదని చెప్పాడు. ఎప్పుడూ సిగరెట్లు కాల్చడమే పనట.

అతణ్ణి వదలిరావడం నాకు ఏడుపు పర్యంతం అయింది. పాపం—

నిజంగా కొన్నాళ్ళ కతడు యింకా లావై నాడు చనిపోయాడు.

అతడు మావూరు రావడం నాకు తెలుసు. అతడెలా మాట్లాడేవాడో, ఎంత నమ్రతగా వుండేవాడో అన్నీ యింకా కళ్ళకు కట్టినట్టే వున్నాయి.

ఒళ్లువచ్చి చనిపోయాడు. అంత ఒకరోజు బ్రతికున్నరోజుల్లో అతనివద్దకు వెళ్ళాను. అతడు చనిపోతానేమో అన్నాడు కూడా-అంతే-అదే నిజమైంది రెండునెల్ల తర్వాత చనిపోయాడు. ఆరోజు రాత్రిమాత్రం అతనికి ఊపిరి పీల్వడమే కష్టం అనిపించిందటకూడా—

నాకు దేనిగురించీ తెలియదు కాని—కొన్ని కొన్ని ముఖ్యమైన అరు విషయాలు తెలుసు. ఇలా అతడు లావెక్కి చావడం ఏతవది-అంతే.

(అనువాదం-సజగ్ నాధ్)



# అమాత్యుని అకాలమరణం

'బైరాగి'

నిన్న ఉదయం ఎనిమిదింటికి
పట్టణంలో స్వగృహాన
పోర్టుఫోలియో లేని మంత్రి శ్రీ ఫలానా గారు
హృద్రోగంచే మరణించారు
దేశాన్ని, కుటుంబాన్ని దుఃఖాంబుధిలో
[ముంచారు.

వయస్సు ఎంతో లేదు. నలభై ఐదు
ఈ కష్టసమయంలో వారినుంచి
ఎంతో ఆశించింది దేశమంతా

గొప్ప రాజకీయవేత్త. ప్రఖ్యాత అర్థశాస్త్ర
[నిపుణుడు
నాలుకపైన ఆడేవి జనాభా లెక్కలన్నీ
ఆయన కూర్చుంటేనే అసెంబ్లీకి
వచ్చేదొక ప్రత్యేకమైన అందం
ఆయన్ను చూస్తేనే సభ్యరాంద్ర కానందం
ఆయన గర్జించినపుడు ప్రతికక్షుల గుండెల్లో
పరుగెత్తేవి చిట్టెలుకలు
ఆయన మంచినీళ్ళ ప్రాయంగా మాట్లాడుతుంటే
నిద్రవచ్చేది శ్రోతలకు హాయిగా
ఇంకా వృద్ధిలోకి రావలసినవాడు
అకస్మాత్తుగా పాపం...
వారి కుటుంబీకుల పట్ల తప్త హృదయాలకు సాను
[భూతి
(ఆయనకొక కుమారుడు కార్యదర్శిని కూడా పెంచేవి)
చుట్టూ నల్లగీతలు పెట్టి రాశాయి పత్రికలన్నీ
'ఒక తార రాలిపోయింది. ఒక చెట్టు కూలి
[పోయింద'ని
దినపత్రిక సంపాదకీయం

నాయకుల సానుభూతి సందేశాలు
శోకసభలు ప్రజానీకపు జోహార్లు
మరణానంతర సత్కార ప్రదర్శనాలు
నాడు అనందించని వాడల్లా అమాత్యు డొక్కడే

అమాత్యుడు లేడిప్పుడు
మిగిలినది ఎలుకల చప్పుడు
అందమైన బంగళా అద్దెకిచ్చేశారు
అమ్మేశారు సరిక్రొత్తకారు

చట్రంకట్టిన సన్మానపత్రాలు మూటకట్టి
భార్యాపిల్లలు స్వగ్రామానికి తరలిపోయారు
అమాత్యుని శేషచిహ్నాలు
అకడావిష్కరించిన ఎలుకకన్నాలు

* * *

అమాత్యుడు చనిపోయాడు
పట్టని ప్లాట్‌ఫారంమీద మూగుతున్న మహాజనం
నినాదాలు, పూలమాలలు, నగుమొగాలు
వెనుకతోన్న చేయికట్లు, స్వాగతాలు
అతనికోరకు కాదిప్పుడు.
అతనికి ఎలుకల చప్పుడు.
అమాత్యుడు నిదురించాడు
జీవితపు ఏడురంగుల స్వప్నాలు సోకలేని

జీవితజ్వరోన్మాదపు పలవరింతలు ప్రాకలేని
మంచుముక్కటి కప్పులోని మృత్యుశయ్యను;
కౌగలించుకొన్నాడొక మొద్దుకొయ్యను
చనిపోయిన చరిత్రల పుస్తకాల్లో

చిరిగిన, మరకలైన పేజీలం
భూలుంఠిత కిరీటాలు
బద్దలైన కనాటాలు
సమాధులు శ్మశానాలు

గబ్బిలాల నృత్యాలకు
ఉలూకాల గానాలు
నాచుపట్టిన శిథిలాల్లో
పాచిపోయిన జ్ఞాపకాలు

రాజ్యాలివి, అస్థికల్పిన జంగళాలు
అమాత్యు డెక్కడున్నాడు!
        చలికాలం. చీకటి రాత్రి.

హోరున వీస్తోంది ఈదరగాలి
నిర్జన వీథుల్లో ఈలవేస్తూ
మూసిన కిటికీలపై జాలిగావాలి
ఉష్ణపరిష్వంగంలో నిదురించింది యౌవనం
ముసలివాళ్ళకు పరుపులు రగ్గులు
ఎరువిచ్చిన వెచ్చదనం;

శిథిల సమాధిలో కటికనేల
మృతకాత్మలు పొరిలేవేళ
స్వర్గనరకాలు ఛాయాచిత్రాల్లా
ఆడుతున్నవి కనులముందు
కటికనేల వాలుకుదరక పొరలుతోంది
అమాత్యుని గౌరవనీయమైన శవం.

చావుకి మర్యాదలేదు. గౌరవనీయులకూ పరా
                                        భవం!

అమాత్యుడు చనిపోయాడు
ప్రజాక్షేమ ప్రణాళికలు, మేజాలు, కాగితాలు
పత్రికా విలేఖరులకు దర్శనాలు
ఎముక పిండి ఫ్యాక్టరీ తెరిచిన కారణాలు
అన్నీ మరచిపోయి
కొడుకు చదువు, మేనల్లుడి ఉద్యోగం
కార్యదర్శిని యౌవనోద్వేగం
అన్నీ మరచిపోయి చనిపోయాడు.

పురుగుల పుట్టినిది
అమాత్యుని సమాధి అది
హోరున వీస్తోంది ఈదరగాలి
చెడిపోయిన జీవిత యంత్రాలపైన వ్రాలి
జాలిగా తాకుతోంది మొండి మోళ్ళను
        చలికి బిగిసిపోయిన కీళ్ళను

అమాత్యు డెక్కడున్నాడు? వింటున్నాడు!
పత్రికల శోకసంచికలు చదువుకొని నిదురించాడా!
గాలిలో ఎవరికేక!

ఆత్మల అశాంత ఆర్తనాదం
కాళ్ళు చాపేందుకు చోటుచాలని వివాదం
చీకటిలో చెరగిపోయిన చిత్రాలు
అమాత్యుని శ్వేతపత్రాలు
ఎక్కడ అమాత్యుని చేవ్రాలు
మంచుకురుస్తున్నదా సమాధిమీద!
మరచిపో మరచిపో, మరచిపో జీవితాన్ని
        గానుగ ఎద్దుల గతాన్ని

రాకపోకలులేని బాట
ఇరుసువిరిగిన బండిలా నాగరికత
గాలిలో జోలపాట
ఈ కటికనేలపైన నిదురించిన తరతరాలు
పిరామిడ్లు, తాజమహల్, మృత్యుశిఖరాలు
బ్రతుకుల రంకులరాటం
అవి తీరని ఆరాటం
నిద్రపో, నిద్రపో, నిద్రపో
ఈ కటికనేలపైన ఇక్కడ సంపూర్ణ శాంతి
        పీడ లేదా ఇంకా భ్రాంతి!
మృతకాత్మల అనాథ శరణాలయం
        ఇక్కడ ఇంకేమి భయం?

హోరున వీస్తోందిగాలి
చల్లని చేతులతో తాకుతోంది
విషపుశ్వాసలా చెంపకు సోకుతోంది
పగిలిన తలుపుల్లోంచి

శిథిలసమాధిలో అమాత్యుడు అశాంతిగా
        పొరులుతున్నాడు నిద్రపట్టక
జీవితం ప్రశ్నిస్తోంది ఎదురు తిరిగి
        ఆత్మ నసుగుతోంది జవాబుతట్టక.



# తుపాను : ప్రజాప్రతినిధుల బాధ్యత

రావెళ్ల హనుమంతరావు

మద్రాసు రాష్ట్ర రెవిన్యూ మంత్రి శ్రీ సీతారామరెడ్డిగారు లెజిస్లేటివ్ కౌన్సిలు సమావేశంలో తుపాను బాధితులకు ప్రభుత్వం చేస్తున్న సాధ్యమైన సహాయాన్ని గూర్చి ప్రకటించారు.

తుపాను పీడిత జిల్లాలలో ప్రజలకు ఆహారం సప్లయి లేదనే విమర్శకు వారీవిధంగా సమాధానం చెప్పారు: నవంబరు 5-వ తేదీ నాటికి ఆయా జిల్లాలలో ప్రభుత్వం ధాన్యసేకరణ ఏజన్సీలవద్దనున్న ధాన్యం-జొన్నలు నిలవ వివరాలు క్రమపద్ధనున్నవని వారీక్రింది లెక్కలను బహిరంగపరచారు.

విశాఖపట్నంలో 6262 టన్నులు నిల్వలో వున్నవి. వారానికి 875 టన్నుల వాడకం జరుగుతుంది. గనుక 7 వారాలకు సరిపోతవి. తూర్పు గోదావరి 6111 టన్నులు నిల్వ వున్నవి. వారానికి 977 టన్నులు వాడకం. ఆరు వారాలకు సరిపోతాయి. పశ్చిమ గోదావరి నిల్వ 6194 టన్నులు. వారానికి వాడకం 846 టన్నులు. గనుక 8 వారాలకు సరిపోతాయి. కృష్ణాలోవున్న నిల్వ 4867 టన్నులు. వారానికి వాడకం 1193 టన్నులు. గనుక 4 వారాలకు సరిపోతాయి. గుంటూరులో నిల్వ 6874 టన్నులు. వారానికి వాడకం 1153 టన్నులు. గనుక 5 వారాలకు సరిపోతాయి. నెల్లూరు జిల్లాలో నిల్వ 4612 టన్నులు. వారానికి వాడకం 274 టన్నులు. గనుక 16 వారాలకు సరిపోతాయి.

ఇవి మద్రాసు రెవిన్యూ మంత్రిగారు తెలిపిన వివరాలు. ఈ లెక్కలు జూస్తే ఎవరికైనా కడుపు నిండుతుంది. తుపాను పీడితులకు ప్రభుత్వం చేస్తూన్న సహాయానికి సంతృప్తి గల్గుతుంది. అయితే ఆచరణలో జరుగుతున్న దేమిటి? నిజంగా తుపాను పీడితులకు ఈ నిల్వ ధాన్యం అందజేయబడుతూందా? క్రొత్త-పాత పంటల మధ్య నలిగిపోతూన్న నిర్భాగ్యులకు సకాలంలో సరియైన ధరలకు ఆహార పదార్థాలు లభించుచున్నాయా? ఇలా జరిగేందుకు ఎవరైనా కృషి చేస్తున్నారా? కృషి ఫలించే అవకాశంగానీ, ఆశలుగానీ కనిపించుతున్నాయా? ఏ టన్నిటికీ లేదనే సమాధానం యీ దిగువ లెక్కలవలన తెలుస్తుంది.

"కృష్ణాజిల్లా నూజవీడులో బియ్యం కొరత అత్యంత విషాదకరంగా వుంది. పేటల్లో ఒక్కొక రోజున అసలు బియ్యమే వుండటం లేదు. వున్నా బియ్యము పశువులు, గుర్రాలు తింటానికేగాని మనుష్యులు తింటానికి పనికి వచ్చేవిగావటం లేదు. ఈ బియ్యము అనేక రోగములకు, అనారోగ్యస్థితులకు కారణమౌతాయని ప్రజలు భయపడుతున్నారు. మంచి బియ్యం దొరకక నానా బాధలుపడుచున్నారు. ఆరోగ్య శాఖవారుగాని, ఆహార శాఖవారుగాని తుదకు స్థానిక పట్టణ కాంగ్రెసు వాదులుగాని ఈ విషయంలో తగిన శ్రద్ధ వహించి ప్రజల బాధలు నివారించుట చాలా అత్యవసరమని ప్రజలు అభిప్రాయపడుచున్నారు."

"కృష్ణాజిల్లా గన్నవరం తాలూకాలో పల్లె ప్రాంతాలయందు బియ్యం మానిక 1 కి రు. 1-10-0 లకు అమ్ముచున్నారు. అంటే బస్తా బియ్యం ఖరీదు దాదాపు 80 రూపాయిలన్నమాట. తినుటకు తిండిలేక బాధపడుతూన్న బీద ప్రజలు ఇంత అధికధరలు చెల్లించలేక అల్లాడిపోతున్నారు."

"గోదావరిజిల్లా నర్సాపురం తాలూకాలో రెండవపంట విత్తనాలకు పనికివచ్చే ధాన్య విత్తనాలు బస్తా 1 కి 40 రూపాయలకు అమ్ముచున్నారు."

"కృష్ణాజిల్లా బందరు సమీప ప్రాంతంలో తిండి కుపయోగించే ముతక ధాన్యం బస్తా 1 కి 30 రూపాయలు అమ్ముతూంది."

ఇలాంటివే ఇంకెన్నో వున్నాయి. అధికంగా ఆహారధాన్యాలు పండించబడే కృష్ణా-గోదావరి జిల్లాలలో డెల్టా ప్రాంతమందే పరిస్థితులు ఇంత

అధ్వాన్నంగా వుంటే మిగతా తెలుగు ప్రాంతాల మాట ప్రత్యేకంగా వ్రాయ నవసరం లేదు. ఇక నిత్యజీవితావసర వస్తువుల ధరలు మరింత అధికంగా పెరిగిపోయాయి. ప్రజల స్థితి అయోమయంగా వుంది.

మద్రాసు రెవెన్యూ మంత్రిగారు అన్ని జిల్లాల్లోనూ తమ ఏజెంట్లదగ్గర ఆహార పదార్థాలు విరివిగా నిల్వవున్నాయని, అవి ఒక్కొక్క జిల్లాకు ఆరు వారాలునుండి పదహారు వారాలు వరకు సరిపోతాయని చెప్పారు. అయినప్పుడు ఆ ఏజెంట్లు తమదగ్గర నిల్వవున్న ఆహార పదార్థాలను తక్షణమే ఎందుకు పంపకం చేయటం లేదు? తమదగ్గర నిల్వవుంటే చాలునని వారు సంతృప్తి పడుచున్నారా?

ఏది నిజమైనప్పటికీ, మరేది అబద్ధమైనప్పటికీ ప్రజలు విపరీతంగా బాధ పడుతూన్న మాట మాత్రం వాస్తవం. తిరిగి మరొక బెంగాలు కరువు ఆంధ్రావనిలో ప్రత్యక్షమై లక్షలాది ప్రజల ప్రాణాల బలి గొంటుందేమోనని బీదలు భయపడుతూన్న మాట నిజం. అసలే కార్తీక మాసం కరువుతో బాధలుపడే వ్యవసాయ కూలీల - చేతివృత్తులమీద జీవించే తదితరుల కుటుంబపోషణ దుర్భరమైన మాట నిజం.

నల్లబజారు వ్యాపారులు-మిల్లు యజమానులు యీ అవకాశాన్ని పూర్తిగా తమ కనుకూలంగా ఉపయోగించుకుంటున్నారు. ప్రజల ప్రాణాలతో చెలగాటలాడ నేర్చుకున్న వీరు వివిధవస్తువుల ధరలను, ఆహార పదార్థాల ధరను అధికంగా పెంచి లాభాలు సంపాదించ ప్రయత్నించుచున్నారు. ఇకముందు కూడా పరిస్థితు లిదేవిధంగా వుంటే ఆంధ్రదేశం అల్లకల్లోలం కాక మానదు. ఆకలి మంటలు-అంటురోగాలు అధికమౌతాయి. తిండికిమాడే ప్రజలు దోపిడీలకు-దొంగతనాలకు పూనుకుంటారు. అప్పుడు పరిస్థితులు మరింత గందరగోళంగానూ, అయోమయంగానూ వుంటాయి. ఇవన్నీ రాకుండగా చేయాలంటే ఆంధ్రదేశంలో ఉన్న అసెంబ్లీ సభ్యులు-కౌన్సిల్ సభ్యులు, మంత్రులు అందరు కూడా తక్షణమే పనికి పూనుకోవాలి. మద్రాసులోవున్న అసెంబ్లీవారందరు వరదలకు తుపానుకు దెబ్బతిన్న ప్రాంతాలకు తక్షణమే తరలి రావాలి.

మన రాష్ట్రమంత్రులు తుపాను పీడిత ప్రాంతాల సందర్శించటంలో నిర్లక్ష్యం వహించారనేది నిస్సందేహం. అసెంబ్లీ సభ్యులుకూడా తమతమ నియోజక వర్గాలలోనైనా తిరిగి పని చేయకపోవటం మరింత విచారకరమైన విషయం. ఒకరిద్దరు సభ్యులు అక్కడక్కడ రెండుమూడు రోజులు గ్రామాలవెంబడి తిరిగినప్పటికీ తరువాత నిర్మాణాత్మకంగా మాత్రం పని చేయలేదు. స్థానికంగా వుండే కాంగ్రెసు సంఘాలు, కాంగ్రెసు నాయకులు- సేవకులు కూడా యీ విషయంలో జోక్యం కల్గించుకొని పని చేయటం లేదు. ప్రజలచే యెన్నుకోబడిన పెద్దలంతా యీ పనితో తమకు సంబంధం లేనట్లుగా ప్రజల బాధానివారణ కార్యక్రమంలో పాల్గొని పని చేయవలసిన బాధ్యత తమకు లేనట్లు వూరుకొంటున్నారు. ఇందువలన ఈ కాంగ్రెసు నాయకులందరూ ప్రజల విశ్వాసాన్ని త్వరలోనే కోల్పోతారనక తప్పదు.

పరిస్థితులు శృతిమించి పోకుండగా చేయ వలసిన బాధ్యత మంత్రులపైనా- అసెంబ్లీ సభ్యులపైనా- రాష్ట్రకాంగ్రెసు నాయకులపైనా వుంది. చేతులు కాలినతరువాత ఆకులు పట్టుకుంటే ప్రయోజనం వుండబోదు. తుపాను పీడితులను ఉద్యోగులే తగు సహాయం చేస్తారనుకుంటే, ప్రభుత్వ యేజెంట్లే సక్రమంగా ఆహార పదార్థాలు పంపకం చేస్తారనుకుంటే, అది కేవలం అవివేకం.

ఇప్పుడు అసెంబ్లీ సభ్యుల- కౌన్సిల్ మెంబర్ల మంత్రుల కర్తవ్యము మద్రాసు మీటింగు హాల్లో కూర్చుని తుపానును గూర్చి వాదోపవాదాలు చేయడంగాదు. ఎందరు మనుష్యులు చనిపోయారు? ఎన్ని ఇళ్ళు పడిపోయాయి? ఎంత పంట నష్టమైంది? లెక్కలు తయారు చేస్తూ ఒకరు చెప్పినదాన్ని మరొకరు కాదని విమర్శించుకోవటం గాదు. ఈ విధంగా వాదోపవాదాలతో కాలము గడిపేది ప్రజాసేవకులు కాదని తెలుసుకోవాలి.




సంపుటి 2. సంచిక 18.
శుక్రవారం, డిసెంబరు 2, 1949

# దాగుడు ముచ్చిలు

కొనకళ్ల వెంకటరత్నం

తెలుగు విశ్వవిద్యాలయ
గ్రంథాలయము
నమోదు సంఖ్య..........
తేది..........

ఘుమఘుమలను మీటే
గాలి మెరచేలు దాటి
కోరికతో వస్తే నను
గోష పెట్టబోకురా
    ఏడ దాగున్నావోయీ దొరా
            నీ
    జాడ తెలిసెలేవోయీ కదలిరా

తెరచాప యిసుకల్లో
తేలిపోతున్నాయి
తెడ్డ గలగలలా నీ
తేట నవ్వు కిలాకిలా
    మల్లెపూవులా చిటుకని విరిసిపో
    మంచుబొట్టులా తళుక్కుని మెరిసిపో

కోరతలపొగల్లో
నుచ్చు మెదిలేను సుమీ
దొరపుగాకు ఎన్నెల్లో
దోబూచాడే దొరా
    ఆడిపిలురాయని కాపటి పొంచెరా
    వడిసెల యేటూరకే తిసేవురా

ఏటికెల్లి పొదమాటున
ఈ తాలం మోగినావో
వొద్దోయి అన్నికాలు
పూబులి 'తు నీట్లో
    చెదిరిన కౌలి చంద్రవంక నీడలా
            మాదు
    చెదరని పున్నమి నవ్వులు చిలికేగా

# తెలుగు స్వతంత్ర

సంపుటి-2
సంచిక-18

డిసెంబరు 2, 1949

ప్రచురణ:
ప్రతి శుక్రవారం


# కొత్త సంస్థానాధిపతులు

**కేం**ద్రప్రభుత్వపు హోంశాఖ ఆంధ్ర రాష్ట్ర నిర్మాణం విషయంలో తీసుకోవలసిన చర్యలను శ్రద్ధగా పరిశీలిస్తున్నదని ఢిల్లీ నుండి వార్తలు. విభజన కార్యక్రమం గాని, విలీనం చేసే కార్యక్రమం గాని హోంశాఖకు కొత్త గాదు. అతఃపూర్వం సింధు, ఒరిస్సా రాష్ట్రాల నిర్మాణంలో అవలంబింపబడిన విధానం అటుంచి, స్వాతంత్ర్యం వచ్చే సమయంలో దేశంతోపాటు పంజాబు, బెంగాలు రాష్ట్రాలు సైతం విభజింపబడ్డాయి. అది కాక, సుమారు అయిదువందల ఆరవై సంస్థానాలను చెరిపివేసి సమాఖ్యలగా తిరిగి నిర్మించడంలోని అనుభవం హోంశాఖకుఉండనే ఉన్నది. అందువల్ల, ఆంధ్రరాష్ట్ర నిర్మాణంలో హోంశాఖ క్లిష్టతర సమస్యలను సాధించ వలసిన అవుసరం లేదు. కాలహరణాని కేమీ కారణాలు లేవు.

కాని, అటువంటి కారణాలు లేవన్న నిర్వేదం వల్లనే కాబోలు, కొందరు తమిళనాయకులా లోపాన్ని పూరించడానికి ప్రయత్నిస్తున్నారు. శ్రీయుత కామరాజనాడార్ యిటీవల ఒక ప్రకటన చేస్తూ, రాబోయే ఆంధ్ర రాష్ట్ర ప్రభుత్వం తాత్కాలికంగానైనా మద్రాసులో ఉంచడానికి వీలులేదనీ, ఆంధ్ర నాయకులంతా కలిసి వెంటనే తమ రాజధానీ నగరం నిర్ణయించుకోవాలనీ, అధికారయుతంగా సూచించారు. ఆ ప్రకటనలోనే, ఆంధ్ర జిల్లాలను వేరుచేశాకనైనా మద్రాసు ఒక్క తమిళులకు మాత్రమే రాజధాని అనుకోవడం అపోహ అనీ, తక్కిన సమష్టి వర్గాల వారందరికీ అది రాజధాని అనీ,అన్నారు. అయితే, ఆంధ్రుల ప్రభుత్వం తాత్కాలికంగా నైనా మద్రాసులో ఉండాలా, కూడదా అన్న విషయంలో తుది తీర్పు నిచ్చేఅధికారం వీరికెలాసంక్రమించిందో ఎవరికీ బోధపడదు. నిన్న మొన్నటి వరకూ, ఆంధ్రులూ తమిళులూ సోదరులవలె, పరస్పర సౌహార్దంతో విడిపోవాలని గంభీరోపన్యాసాలిచ్చిన తమిళ నాయకులుతమవంతు సుహృద్భావాన్ని నేడీరీతిగా ప్రదర్శిస్తున్నారు. ఆంధ్రనాయకులంతా ఏకమై, ముఖ్యపట్టణం నిర్ణయించుకున్న ఉత్తరక్షణం ఒక రాజధాని నగరం గాలిలో ఉద్భవించబోదు. రాష్ట్రప్రభుత్వం మద్రాసులోనే ఉండితీరాలన్న మొండిపట్టుదల ఆంధ్రులకు లేదు: వాళ్ళెలాగూ మద్రాసుపై తమ హక్కు వదులుకున్నారు. నూతన రాష్ట్ర

ప్రభుత్వంఏర్పడి శాస్త్ర ఊపిరి పీల్చగలిగే వరకూ, ఆంధ్రప్రభుత్వం మద్రాసులో ఉండడం తప్పని సరి. ఆ విషయం తమిళ నాయకులకూ తెలుసు. అయినా వారు ఉపన్యాసాలలో అదే పల్లవి పునశ్చరణ చేస్తున్నారు. అసంభవమైన అటువంటి షరతులు ప్రచారం చెయ్యడంలో వారి ఉద్దేశం ఏమిటో ఆంధ్రులకు తేటతెల్లమే: తాత్కాలికంగానైనా మద్రాసు ఆంధ్రుల రాజధాని అవడానికి అంగీకరిస్తే, తమిళులు భీష్మించినట్లు మద్రాసు తమిళుల కాణాచి కాదనీ, బొంబాయి ఢిల్లీలవలె అది భారతీయు లందరికీ చెందిన పట్టణమనీ, నిరూపింప బడుతుందని వారి భయం. నిరంతర ప్రచారం వల్ల అసత్యమైనా సత్యమని ప్రజలు నమ్ముతారనేది ఫాసిస్టుల, తదితర నిరంకుశుల సూత్రం. తమిళనాయకులు ఆ సూత్రాన్నే అమలులో పెడుతున్నట్టు గోచరిస్తున్నది. ఈ విషయంలో కేంద్ర ప్రభుత్వం యింతవరకూ ప్రదర్శించిన వైఖరి తమిళనాయకుల ప్రవర్తనకు దోహదం కలుగజేసింది. ఇకనైనా కేంద్రప్రభుత్వం విభ్రాంతులు విడనాడి, తన ఉనికిని విస్పష్టంగా తెలియ చెయ్యడం అవసరం.

అపురూపమైన ఆంధ్రరాష్ట్ర సమస్యలో, శ్రీయుత కామరాజ నాడార్ వంటివారు చేస్తున్న సహాయం, ప్రదర్శిస్తున్న సుహృద్భావం యీ రీతిగా ఉన్నది. ఇక రాష్ట్రప్రభుత్వ వైఖరి. కేంద్రప్రభుత్వం సూచించిన ప్రకారం, రాష్ట్రవిభజనకై నియమింపబడ నున్న సంఘం ఎప్పుడు పని ప్రారంభిస్తుందో, ఎంతకాలంలో పని ముగిస్తుందో, నిర్ణయించడం కష్టమట. ఈ విషయంలో కేంద్రప్రభుత్వం ఏదీ గడువు నిర్ణయించలేదట. అంతమాత్రాన, సుమారుగా ఆ సంఘం తన పని ఎంత కాలంలో ముగిస్తుందో నిర్ణయించడం రాష్ట్రప్రభుత్వానికి అసంభవం కాదే! నిర్ణీతమైన గడువంటే కేంద్రప్రభుత్వం నిర్ణయించలేదు గాని, "వెంటనే" ఆంధ్ర రాష్ట్రనిర్మాణం, జరగాలని నిశ్చయించినదే! ఎలాగూ ఆంధ్రరాష్ట్ర నిర్మాణం తప్పదు. పోగా, తమిళనాయకులు గాని, రాష్ట్రప్రభుత్వాలు గాని, చెయ్యగలిగిందంతా కాలహరణం మాత్రమే. ఒక ప్రక్క పండిత నెహ్రూ, సర్దార్ పటేల్ వంటి నాయకులు అందర్నీ యావద్భారత దృష్టి నలవరుచుకోమని ప్రబోధిస్తున్నారు. ఇంకోపక్క ఛోటానాయకు లీవిధంగా అంతర-రాష్ట్ర వైషమ్యాలకు యింధనాలు చేరుస్తున్నారు. సూక్ష్మంగా పరిశీలిస్తే, కొత్త రాజ్యాంగ చట్టంలో కేంద్రప్రభుత్వానికి మితిమీరిన అధికారం ఉన్నదనే విమర్శ నిరాధారమైనది అని రుజువు అవడమే కాక, బలీయమైన కేంద్రం దేశ క్షేమానికి ఎంత అవుసరమో బోధపడకమానదు. సంస్థానాధీశులు సైతం కాలప్రభావాన్ని గుర్తించి, లొంగుబాటుకు వచ్చారు. కాని, రాష్ట్రాల్లోని నాయకులు నూతనంగా సంక్రమించిన పదవీవ్యామోహంలో తామే సంస్థానాధీశ్వరులైనట్లూ, రాష్ట్రాలు తమ రాజ్యాలైనట్లూ కలలు కంటున్నట్లున్నది. వీరి మధుర స్వప్నాలలో గర్భితమైయున్న ప్రమాదాన్ని పండిత నెహ్రూవంటి నాయకులెంత త్వరగా గుర్తిస్తే అంత మంచిది.

# తుపాను తరవాత: వర్తకుల వైఖరి

చాగంటి కపాలేశ్వరరావు

తుపాను వచ్చేముందే అన్ని వస్తువుల మూల్యాలు ఎంతో అధికంగా వుండి సామాన్య, మధ్యతరగతి కుటుంబాలకు ఎంతో భారంగా వుండేవి. తుపాను వచ్చింది. అసలే క్షుద్బాధతో క్రుంగిపోతున్న ప్రజానీకాన్ని ఉండేందుకు గూడుకూడా లేకుండా చేసింది. ఎంతోమంది యిళ్ళు పోయినవారు నాలుగయిదు రోజులు ఏ పిల్లల బడిలోనో సత్రంలోనో తల దాచుకున్నారు. ఇట్లాంటి దౌర్భాగ్య స్థితిలో వున్నవారికి ప్రభుత్వం చేసిన తిండి సదుపాయాలు చాలా అసంతృప్తికరంగా వున్నాయని అందరం విచారించాం. సరే పోనీ ప్రభుత్వం ఎన్నింటికని తంటాలు పడుతుంది, ఎన్ని చోట్లని శ్రద్ధవహిస్తుంది, అనుకుందాం. బాధ పడ్డవారికి సహాయం చేసే బాధ్యత తోటిమానవులకుకూడా వుంది. వీరుకూడా కొంతవరకూ తాము చేయగలిగిన సహాయం చేశారని ఒప్పుకోక తప్పదు. ఇంక వ్యాపారం చేసే తెగవారు తుపాను బాధితులకు సానుభూతిగా తమతమ దుకాణాలన్నీ మూసివేసారు. వారికి వుండే అసలు భయం గాలి వానలకు దుకాణం లోపలి సరుకులు పాడవుతాయని మనం అనుకోవచ్చు. కాని అది పొరపాటు. ఇంకా కొంతమంది మరీ జాలికలిగిన వర్తకులు బియ్యం వగైరా ముఖ్యావసరమైన ఆహార పదార్థాలను తుపాను బాధితులు తల దాచుకున్న చోటికి అత్యంత శ్రమకోర్చి చేరవేసి బాధితులకు ఆ సామానులన్నింటినీ అతి ఉదారస్వభావంతో రెట్టింపు, నాలుగురెట్లు మాత్రమే ధరలను ఎక్కువచేసి అమ్మారు. కాని భయంకరంగా తుపాను భీభత్సం చేసేస్తుంటే ఎవరండీ అంత చౌకవగా అన్నింటినీ కాదని ప్రాణానికికూడా తెగించి, తన సరుకుల్ని ఎక్కువ ధరలకైతేనేం గాక అమ్ముకురాగలరు? విధవ దబ్బు ఈవాళ గాకపోతే రేపు సంపాదిస్తారు. ఎప్పటికీ వాళ్ళచేతుల్లో వున్నపనే గాబట్టి.

సరే, తుపాను పూర్తిగా శాంతించింది. ఈ సత్రవులు స్కూళ్లు ఆధారంగా చేసుకున్న దీనులంతా తమతమ స్థలాలకు తిరిగి పోయారు. మళ్లీ కొందరు ఏదోవిధంగా నిలవనీసుకున్నారు. తమ నిత్యకృత్యాల్లో యథావిధిగా నిమగ్నులైయారు. జరిగినదానికి కూర్చుని విచారిస్తే విచారమే మిగుల్తుంది గాని కడుపు నిండదు. కష్టపడితేనే గదా డొక్కాడాలి. మళ్ళీ మామూలుగా బజారుకు వెళ్లి సరుకులు కొనాలని చూస్తే వారి ఆశ్చర్యానికి అంతులేదు. తుపాను యింకా తగ్గీ తగ్గకుండానే బజారు ధరలన్నీ కూడా విపరీతపు మార్పును పొందాయి. చింతపండు అంతకు బహు కొద్దిరోజులు ముందుగానే వీశ ఒకటికి పన్నెండు అణాలకు లభించేది ఒక్కసారి ఒక రూపాయి పన్నెండణాలు అయి కూచుంది. బియ్యం కంట్రోలు ధర కుంచం ఒక రూపాయి తొమ్మిదణాలు అలా వుంచి 3 రూపాయలు తక్కువగా ఏ కోశానా లేవు. బెల్లం 1-12-0. మిరపకాయలు 6 రూపాయలు. ఆహాహా! ఎట్లాంటి రోజులు. ప్రకృతి తుపాను యీ మార్కెట్టుతుపాను కంటే ఏమంత ఎక్కువయినది?

ఇదంతా ఏమిటి? ఎందుకిలా విపరీతంగా ధరలు పెంచాల్సిన అగత్యం ఏర్పడింది? వర్తకులకు తుపాను వల్ల ఏ కొంచెమైనా నష్టం కలిగి వుంటే ఆ నష్టాన్ని తమ సరకుల ధరలు అంత విపరీతంగా పెంచి భర్తీ చేయాలనుకుంటే అంతకంటె తమ సర్వస్వాన్ని పోగొట్టుకొని, చేసులు చాలిన సామాన్యప్రజలు ఏ విధంగా ఇచ్చుకోగలరు? ఈ విషయాలు ఆలోచిద్దాం.

గాలికి బాగా మిరపతోటలన్నీ పోయుంటాయని ఊహించి మిరపకాయల ధర పెరిగిందా? వచ్చే ఏడాది ధాన్యం దిగుబడి తక్కువగా వుంటుందని బియ్యం ఖరీదు ఇన్ను

ట్నుంచీ ఎక్కువ చేయాలా? చెఱకు తోటలన్నీ పోవటమే గాకుండా, యీ తుపాను హడావుడి మూలంగా పంచదార పంపకం సరిగ్గా జరగదని తమ చేతుల్లోవున్న పంచదారను రెట్టింపుపైగా చేసి అమ్ముతూ పైగా బెల్లాన్ని కూడా పంచదార నల్లబజారు ధరలో సమానంగా అమ్మాలా? చింత చెట్లన్నీ నాశనమయ్యాయి, యికముందు చింతపండు అరుదవుతుంది గాబట్టి చింతపండు ధర 1—10—0 వరకూ పెంచారా? ఈవిధమైన దౌర్జన్యానికి ఏ ఆర్థిక శాస్త్రంలోని సూత్రాలు దారి చూపెట్టాయి? దీనిని అరికట్టే సాధనం ఏమీలేదా? ఇలా మండిపోతున్నాయి మధ్యతరగతి ప్రజల హృదయాలు.

దీనికంతటికీ కారణభూతులైనవారే వ్యాపారస్థులు. నేటి వ్యాపార సంస్థకు సరియైన నిర్వచనం ఏమిటంటే పరిస్థితుల సహాయంతో ఉచ్ఛనీచం అనే తారతమ్యం పాటించకుండా యిష్టంవచ్చినట్లు దోపిడీ సాగించే మూక. ఈ సంస్థలో వారందరికీ తుపాను రాగానే ఎంత దూరదృష్టి కలిగిందో చూడండి. వచ్చేసంవత్సరంలోనూ వచ్చే కొంత కాలంవరకూ కూడానూ, సామాన్యంగా మానవుల కందరికీ నిత్యావసరాలైన వస్తువులు అన్నీ చాలాతక్కువగా లభించి ప్రజల కందుబాటులో వుండవని ప్రతీ వస్తువునీ యిప్పట్నుంచీ సామాన్య మానవుడి కెవడికీ అందుబాటులో లేని ధరలు నిర్ణయించారు. ఈ సామాన్య ప్రజలు యిప్పట్నుంచీ అంత ధరా పెట్టి కొనలేక ఆకలితో చచ్చినాకూడా, వచ్చే సంవత్సరం పై తరగతులవారి కేమీ లోటు రాకుండా వుంటేచాలు. ఇట్లా వుంటుంది ఈ వర్తకుల దృష్టి. వీరికి తమతోటి మానవులయెడల తమతమ విధులేమీ గుర్తుండవు. వీరిదృష్టి ఎల్లప్పుడూ అత్యధికంగా లాభం సంపాదించటం మీదనేవుంటుంది. ఈ కార్యసాధనలో ఎంతమంది జీవితాలైనా నశించనీయండి, వారి శవాలమీద నుంచైనా నడిచి తమ గమ్యస్థానం చేరుకుంటారు. చిన్నా, పెద్ద, ఉచ్ఛనీచం న్యాయంఅన్యాయం యీ తారతమ్యాలు పాటించరు.

తుపానువల్ల బాధపడినవారిని తుపాను బాధితులంటే ఈ వర్తకులవల్ల బాధపడినవారిని ఏ పేరుతో పిలవాలి? వీరికి కల్గిన నష్టాన్ని అంచనా వేయటం ఎలా వీలవుతుంది? ఆ నష్టం ఎంత ఎక్కువైనాసరే బాధితులకు ఎవరైనా పరిహారం యిస్తారా? ఈ ప్రశ్నలకు సమాధానం ప్రభుత్వం యివ్వగలదా?

తోటిమానవుడియొక్క జీవితాన్ని యిలా వుపయోగిస్తూ వాని దీనస్థితిని తన ఔన్నత్యం కోసం వాని కష్టాల్ని తన సౌఖ్యంకోసం నష్టాల్ని తన లాభంకోసం, పతనాన్ని తన అభ్యుదయం కోసం ఉపయోగించుకుంటూండే యీ వ్యాపార సంస్థయొక్క దౌష్ట్యాన్ని అరికట్టే వుపాయం ప్రభుత్వానికి తెలిసుండీ ఎందుకు అమలు జరపటం లేదు? యిలా సామాన్యప్రజ బాధపడటం ప్రభుత్వానికిష్టమా అంటే అదీలేదు. ప్రతి ప్రభుత్వోద్యోగీ మంత్రీ ఎప్పటికప్పుడు ప్రజలకు ఎక్కడాలోటు లేకుండా వారిమీద తమకుండే అత్యధికశ్రద్ధనూ వారి కష్టాలను ఎప్పటికప్పుడు పోగొట్టేయటంలో తమకుండే ఆతురతను, వ్యక్తపరుస్తూనేవున్నారు. ఈ ధరల ముమ్మరాన్ని ఎందుకు అరికట్టటం లేదు? చివరికి మన ఆర్థికస్థితి చైనాదేశంలా తయారవ్వాల్సిన రోజొస్తుందా? మన రూపాయలు బిళ్ళపెంకుల విలువను పొందుతాయా? అని ప్రతిమనిషీ యిప్పట్నుంచీ భయపడాల్సి వస్తోంది.

యుద్ధం మూలంగా ధరలు హెచ్చవుతున్నాయి, తుపాను మూలంగా ధరలు హెచ్చవుతున్నాయి. ప్రజల్ని ఒకవైపునుంచి ప్రకృతి ఎదుర్కొని హింసిస్తూంటే యింకోవేపు నుంచి, ప్రజల్లోనే ఒక భాగంగా వుంటూ వారికే అధోగతి పాలుచేసే యీ వర్తకసంస్థ ఎదుర్కొంటోంది. ఈ ఇరువైపుల దాడినీ ఎదుర్కొని ఓడించి సామాన్య మానవుడు ఎప్పుడైనా పైకి రాగలడా?



# సోవియట్ వర్ణచిత్రాలు

పి. వెంకటేశ్వరరావు

మద్రాసు నగరంలో కొద్ది రోజులనుండి "నయా తాలీమ్" (నూతన విద్య), "ట్రయంఫ్ - ఆఫ్ - యూత్" (యువజన విజయము), "పత్థర్-కా-ఫూల్" (రాతిపూలు), "ఫెస్టివల్ - ఆఫ్ - యూత్ (యువజనోత్సవాలు) - అనే నాలుగు చిత్రాలు ప్రదర్శింపబడుతున్నాయి. "ట్రయంఫ్ - ఆఫ్ - యూత్", "ఫెస్టివల్-ఆఫ్-యూత్"-రెండూ వార్తా చిత్రాలు. "నయా తాలీమ్" తప్ప మిగతా వన్నీ వర్ణ-చిత్రాలు.

ఈ మధ్యనే సోవియటు రష్యానుంచి మన దేశానికి ప్రదర్శనకోసం పంపబడి, మన సెన్సారు బోర్డువారి వడపోతలోనుంచి తప్పించుకొని బయటపడ్డ సోవియటు చిత్రాల్లో పై నాలుగూ కొన్ని. క్రిందటి ప్రపంచయుద్ధంలో రష్యన్ ప్రజల ఫాసిస్టు వ్యతిరేక పోరాటాన్ని చిత్రించే "జోయా" అనే చిత్రం, మరికొన్ని చిత్రాలూ సెన్సారు బోర్డువారి కత్తెరకు గురి అయినాయి. అది మన దురదృష్టం. నగ్న నృత్యాలతోనూ, కామోద్రేక ప్రేమ గాథలతోనూ, భయానక హత్యానేరాపరాధాలతోనూ నిండివుండి, ప్రేక్షకుల్లో విజ్ఞానాన్ని బదులు కామోద్రేకాన్ని, నైతికపతనాన్ని తెచ్చిపెట్టే హాలీవుడ్ చిత్రాల్ని చూచిచూచి విసిగి వేసారిన, భారతీయ ప్రేక్షకులకు శరత్కాలపు వెన్నెలలా వున్నాయి, ఈ సోవియటు చిత్రాలు.

"నయా తాలీమ్" అనే చిత్రం వెనకబడి యున్న ఒక రష్యన్ జాతి ప్రజల్ని విద్యావంతులనుగా చేయటానికి, ఉన్నతాదర్శాలు కల్గిన ఒక స్త్రీ చేసిన కృషిని అద్భుతంగా చిత్రిస్తూ వుంది. ఆ స్త్రీ సంపన్నకుటుంబంలో జన్మించింది. ఉన్నతవిద్యను అభ్యసించింది. ఉన్నతాదర్శాలు గల ఒక యువకుణ్ని ప్రేమించింది. కాని ప్రజాసేవయే పరమావధిగా పెట్టుకుని, పట్టణజీవితాన్ని వదలి, గ్రామీణ జీవితాన్ని మనసారా స్వీకరించింది. అవి రష్యాలో జారు ప్రభుత్వపు రోజులు. ఆ గ్రామంలో సామాన్య ప్రజలు విద్యావిహీనులై పశుతుల్యులుగా వున్నారు. ధనవంతులకే భాగ్యభోగాలూ, విశ్వవిద్యాలయాల్లో ఉన్నతవిద్య నభ్యసించే అవకాశం. పేదకుటుంబంలోనుంచి వచ్చినవాడు ఎంత ప్రతిభావంతుడైనా ఉన్నత విద్యాలయాల్లో ప్రవేశించటానికి అర్హత లేదు. సామాన్య ప్రజల్లో విద్యావిహీనతకు తోడు తాగుడు మొదలైన దురభ్యాసాలు. స్త్రీకి స్వాతంత్ర్యం లేదు. తప్పతాగిన భర్తలు భార్యల్ని తిట్టటం, కొట్టటం, నానాహింసలూ పెట్టటం సర్వసామాన్యం. ఒకవైపున కూలినాలి చేసుకునే సామాన్యప్రజలు ఇలా వుంటే, మరొకవైపున ధనవంతులు ధనమదాంధులై, భాగ్యభోగాలు అనుభవిస్తూ, తప్పతాగి సామాన్య ప్రజల్ని నానాహింసలూ పెడుతూ వుండేవారు. ఇటువంటి పరిస్థితుల్లో సామాన్య ప్రజల బిడ్డల్ని విద్యావంతులనుగా చేయటానికి పూనుకుంది ఆ స్త్రీ. విద్య చెప్పటానికి కావలసిన విద్యాలయం లేదు. బల్లలు,కుర్చీలు లేవు పుస్తకాలు లేవు. పైగా ధనవంతులవ్యతిరేకత. ఈ పరిస్థితులలో వీరోచితంగా పోరాడి, అష్టకష్టాలు పడి, సామాన్య ప్రజల సహకారాన్ని సంపాదించి, విద్యాబోధన ప్రారంభించింది. స్వయంకృషి వల్ల కొందరు పిల్లలను విద్యావంతులనుగా చేసింది. 1917 విప్లవానంతరం రష్యాలో పరిస్థితులు మారాయి, సోవియటు ప్రభుత్వం వెనుకబడివున్న జాతుల ఉద్ధరణకు పూనుకుంది. ఆ స్త్రీకి అన్ని అవకాశాలూ లభించాయి, ఆ గ్రామంలో పాత విద్యాలయంస్థానే ఒక దివ్యభవనం వెలిసింది. ప్రాథమిక పాఠశాల ఉన్నత కళాశాలగా మారింది. ఇంజనీరింగు మొదలైన సాంకేతిక విద్యలు ప్రవేశపెట్టబడ్డాయి. ఆమె కృషి ఫలించింది. తనవద్ద విద్య నభ్యసించిన విద్యార్థులు,

విశ్వవిద్యాలయాల్లో విద్య నభ్యసించి, మేధావులూ, గొప్పవారూ అయ్యారు. వెనకబడ్డ జాతి యావత్తూ సకలరంగాలలో తులతూగుతూ నవనాగరికమైంది. తాను చిన్ననాటి నుంచీ ప్రేమించి, పెండ్లిచేసుకున్న భర్త విప్లవంలో వీరోచితంగా మరణించినా, జీవితాశయం ఫలించింది.

ఈ చిత్రంలో ఛాయాగ్రహణం అద్భుతంగా వుంది. సంభాషణల్ని హిందీలో చక్కగా "డబ్" చేసారు. "డబ్" చేసిన హిందీ పాటలు కూడా రసానుగుణంగా వున్నాయి.

"పత్థర్-కా-ఫూల్" (రాతిపూలు) అనే చిత్రాన్ని ప్రశంసిస్తూ, నెహ్రూ పండితుడు "ఇది సెల్యులాయిడులో పాడిన గేయం" అన్నాడు. ఇది అద్భుతమైన కళాసృష్టి. ఫ్రాన్సులో జరిగిన అంతర్జాతీయ సినిమా ప్రదర్శనాల్లో, వర్ణ చిత్రాల్లో దీనికి ప్రథమ బహుమానం వచ్చింది. ప్రపంచ సినిమా చరిత్రలో ప్లాస్టిక్ సెట్టింగ్సు ప్రథమంగా ప్రవేశపెట్టబడ్డది ఈ చిత్రంలోనే. ప్రజాసామాన్యంలో ప్రచారంలో వుండే "[illegible] మలేలీలు" కథ వంటి కథను ఆధారంగా చేసుకొని తీయబడ్డ చిత్రం యిది. ఇది ఒక యువశిల్పి యొక్క జీవితగాథ. యువశిల్పి ప్రకృతిలోని చక్కని పూవుల్ని చూచి, తన కళాప్రజ్ఞతో వాటిని రాతిలో చిత్రించాలని బాధపడతాడు. అంతులేని కళాతృష్ణతో రాతిలో ఒక పూవును చెక్కుతాడు. అందరూ మెచ్చుకుంటారు. కాని ఆకలి తీరదు. రసపిపాస ఆరదు. అంతకన్నా అద్భుతమైన శిల్పాన్ని నిర్మించాలని యోచనపడతాడు. అతని కృషిని, అతని సౌందర్యాన్ని చూచి గాఢంగా ప్రేమించిన ఒక దేవకన్య సహాయపడుతుంది. కొండల్లో వున్న అద్భుతశిలల్ని అతనికి చూపుతుంది. అద్భుతమైన కొండరాతిలో, జగదేక సుందరమైన మరొక పెద్ద పుష్పాన్ని చెక్కుతాడు. ఈ పుష్పం అత్యద్భుత కళాసృష్టి. యువశిల్పి తృష్ణ తీరింది. పురుషుడు ప్రకృతిని జయించాడు. దేవకన్య అతని కళాప్రజ్ఞను చూచి విగ్భ్రాంతురాలై, ప్రేమించి తనతో శాశ్వతంగా వుండిపొమ్మని యువశిల్పిని ప్రాధేయపడి అడుగుతుంది. ప్రవరాఖ్యుడులా నిరాకరిస్తాడు. అనేకవిధాల భయపెట్టుతుంది. లాభం లేకపోయింది. తాను వచ్చిన పని అయిపోయింది గనుక తన భార్యవద్దకు వెళ్తానని పట్టుపడతాడు. వారిరువురి పవిత్ర ప్రేమను గ్రహించి, ఇరువుర్ని ఒకచోటకు చేర్చి వారిప్రేమను ప్రశంసించి, ఒక రత్నపేటికను బహూమానంగా యిచ్చి వారిద్దర్ని యింటికి పంపుతుంది.

ప్రకృతిలో వర్ణించనలవిగాని సంపదలూ, సౌందర్యాలూ వున్నాయనీ, ప్రకృతి సౌందర్యాల్ని ప్రతి సృష్టి చేయగలిగేది మానవశ్రమయే ననీ, మానవకృషి శ్రమలవల్లనే మానవుడు ప్రకృతిని జయించగలడనీ, ఈ కథ సారాంశం.

సాంకేతికంగా "పత్థర్-కా-ఫూల్" వంటి చిత్రాన్ని ఇంతవరకూ మనం చూచివుండం. హాలీవుడ్ చిత్రాల రంగులలాగా కళ్ళకు మిరిమిట్లు గొలిపేవిగా కాక, ఈ చిత్రంలోని రంగులు కళ్ళకు హాయి, ఆనందం, ప్రశాంతి యిస్తున్నాయి. ఇంత చక్కని రంగుల్ని ఏ హాలీవుడ్ చిత్రంలోనూ చూచి వుండమంటే అతిశయోక్తిగాదు. కొండ గృహాల్లో చూపబడ్డ ప్లాస్టిక్ సెట్టింగులు స్వయంగా చూచి ఆనందించాలేగాని, రాయటానికి శక్యంగాదు. ఈ చిత్రం చూస్తున్నంతసేపూ ఏదో కొత్త ప్రపంచంలో మనం తిరుగుతూ వున్నట్లుగా వుంటుంది.

"ట్రయంఫ్-ఆప్-యూత్", "ఫెస్టివల్-ఆప్-యూత్" (Triumph of youth & Festival of youth)—ఈ రెండూ డాక్యుమెంటరీ చిత్రాలు. 1946, 1948 సంవత్సరాల్లో, మాస్కోలో రష్యా నాయకుడు జోసెఫ్ స్టాలిన్ సమక్షంలో, రష్యాలో వివిధ జాతుల యువజనులు ప్రదర్శించిన వ్యాయామపోటీలో, ఆటల ప్రదర్శనాల చిత్రాలు ఈ రెండూ. 85 మంది ఛాయాగ్రాహకులు కృషిచేసి తీసిన అద్భుత చిత్రాలు. వేలమంది యువజనులు బారులుదీరి నడుస్తూవుంటే, ప్రదర్శనాలు చేస్తూవుంటే రక్తం ఉడుకెత్తుతుంది; వ్యాయామం మీద ఆసక్తి జనిస్తుంది. సోవియట్ ప్రభుత్వం యువజనుల వ్యాయామంఆటలకుయిస్తున్న ప్రోత్సాహం, సమష్టి కృషివలన సాధించగలిగిన అద్భుతాలు—ఈ చిత్రాలు యిస్తున్న సందేశం.

తెలంగాణా తీరుతెన్నులు

# విప్లవవాదులు ప్రదర్శించే మానవత్వం!

'భవదీయుడు'

ప్రతిసారీ నీకు హృదయవిదారకమైన విషయాలు వ్రాస్తుంటే యేమనుకుంటున్నావో యేమోకాని- నేను మాత్రం యిక్కడి పరిస్థితులను బట్టి నీకు సంతోషాన్నీ, వినోదాన్నీ కలిగించే వేవీ వ్రాయలేక పోతున్నానేమో నని విచారంగా వుంది. తోటి మానవసంతతి పెదవులపై చిరునవ్వు వొలికినప్పుడేమైనా నీవు వూహించే విధంగా వ్రాయగలుగుతానేమో! ప్రస్తుతం యితర విషయాలాలోచించేట్టే లేదు. ఒకే ఒక ముఖ్యాతి ముఖ్యమైన కార్యక్రమం- ఎలాగైనా యీ గండాలన్నీ గడిచి కొనవూపిరితోనైనా బ్రతికి బయట పడడం.

ఊపిరంటే జ్ఞాపకమొచ్చింది. మొన్న జరిగిన దుఃఖసంఘట నొకటి వివరిస్తాను.

ఏ నిమిషాన ఏ దుర్వార్త వింటామోనని జంకుతూనే వున్నాం- రానేవచ్చింది, డాక్టరు గారి హత్య.

డాక్టరుగారి విషయం నీకు తెలియంది కాదు.

అంత దూరదేశం నుంచి- ఎవరూ పట్టించుకోని మన అజ్ఞానలోకానికి సేవ చేయడానికి వచ్చిన ఆ దయార్ద్రహృదయం, తోటిమానవుని రోగాలకు తానూ బాధపడే ఆ జాలిగుండె, రాత్రంబవళ్ళనే విచక్షణ లేకుండా రోగులతో సతమతమయ్యే ఆ ఓర్పు- ఎన్నికోట్ల రూపాయలు పోసినా ఎవడి కలవడుతుంది? అసలెలా విలువ కడతాం?

ఇంకా నేనా రోజులు మరిచిపోలేదు. బహుశా నీవూ మరువలేదనే అనుకుంటాను- ఆయనగారితోపాటు కష్టమనుకోకుండా పల్లెపల్లె కాలినడకన ప్రయాణం చేస్తూ రోగుల పరీక్షించడం, ఆ పేదవాళ్ళిచ్చే కొద్దిపాటి ఆతిథ్యానికి సంతోషాన్ని వెలిబుచ్చి సంతృప్తిపడడం, బాధల కుప్పతో వచ్చే రోగులందర్నీ పరీక్షిస్తూ తియ్యటి మాత్రలు వేయటం.

అలాంటి డాక్టరుగారు సాయుధ సోదరుల సిద్ధాంతాలకు అతిదారుణంగా బలయ్యారు.

వారు- మరోప్రపంచానికి చేరి ఏమనుకుంటున్నారో, ఏమో! బహుశా యిలాగే అనుకుంటూండవచ్చు.

"మీరంతా బావుపడే సంతోషానికి నేనేం అడ్డుపడ్డాను? నేనూ మీతోపాటు సంతోషించే వ్రాత లేదా? నన్నిలా పంపేశాక మీరు శాంతిసౌఖ్యాలనుభవిస్తూ, హాయిగానే జీవిస్తున్నారనుకుంటాను. తోటిమిత్రులు సుఖపడడం కన్న నాకేం కావాలి?"

వారి హృదయం తప్పకుండా యిలాగే అనుకుంటుందని స్ఫురిస్తున్నది. ఈ 'హాసి' నన్ను కలవరపెడుతున్నది. నన్ను కత్తికోత కోస్తున్నది. నా చేతగానితనంమీద నవ్వుకుంటున్నది.

వారికి మన మేమీ ఋణం తీర్చుకోలేక పోయాము. ఇదే నేమో-మన ప్రతిఫలం! ఛీ, వెధవ బ్రతుకులయ్యాయి. ఇలా విలపించడం కూడా బూర్జువా మెంటాలిటీ అవుతుందేమో!

మన వూరుకు రెండు మైళ్ళలోనే యీ సంఘటన జరిగినా-నేను వెళ్ళే సాహసం లేకపోయిందంటే నీవు నన్ను పిరికివాడిగా అనుమానించకు. నేనుమాత్రం వెళ్ళి చేయగలిగిందేముంది? వారికి పట్టిన దుర్గతే మనుకున్నా!

వారు చేసిన నేరమేమంటే-సాయుధ పోరాటం కాకపూర్వం వారు అందరు రోగులకూ పరిచర్య చేసేవారు. పోరాటంవచ్చాక సాయుధ సోదర రోగులకు పరిచర్యచేసే భాగ్యం లేక పోయింది. (అడవుల్లో కాపురాలు పెట్టడం వల్లనే) ఇక మిగిలింది-సోదరుల హాక్యాకాందలో పూర్తి ప్రాణాలు కోల్పోక (పూర్తిగా ప్రాణంతీసే అవకాశాలు లేని సమయాలు లేక పోలేదు) సగం శిక్ష అనుభవించిన 'ప్రజాద్రోహు'లకే చేయాల్సి వచ్చింది.

ఇది సోదరులకు కిట్టదు. వారిచే హింసింప బడ్డవారు-చికిత్స లేకుండానే మగ్గుతూ చావాలనేది వారి సిద్ధాంతంలా వుంది. దానికి వ్యతిరేకించిన రోగీ, డాక్టరూ అంతా శిక్షకు పాత్రులు కావల్సిందే. ఆశిక్ష యేముంది? ఉత్తరహింసద్వారా ప్రాణాలు తీయడం (నేరానికి తగ్గ శిక్షలుండవద్దా అని యీ మధ్య ఒక పట్టుబడిన దళాధిపతి నడిగితే-మాకు నైతిక్యకుదున్నాయి! అందుకని-మా శిక్షలన్నీ చంపెయ్యడమేనని ఆశ్చర్య పడకుండా చెప్పాడంటే-నీ వేమైనా ఆశ్చర్య పడ్డా నమ్మక తప్పదు.)

ఆ విధానంగానే శిక్ష విధింపబడింది. చావుకు ముందే - కొన్ని రక్తపు లేఖలు "జాగ్రత్త! జాగ్రత్త!" అంటూ వార్నింగిచ్చాయి. వెంటనే వారిని నేను రక్షణ క్యాంపుకు రమ్మని బ్రతిమాలాను- నేను రాను- వాళ్లేదో హాస్యానికలా వార్నింగులిస్తున్నారని-న్యాయంగా వాళ్లకు నే చేసిన అన్యాయ మేముందన్నారు. నేను నిర్లక్ష్యం పనికిరాదని హెచ్చరించి నప్పటికీ-అః! అంత భయపడి మాత్రం ఎలా బ్రతికేదుస్తున్నాం గనుక, మిగతా ప్రజలంతా లేరా? అని మొండిగా వాదించడం మొదలెట్టారు. ఈ విషయంలో మాత్రం వారితో నేను సహకరించ లేకపోయినందుకు చింతిస్తున్నాను.

సరే- యిక సోదరులు అన్నంతపనీ చేశారు. ఇంక- ఎంత క్రూరంగా చంపేశారంటే చెప్ప లేను. ఘోరం! ముందు- పడుకోబెట్టి, నోరు మూసి; ఒకరు పీకపై కూర్చున్నారట. మరొకరు మర్మావయవాలు చిదకబొడిచారట. ముందొక చెయ్యి, తర్వాత మరో చెయ్యి, కాలు యిలా నెమ్మది నెమ్మదిగా వూపిసి తీశారట. తర్వాత శవాన్ని గాట్లుగాట్లుగా పొడిచారట. ప్రజలంతా ఏడుస్తూ అడ్డుపడ్డారట కాని- యిద్దరు వాలంటీర్లు తుపాకులతో ఆపుచేశారట. ఏం చేస్తారు- నిరాయుధులు? ఏడిచారు; మొత్తుకున్నారు; అరిచారు. కొందరేమో దృశ్యాన్ని చూడలేక వెళ్ళిపోయ్యారట. మరికొందరు భయపడి.

ఇలా వుంది- మన నాగరికతా ప్రపంచం! మానవత్వమనీ, నీతి అనీ ఘోష పెట్టే నీవిది నమ్మలేక, ఇదేదో డిటెక్టివ్ నవల చదువుతున్నట్టు ఊరుకున్నావంటే; మాత్రం యిక నీవు పూర్వ లోకంలో కళ్లు మూసుకొని విహరిస్తున్నట్టూ, వాస్తవికతను కించిత్తయినా గుర్తించడానికి ప్రయత్నించనట్టే అంచనా వేసుకోవాలి. అంతకూ నీకేమైనా అతిశయోక్తులని ఆశ్చర్యమేస్తే ఒకసారి యిటు వచ్చి నిష్పాక్షికంగా విచారించి, నా వ్రాతలపై అభిప్రాయాన్ని మార్చుకో. అసలు నేనంటాను- యథార్థాలన్నీ చెప్పే ఓపికా, వ్రాసే భాషా, వర్ణించే శక్తి నావద్ద లేవేమో!

ఒకసారి మృత్యువంతటిదే దయ దలిచి డాక్టరుగారి ప్రాణాన్ని కాపాడింది. కాని-మన సోదరులు దాని మృత్యువును కూడా బలవంతంగా రప్పించారు. దయాదాక్షిణ్యాలు లేకుండా. ఆ సంఘటన వివరించాలంటే ఏడుపే వస్తుంది (ఇది ఏడుపో, నవ్వో తేల్చుకోలేని రోజులు.)

ఆమధ్య డాక్టరుగారికి ప్రమాదకరమైన జబ్బు చేసినట్టు నీకు వ్రాశాను. గుర్తుందనుకుంటా. అప్పుడు బ్రతుకుతారనే ఆశ లేకపోయింది. ఆ పరిస్థితుల్లో ఒకరోజు నేనూ, మరికొందరు మిత్రులం ఆయనగారి మంచంపై కూర్చున్నాం. మాకు దిక్కుమొహాలు పడ్డాయి. ఫెళ్ళున ఏడుపు కట్టలు తెంచుకొని రాబోయే స్థితి. డాక్టరుగారు నన్ను దగ్గరికి చేర్చుకొని, మొహంలో మొహం పెట్టుకొన్నారు. అప్పటిదాకా వారి మొహంలో చిరునవ్వు మాయంకాలేదింకా. కాబోతున్నది.

"మిత్రమా! ఏడుస్తున్నావా? ఛీ! తప్పు కాదూ! ఎందుకూ? ఎప్పటికైనా అందరికీ మృత్యువు తప్పనిసరి. ఇతరులకోసం దుఃఖిస్తూ మనసును మరికాస్త కష్టాలపాలు చేసుకోక, ఎప్పటికప్పుడు కష్టాలను మరిచిపో. ఉన్న జీవితంలోనే సంతృప్తికరం, సుఖవంతం చేసుకో...

"నే నెలాగైనా బ్రతకను. ఆ ఆశ ఎలాగూ లేదు." అని అంటూ మరీ విచారంగా-

"నేను చచ్చిపోతున్నానని ఏమీ విచారం పడటం లేదుగాని మిత్రమా! మిమ్మల్నందరినీ వదిలి పోవలసి వచ్చినందుకు విచార మేస్తోంది. ఎలాగైనా, ఎందుకోగాని, యీ బాధల్లోకూడా యింకా బ్రతకాలనే అనిపిస్తున్నదోయ్!" అని

ఒక్కసారే పటపటా నీరు కారిస్తే నా హృదయమిక పట్టలేక అక్కడ్నుంచి వెళ్ళిపోయి ఒకటే ఏడుపేడిచాను కొన్నాళ్లు. నే నాదృశ్యాన్ని వాక్యాలనూ ఎన్నటికీ మరువలేకుండా వున్నాను.

సరే. అదృష్టవశాత్తూ డాక్టరుగారు అప్పుడు బ్రతికారు. ఒకసారి మృత్యువంతటిది కూడా వారిమీద దయదలచి వదిలిపెట్టింది. కాని-మన సోదరులు మాత్రం వదిలిపెట్టలేదు.

ప్రాణమంటే మానవుడి కెంత తీపో, చచ్చిపోతూ కూడా దానికోసం ఎంత తహతహలాడ్తాడో పై వాస్తవసంఘటన ద్వారా విశదమవుతుందనుకుంటా.

డాక్టరుగారు చనిపోయ్యారంటే వారితో కలసిమెలసి తిరిగిన రోజులకంటే వారి చివరి వాక్యం నన్ను ఎంతగా నలిపేస్తున్నదో చెప్పే శక్తి నాకు లేనట్టుంది.

అబ్బ! మానవుడు ఎన్ని కష్టాల్లో కూడా యింకా బ్రతకాలనే ఆశ, తహతహ, వెనుగులాట... ఇవన్నీ మనవాళ్ళ శిక్షల క్రింద రద్దు!

మనవాళ్ళు యీ విలువైన ప్రాణాలను అంత తేలికగా ఎలా తీయగలుగుతున్నారో, ఆ కిటుకేమిటో నాకంతు పట్టకుండా వుంది.

ప్రాణాలు తీసే సరదా వున్నవాడు-ముందుగా ప్రాణాలు పోసే యంత్రాన్ని కనిపెట్టి, తర్వాత మన యిష్టమొచ్చినన్ని తీయడం, మళ్లీ బ్రతికించడం కానీ అటయితే భలే సరదాగా వుంటుందనుకుంటాను. నా అనుమానాలు వారి కక్కర్లేదని తెలుసుగాని-తీసే ప్రాణాలేమిటో తావ్వర తీసేస్తే గుడ్డిలో మెల్లగా వుంటుందని సలహా యిద్దామంటే ఎవరూ కలవరు. కలిస్తే-సలహాలిచ్చేదాకా మన ప్రాణాలు...

ఈ విషయాలన్నీ మీకు అసహ్యాన్ని, విసుగునూ కలిగించడంలేదు కదా అని భయపడుతున్నాను. ఓపికతో వింటున్నావని ఆవేదనను వెళ్ళబోసుకుంటున్నాను. ఎంతవరకు రుచిస్తుందో మరి-యీ సోది!

మనం మురుస్తూ, లొట్టలు వేస్తూ గర్వించే ప్రపంచంలోని విషయాలే-యివి. నేను కోప్పడ్తున్నాననుకోకు. సిగ్గుపడుతున్నాను; జాలి పడుతున్నానంతే.


## మీ పసిబిడ్డలకు ఆయురభివృద్ధి కలిగించండి



పిల్లల లివర్, స్లీపను వ్యాధులందు, వ్యాధి ముదిరి కుదురుట కష్టము అని నిరాశకైన అవస్థలో కూడ కుదుర్చుటలో పేరెన్నిక గన్నది జమ్మివారి "లీవర్ క్యూర్" మాత్రమే. ఇది వైద్యుల సంపూర్ణ నమ్మకము పొందియున్నది.

జమ్మివారి

### లీవర్ క్యూర్

పసిపిల్లల లివర్, స్లీపను వ్యాధి నివారణకు జగద్విఖ్యాతమైనది

### జమ్మి వెంకటరమణయ్య అండ్ సన్స్

మైలాపూరు—మద్రాసు (ఫోన్ నం: 8139)
సాండ్ హర్స్టు రోడ్డు, బొంబాయి (ఫోన్ నం: 41593)
ఇతరచోట్లు: లక్నో—బెంగళూరు—తిరుచునాపల్లి.

# డివేల్యుయేషన్




## బ్రిటన్: 1931 నాటి డివేల్యుయేషన్

**1949** సెప్టెంబర్ డివేల్యుయేషన్ బ్రిటన్ ఆర్థిక చరిత్రలో మొదటిది కాదు. సరిగా 18 సంవత్సరాల క్రితం-అంటే 1931 సెప్టెంబర్ 21వ తారీఖున-అంతవరకూ అమలులో ఉండిన సువర్ణ ప్రమాణాన్ని (Gold Standard) రద్దుచేసి, పౌను మారకపు విలువను బ్రిటన్ తగ్గించినది. అప్పటి పౌను డివేల్యుయేషన్‌కు దారితీసిన ఆర్థిక పరిస్థితులకూ, ఇప్పటి పరిస్థితులకూ చాలా పోలికలు ఉన్నాయి. ఆ నాటి డివేల్యుయేషన్ ఫలితాలనూ, ఇప్పటి డివేల్యుయేషన్ ఫలితాలకూ కూడా చాలా పోలికలు ఉండటం సహజం, అని ఆర్థిక శాస్త్రవేత్తల అభిప్రాయం. అందువల్ల 1931లో బ్రిటన్ పౌను మారకపు రేట్లను తగ్గించినందుకు గల కారణాలూ, ఆ చర్యవలన ఏర్పడిన ఫలితాలూ స్థూలంగా చర్చిస్తే, ఈ విషయానికి సంబంధించిన సంగతులు విశదపడగలవు.

మొదటి ప్రపంచ యుద్ధ ప్రారంభంలో అంతకు ముందు బ్రిటన్‌లో అమలులో ఉండిన సువర్ణ ప్రమాణం తాత్కాలికంగా నిలుపుచెయ్యబడినది. సువర్ణ ప్రమాణానికి ముఖ్య లక్షణాలు మూడు: మొదటిది దేశంలో చలామణి అవుతూన్న కరెన్సీ నోట్లకు బదులుగా, ఆ నోట్లను జారీచేసే అధికారం కలిగిన కేంద్ర ధనాగారం కాని, ప్రభుత్వంకాని బంగారు నాణెములను ఇస్తుంది. రెండవది టంకశాలలో బంగారం ఇస్తే, ఆ బంగారం అంతటితోనూ నాణెములను ముద్రించి ఆ బంగారు నాణెములు తిరిగి ఇస్తారు. మూడవది బంగారం ఎగుమతి దిగుమతులకు ఏ విధమైన ఆటంకాలూ ప్రభుత్వం కల్పించదు. యుద్ధానికి ముఖ్యంగా కావలసిన ఆయుధ సామగ్రీ, తదితర పదార్థాలూ దిగుమతి చేసే నిమిత్తం దేశంలోఉన్న యావత్తు బంగారాన్ని ఉపయోగించడంకోసం మొదటి ప్రపంచ యుద్ధ ప్రారంభంలోనే బ్రిటిష్ ప్రభుత్వం సువర్ణ ప్రమాణాన్ని నిలుపుచేసింది. యుద్ధానంతరం తిరిగి దేశంలో ఆ ప్రమాణాన్ని తిరిగి ప్రతిష్ఠించాలి అనే బహుజనాభిప్రాయానికి అనుగుణంగా 1925లో బ్రిటన్‌లో ఇంకో రకపు సువర్ణ ప్రమాణం ప్రవేశపెట్టబడినది. (Gold Bullion Standard). ప్రపంచంలోని ఇతర దేశాలలో కూడా చాలవరకు ఈ సువర్ణప్రమాణ పునః ప్రతిష్ఠ జరిగినది. దీనికి కారణం అన్ని దేశాలలోనూ విపరీతమైన ద్రవ్యోల్బణం జరగడం. ఆయాదేశాల కరెన్సీలకు దేశంలోనూ బయటా విలువ కల్పించడానికి సువర్ణ ప్రమాణమే ఏకైక సాధనంఅని ఆ నాటి ఆర్థిక వేత్తలూ ప్రభుత్వాలూ గాఢంగా విశ్వసించడంచేత తిరిగి ఆ ప్రమాణం అన్ని దేశాలలోనూ పునః ప్రతిష్ఠించబడినది. సువర్ణ ప్రమాణం వల్ల అంతర్జాతీయ వ్యాపారం కూడా యథాపూర్వంగా నెలకొంటుందనే విశ్వాసం కూడా ఆ రోజులలో ఉండేది. ఆ ప్రమాణం అమలులో ఉంటే అంతర్జాతీయ వ్యాపారంలో ఎగుమతి దిగుమతులలోని భేదాలు బంగారం ఎగుమతి దిగుమతుల వల్ల పరిష్కరింపబడతాయి. అంతేకాక, బంగారం ఎగుమతి దిగుమతులవల్ల వివిధ దేశాలలోని ధరలు సమానం అయి, అంతర్జాతీయ వ్యాపారానికి ఎంతో సహాయం కలుగుతుందని ఆనాటి ఆర్థిక శాస్త్రవేత్తల అభిప్రాయం.

కాని ప్రపంచంలో సువర్ణ ప్రమాణం అమలులో ఉండాలంటే అన్నిదేశాలకూ అన్యోన్య సహకారం ఉండాలి. ముఖ్యంగా ఏ దేశమూ కూడా ప్రత్యక్షంగా కాని పరోక్షంగా కాని బంగారం ఎగుమతి దిగుమతులకు నిరోధాలు కల్పించకూడదు. అంటే, ఏ విధమైన వ్యాపార నిరోధం ఉండకూడదు. వ్యాపార నిరోధంవల్ల బంగారం ఎగుమతి దిగుమతులు సహజమార్గంలో

కాకుండా విపరీత మార్గాలలో జరిగి, చివరకు సువర్ణ ప్రమాణానికి విఘాతం కలుగుతుంది. అంతేకాదు. రెండు దేశాలకు వ్యాపారం జరుగుతున్నప్పుడు, అందులో ఒక దేశానికి ఎన్నడూ వ్యాపార విముఖత్వం, రెండవ దానికి వ్యాపార సుముఖత్వం ఉన్నట్లయితే, వ్యాపారవిముఖత్వం కలిగినదేశం రెండవదేశానికి సర్వదా బంగారం ఎగుమతి చెయ్యవలసి ఉంటుంది. అది ఎంతో కాలం సాగదు. అందువల్ల వ్యాపార సుముఖత్వం కలిగిన దేశం రెండవ దేశానికి కొంత మూలధనం ఎగుమతి చేసి, తద్వారా ఎగుమతి దిగుమతుల లావాదేవీలకు పొత్తు కలిగించవలసి ఉంటుంది. లేకపోతే సువర్ణ ప్రమాణం రద్దుకావడం తథ్యం.

రెండు ప్రపంచ యుద్ధాలకీ మధ్యకాలంలో సువర్ణ ప్రమాణ సూత్రాలను కొన్ని దేశాలు పాటించలేదు. ఆ దేశాలు ముఖ్యంగా ఫ్రాన్సు, అమెరికా. ఈ రెండు దేశాలలోనికి వ్యాపార సుముఖత్వం ద్వారా బంగారం ప్రవహించినది. సామాన్యంగా ఈ సువర్ణ ప్రవాహం ఆ దేశాలలోని ధరలను హెచ్చించి వ్యాపార విముఖత్వానికీ, బంగారపు వెనుకమరలకూ దారి తీసి ఉండవలసినది. కాని పైదేశాలు రెండూ ఇలాంటి సహజమైన ఆర్థిక ఫలితాలకు అడ్డంకులు కల్పించాయి. దేశంలోనికి బంగారం దిగుమతి అయినప్పటికీ, అక్కడి ధరలు పెరగకుండా ఆ దేశాలు కట్టుదిట్టం చేశాయి. ఫలితం—ప్రపంచంలోని బంగారం అంతా ఆ దేశాలలోనికి వచ్చి చేరినది. అంతే కాదు. ఆ దేశాలు—ముఖ్యంగా అమెరికా—దిగుమతి సుంకాల ద్వారా దిగుమతులను నిరోధించాయి. అందువల్ల ఆ దేశాలకు వ్యాపార సుముఖత్వం ఇంకా ఎక్కువ అయి, ఆ దేశాలలోనికి బంగారం ఇంకా దిగుమతి అయింది. దానివల్ల ఇతరదేశాలలో బంగారం కరువై ధరలు పడిపోడానికి కారణభూతం అయింది. ఏ దేశంలోనైనా ధరల మట్టం ఆ దేశంలో చలామణి అవుతూన్న ధనం మీద ఆధారపడుతుంది. బంగారం కరువైపోగానే చలామణి అవుతూన్న ధనం తగ్గిపోయి ధరలు పడిపోయి, చివరకు ఆర్థిక మాంద్యానికి దారి తీసింది.

వ్యాపార సుముఖత్వం సాధించి, తద్వారా బంగారం దిగుమతి చేసుకున్న దేశాలు ఇతర దేశాలలో పెట్టుబడికింద ఋణాలు ఇస్తే, ఆ దేశాల లావాదేవీలకు పొత్తుకుదిరి బంగారం తిరిగి వ్యాపారసుముఖత్వం కలిగిన దేశాలనుండి ఇతర దేశాలకు ఎగుమతి అయి ఉండేది. అప్పుడు సువర్ణప్రమాణం రద్దుకాకుండా ఉండే అవకాశం ఉండేది. కాని అదికూడా జరగలేదు. అమెరికా, ఫ్రాన్సుదేశాలు ఇతర దేశాలకు ఋణాలు ఇవ్వలేదు. అందువల్ల బంగారం లేకపోవడంచేత ఇతరదేశాలు సువర్ణ ప్రమాణాన్ని రద్దు చేయక తప్పినది కాదు. అమెరికా ఫ్రాన్సు దేశాలు స్వలాభంకోసం అంతర్జాతీయ సహకారానికి అడ్డంకులు కల్పించడంవల్ల ఆర్థికమాంద్యం సంభవించింది; సువర్ణప్రమాణం రద్దయింది.

ఆర్థికమాంద్య చరిత్రను సంక్షిప్తంగా సూచిస్తే చాలు. 1928-29 లో న్యూయార్కు వాల్ స్ట్రీట్‌లో అంతవరకూ విపరీతమైన హెచ్చులో ఉన్న సెక్యూరిటీల ధరలు ఒకసారిగా కూలిపోయినవి. ప్రాథమికంగా వ్యవసాయిక దేశాలు—అందులో ముఖ్యంగా ఉత్తర దక్షిణ అమెరికాలలోని వ్యవసాయిక దేశాలు, ఆస్ట్రేలియా—మొట్టమొదట దెబ్బతిన్నవి. ఆ తరవాత జర్మనీ, మధ్య ఐరోపాదేశాలలో విదేశ పెట్టుబడిదారుల నమ్మకం తగ్గిపోవడం మూలాన ఆ దేశాలనుండి వారి పెట్టుబడులను తమ దేశాలకు మార్చుకోవడం మొదలెట్టేరు. 1931 లో ఆస్ట్రియాలోని ఆన్‌స్టాల్ట్ బ్యాంకు, జర్మనీలోని డనట్ బ్యాంకు దివాలా తీశాయి. బ్రిటన్‌లోని నమ్మకం కూడా చెదిరిపోయింది. బ్రిటన్‌లోని నిరుద్యోగ భీమా మొదలగు ప్రజాభ్యుదయానికి ఉపకరించే శాసనాలమూలంగా ప్రభుత్వం తన వ్యయాన్ని ఆదాయానికి సరిపోయేటట్లుగా తగ్గించుకోలేకపోయినది. బ్రిటన్‌నుండికూడా విదేశీయులు తమ ధనాన్ని ఇతర దేశాలకు మార్చుకోడం మొదలెట్టేరు. దానిమూలాన బ్రిటన్‌లోని బంగారం ఇతరదేశాలకు విపరీతంగా ఎగుమతి అయిపోయింది. బ్రిటన్ తాలూకు విదేశ కరెన్సీ రిజర్వులు మాయమైపో మొదలిడినవి. బ్రిటన్ అమెరికానుండీ, ఫ్రాన్సునుండీ తీసుకున్న అప్పులు చాలలేదు. బ్రిటన్ సువర్ణప్రమాణాన్ని రద్దు

చేసినవి. అంతకుముందే అమెరికా జర్మనీ విషయంలో "మారటోరియం"ను ప్రతిపాదించినది. బ్రిటన్‌లో ఎంతోకాలంనుండీ అమలులో ఉండిన స్వేచ్ఛావ్యాపారం రద్దుచేసింది. అన్నిదేశాలు కూడా తమ దేశంలోకి వచ్చే విదేశపు సరకుల మీద దిగుమతి సుంకాలు వృద్ధిచేసియూ, తదితర విధానాలవల్లా, అంతర్జాతీయ వ్యాపారానికి నిరోధాలు కల్పించాయి.

ఇది స్థూలంగా 1931 సెప్టెంబర్‌లో బ్రిటన్ సువర్ణ ప్రమాణాన్ని రద్దు చెయ్యడానికి ముందునాటి చరిత్ర. కాని ఈ చరిత్రతో మనకు ఎక్కువ నిమిత్తం లేదు. 1931 నాటికీ, ఇప్పటికీగల పోలికలు, అప్పటి డివేల్యుయేషన్ వలన ఏర్పడిన ఫలితాలు, ఇప్పటి డివేల్యుయేషన్ వలన ఏర్పడబోయే ఫలితాలూ చర్చించడమే మనం చెయ్యవలసినది.

1931లో నాటిలాగే ఇప్పటినుంచీ డివేల్యుయేషన్ ముందునాటి కాలంలోకూడా బ్రిటన్ నుండి విశేషంగా బంగారం, డాలర్ రిజర్వులూ ఎగుమతి అయిపోతూండడం జరిగింది. అప్పుడు అది ముఖ్యంగా విదేశీయులకు, బ్రిటిష్ ప్రజలలో కొందరికి బ్రిటన్ భావి విలువలో నమ్మకం తగ్గిపోవడంవల్లనే జరిగింది. ఇప్పుడుకూడా అలాటి అపనమ్మకం హెచ్చవడం, పైగా అమెరికాతో వ్యాపార విముఖత్వం ఏర్పడడం మూలంగానే ఇది జరుగుతున్నది. బ్రిటన్ నుండి పౌనులను ఇతర కరెన్సీలలోనికి మార్చుకో వవసరం లేకుండా చెయ్యాలంటే పౌను మారకపు విలువ నిజమైన విలువకంటే ఎక్కువగా ఉండకుండా చెయ్యాలి. అంతేకాదు. పౌనులను ఇతర కరెన్సీలలోకి మార్చడం కష్టంతో కూడుకున్న పనిగా కూడా చెయ్యాలి. 1931 డివేల్యుయేషన్‌తో అంతకుముందు నాటికి 10 వంతున ఎక్కువ విలువ ఉన్న పౌను, సరియైన మట్టానికి తీసుకు రాబడినది. అంతేకాక, పౌనులను డాలర్లలోనికి గాని, ఇతర కరెన్సీలలోనికి గాని మారుస్తే అంతకుముందుకంటె తక్కువ డాలర్లూ, ఇతర కరెన్సీలూ వస్తవి కనక పౌనుల మారకం నష్టదాయకం. ఈ కారణాలవల్ల పౌనులను ఇతర కరెన్సీలలోకి మార్చడం పూర్తిగా తగ్గిపోయినది. ఇప్పుడు కూడా అదే కారణాలవల్ల పౌనులను డాలర్లలోకి మార్చడం తగ్గవచ్చును.

రెండవది పౌనుల విలువ తగ్గిపోవడం మూలాన బ్రిటిష్ సరకుల ఖరీదు ఇతరదేశాలలో తగ్గి, బ్రిటిష్ ఎగుమతుల ప్రమాణం హెచ్చినది. అందువల్ల బ్రిటన్‌లో ప్రబలుతూ ఉండిన నిరుద్యోగం తగ్గి, అధికోత్పత్తికీ, దేశసౌభాగ్యానికీ దారితీసినది. కాని అప్పటికీ ఇప్పటికీ ఒక తేడా ఉన్నది. అప్పుడు బ్రిటన్, కొన్ని దేశాలు మాత్రమే డివేల్యుయేషన్ చేసినవి. ఇతర దేశాలు విశేషంగా తమ కరెన్సీల విలువను తగ్గించలేదు. అందువల్ల బ్రిటన్ కొంత లాభం పొందగలిగినది. కాని ఇప్పుడు స్టెర్లింగ్ దేశాలన్నీ తమ కరెన్సీల విలువను తగ్గించడం చేత బ్రిటన్ పొందగలిగే లాభం తక్కువ కావచ్చును.

మూడవది బ్రిటన్‌లో 1931 సెప్టెంబర్ ముందు బంగారం ఎగుమతి మూలాన బ్రిటన్‌లో చలామణి అయే డబ్బు తగ్గి ధరలు తగ్గిపోయినవి; వడ్డీరేట్లు హెచ్చయినవి; అందువల్ల పారిశ్రామికోత్పత్తి కుంటుపడినది. ఆనాటి నుంచీ వ్యాపారవిముఖత్వం మూలాన బంగారం ఎగుమతి తగ్గిపోవడమే కాకుండా దేశంలోనికి బంగారం దిగుమతి అవడం మొదలెట్టింది. దానివల్ల ధరలు హెచ్చినవి; నిరుద్యోగం తగ్గినది. ఇప్పటి డివేల్యుయేషన్ వల్ల కూడా అలాటి ఆర్థిక ఫలితాలే ఉండవచ్చునని అర్థశాస్త్రజ్ఞుల నమ్మకం.

1931 నాటి డివేల్యుయేషన్ వల్ల బ్రిటన్‌కూ, బ్రిటన్ అడుగు జాడలలో నడచిన ఇతర దేశాలకూ ఆర్థికంగా ఎంతో లాభం కలిగినది. దానివల్లనే ప్రపంచ ఆర్థిక మాంద్యాన్ని ఎదుర్కోడానికి అవకాశం ఏర్పడినదని అనడంలో అతిశయోక్తి ఎంత మాత్రం లేదు. డివేల్యుయేషన్ చెయ్యడానికి బ్రిటన్ అప్పుడు కూడా ఎంతో సంశయించినది. ముందుగా బ్యాంకు రేటును హెచ్చుచేసి చూసింది.

దేశంలో చలామణి అవుతూన్న డబ్బు తగ్గిపోవడం మూలంగా వడ్డీ రేట్లు బ్యాంకు రేటుతో బాటు పెరిగినవి; విదేశ కరెన్సీ రిజర్వులు మాయమైపోయినవి; ఇతర దేశాల నుండి తెచ్చిన అప్పులు కూడా ఖర్చై పోయినవి. డివేల్యు

యేషన్‌తో ఈ సమస్యలన్నీ తీరిపోయాయి. బంగారం, ఇతర కరెన్సీ రిజర్వుల ఎగుమతి తగ్గిపోయినది, క్రమంగా పౌను విలువలో నమ్మకం హెచ్చినది. దేశంలో వడ్డీరేట్లు తగ్గినవి. పారిశ్రామికోత్పత్తికి వికాసం చేకూరినది. నిరుద్యోగం తగ్గినది. అంతర్జాతీయ వ్యాపారం యథాపూర్వకంగా సాగి ఆర్థిక మాంద్యం మాయమైపో మొదలెట్టింది. ఆ విధంగానే, ఇప్పుడు కూడా డివేల్యుయేషన్ ప్రపంచార్థిక చరిత్రలో ఒక నూతనఘట్టం ప్రారంభించబోతూన్నది. ప్రపంచంలో ఉత్పత్తి హెచ్చి, జీవనసౌభాగ్యం వృద్ధి కానున్నది అని ఆర్థిక శాస్త్రవేత్తల అభిప్రాయం.

1931 నాటి డివేల్యుయేషన్‌కూ, ఇప్పటి డివేల్యుయేషన్‌కూ ఎన్నో పోలికలున్నాయనీ, అందువల్ల క్రిందటిసారి డివేల్యుయేషన్ వల్ల ఏర్పడిన ఫలితాలు తిరిగి ఏర్పడడానికి అవకాశాలున్నాయనీ తేలింది. డివేల్యుయేషన్ వల్ల ఎగుమతులు హెచ్చి, దిగుమతులు తగ్గుతాయనీ, ఇతర దేశాలకు ఎగుమతి అయే బంగారం, ఇతర కరెన్సీ రిజర్వులూ తగ్గిపోతాయనీ, వడ్డీ రేట్లు తగ్గడం మూలానా, ధరలు హెచ్చడం మూలానా, అధికోత్పత్తికి దోహదం కలుగుతుందనీ ఇంతవరకూ జరిగిన చర్చ సారాంశం. కాని 1931 నాటికీ, ఇప్పటికీ గల భేదాలు మనం మరిచిపోకూడదు. ఆ భేదాలు ముఖ్యంగా మూడు:

మొదటిది. 1931 నాటికి ప్రపంచంలో ఆర్థికమాంద్యం చెలరేగుతూ ఉంది. ధరలు విపరీతంగా తగ్గిపోయాయి. వ్యవసాయిక పదార్థాలు మరీ విపరీతంగా తగ్గిపోవడం మూలంగా వ్యవసాయిక దేశాలు మరింత ఎక్కువగా నష్టపోయాయి. విదేశ వ్యాపారం పూర్తిగా స్తంభించిపోయింది. డివేల్యుయేషన్ ద్వారా ధరల మట్టాన్ని హెచ్చించడానికీ, వ్యవసాయిక పారిశ్రామిక పదార్థాల ధరల మార్పులలోని భేదాలను సరిదిద్దడానికీ, విదేశవ్యాపారాన్ని యథాపూర్వంగా నెలకొల్పడానికీ, వివిధదేశాలు ఆనాడు డివేల్యుయేషన్ చేశాయి. ఇప్పటి పరిస్థితి వేరు. యుద్ధానికి పూర్వం నాటికంటే ఇప్పటి ధరలు అన్నిదేశాలలోనూ ఎక్కువగానే ఉన్నవి. మన దేశంలో 1939 నాటికంటే కూడా ధరలు 3.8 రెట్లు పెరిగినవి. ఇంగ్లండులో 2.2 రెట్లూ, అమెరికాలో 1.7 రెట్లూ పెరిగినవి. ఈ లెక్కలనుబట్టి నేటి డివేల్యుయేషన్ ఆశయం ధరలను ఇంకా పెంచడం కాదని తెలియగలదు. డివేల్యుయేషన్ ప్రస్తుతపు ధరలను స్థిరీకరించడానికి మాత్రం ఉపయోగిస్తుంది లేదా వివిధదేశాలలోని ధరలను యుద్ధానికి పూర్వంకంటే సమానంగా హెచ్చు చెయ్యడానికికూడా ఉపయోగిస్తుంది. అంటే అన్ని దేశాలలోనూ ధరలు ఒక్కతీరున పెరగలేదు కనక, ఈ హెచ్చు తగ్గులను సమానం చెయ్యడానికి ఉపయోగపడుతుంది ఈ సాధనం. ప్రస్తుతం బ్రిటన్‌లో ధరలు ఎంతవరకు పెరిగాయో, అంతవరకే ఇతరదేశాల ధరలను హెచ్చించడం; లేదా ఆమట్టానికి తగ్గించడం—డివేల్యుయేషన్ ద్వారా సాధించవచ్చు. ఇంగ్లండులో ధరలు 2.2 రెట్లు పెరిగినవి. మన దేశంలో 3.8 రెట్లు పెరిగినవి. డివేల్యుయేషన్ ద్వారా రెండు దేశాలలోనూ ధరలు ఇంకా పెరగవచ్చును. ఈ పెరుగుదల రెండు దేశాలలోనూ సమానంగా ఉండేటట్లు నిర్ణయించి, స్థిరీకరించడం జరగవచ్చును. కాని, ఇప్పటికంటె ధరలను పెంచి, తద్వారా ఉత్పత్తికి దోహదం కల్పించడం ఈ నాటి డివేల్యుయేషన్ ఆశయం కాదు.

1931 నాటికీ ఇప్పటికీ ఉండే రెండవ భేదం అంతర్జాతీయ వ్యాపార పరిస్థితులకు సంబంధించినది. అప్పటిలో చాలవరకు స్వేచ్ఛావ్యాపారం అన్ని దేశాలలో సాగిస్తూ ఉండేది. విదేశవ్యాపారంలో ఎగుమతి దిగుమతులపై నిర్బంధాలూ, దేశీయ వ్యాపారంలో కంట్రోళ్లూ ఆనాడు లేవు. ప్రస్తుతం ఈ నిర్బంధాలవల్ల ఆర్థిక ఫలితాలు శాస్త్రరీత్యా కలగవలసినవిధంగా కలగటానికి అవకాశాలు లేవు.

మూడవది 1931 లోనూ, ఇప్పుడూ వడ్డీ రేట్లలోనూ, బ్యాంకు ఋణాలకు సంబంధించిన పరిస్థితులలోనూ భేదం ఉన్నది. 1931 లో వడ్డీ రేట్లు చాలా ఎక్కువగా ఉండేవి. కావలసినంతగా పెట్టుబడి దొరికినా, హెచ్చువడ్డీరేట్ల వల్ల ఎక్కువ లాభాలు మిగిలేవి కావు. అందువల్ల

ఉత్పత్తి కుంటుపడినది. కాని ఇప్పటి పరిస్థితి వేరు. యుద్ధానికి పూర్వం కొంతకాలంనుండే ప్రభుత్వం అవలంబించిన "చవకడబ్బువిధానం" (cheap money policy) వల్ల వడ్డీ రేట్లు తగ్గిపోయినవి. వడ్డీ రేట్లను తగ్గించడం వల్ల ఉత్పత్తి పెరుగుతుందని అనుకోడానికి వీలులేదు.

దీనినిబట్టి ఇప్పటి డివేల్యుయేషన్ చరిత్ర ఇదివరకు దానివలె ఉండదని రుజువవుతుంది. కాని, ఎగుమతుల పెరుగుదలవల్ల దేశీయోత్పత్తి పెరుగుతుంది; బంగారం, ఇతర రిజర్వుల ఎగుమతి తగ్గుతుంది; నిరుద్యోగం తగ్గుతుంది; ఆర్థిక మాంద్యం వాయిదా పడుతుంది; ఈ ఫలితాలు అప్పుడే బ్రిటన్‌లో కలిగినవి. సెప్టెంబర్ 1ంవ తారీకునుండి 31వ తారీకువరకూ, బ్రిటన్ బంగారం డాలర్ రిజర్వులు 20 మిలియన్ పౌన్లు హెచ్చినవి. అయితే, ఇది ఎగుమతులపరిమాణం హెచ్చినందువల్ల కలిగినదో, స్టెర్లింగ్ విలువ తగ్గినందువల్ల ఏర్పడినదో నిర్ణయించడం ఇప్పటిలో కష్టం.

# త్రిశంకుని ఏకాంతసేవ

ఏ. ఎల్. నరసింహారావు

నీవు కూడా నాబోటివాడివే నని ఉద్దేశంతో నీకు యీ సంగతి చెబుతున్నాను. నేను అటు ధనికవర్గానికీ చెందను; ఇటు కార్మిక వర్గానికీ చెందను. లేక నేను మధ్యతరగతి వాణ్ని కాదు. నాకు ఆస్తిపాస్తులు లేవు. నేను కార్మికులు చేసేపని చేయలేను. నా మెదడుమీద లెక్కలమీద ఆధారపడి బ్రతకాల్సిందే. నీవు కూడా నా తరగతివాడివే అయితే నా సలహాలను గురించి ఆలోచించు.

డబ్బు లేనివాడు ఎంత చిత్తశుద్ధితో పని చేసినా, ఎంత నీతిగా ప్రవర్తించినా దానిని హర్షించేవారు లేరు. అది కేవలం నీ అసమర్థత ప్రతిబింబం. నీవు ఎలా బ్రతుకుతున్నావో, నీ సంపాదనతో నీకు ఎలా గడుస్తున్నదో అనే ఆలోచన ఎవరికీ పట్టదు. నీవు కాస్ట్లీ సిగరెట్ కాల్చావో - సందేహానికి తావిచ్చావన్న మాటే. నీ అరవచాకిరీకి ప్రయోజనం ఏమీ వుండదు. అదంతా ఎవరిని ఉద్ధరించేందుకు? నీ బుర్ర బద్దలుకొట్టుకొని రాత్రింబగలు చాకిరీ చేయడం నీ పెళ్ళాం పిల్లల్ని పస్తులు పడుకో బెట్టేందుకు తప్ప మరెందుకు కాదు. నీకన్నా కార్మికుడు పని యీ రోజుల్లో ఎంతో మెరుగు. నీవు ఇటు కార్మిక వర్గానికీ చెందవు, అటు ధనిక వర్గానికీ చెందవు. నీది త్రిశంకు స్వర్గం. ఊహాలు, భావాలూ ఎంతో అభ్యుదయకరమైనవిగా ఉంటాయి. కాని నీస్థితి కార్మికుడి స్థితికన్నా కూడా దుర్భరంగా వుంటుంది.

నీ అభ్యుదయకర భావాలకు నీ ఆర్థిక స్థితికి పెద్ద సంఘర్షణ. సవాశేరు పంచదార రూపాయి పావలా. మిరపకాయలు రూపాయి పావలా. బియ్యం రూపాయికి పెద్ద తక్కువ మానెడు. నీ జీతం-మహా అయితే వందరూపాయలు. అమ్మబాబో! వందరూపాయలే. గుండె దేబా కొట్టుతుంది పైతరగతివారికి, కాని వందరూపాయలతో నీవు నీ భార్య, పిల్లలు ఎలా బ్రతుకుతున్నారా అని ఏ పెద్దమనిషీ - కాంగ్రెస్ మంత్రులతో సహా-ఆలోచించడు. ధనికవర్గంవారి సిగరెట్ల ఖరీదంత కాదు నీ జీతం.

నీ పరిస్థితిని ఎవరూ సానుభూతితో అర్థం చేసుకోలేరు. నీకని అటునుయ్యి, ఇటుగొయ్యి. కొంతకాలం గడిచేసరికి నీలో సహజంగా నిస్పృహా, నిరాశ, అసహనం బయలుదేరుతుంది. ఆ పరిస్థితిలో ఆత్మగౌరవాన్ని చంపుకొని తమను తాము చవకగా అమ్ముకొని పశుతుల్యులౌతారు. జీవనోపాధికి గడవక, వేరే మార్గం లేక అవినీతికి, దుర్వృత్తులకు పాల్పడతారు. మనం లంచగొండితనం అంటున్నామే అది ఇలా బయలుదేరిందే. చాలీచాలని జీతాలవాళ్లకు ఇంకో మార్గం ఏముంది?

ఈ నాటి సంఘవ్యవస్థ నీ నైతిక పతనానికి దారితీస్తున్నది. నీ ఉన్నతభావాలూ, ఆశయాలూ ఎందుకు పనికిరాకుండా పోతున్నాయి. ప్రస్తుత సాంఘికవ్యవస్థ నిన్ను పతితుణ్ణి చేసివేస్తున్నది. నీచిత్తశుద్ధికి విలువ శూన్యం.

# కొత్త పద్ధతులు

రావి

## సత్యాగ్రహం

నాకొక సినిమా ప్రొడ్యూసరు మిత్రుడున్నాడు. అతడు వ్యాపారాన్ని కళగానూ, కళను వ్యాపారంగానూ నడుపుతూ ఉంటాడు. అందుచేత నాకు అతనంటే గౌరవం. ఓ మాదిరి వ్యాపారస్థులు తమకిందపని చేసేవారి శ్రమ శక్తిమాత్రమే కొంటారు, కాని నా మిత్రుడు మనస్సులను కూడా కొంటాడు. అతనికి అమ్ముడు పోవటంలో ఏదో ఆనందం ఉండి ఉండాలి. లేకపోతే అమ్ముడు పోదామని అంతమంది తహతహ లాడరు.

నా ప్రొడ్యూసరు మిత్రుడికీ నాకూ చాలా విషయాలలో అభిప్రాయాలు కలియవు. బాగుపడే గీత లేని వాణ్ణి కావటం వేత నేను ఒకే తాటి మీద నడుస్తూ ఉంటాను. అతను బాగుపడే గీత ఉలాడు కనక కప్పదాట్లు వేస్తూ ఉంటాడు. ఉదాహరణకి, అతను ఎప్పుడు వ్యాపారాన్ని కళ అంటాడో, ఎప్పుడు కళను వ్యాపారమంటాడో నేను చచ్చినా ఊహించలేను.

తాను పెట్టుబడిదారు కావటమే లోకానికి ఉద్ధరింపని ఒకసారి అంటాడు. తన లాభాల కోసం దేశమంతా నష్టపడినా ఫరవాలేదంటాడు మరోసారి. పైపెచ్చు ఈ రెండూ రెండు సిద్ధాంతాలు కావంటాడు.

అయినా నాకతనంటే గౌరవం ఎందుచేతనంటే అతను ఎవరూ చేయలేని పనులు కొన్ని చేయగలడు. ప్రభుత్వాన్ని గడ్డిపోచకింద లాగి పారెయ్యగలడు. తాను చిత్రాల ద్వారా "ఎంటర్టెయిన్మెంట్" ఇస్తున్నానంటూ ఆ చిత్రాలలోనే, అత్యవసర సమస్యలు ఎదుర్కొనటానికి ప్రభుత్వం చేసే ఏర్పాట్లను దుమ్మెత్తి పొయ్యగలడు. అతని చిత్రాలు సెన్సారుకు వచ్చే సమయానికి సెన్సారు సభ్యులు "విడవ స్వర్గంలో ఉంటారల్లే ఉంది: పడవలసినచోట కూడా కత్తెర పడదు.

ఇండియాలో తయారయే చిత్రాల పొడుగు పరిమితం చెయ్యాలా అన్న సమస్యను గురించి రాయవలసిందని నన్నొక పత్రిక వారడిగారు. చిత్రాల పొడుగు పరిమితం చెయ్యవలసిందేనంటూ వ్యాసంరాసి జేబులో పెట్టుకుని నా ప్రొడ్యూసరు మిత్రుడి దగ్గిరికి వెళ్ళాను. ఆయన నా వ్యాసం చూసి, "నువ్వు చాలా పొరపాటుపడ్డావు." అన్నాడు.

"నేనాట్టే పొరపాటు పడ్డాననుకోను. ఈ సమస్య అన్ని వేపులనుంచీ ఇందులో చర్చించాను" అన్నాను.

"నీ వాదనలన్నిటికీ నేను సమాధానం ఇవ్వగలను," అన్నాడాయన.

"ముడి ఫిలిము దిగుమతిసరుకు. మనం ఎంత పొదుపుగా వాడుకుంటే మన ఆర్థికస్థితి అంత బాగా ఉంటుంది. మనసినిమాచిత్రాలుఎగుమతిసరుకుకాదు."

"నా చిత్రాలు మలయా, సిలోన్, బర్మాలకు పోతాయి."

"సముద్రంలో కాకిరెట్ట."

"అందరికీసరిపోయేముడిఫిలిములేదంటావా!"

"ఉండవచ్చు. కాని దానిని ఎంత తక్కువగా వాడితే అంత మంచిది. మన అంతర్జాతీయ వ్యాపారమంతా తగులు వ్యాపారమే. మన సినిమా కెమెరాలూ, సౌండు ఎక్విప్మెంటూ పైనుంచే రావలసి ఉంది. అది అనవసరంగా అరిగిపోవటం మంచిది కాదు."

"పూర్తి అయిన చిత్రాల పొడుగు తగ్గిస్తే ముడి ఫిలిము వాడకం తగ్గుతుందనీ, సినిమా పరికరాల అరుగుదల తగ్గుతుందనీ నీ కెవరు చెప్పారూ? 18 వేల అడుగుల చిత్రానికి పట్టే ఫిలిముకంటె 11 వేల అడుగులకు ఎక్కువ నెగెటివ్వూ, ఎక్కువ సౌండూ పట్టవచ్చు. అది నా అనుభవం."

"ఒక్కడి అనుభవం ఒకసారి ఆ విధంగా ఉండవచ్చు. 300 చిత్రాలమీద చూసేట్టయితే విధిగా తక్కువ పొడుగు చిత్రాలకు తక్కువ ముడి ఫిలిం పడుతుంది—అందరూ వెర్రి వెధవలైతే తప్ప."

"అట్లా అయితే చిత్రాల సంఖ్య తగ్గించుకోవచ్చుగా! ముడి ఫిలిం రేషన్ చేసి ఇస్తే మేం నాలుగు చిత్రాలు తీస్తామో, ఒక చిత్రమే తీస్తామో, మాగోల మాదీ! ఫిలిము పొడుగు తగ్గించాలని పంతమేం!"

"ఇందులో పంతా లేమీ లేవు. ఇదొక సూచన. ప్రభుత్వం వారు తమ జోక్యం లేకుండా మిమ్మల్నే పొడుగు తగ్గించుకోమంటున్నందుకు సంతోషించక, వాళ్ళను ఫిలిం రేషను చెయ్యమంటావెందుకు!"

"ఫిలిం పొడుగు తగ్గించమనటం జోక్యం కాదూ? క్షమించరాని జోక్యం! నా చిత్రం ఇంత పొడుగుండాలి అని ప్రభుత్వం చెబుతుందా? ఇది కళ! కళ నిరంకుశం! దీనికి ఎవరి హద్దూ ఉండరాదు."

"కాదని హద్దులా ఉంటూనే ఉన్నాయి. నీ కళ దాని హద్దుల్ని అదే మానుకుంటున్నదని నేను నమ్మను. పొరపాటునకూడా నీ చిత్రాలు మూడు వేల అడుగులలో ముగియగా నేను చూడలేదు. 30 వేల అడుగులకు పోగాకూడా చూడలేదు."

"నేను తీయదలిస్తే 3 వేల అడుగుల్లో ఇమిడే కథలూ, 30 వేల అడుగులకుపోయే కథలూ కూడా ఉన్నాయి."

"11 వేల అడుగుల్లో ఇమిడే కథలేనా లేవు?!"

"అవీ ఉన్నాయి. నేను వాటిని తీయను."

"ఏం?"

"ప్రేక్షకులు చూడరు. ప్రేక్షకులకు అక్కర్లేని చిత్రాలు తీసి దివాలా ఎత్తటానికా ఇక్కడ కూచున్నాను? నేను చేసేది వ్యాపారం."

"నీ దింతకూ కళా? వ్యాపారమా?"

"కళా వ్యాపారం."

"ఇదం బ్రాహ్మమిదం క్షాత్రంగా ఉంది నీ పని. 11 వేల అడుగులు చిత్రాలు చూడరని నీ కెట్లా తెలుసూ?"

"డబ్బొచ్చేది ఎప్పుడూ పొడుగాటి చిత్రాలకే. ఏకాదమీ ఎవార్డులన్నీ పొడుగాటి చిత్రాలకే."

"భారీ అయిన కథ ఉండి, కళాదృష్టిలో పొడుగుగా ఉండవలసిన చిత్రాలకు పర్మిషను పుచ్చుకోవచ్చుగా, ప్రస్తుతం కథ లేకుండా పొడుగున్న చిత్రాలు చూస్తూ ఎంత తలనొప్పిగా ఉన్నాదో!"

"ఎవరా పర్మిషనిచ్చేది? ఏ చిత్రానికి పర్మిషనివ్వాలో నిర్ణయించే మగవాడెవడు? చిత్రనిర్మాణం కళ. ఉక్కు కోటాలూ, సిమెంటు కోటాలూ మంజూరు చేయటమా?"

"మళ్ళీ చిత్రనిర్మాణం కళ అయిందా? నీ కళా చిత్రాలను సెన్సారు చేస్తున్నారే, మాట్లాడవేం?"

"సెన్సారు పద్ధతి మాకూ బాగాలేదు. నేనది బాగుందనలేదు. అయినా దానికీ దీనికీ సాపత్యం లేదు."

"మనం ఇంతసేపు మాట్లాడినా నాకు సరి అయిన సమాధానాలు రాలేదు. చిత్రాల పొడుగు తగ్గటంవల్ల లాభం ఉందనే నాకు తోస్తున్నది. ఈ వ్యాసం పత్రిక కిచ్చేస్తాను. ఒక్క విషయం మాటవరసకు అడుగుతాను. ప్రభుత్వం చిత్రాల పొడుగు తగ్గించవలిస్తే ఏం చేస్తావు?"

"చిత్రనిర్మాణం మానేస్తాను."

"అట్లాగైతే నష్టపడతావు గాని, 11 వేల అడుగుల చిత్రాలు తీసి నష్టపడవన్నమాట."

"పోతున్నావా? ఆ వ్యాసం మాటేమిటి?"

"పత్రిక కిస్తాను."

"అది పత్రికకిస్తే నేను నా వ్యాపారమంతా అమ్మేసి బీదలకు దానంచేసేసి సన్యసించి కొండ గుహలో కూర్చుని తపస్సు చేస్తాను. ఇది ముమ్మాటికీ నిజం!"

నా మిత్రుడు సత్యాగ్రహంలోకి దిగాడు! ఇది పుణ్యభూమి కనక ఇక్కడ పెట్టుబడిదార్లు సత్యాగ్రహం చేయగలరు. నైతికంగా నా మిత్రుడి సత్యాగ్రహం నన్ను జయించేసింది. దాని మహత్తరశక్తికి నా హృదయం కరిగిపోయింది. ఇల భక్తిగా నేను, "మిత్రమా, నిన్నటినుంచీ చేసిన వాదంలో గల తప్పులన్నీ గ్రహించాను. నాకు జ్ఞానోదయమయింది. ఇదుగో ఈ వ్యాసం ఇప్పుడే తగలబెడ్తున్నాను." అంటూ నా వ్యాసానికి నిప్పుపుల్ల వెలిగించి అంటించాను.

"పాపం, పత్రికకు వ్యాసం లేకుండా పోయింది. మళ్ళీ కూచుని ఎక్కడ రాస్తుంటావు. ఇది తీసుకుపోయి పత్రికకియ్యి. అందులో ఏమున్నదీ నువ్వు చూడనుకూడా అవసరం లేదు" అంటూ నా మిత్రుడు నాకొక సైక్లోస్టైలు చేసిన కట్ట ఇచ్చాడు.

వెక్‌పోలీలు వగైరా వ్రాత పరికరాలకి వెంటనే ఆర్డరు ఇప్పించగలందులకు తమ ఘనమును మిక్కిలిగా ప్రార్థిస్తున్నాను. మన అబ్బాయిలకు కావలసిన ఎక్సరసైజు పుస్తకాలు ఇప్పుడే తమ ఇంటికి పంపించాను..."

ఒక అంతరంగికుడు:

"...చాలా సంతోషం - చూడండి, మన సుబ్బారావుగారి మూడోవాడు స్కూల్ ఫైనల్ పూర్తిచేశాడు. మన ఆఫీసులో వేసుకుంటే బావుంటుందా? మనకి కావలసినవాడు. ఖాళీలు లేవంటావేమో? ఈమధ్య ఓ ఇంటర్మీడియేట్ ప్యాసయినవాణ్ణి కొత్తగా వేసుకున్నారుటగా? ఇంటర్ ప్యాసయినవాడికే క్లర్కు ఉద్యోగం దొరక్కపోతుందీ? ఏమంటావ్? అన్నట్టు...అప్పర్ డివిజన్ క్లర్క్‌గా ప్రమోషనయేట్టు చూడు, పాపం-బీదవాడు, నన్ను ఆశ్రయించుకుని తిరిగేవాడు..."

ఒక ఫర్నిచర్ వర్క్సు ప్రొప్రయిటరు:

"...లోగడ తమరు డాబా వేయించినపుడు చెక్క సామగ్రి యావత్తు నేనే సప్లయచేసి యున్నాను. ప్రస్తుతము తమరు కవున్సిలులో కూర్చోటానికి చక్కటి రోజ్‌వుడ్ చెయిర్ ఒకటి ఆర్డరిప్పిస్తారని ఆశపెట్టుకుని యున్నాను. మన మునిసిపల్ హైస్కూల్‌కి ఫర్నిచర్ అవసరమని తెలుస్తూయున్నది. తమరు 'ఊఁ' అంటే టెండరు పెట్టుకోగలవాడను. తమ దయ..."

ఒక శ్రేయోభిలాషి:

"...చైర్మన్‌గా ఎన్నుకోబడ్డప్పటినుంచీ తమరికి రోజురోజు విందుల సంఖ్య హెచ్చుగా ఉంటున్నది. నాచే కనిపెట్టబడిన 'వాతాపి జీర్ణం' మాత్రలు ఎట్టి విధమైన అజీర్ణవ్యాధినైనా పారద్రోల్చగలవు. ఒక్కసారి వాడి చూస్తే మీకే తెలియగలదు. తమవంటి ప్రముఖులు వాడిచూచి సర్టిఫికెట్టు దయచేసిన నా మాత్రలకు బహుళ ప్రచారము కలిగి లోకమునకు గొప్ప మేలు జరుగును."

ఒక దగ్గరి బంధువు:

"...మన పడమటి పొలం ఎన్నాళ్ళకీ అమ్ముడు పోకుండా ఉంది. మునిసిపాలిటీ పట్టణ విస్తరణ పథకాలు తయారుచేసి స్థలాలను కొనేట్టు చూడకూడదూ? పట్టణం పడమటివైపు అభివృద్ధి చెందటం మంచిదని నీ పలుకుబడి వినియోగించి అధికారులకి నచ్చచెప్పలేవూ? ప్రయత్నించు. ఈలోపల ప్లాట్లు వేసి ఉంచుతాను, బొత్తిగా ధర రాకుండా ఉంది. చివరికెట్లైనా. కనీసం పుకారైనా పడితే మంచి ధర రావొచ్చు. ఈ ఛాన్సు పోతే ఇహ మన పొలాలు అమ్ముడు పోవటమే కష్టం. నా పొలాలకి ఆనుకునేగా నీ పొలాలు కూడా ఉన్నాయి. నాదేమిటి పెద్దవాడినైపోయాను...నీ విషయమే..."

ఒక ఓటరు మహాశయుడు:

"...మీరు కౌన్సిలర్‌గా ఒక్క ఓటు మెజారిటీతో ఎన్నికయ్యారు. ఆ ఒక్క ఓటూ నాదే నని మనవి చేస్తున్నాను. చివరిదాకా తటపటాయించి మీమీద నాకు ఉంటున్న అభిమానం వల్ల చివరికి తెగించి మీ పెట్టెలోనే నా ఓటు వడేశాను. నేను కోరిన కించిత్తుసేవనీ మీరు మర్చిపోరని తలుస్తాను. వీలు చూసుకుని తమ దర్శనం చేసుకుంటాను..."

ఒక స్నేహితుడు:

"...అవునుగాని మా ఇంటికి అంత పన్నేమిటయ్యా? ఏదీ-నీ పలుకుబడి ఎంత గొప్పదో చూద్దాం—పన్ను ఎంతవరకు తగ్గించగలవో తగ్గించుమరి!...నీకు తెలుసుగా? మా వీధి చివర ఉన్నాడే సాహుకారు- ఆయన కమీషనర్‌కి ఇష్టుడని నా అభిప్రాయం- లేకపోతే అంత పెద్ద ఇంటికి అంతేనా పన్ను?...కమీషనర్ లేకుండా గొడ్డుకాకా వేశాట్ట- వాడికోసారి చురుకు తగిలితే గాని మన తడాఖా తెలీదు. అంత చేతకాని వాళ్ళనుకుంటున్నాడు కాబోలు"

"ఆకాశరామన్న":

"గోముఖ వ్యాఘ్రాలు మీ వెంట తిరుగుతున్నాయి. మీరు ఎంతో నమ్మినవాడనుకుంటున్న వైస్‌చైర్మన్ మీమీద విశ్వాసరాహిత్య తీర్మానం ప్రవేశపెట్టడానికి కుట్రలు పన్నుతున్నాడు. ఆయనకి ఎక్కువగా చనువివ్వటం మంచిది కాదు. కౌన్సిలర్లలో కొంతమంది మీ మీద విరుద్ధప్రచారం చేస్తున్నారు. సమయం చూసి వాళ్ళనట్టు చేతిలో చిక్కించుకోటానికి మీరు ప్రయత్నించాలి..."

(సౌజన్యం: చైర్మన్‌గారి చెత్తబుట్ట).



# అద్దంలో విప్లవం

కవి తన గదిలో కూర్చుని 'విశ్వ మానవ సౌభ్రాతృత్వము' అనే గ్రంథము యొక్క ఆఖరు పేజీలను అత్యుత్సాహంతో రాసేస్తున్నాడు. అతడి గదిఅంతా పుస్తకాలతోనూ కాగితాలతోనూ నిండిపోయి వున్నది. ఒక బీరువా కాళిదాసు, హోమర్, షెల్లీ, పోతన, మిల్టన్ మొదలైన పురాతన కవుల ఉత్కృష్ట గ్రంథములతోనూ, మరొక బీరువా జాన్సన్, గోల్డుస్మిత్, కందుకూరి, బెర్నార్డ్‌షా, టాల్‌స్టాయ్, టాగూర్ మొదలైన తరువాత కవుల పుస్తకాలతోనూ నింపబడివున్నై. మూడో బీరువాలో కవి రాసిన కాకి తుక్కు కథలు, నవలలు, నాటకాలు, గేయాలు, కావ్యాలు, రాజకీయ సాంఘిక గ్రంథాలూ పేర్చబడి వున్నై.

కవి తన గ్రంథరాజపు ఆఖరు పేజీ వ్రాయటం ముగించి, ఒక సిగరెట్టు ముట్టించి పురాతన కవుల పుస్తకాలున్న బీరువావైపు సగర్వంగా పొగ వదిలాడు. పురాతన కవులు తమతమ పుస్తకాలలోంచి బయటకువచ్చి చిరునవ్వుతో తనను ఆశీర్వదించటం పొగవెనక మసగగా కనపడింది కవికి. కవి సంతోషంపట్టలేక తెగ వదిలేస్తున్నాడు సిగరెట్టు పొగని. గదిఅంతా పొగతో నిండిపోయింది. కవి హృదయం సంతోషంతో నిండిపోయింది. కాని ఆధునిక కవులంతా తమతమ గ్రంథాలలోంచి బయటపడి ఏకగ్రీవంగా 'నీ గ్రంథాల్లోని భావాలు బూజు పట్టిన భావాలు, నువ్వు రాసేదంతా చెత్త' అనేటప్పటికి హృదయంలోంచి సంతోషం మాయమై నిరాశ ప్రవేశించింది.

'నేను చెత్త రాస్తున్నానా?' విచారంతో కవి ప్రశ్నించాడు.

'అవును. ముమ్మాటికీ చెత్త రాస్తున్నావు' ఆధునిక కవుల కంఠాలన్నీ ఎలుగెత్తి అన్నై.

కవికి మతి పోయింది. జుట్టు పీక్కుని ఒకసారి పూర్వకవులు అలంకరించిన అద్దాల బీరువావైపు చూశాడు. వాళ్లంతా చిరునవ్వుతో మళ్లీ ఆశీర్వదించేటప్పటికి కవికి ధైర్యంవచ్చింది. ఆధునిక కవిసముదాయంవైపు తిరిగి అన్నాడు:

'లేదు. నేను చెత్త రాయటంలేదు- మాడండి పూర్వకవులంతా నన్ను ఎట్లా అభినందిస్తున్నారో?

'వాళ్ల బుర్రలకు బూజు పట్టింది. వాళ్ళ అభిప్రాయాలూ, భావాలూ యీ ఇరవయ్యో శతాబ్దంలో ఎందుకూ పనికిరాని చెత్తగా పరిగణింపబడుతున్నాయి. కాబట్టి వాళ్లు నిన్ను అభినందిస్తున్నారంటే నువ్వుకూడా చెత్త రాస్తున్నావన్నమాటే!'' ఐక్య కంఠంతో చాటారు, ఆధునిక కవులు.

కవి చెవులు మూసుకున్నాడు. కళ్లు కూడా మూసుకుని కాసేపు ఆలోచించి ఉపన్యాస ధోరణిలో గంభీరంగా అన్నాడు——

'లేదు, నేను రాసింది చెత్త కాదు, నా భావాలు బూజుపట్టలేదు. నా భావాలను మీరు అర్థం చేసుకోలేక చెత్త అంటున్నారు. నా గ్రంథాలను మీరు అర్థం చేసుకోవాలంటే

కొండేపూడి సూర్యకామరాజు

మీరు మరొక శతాబ్దం బతకాలి. అప్పుడు నా గ్రంథాలనూ, నా భావాలనూ, నా అభిప్రాయాలనూ ప్రపంచం ఎలుగెత్తి పొగుడుతుంది. నా అభిప్రాయాలకు అనుగుణమైన రాజ్యాంగాన్ని ఏర్పరుచుకొని ప్రపంచం సుఖిస్తుంది. అందువల్ల నేను రాసింది చెత్తగాదు. నా గ్రంథాలను పొగిడిన పూర్వకవుల బుర్రలకు బూజు పట్టలేదు. వాళ్ళు రాసింది చెత్తకాదు. వాళ్ళ భావాలు బూజు పట్టినవి కావు. పూర్వకవుల విశాల హృదయాల్లోని భావాలు అన్నికాలాలకూ వర్తిస్తవి. నా అత్యభ్యుదయకరమైన భావాలు మీకిప్పుడు అర్థం చేసుకోటంచేత కాదు. మరొక శతాబ్దం తరువాత ఉండే ప్రపంచ పరిస్థితులతో నా ఉద్దేశాలను పోల్చుకుని పరిమానుకునే దూరదృష్టి మీకు లేదు.'

కవి తన ఆవేశపూరితమైన వచనాలాన్ని ముగించేటప్పటికి గదిలోని సిగరెట్టు పొగ అంతా కిటికీలలోంచి తలుపు సందుల్లోంచి మాయమైంది. దాంతో కవులంతా వాళ్ళ గ్రంథాలను మాత్రం అక్కడే వదిలి మాయమయ్యారు. కవి తన 'విశ్వమానవ సౌభ్రాతృత్వము'వైపు చూశాడు. వెంటనే అతడి పోయిన సంతోషం తిరిగి వచ్చింది. ఆ వ్రాతప్రతిని అటూ యిటూ తిప్పి సంతృప్తితో తనలో తను అనుకున్నాడు——

'ఈ గ్రంథానికి విలువ కట్టటం వీళ్ళ తరమా?— రాజ్యాంగాల్ని తయారు చేసేవాళ్లు యీ గ్రంథాన్ని అర్థంచేసుకో గలిగితే ప్రపంచం ఎంత సౌభాగ్యవంతంగా వుండునో కదా!'

గ్రంథం అచ్చవుతుంది. అనేకమంది చదువుతారు. అర్థమయినవాళ్లు మెచ్చుకుంటారు. అర్థం కానివాళ్ళు అందులో ఏదో విశేషముండబట్టే అర్థం కాలేదని మెచ్చుకుంటారు. మరికొంత మంది తన పుస్తకాలను మెచ్చుకోటం ఫాషన్ కాబట్టి మెచ్చుకుంటారు. ఎట్లాగూ ప్రజలు మెచ్చుకుంటారు కదా అని పత్రికలు పొగుడుతై. గొప్పగొప్ప పండితుల వద్దనుండి అభినందన ఉత్తరాలు వస్తై——కవి సంతోషం పట్టలేక పోయాడు. తనని తాను చూసుకోవాలని ఎదురుగావున్న నిలువుటద్దంవైపు నడిచాడు. కవి అద్దంలోకి చూడగానే అతడి ముఖం వివర్ణమైంది! కారణం, తన ప్రతిబింబానికి బదులు వీణాపాణిగా సరస్వతి నిలువుటద్దంలో నిలువునా ప్రత్యక్షమైంది!

'దేవీ——ఆజ్ఞ' అని సాక్షాత్కరించిన సరస్వతి మృదుపదాల ముందు మోకరిల్లాడు కవి.

'నువ్వు రాయటం మానెయ్. అదే నా ఆజ్ఞ.' సరస్వతి బి.బి.సి. రేడియోధ్వనితో అన్నది.

కవికి వెంటనే గొడ్డలి పెట్టి తలమీద బాదినట్టయింది. అతడు ముఖంపైకెత్తి సరస్వతి కళ్ళలోకి తీక్షణంగా చూసి అన్నాడు——

'దేవీ, పరిహాస మాడుతున్నావ్!'

'నీతోనా?——పరిహాసమా! సారస్వతానికి అధికారిణి అయిన సరస్వతీదేవి చెత్తతో కాగితాలు నింపే నీచకవితో పరిహాస మాడుతుందా!'

'దేవీ, నువ్వేనా మాట్లాడేది?' లేచి నిలబడి వణికిపోతూ కవి అన్నాడు.

'అవును నేనే——అబ్బాయ్, భ్రమ వొద్దు. నీ గ్రంథాలనుచూసి నేను గర్వంతో విర్రవీగటం లేదు. క్రుంగి కృశించిపోతున్నాను. నువ్వు నానాచెత్తా రాసి నన్ను చిన్నబుచ్చుతున్నావు. లోకం దృష్టిలో నన్ను చాలా చవుకగా చేశావు.'

సరస్వతి మాటలు వినలేక కవి చెవులు మూసుకున్నాడు. గద్గదస్వరంతో అతడన్నాడు—

'దేవీ, నీ కఠోరాక్షరాలతో యీ దీనుణ్ణి చిత్రవధ చెయ్యటం భావ్యంకాదు. నిన్ను చిన్నబుచ్చే——లోకం దృష్టిలో చవుక చేసే—ఉద్దేశం నా కెన్నడూ లేదు. నిన్ను రంగురంగుల కాంతులతో ప్రపంచంముందు ప్రకాశింప చెయ్యటమే నా గ్రంథాల పరమావధి. ఉత్త చెత్త గ్రంథాలురాసే నీచకవిగా నన్ను వర్ణించటం దేవికి తగని పని——దేవీ, యీ దీనుడి ముఖం ఒక్కసారి చూడు. ఈ దీనుడు రాసిన గ్రంథ సహస్రాలను మరొక్కసారి పరిశీలించి అర్థం చేసుకోటానికి ప్రయత్నించు.'

'నీ గ్రంథాలు అర్థం చేసుకునే తెలివి చదువుల సరస్వతినైన నాకే లేదంటావా!—ముమ్మాటికీ నువ్వు చెత్త రాశావు. నాకు తీరని అపకారం చేశావు. ఇకనైనా నువ్వు రాయటం మానెయ్' సరస్వతి కోపోద్రేకంతో అంది.

'ప్రజలంతా నా గ్రంథాలను వేనోళ్ళ పొగుడుతుండగా చెత్తరాస్తున్నానని నువ్వు నన్ను నిందించటం అన్యాయం దేవీ.'

'నువ్వు చెత్త రాస్తున్నావు. ప్రజలంతా వాటిని పొగుడుతున్నట్లుగా నువ్వు నీ గదిలో కలలు కంటున్నావు—నిజంగా ప్రజలు నిన్ను తిడుతున్నారు నీవల్ల నాకతీరని అపకారంజరిగింది.'

'ప్రజలు నన్నూ నా గ్రంథాలనూ తిడుతున్నారంటే నేను నమ్మను. నీ మాట నమ్మనందుకు నన్ను క్షమించు దేవీ!' అని కవి సరస్వతి ముందు నిలవలేక ధైర్యం సంపాదించుకోటానికి తను కొత్తగా రాసిన గ్రంథం దగ్గరకు చేరుకున్నాడు. మనస్సు సంక్షోభానికి గురైనందువల్ల కవికి మతిపోయింది. కవికి మతిపోయే సమయాలు సాధారణంగా రోజూ వుంటాయి, దానికి విరుగుడుగా అతడు సిగరెట్లు కాలుస్తాడు. కవి ఇప్పుడుకూడా ఒక సిగరెట్టు వెలిగించి గ్రంథ సమేతంగా సరస్వతివద్దకు తిరిగివచ్చాడు. సరస్వతి మాత్రం మాట్లాడకుండా వీణ వాయిస్తున్నది. కవికి సిగరెట్టు కావలసినంత ధైర్యాన్నిచ్చింది. సాక్షిగా సిగరెట్టు పొగవదుల్తూ సరస్వతితో అన్నాడు:

'దేవీ, యీ గ్రంథాన్ని ఒక్కసారి చిత్తగించు. కర్వాన్ అని కొత్త రచనతో సర్వప్రపంచ రాజ్యాంగ రచనో నీకే తెలిసిపోతుంది.'

'నీ గ్రంథం చదవవలసిన అవసరం ఇంకేమీ లేదు. ఇన్నాళ్లూ చెత్త రాసిన వాడివి ఇప్పుడు మాత్రం రాయవని నమ్మకమేముంది?—నిన్ను గురించి ప్రజలకున్న అభిప్రాయం నీ కిప్పుడే తెలుస్తుంది. విను జాగ్రత్తగా' అని సరస్వతి వీణ వాయించటం ఆపేసింది.

కవి చెవులొగ్గి వింటున్నాడు. 'డౌన్ విత్ చెత్తకవి, డౌన్ డౌన్' అని అనేకమంది ఏక కంఠంతో అనటం అతడికి దూరంనించి మెల్లగా వినపడింది. కవి నోరు తెరచుకుని ఇంటికప్పువైపు చూస్తూ వింటూనేవున్నాడు. రాను రాను ఆ ధ్వని దగ్గరకు వస్తూన్నట్టుంది. మరొక్కసారి దగ్గరగా 'డౌన్ విత్ చెత్తకవి, డౌన్ డౌన్' అని అతి సమీపంగా వినపడటంతోనే కవి సరస్వతి వైపు చూశాడు. సరస్వతి వెనకగా అద్దంలో పెద్ద జనసమూహం బారులు తీర్చి నల్లజెండాలు పట్టుకుని నిలబడివుంది. కవి తన కళ్ళను తానే నమ్మలేక పోయాడు.

'ఇప్పుడు చెప్పు-నువ్వు రాసిందంతా చెత్త కాదూ!' సరస్వతి ఖంగుమని మోగింది.

పోయే ధైర్యాన్ని సిగరెట్టు పొగతో అత్తు చేసి శాంతగంభీర స్వరంతో కవి అన్నాడు—

'కాదు-ముమ్మాటికీ కాదు'

కవి జవాబు వినగానే జన సమూహంలో కలవరం బయలుదేరింది. 'డౌన్ విత్ చెత్త కవి-డౌన్ డౌన్' 'తగలపెట్టండి చెత్త గ్రంథాలను' అంటూ జన సమూహం ముందుకు తోసుకు వస్తోంది. కవి కుడిచేతిలోవున్న 'విశ్వమానవ సౌభ్రాతృత్వం' కిందపడిపోయింది.

'తగుల పెట్టండీ' అని మరొక్కసారి జన సమూహం గొల్లుమంది. దాంతో అతని ఎడమ చేతిలోవున్న సిగరెట్టు కిందపడి అంతకుముందు కిందపడిన వ్రాతప్రతిమీదకు దొర్లింది. 'విశ్వమానవ సౌభ్రాతృత్వం' రాజుకోవటం మొదలుపెట్టింది.

'ఇకనైనా రాయటం మానేస్తావా?' సరస్వతి అడిగింది, అధికార స్వరంతో.

కవి మాట్లాడలేదు. తగులబడుతున్న వ్రాత ప్రతివైపు శిలా ప్రతిమలా చూస్తున్నాడు. కవి చూస్తూండగానే అతడి 'విశ్వమానవ సౌభ్రాతృత్వం' తగులబడి బూడిదగా మారింది— జన సమూహం మాయమైంది-గదిఅంతా పొగతో నిండిపోయింది.

'ప్రజలు నన్ను అర్థం చేసుకో లేక పోయినందుకు నేనంతగా విచారించటం లేదు. నువ్వుకూడా నన్ను అపార్థం చేసుకొంటున్నావంటే నా హృదయం రక్తబిందువుల్ని రాలుస్తున్నది. కాని, దేవీ ఒక్క విషయం గ్రహించు. నువ్వేం చేసినాసరే నిన్ను పూజిస్తాను-ఆరాధిస్తాను.' కవి కన్నీటితో అన్నాడు.

ఇంకా రాస్తావా!విజయగర్వంతో సరస్వతి అన్నది.

గంభీరంగా కవి అన్నాడు:

'రాయను. కాగితంమీద రాస్తే తగల పెడ్తారు. హృదయంలో రాసుకుంటూ, హృదయాన్ని ఎవరూ తగలపెట్టలేరు!'

సరస్వతి వీణ ఒక్కసారి మీటి చిరునవ్వుతో అంతర్ధానమైంది. కవి పొగను తట్టుకో లేక మూర్ఛపోయాడు. నల్లటి విశ్వమానవ సౌభ్రాతృత్వపు బుగ్గి గాలి కెగిరి గది నలుమూలలా నృత్యం చేస్తోంది. ఆ నృత్యాన్ని నిలువుటద్దం ప్రతిబింబింప చేస్తోంది.

నిరక్షరాస్యత ఒక మూలనించి పారగొట్టబడుతూంటే, మరో మూల నుంచి మళ్లీ దాపురిస్తున్నది. ప్రాథమిక పాఠశాలలను కళ్లెత్తి చూడకుండాను, అనుభవజ్ఞులైన ప్రాథమికోపాధ్యాయుల సలహాలను మన్నించకుండాను, ప్రభుత్వం యీ సమస్య పరిష్కరించడానికి ప్రయత్నిస్తున్నది.

# అందరూ చదువుకోవాలి: ఔనుగాని—

వెన్నవెల్లి సుబ్బారావు

ఈనాడు మనదేశ ప్రభుత్వాలు నివారించవలసిన దుర్యోగాలెన్నో వున్నాయి. ఆదిలో అన్నవస్త్రాల కరువును నివారించాలి. అటు వెనుక అవినీతిని నిర్మూలించాలి. వీనికితోడు అస్పృశ్యతను, అంటురోగాలను, ఆర్థిక దుస్థితిని, అనారోగ్యాన్ని, మద్యపాన మహారాక్షసిని, కులమత కక్షలను, కుటిలదురాచారాలను, కష్టజీవులబాధలను, కమ్యూనిస్టుల వేధలను, నివారించి ప్రజలకు సుఖసంతోషాలను కలిగించవలసియుంది కూడా. వీటన్నిటికంటె ముఖ్యంగా దేశప్రజలకు ఆవహించియున్న నిరక్షరాస్యత పోయి. ప్రజలు జ్ఞానవంతులైతే మిగిలిన ఈతిబాధలన్నింటినీ ఉపాయాంతరాలతో కొంతవరకు వారే తొలగించుకునే శక్తి కలుగుతుంది. తమ హక్కు బాధ్యతలను గుర్తించి, ప్రజలు ప్రభుత్వాలతో సహకరించడానికి అక్షరాస్యత మిక్కిలిగా తోడ్పడుతుంది.

అక్షరాస్యత అంటే: ఎవరి మాతృభాషలో వారు వ్రాత, చదువు నేర్చి, ఉత్తరాలు, చిన్న పుస్తకాలు. పత్రికలు చదివి అర్థంచేసికొని, యితరులకు చెప్పగలశక్తిన్నీ, సామాన్య వ్యవహారాలలో అవసరమయ్యే లెక్కలు కట్టుకొనగల శక్తిన్నీ, కొంతవరకు లోకజ్ఞానమున్నూ కలిగియుండడమని పలువురి అభిప్రాయం. ఇందు నిమిత్తం మన ప్రభుత్వాలు ప్రాథమిక పాఠశాలలను పెట్టి, పెట్టించి, కోట్లకొలది ధనమును వెచ్చించుచున్నవి. సర్కారువారు తాము వ్యయముగా నడుపుచున్న పాఠశాలలేగాక, బోర్డు, మిషన్, ఎయిడెడ్ ఎలిమెంటరీ స్కూళ్ళకున్నూ ధనసహాయముచేసి ప్రాథమిక విద్యాభివృద్ధికి పాటుపడుతున్నారు. ఇది ఈడుగల బాలబాలికలకందరకు ప్రారంభవిద్య ఉచితముగా నేర్పబడుచున్నది.

క్రమక్రమంగా పాఠశాలలసంఖ్య, ఉపాధ్యాయులసంఖ్య, విద్యార్థులసంఖ్య విస్తారంగా పెరిగిపోతున్నది. కాని అక్షరాస్యులసంఖ్య మాత్రం తగినంతగా పెరగడంలేదు. 5 తరగతులు పూర్తి అయ్యేదాకా చదివేవాళ్ళే తక్కువ. (నూటికి పది) 5వ తరగతి ప్యాసైన వాళ్ళయినా, మరి రెండుసంవత్సరాలు పోయేసరికి నిరక్షరాస్యులుగానే తయారవుతున్నారు. పల్లెటూరి పెద్దలంతా ఈనాటి చదువులను నిరసిస్తూనే వుంటారు. వెనుకటి చదువులతో పోల్చిచూపించి, ఈనాడు 5వ తరగతి ప్యాసైన వాళ్ళకు అక్షరజ్ఞానమే లేదని, ఉత్తరం ముక్కైనా వ్రాయలేరని, బజారులెక్కైనా చేయలేరని, పూర్వం పెద్దబాలశిక్ష చదువుకొన్న తామే వీళ్ళకంటె ఎన్నోరెట్లు మేలని చెప్పుకుంటూ వుండడంకద్దు. ఈ మాటలలో యే కొంచెమో అతిశయోక్తివున్నా, మొత్తంమీద ఈ నాటి ప్రారంభవిద్య ఖర్చునకు తగిన ప్రతిఫలమివ్వడం లేదనిమాత్రం అంగీకరించక తప్పదు.

ప్రాథమిక పాఠశాలల అభివృద్ధితో 5వ తరగతి ప్యాసయ్యేవారి సంఖ్య కొద్దికొద్దిగా హెచ్చవుతున్నా, స్థిరపడని వారి అక్షరజ్ఞానం క్రమక్రమంగా క్షీణించిపోతూ వుండడంవల్ల, ఎంత ధనవ్యయంతోనైనా మనదేశంలో అక్షరాస్యుల సంఖ్యను, సంఖ్యారూపంలోనేగాని, విశాలంగా అభివృద్ధి చేయడం యింతలో సాధ్యపడదేమోనని అనుమానించవలసి వస్తున్నది. ఏమంటే ఒక మూలనుంచి నిరక్షరాస్యత పారగొట్టబడుతూంటే, మరో మూలనుంచి మళ్లీ దాపురిస్తూ వుండడం వల్ల (అక్షరజ్ఞానం పూర్తిగా లేకపోవడం, ఉన్నది కాస్త కొద్దికాలంలోనే మరచిపోవడ,

వల్ల) అవి పూర్తిగా తొలగించబడాలంటే అసాధ్యమైన కాలయాపన కాకపోదు. మేధావులు కొంతమంది పంచవర్ష ప్రణాళికలు, దశవర్ష ప్రణాళికల తయారుచేసి, నిరక్షరాస్యతను రూపుమాపాలని భగీరథ ప్రయత్నాలు చేస్తున్నారు. అది మళ్లీ దాపురిస్తున్న అపయోగం వారిదృష్టిపథాన పడ్డట్టు తోచడం లేదు. చివరకంతా శ్రమప్రమాద ప్రహసనంగా వుంటుందేమో! ప్రాథమిక పాఠశాలలను కళ్లెత్తి చూడకుండాను, వాటి ఉపాంగాల పరిస్థితులను అవగాహన చేసుకోకుండాను, అనుభవజ్ఞులైన ప్రాథమికోపాధ్యాయుల సలహాలను మన్నించకుండాను, ఎంత మేధావులైనా ఈసమస్యను పరిష్కరించడం సాధ్యం కాదు.

ఈ పరిస్థితికి తోడు దేశమంతా కాంగ్రెసుమయమే కావడంచేత, గాంధీగారు మన కిప్పించిపోయిన 'రామరాజ్యమే' ఈనాడు విద్యాశాఖలోకూడ ప్రతిబింబిస్తున్నది. ఉదాహరణకొక్క విషయం:-ఆ మహనీయుడు ప్రవాదిచేసిన మూలవిద్య (Basic Education) కొన్ని మార్పులతో యిప్పు డుపాధ్యాయులకు 5 మాసములలో శిక్షణ యివ్వబడుతున్నది. అందులో గొప్ప విశేష మేమంటే, అన్ని కులాలవారు, మతాలవారు ఒకచోటనే కలిసి భుజించడం; స్వయం సంపూర్ణత్వానికట, వంట, వడ్డన, గృహభాండ శుద్ధి, మురుగు దొడ్లను శుభ్రపరుచుట, బట్టలను ఉతుక్కొనుట, యిత్యాదులన్నీ నేర్పుతున్నారని వింటున్నాము. ముందెప్పుడో, యేకొన్ని శతాబ్దాలకో, చాకలి, మంగలి, దాసి, పాకీ, సాలె, వడ్రంగి మొదలగు పనివాళ్లు పూర్తిగా అదృశ్యులైపోతారని, వాళ్లు చేసే పనులన్నీ యిప్పటినుంచి యెవరికి వారు చేసుకోవడం నేర్పుమని, పసిపిల్లలకుకూడా నేర్పమని అధికారుల అభిప్రాయం కాబోలు! రాజకీయాలలో రచ్చకెక్కిన కులమతాచార సమస్యను విద్యాశాఖద్వారా సాధింప బూనడం సమంజసంగా కనిపించదు. విద్యాశాఖను ఈ విధంగా సంస్కరింప బూనడంకంటే, యిప్పటి [illegible] వుండే నీరసత్వానికి కారణాలు కనిపెట్టి [illegible]మైన అక్షరాస్యులను వృద్ధిచేయుటకు [illegible] కోవడం ముఖ్య అవసరంగదా!

ఇప్పటి విద్యయొక్క నీరసత్వాన్ని గురించి, ఫలశూన్యత్వాన్ని గురించి ఈమధ్య ఒకాయన తన స్వవిషయం యిట్లా చెప్పగా విని, నిజమే యని నమ్మవలసివచ్చింది. ఆయన తాత ప్రయిమరీ పాసై తాణేదారుగాచేసి పాతిక ఎకరాలభూమి సంపాదించాడట. ఆయనతండ్రి లోయర్ సెకండరీ వరకు చదివి ఘరానా ఉద్యోగాలన్నీ చేసి (ప్రెసిడెంటుపదవులూ వగైరా) మంచి ప్రఖ్యాతిపొంది ముప్పాతిక భూవసతి తగులబెట్టాడట. ఆయన స్కూల్ ఫైనల్ ప్యాసయి మాస్టరు ఉద్యోగం చేస్తున్నాడట. ఆయన కుమారుడు బి. ఏ. ప్యాసయి ఒక గొప్పపట్టణంలో గుమాస్తాగిరీ చెలాయిస్తున్నాడట. తండ్రి తగులబెట్టగా మిగిలిన స్థిరాస్థి అంతా తన కుమారుని చదువుతో నశించిపోగా ఈనాడు రెక్కలమీద ఆధారపడి జీవిస్తున్నామని చెపుతూ, ఆనాడు లోయర్ సెకండరీ, మెట్రిక్యులేషన్ వాళ్ళకున్న విజ్ఞానం, ఈనాడు యఫ్. ఏ., బి. ఏ. లకు లేదని అభిప్రాయమిచ్చాడు. విన్నవాళ్ళలో కొందరు "అంతేనండీ, యిప్పుడు పెద్దచదువులు యిట్లాగే వుంటున్నాయండీ" అని ఆయనను సమర్థించారు. పెద్దచదువుల ప్రయోజకత్వమే యిట్లావుంటే ప్రారంభ పాఠశాలలో ప్రతి సంవత్సరం మెట్లెక్కించబడి 5వ తరగతి ప్యాసైన విద్యార్థి యొక్క అక్షరాస్యత యెంత దృఢంగా వుంటుందో పెద్దలంతా ఆలోచించవచ్చు.

ప్రారంభవిద్య యింత నీరసించి పోవడానికి ఉపాధ్యాయుడొక్కడే బాధ్యుడు కాడు. వానిది ప్రధాన పాత్ర అయినా ప్రారంభవిద్యకు సంబంధించిన యితర ఉపాంగాలలో వుండే లోపాలతో కలిసి ఈ దురవస్థకు వచ్చింది. ఆ ఉపాంగాలు యేవంటే 1 విద్యార్థి; 2 వాని పోషకులు; 3 పాఠశాల, దాని ఉపకరణములు; 4 పరీక్షాధికారులు, వారి రికార్డులు; 5 సిలబస్సులు—పాఠ్యపుస్తకాలు; 6 బోధనాపద్ధతులు; 7 సర్కారువారు (ప్రభుత్వము)—ఈ ఏడింటితోను ప్రధానమైన ఉపాధ్యాయుని కలుపగా [illegible] దళచక్ర పరిభ్రమణంలో [illegible] కృశించిపోయి ఈనాటికి ఈ [illegible]ంది. ఈ అష్టాంగయోగంలో [illegible]యున్న లోపాలన్నిటిని అతి జాగ్రత్తగా

తమోదు వంతు...... ...... ...... ......

అవలంబించుకుంటే, ఏ కొంతకాలానికైనా ప్రారంభ విద్యా వికాసాన్ని పొందవచ్చు. ఈ దురవస్థలోనే పాలకులు కొన్నిచోట్ల ప్రారంభ విద్యను నిర్బంధంచేసి ఫలితాలను గమనిస్తున్నారు. నిర్బంధ ప్రారంభవిద్య అమలు జరుప బడుచున్న ప్రదేశాలలో, ఉపాధ్యాయులూ, పోషకులూ, అధికార్లు అష్టకష్టాలు పడుతున్నా దారీతెన్నూ కనిపించడం లేదని పత్రికలద్వారా వెల్లడిస్తున్నారు. ఏదేమో బాగ వాలచేత ఉచితంగా అయినా తమ బిడ్డలకు చదువు చెప్పించుకో లేనివాళ్ళు, చెప్పించుటకు యిష్ట పడనివాళ్ళు మన దేశంలో చాలా మంది వున్నారు. అందువల్ల నిర్బంధ విద్యా విధానం యిప్పట్లో కొంతకాలం విరమించడమే యుక్తమని తోస్తుంది.

ఇకమరి ప్రస్తుతం సాగుతున్న ప్రారంభ విద్యనే కొంతవరకు గట్టి పరచవలసి వుంటుంది. ఇందు నిమిత్తం పాఠ్య పుస్తకాలు 'కొంతకాలాని కొయ్యలు'గా తయారు చేయించి బడిలో పెట్టించడం వివేకయుక్తమైన పనికాదు. దాని వల్ల వున్నరూపుకూడా చెడుతుంది. మరి చేయవలసిన పని కొంతవరకు ఉపాధ్యాయుల చేతులలోనే వుంది. వారు ప్రారంభ పాఠశాలల లోని విద్యార్థులకు సంపూర్ణ అక్షరజ్ఞానమును కలుగజెయ్యాలి. అంటే స్వరాక్షరములు, సంయుక్తాక్షరములు, వీనికి సంబంధించిన గుణిత రూపాలు, సాధ్యమైనంత వరకు విద్యార్థుల దృష్టి పథానికిచ్చి, (పదముల ద్వారానే) అవి వారి హృదయాలలో వర్ణక్రమ సహితంగా నాటుకునే టట్లు చెయ్యాలి. అక్షరమేదో తెలియక, ఉచ్చారణ రాక, తడుముకుంటూ ఒక్కొక్క అక్షరమే కూడబలుక్కొని చదివే దురవస్థ, ఏ తరగతి విద్యార్థికైనా తప్పించాలి. ఏ విధానం చేతనైనా స్థిరముగా నిలిచే అక్షరజ్ఞానం కలిగించవలసిన బాధ్యత ఉపాధ్యాయునిదే. కాని క్రమశిక్షణకొరకు అతడు విద్యార్థులను స్వల్పంగా దండించక తప్పదు. నవీన పద్ధతులలో పనికి రాదని చెప్పబడే "భయం" కొంతైనా విద్యార్థికి లేకపోతే వానికి విద్య తేర్పడం అసాధ్యం. స్వల్పశిక్షకే ఉపాధ్యాయునిపై దండెత్తిపోవు అలవాటు పోషకులలో కొందరికి కద్దు. అది పూర్తిగా తగ్గించుకొని, తమ బిడ్డల యొక్క క్షేమాలకు క్రమశిక్షణతో కూడిన విద్య అవసరమని వారు గుర్తించాలి. ఉపాధ్యాయుని సాధక బాధకాలను కనిపెట్టి కొంతవరకు అతనికి సహాయపడాలి. ప్రారంభవిద్యకుసంబంధించిన ఇలాంటిసవరణలు మరికొన్ని కూడా వున్నాయి. అన్నీ చెప్పబోతే మరొక పెద్ద గ్రంథ మవుతుంది. విద్యాధికులకు, విద్యాధికారులకు, ఉపాధ్యాయులకు చాలవరకు తెలిసిన విషయాలే. గనుక యీ లోపాలున్నా క్రమంగా వారే సవరించుకోవలసి వుంటుంది. ప్రజలందరకు కావలసిన దేమంటే ప్రాథమికవిద్య బహుళ వ్యాప్తమై నిరక్షరాస్యత క్రమంగా తొలగింప బడడం. రెండవది: ఆ విద్య బడి మానివేసిన యేడాది లోపుగానే అంతర్హితమై విస్మృతిగర్భంలో పడకుండునట్లు దృఢపరచబడి, నిత్యజీవితంలో ఉపయోగపడడం; ఈ రెండు ఆశయాలు ఫలించే టట్లు ప్రారంభ విద్యాభివృద్ధికి కృషి చేయవలసినదిగా అన్ని వర్గాలవారినీ అర్థించుదాం.


ప్రఖ్యాతిగాంచిన ప్రశస్తమైన

## మెహతావారి
## విశేష ఔషధములు

1. సుందరి ఎలిక్జర్ :—సమస్త బుతు దోషములను పోగొట్టును, గర్భాశయరోగ అనుపను నివారిణి.
2. ఫాస్ఫగస్ ఆయిల్ :—బాధ నివారణకు సాటిలేని తైలము.
3. మస్తానాపిల్స్ :—సాధారణబలహీనత, కీళ్లనొప్పులు, జ్వరము అన్నిటికీ అమోఘముగా పని చేయును
4. ద్రాక్షాసవము :-(బంగారము, మకరధ్వజము కలిపినది) రక్తమును శుద్ధి పరచునటువంటి, అజీర్ణము రూపు మాపునటువంటి బలవర్ధకౌషధము.

కెమిస్టు లందరివద్ద దొరకును.

తయారు చేయువారు :

**K. S. MEHTA & CO.**
**250, China Bazar, Madras.**

# ఆహ్వానం

మూలం: రవీంద్రుడు                                                  అనువాదం: "అమరేంద్ర"

(గురుదేవుని ఆఖరి పుట్టినరోజున ప్రచురితమైన "జన్మదినే" కావ్యంలో ఒక గేయానికి ఇది స్వేచ్ఛానువాదం. తన కవిత్వ ప్రయోజనం పరిమితమైనదని గ్రహించి మరొక నవకవిత అవతరించవలసిన అవసరాన్ని ఆయన గుర్తించినట్లు ఈ గేయంవల్ల తెలుసుకోగలం. ఇది ఎనభై యేళ్లు నిండిన వృద్ధ కవి నమ్రతకీ ప్రగతి శీలానికీ నిదర్శనం.)

ఇంత మహాప్రపంచాన్ని గురించి నాకేంత తెలుసు?
ఎన్నో మానవ చేష్టలూ
ఎన్నో నగాలూ, నగరాలూ
ఎడారులు, సాగరాలు, దేశాలూ
అజ్ఞాత జీవాలు, అపరిచిత వృక్షాలు
అందకుండా నా చైతన్యప్రాకారానికి
అవల దూరంగా నిలబడినయ్
అపరిమితం ఈ ధరిత్రి
అపారం జీవితం
ఏదో ఒక మారుమూల ఒదిగిన నా హృదయం
ఎవరో చెప్పిన మాటలతో వేసిన వర్ణనలో
తనివితీరని దాహంతో
తన శూన్యభావనా సామ్రాజ్యాన్ని అద్భుత
పదాలతో నింపుకుంటుంది.
అవును, నేనీ లోకపు కవిని
జీవితంలోని వివిధమైన అనుభవాలు
నా భావవీణమీద విభిన్న స్వరాలు పలికిస్తయ్
ఈ విశ్వసంగీతం సాగరమై పొంగి
కెరటాలతో నా మనస్సుని ముంచివేసినప్పుడు
ఈ లోకపు నిగూఢ సత్యం
మెరుపులాగా నా మనోనేత్రం ముందు తళుక్కు
మన్నప్పుడు
ఏవేవో ఊహాలతో
ఏవేవో కలలతో
నిండిపోయింది నా గుండె
సుదూరపర్వతాల దిగంచలాన
దాటలేని మంచుకొండల వరసలు
వాటి వినబడని మధుర సంగీతంతో
నన్ను పిలిచినయ్
ఎన్నోసార్లు పలుకరించినయ్.
శూన్యంలో ఒంటరిగా తేలిపోయే
ధ్రువనక్షత్రపు అస్పృశ్యకాంతి, అతిలోక కాంతి
మిరుమిట్లు గొలిపింది నిద్రరాని నా కళ్ళని.
దూరాన దూకుతున్న మహాజలపాతం ప్రచండ
ధ్వానం
నా హృదయంలో ప్రతిధ్వనించింది.
అన్ని దేశాల కవులూ
అన్ని కాలాల కవులూ
తమ స్వరాలు మేళవించిన
అనంతప్రకృతి సంగీతంలో
నా కంఠం కూడా కలిసింది
నా ప్రాణం ఎంతో మురిసింది.
అన్నిటికంటే దూరంగా
అర్థంకాని రహస్యంగా
నిలబడ్డాడు మానవుడు.
కాలదేశాల పరిమితులకు అవల
నిలబడింది మానవాత్మ.
హృదయాన్ని హృదయం ప్రేమతో పలుకరించి
నప్పుడే
మనిషిని మనిషి తెలుసుకోగలడు
కాని, అన్ని తావుల లోనూ నాకు ప్రవేశం దొరక
లేదు
నా జీవిత విధానాలు నాకు అడ్డంవచ్చి
నన్ను ఎడంగా దూరంగా నిలబెట్టినయ్.
పొలాలు దున్నే హాలికులూ
వలలను పన్నే జాలరులూ
వడకలు నేసే సాలీ

సమ్మెట పోటుల కమ్మరి
తమ విశ్వవ్యాప్తమైన విశేష కృషితో
తమ విభిన్న కర్మల ఘర్మజలంతో
తమ భుజ స్కంధాలమీదనే లోకాల్ని మోస్తున్నారు
వారిని నే నెరుగుదును
నా కీర్తి నిర్మించిన ఎత్తయిన అంతస్తునుంచి
వారిని చూశాను.
వారి జీవితాల ప్రాంగణాలు దాటి
లోపలి ఆవరణలోకి, నట్టింట్లోకి పోలేక
బైటే నిలబడ్డాను.
ప్రాణితో ప్రాణికి బలీయమైన అనుబంధం లేకుంటే
పాటలన్నీ, బూటకపుమాటల మూటలని నాకు తెలుసు.
నాపాట నలుగడలా పాకి
నరులందరి గుండెలనీ తాకి
చరితార్థం కాకుంటే
నా తపస్సు నిష్ఫలమని నే నెరుగుదును.
అందుకే ఎదురు చూస్తున్నాను
నీ సందేశం కోసం, నవకవీ!
శ్రామిక జీవుల హృదయ స్పందం నీ ఛందంలో వినటంకోసం
ధారుణి దారుణ దుఃఖసుఖాలను లీనం చేసిన గానంకోసం
నిరీక్షిస్తున్నానోయ్ యువకవీ!
నీ కోసం, నీకోసం!
నీ పాటకి అలంకారాలు, ఆడంబరాలు, అట్టహాసాలు అవసరం లేదు.
నీ తేటపాట నిష్ఠుర సత్యాలకి రాచబాట
నేను అందించలేక పోయిన సందేశాన్ని
నువ్వే లోకానికి వినిపించాలి
ఒడ్డున నిలబడి తుచ్ఛ సానుభూతితో సంతృప్తి పడక
అభాగ్యజీవుల ఆర్తిని లోకానికి వినిపించు
ఓ నవకవీ! యువకవీ!

ఈ దీనజనుల మూగవేదనలని మాటలలో నింపి
ఈ జగతి చెవులకి వినిపించు
వారి ఆత్మల ఆక్రందనని నీ కవనంలో ప్రతిధ్వనించు
వారి వంచిత హృదయాల బడబాగ్ని చల్లార్చి
వారి కన్నీరు తుడిచి ఓదార్చి
వారిలో నవచైతన్యం నాట్యమాడించు
ఈ నిరానంద నీరస మానవధరణికి
నవజీవన వికాసాన్ని
నవ్యాశా ప్రకాశాన్ని
ప్రసాదించాలి నవకవీ!
ప్రతీక్షిస్తున్నాం నీకోసం :
మానవహృదయంలో మాటుమణిగి నిద్రించే
కరుణానిర్ఝరి నీ
కవనంతో మేలుకొలుపు
అవమానంతో అడుగున అణగారే
అభాగ్యజీవుల అశ్రువరహాసాలను
నీ కవనంలో మెరిపించు
నీ గానంలో మోగించు
ఏకతార చేబూని నిలిచిన ఈ క్షుద్రకవిగానాన్ని
కవితాదేవత తీర్చిన కొలువులో, ఈ మహాసభా మంటపంలో
ప్రతిధ్వనించే అనంత సంగీతంలో
తరతరాల కవివర్యుల తరగని మాధుర్యంలో
ఒక చరణంగా లీనమైపోనీ
రానోయ్, యువకవీ!
నన్ను వారి హృదయాంతరాలలోకి తోడ్కొనిపో.
ఇంతదగ్గరే వుండికూడా ఎంతో దూరంగా వున్నవారి
ఆత్మల లోతులకి నన్నుకూడా తోడ్కొనిపో.
నువ్వే వారికి ప్రాణం!
నువ్వే వారి మూగప్రాణాల గానం!
నువ్వే వారి భాగ్య విధానం!
ఓ నవకవీ! ఓ యువకవీ!
ఇదుగో నా ఆహ్వానం!
అదుగో నా అభివాదం!



# సంఘము : వ్యక్తి

వి. యస్. అవధాని

వ్యక్తి సంఘంలో నివసిస్తున్నాడు. సంఘంలో అభివృద్ధి చెందుతున్నాడు. అతని సహజ వ్యాపారం సంఘంలో వెల్లడి అవుతోంది. అయితే సంఘం అంటే ఏమిటి అనే ప్రశ్న చాలా తేలిగ్గా కనుపించినా దాన్ని గురించి ఉన్న వివిధ అభిప్రాయాలు తెలుసుకోవలసి ఉంది. వ్యక్తుల కలయికయే సంఘం. ఒక సంఘంలోని వ్యక్తుల మొత్తం అంతా సంఘం అవుతుంది. ఈ అభిప్రాయం నూతనమైంది కాకపోవచ్చు. కాని "సంఘంలోని వ్యక్తుల మంచిని మించిన మంచి ఏమీ లేదు. సంఘం వ్యక్తికి ఉపకరించాలా, సంఘానికి వ్యక్తి ఉపకరించాలా అన్న ప్రశ్న-సంఘాసక్తులకూ, వ్యక్తి ఆశయాసక్తులకూ భేదా లేనంతవరకూ-లేదు. సంఘం వ్యక్తుల కలయికయే కాదు. అంతకన్న ఎక్కువయింది — అన్న అభిప్రాయంగల తాత్విక సూత్రం ఒకటి ఉన్నది, ఇందులో పరస్పర విరుద్ధమయిన అంశాలు కనిపిస్తున్నాయి. వ్యక్తి మేలు కన్న మించినది లేదు అంటూ సంఘం అందులోని వ్యక్తులకన్నా గురుతరమయింది అనడం ద్వంద్వానికి (dualism) ఆస్కారం అవుతోంది. సంఘాసక్తులూ, వ్యక్తి ఆసక్తులూ ఒకటి కాకపోతే ఈ సూత్రం ఏవిధంగా సంఘ నిర్వచనం ఇస్తుంది? వ్యక్తి ఆసక్తులు సంఘ ఆసక్తులకన్న భిన్నంగా ఉంటే వ్యక్తి ఆ ఆసక్తులను తగ్గించుకోవాలా? లేక సంఘ ఆసక్తులు వ్యక్తి ఆసక్తులకన్న భిన్నమయినపుడు వ్యక్తి సంఘాన్ని తన ఆసక్తితో కుదింపు చేయాలా? రెండూ ప్రకృతి విరుద్ధమయిన పద్ధతులే. ఈ బాధ తొలగించుకొనేందుకు - "వ్యక్తుల కలయికయే సంఘం. వ్యక్తి స్థానాన్నిబట్టి సంఘం యొక్క స్థానాన్ని నిర్ణయించాలి. వ్యక్తుల అనుభవంలోకి వచ్చే సుఖం యొక్క మొత్తమే సంఘం యొక్క స్వేచ్ఛ అవుతుంది. వ్యక్తి శ్రేయస్సుకూ, స్వేచ్ఛాసముపార్జనకూ సంఘం ఉపయోగపడాలి. వ్యక్తి స్వేచ్ఛాసముపార్జనకే సకలమూ వినియోగపడాలి. వ్యక్తిని కేంద్రంగా తీసుకునే ధర్మం, నీతీ, అన్నీ ఉండాలి. ఎందుకంటే ఇంతవరకూ సాగిన ప్రకృతి పరిణామంలో (మానవుడు) వ్యక్తి మాత్రమే ఉత్తముడు. కాబట్టి సంఘానికి మూలమూ, అధినేత, వ్యక్తి అని - అనుకుంటే వ్యక్తి ప్రయత్నానికి, సంకల్పశక్తికీ, ప్రాధాన్యం ఇచ్చినవార మవుతాం. వ్యక్తి ప్రయత్నం కుంటుపడితే అతని భవిష్యత్తుకు కారకుడూ నిర్మాతా తానే అనే భావం తొలగుతుంది. ఆ భావం తొలగితే వ్యక్తి సంఘం అనే బండి చక్రంలో ఒక ఆకు మాత్రమే అయి వ్యర్థుడవుతాడు. వ్యక్తిని ఉద్ధరించాలిసిన తాత్వికత వ్యక్తినే హీనపరిస్తే — అ సంఘా స్వేచ్ఛకు బాట కాదు.

మానవచరిత్రలో ఒకానొకప్పుడు వ్యక్తి భద్రతకు అతనికంటె భిన్నమయిన శక్తిమీద ఆధారపడవలసిన అవసరం ఉంటే ఉండియుండవచ్చు. ఈనాడు వ్యక్తి సంఘం కోసరం కుదింపు కావాల్సిన అవసరం లేదు. ఈ వ్యక్తి ప్రకృతి నుంచి కొన్నిదశల తదనంతరం పరిణామం చెందాడు. అయినా అతనికీ ప్రకృతికీ ఉన్న బొడ్డు సంబంధం పూర్తిగా వాడిపోలేదు. బహుశా ఎన్నటికీ వాడిపోదేమో కూడా! అయినప్పుడు మాతృక అయిన ప్రకృతి లక్షణం మానవునిలోనూ ఉన్నది. అతడు ప్రకృతినుండి ఆవిర్భవించాడు అనడంలో అతనూ ప్రకృతిలోని వాడేనని అంగీకరించాలి. ప్రకృతిలో ఒకభాగమయి ప్రకృతి ప్రవాహగమనాన్ని నిష్పాక్షికంగా విచారించగలుగుతున్నాడు. ప్రకృతిలోని వివిధాంశాలలో ఏవీ వాడిపోకుండా, ఎటువంటి నష్టం పొందకుండా, ఎవరికది తన ప్రత్యేకతను కాపాడుకుంటూ ప్రవాహగమనాన్ని సాగిస్తున్నవో అలాగే

సంఘంలోని వ్యక్తులుకూడా ఎవరి ప్రత్యేకతను వారు కాపాడుకుంటూ ఉమ్మడిగా కావాల్సిన పనులకు వలసిన పరస్పర సహకారం సంపాదించగలరు. అట్లా సంపాదించడానికి ఒకరి నొకరు అర్థం చేసుకోగలగాలి. ఒకరిపట్ల నొకరికి సానుభూతి ఏర్పడాలి. ఇది ఏర్పడడానికి ఆస్కారం సంఘం కావాలి. సంఘం వ్యక్తిని అధిగమించి పోకూడదు. లిబరల్స్ వ్యక్తిని కేంద్రంగా తీసుకుని ఆర్థికరంగంలో స్వేచ్ఛా వ్యాపారాన్ని ప్రవేశపెట్టారు. అయితే మానవునిలో చైతన్యాన్ని జీవపదార్థంగా కాక నిర్జీవ పదార్థంయొక్క క్రీడగా భావించారు.

అట్లాంటి భావనలో (Static being) స్థావరమగు జీవి అనేది ఒకటి ఉండాలి. నేటి శాస్త్రీయ పరిశోధనలు-స్థావరంగా కదలకుండా-ఏమీ లేవు. ప్రతిదీ అంతర్గతంగానో - ఒక దశ నుండి మరొక దశకో లేక ఒక స్థితినుండి మరొక స్థితికో లేక ఒక చోటనుండి మరొక చోటికో కదలగల సహజ శక్తిని కలిగి ఉన్నది... అని ఋజువుచేస్తున్నాయి. జీవపదార్థంకదిలే సూత్రాలకీ నిర్జీవ పదార్థాల గమనానికీ తేడా ఉన్నది. నిర్జీవం అంటే ప్రాణంలేనిది అని అనుకుంటే దానికి గమనం ఎక్కడిదీ అనే ప్రశ్న వస్తుంది. గమనం అనే మాటను దాని స్థితికి అది వచ్చిన విధం అని అనుకుందాం. అప్పుడు అది అస్థితికి అది వచ్చిన సూత్రం కేవలం (మెకానికల్) యాంత్రికంగా ఉంటుంది. ఈ లక్షణాన్ని ఆస్కారం చేసుకుని లిబరల్స్ ఊహించిన సంఘంలో వ్యక్తి సంఘానికి దాసుడయిపోడు. సంఘం ఎప్పుడూ దానికి సంబంధించిన యాంత్రిక సూత్రాల ననుసరించి సాగిపోతూంటుంది. వ్యక్తి సాంఘిక ధర్మాన్ననుసరించి—ఆ ధర్మం నిరాఘాటంగా సాగిపోవడానికి సాయపడాలి. అంటే అవసరమయిన మేరలో తనను తగ్గించుకోవాలి. వ్యక్తిశ్రేయస్సు—అతను పొందే స్వేచ్ఛ సంఘం పొందే స్వేచ్ఛాశ్రేయస్సులనుబట్టి నిర్ణయించబడుతుంది. అంటే సంఘం ఒక రకపు స్వేచ్ఛను పొంది దాన్ని అనుభవిస్తోందనుకోండి. వ్యక్తి అనుభవంలోకి అది రాకపోయినా అతడు ఊరట పొందాలి. ఫలితంగా వ్యక్తి సంఘమనియ మానికి బానిసట్లు అయిపోతాడు.

అనటువానుకూలమైన జీవపదార్థం ఒక దశనుంచి మరొకస్థితికి, ఒక చోటునుంచి మరొక చోటికేగాక అంతర్గతంగాకూడా సంకల్ప (creative) రూపకమగు మార్పునుపొందగలదు. ఇట్టి పదార్థంతోనే మానవుడున్నాడు. అతనిలోని అవయవాలు కేవలం సంఖ్యలోనేగాక, బలంలోనేగాక, గుణంలోకూడా అను దినమూ మార్పు నొందుతున్నాయి. పరిసరానికి సంబంధించిన సంగతిని తన పూర్వ జ్ఞానంతోనే గాక రాగల అనుభవ దృష్ట్యాకూడా విమర్శించ గల శక్తి మానవునికి ఉన్నది. ఆ శక్తిని సంఘం త్యాగం అనే పేరుతోనో సాంఘిక ధర్మం అనే పేరుతోనో అణచి వేయరాదు.

వ్యక్తికి తననుగురించిన పూర్తిజ్ఞానం వున్నప్పుడు తన పొరుగువాణ్ని గురించికూడా పూర్తి జ్ఞానం ఉంటుంది. తన సంగతీ తన పొరుగువాని సంగతీ పూర్తిగా తెలిసివున్నప్పుడు తన పొరుగు వానికి ఇబ్బందికలిగే పనిని తాను సహజంగా చేయడు. సంఘం వ్యవస్థారూపం దాల్చి, భయానకమగు అధర్మ ధర్మం అనే పేరుతో వ్యక్తిమీద తరతరాలనుండీ స్వారీచేస్తున్నది. దానికి సహాయపడడానికి లేని అనేక రకాల రంగులు వేసి తాత్వికతను తెలివి గలవారికీ తెలివి తక్కువవారికీ ఎక్కించారు. ఇంకా ఆ ఆట సాగుతూనే ఉన్నది. ఈ గారడీలో శంకరుడూ, హెగెల్ గొప్పవారు. వీరి నుండి కొంతగా గ్రహించి మార్క్సు ఇంకో తమాషా చేశాడు. మార్క్సు సంఘానికీ వ్యక్తికీ ఉన్న సంబంధం విషయంలో సంఘానికే ఎక్కువ ప్రాముఖ్యం ఇచ్చాడు. సూక్ష్మంగా చెప్పుకుంటే ఇంతవరకూ విశ్వతాత్విక రంగంలో అవతరించిన వారెవరూ వ్యక్తినీ సంఘాన్నీ సరి సమానంగా చూడనే లేదు. ఇక వారు వ్యక్తి శ్రేయస్సూ, మానవధర్మాలను నిలిపేందుకు, సంఘం అని ఎలా అనగలరు?

"వ్యక్తికి ప్రాముఖ్యం ఇస్తే అరాజకం రాదా?" అని కొందరంటారు. వ్యక్తికి ప్రాధాన్యం ఇవ్వడం అంటే నియమంలేని స్వేచ్ఛను ఇవ్వడంగాదు. "వ్యక్తి శ్రేయస్సు" కన్నభిన్నమయిందిలేదు. మానవుని అంతర్గత, బాహ్య శక్తులన్నీ అనంతంగా సదా అభివృద్ధి

ఉండాలి. ఏ ఒక్కరినీ ఇంకొకరి పేరుతో బలి చేయరాదు" అన్న ఉత్కృష్టాదర్శాన్ని అవశ్యంగా గ్రహించాలి.

"పదార్థవాదికి నీతి అంటే ఏమిటి?" అని కొందరంటారు. పైగా "పైకి కనుపించేదే నిత్యం. ఇహలోకసుఖమే అంతిమాదర్శం. తినడం త్రాగడం, అనుభవించడమే వీరి లక్ష్యం." అని కూడా అంటూంటారు. ఈ రకపు నింద ఈ నాటిది కాదు. ఎపిక్యూరస్, చార్వాకుల నాటినుంచీ పదార్థవాదులు ఇటువంటి దురాగతాన్ని ఎదుర్కొంటూనే ఉన్నారు. కాని నిజానికి ఎపిక్యూరస్—అతని శిష్యులూ జీవించిన విధం చూస్తే ఈ నాడు వారినితిట్టే వారికంటె ఎన్నో రెట్లు ఎక్కువ నీతివంతంగానూ నియమవంతంగానూ వారు జీవించినట్లు తెలుస్తుంది.

అలంకారశాస్త్రం ఉద్దేశించినదికూడా సమన్వయమే (harmony). ఈ అలంకార శాస్త్రానికీ, ధర్మానికి (ethics) సంబంధం ఉన్నది. ప్రకృతిలోని ఒక విశేషాంశం మానవ మేధ కందినపుడు అలంకారం అవతరిస్తోంది. ఈ అలంకారమే అతనికి నీతిపట్ల నొక వైఖరినిస్తోంది. ఆ వైఖరియే అతని సాంఘిక నడవడిని తీర్చిదిద్దుతోంది. ఎందుకనంటే నియమబద్ధమైన ప్రకృతినుండి కలిగిన అలంకార సంవేదన ధర్మబద్ధమయింది. కాబట్టి సహజంగా హేతువాది అయిన మానవుడు ప్రాథమికంగా నీతిగలవాడవుతాడు. ప్రకృతి సమన్వయానికీ, తన సుఖానికీ తనతో పాటు ఇతరుల సుఖానికీ అడ్డురాకుండా తన ప్రవర్తన ఉండాలి. కనుక అతనికి హేతువాదానికి నిలిచేదీ, తన స్వేచ్ఛకూ తన పొరుగువాని స్వేచ్ఛకూ సహాయపడేదీ, తన జ్ఞాన సముపార్జనకు సహాయపడేదే ధర్మం, నీతి అవుతాయి.

అటువంటి గీటురాయిని ప్రమాణంగా పెట్టుకున్న స్వేచ్ఛాభిలాషియగు మానవుడు తనకై తాను నీతివంతుడవుతాడు. నీతిబాహ్యమైన వ్యవస్థా జీవితం తాను గడపలేడు కనుక వ్యవస్థలను నీతివంతంగా మార్చడానికి యత్నిస్తాడు. అవసరం అయితే పాత వ్యవస్థలోని మంచిని స్వీకరించి-లేక వాటిని పూర్తిగా తన జ్ఞానశక్తిచే నిర్మూలించి కొత్త వ్యవస్థలను నిర్మిస్తాడు. అతని బాట ఇతరు అనుకున్నంత సులభమయిందీ కాదు, అది కనిపిస్తున్నంత భయానకమైనదీ కాదు. అతను తనకు తానే ఆదర్శం. తన ఆదర్శాలను సాధించే దృష్టితో కృషి చేస్తాడు. తను సాధించదలుచుకున్న (ends) ఆదర్శాలు సిద్ధించనపుడు అవి సిద్ధించడానికి కావాల్సిన సరంజామాను తాను సేకరిస్తాడు. తానే ఆ ఆశయసిద్ధికి పాటు పడతాడు. అలా పడడంలో అతడు తన ఆశయ సాధనకు ఉపకరకణం అవుతాడు. అలా ఉండడం బలవంతానకాదు. ఇతర్లు మెప్పిడం కోసం కాదు. అంతకు భిన్నంగా తను ఉండలేడు కనుక, అలా ఉండడం అతని ప్రకృతికి సహజం గనుక అలా ఉంటాడు.

నీతి అనేది సంఘం నిర్ణయించే ప్రతిపత్తి కాదు. వ్యక్తి సహజవ్యాపారానికి ఉపలబ్ధి అయ్యేది, వ్యక్తిగత సహజాభివృద్ధికి దోహదం ఇచ్చి సత్యాన్వేషణకు చేయూతనిచ్చి పరస్పర సహకారం చేసుకోగల సామ్యతాహేతువు వ్యక్తి యొక్క శరీరతత్త్వం దృష్ట్యా అలవరచగల విషయం. నీతి వ్యక్తికీ సంఘానికీ కూడా Subjective గానూ Objective గానూ ఉంటుంది. సకల మానవప్రయత్నానికీ, సంకల్ప శక్తికీ, జ్ఞానకృషికీ—ఆదర్శం నీతి. జ్ఞానవంతుడు మాత్రమే నీతిగలవాడు. హేతువాదం మాత్రమే వ్యక్తికి తనను గురించీ, తన సంఘాన్ని గురించీ, తను నివసిస్తున్న పరిసరాలలోని వివిధ వీచికలూ ఎలాంటి ఆంతర్గత సంబంధం కలిగి ఉన్నవో ఏకత్వ దృష్టితో (Monistic) అన్నింటినీ ఒక సామ్యమునకు లొంగింపుచేసి నిశ్చితంగా తెలియచేయ




సీరియల్



## 14

రామదాసు వెళ్ళిపోవడానికి నరసింహం సమ్మతించక పోయినప్పటికీ, అతను వెళ్ళి పోయాక స్వేచ్ఛగా వుండటానికి. అతను తన ప్రియురాలితో ఒంటరిగా వున్నాడు; సరోజకు యింక ప్రియుడూ, సోదరుడూ అతనే. ఆమెను కనిపెట్టి చూసేవాళ్లెవరూ లేరు. వెంటనే వెళ్ళి ఆమెదగ్గర వాలడం అతని కిష్టం లేకపోయింది. రెండు రోజులవరకూ ఆమె దగ్గిరికి వెళ్ళకుండా వున్నాడు; ఆమె తను వెళ్ళగానే తనకేసి ఎలాగ చూస్తుందోననీ, ఆమెతో తను ఏమి మాట్లాడాలోననీ ఆలోచిస్తున్నాడు.

వాళ్ళ సమావేశం మొదట్లో కొంచెం బాధగా వున్నా ఎంతో ఆనందం కలిగించింది. పుట్టి మొదటిసారిగా ఒకరి ప్రేమ నొకరు అర్థం చేసుకున్నారు. మొదట పదినిమిషాలూ యిద్దరూ కంగారుపడి మెల్లిగా ఏదో విషయం మాట్లాడారు తరువాత వారిద్దరి హృదయాలు విడినాయి. తరువాత వారి సంభాషణలో అన్ని విషయాలూ చర్చించబడ్డాయి. తనభర్త పోయిన తర్వాత అంత త్వరగానే వాళ్ళ వివాహం జరగడం బాగుండదనీ, మరి కొన్నాళ్లు ఆగటం మంచిదనీ సరోజ చెప్పింది. నరసింహం ఒప్పుకున్నాడు. తనకు ఆస్తి ఏమీ లేదనీ, నరసింహాన్ని వివాహం చేసుకుంటే శేషగిరి తాలూకు మిగతా ఆస్తికూడా తనకేమీ దక్కదనీ స్పష్టంగా చెప్పింది సరోజ. నరసింహం ఆస్తిపాస్తులగురించి ఎప్పుడూ బెంగపడడు; అతనికి అక్కరలేదుకూడా.

రామదాసు వాళ్ళ మనస్సులకు చాలా దూరంగా వున్నాడు. ఎప్పుడూ కలుసుకోబోని, చాలా దూరంగావున్న మిత్రుడిగురించి మాట్లాడినట్టు ఒక్కక్షణం అతన్నిగురించి మాట్లాడారు. ప్రేమికుల కుండవలసిన ఆత్మాభిమానమంతా వారిదగ్గర వుంది. ప్రపంచమంతా యిప్పుడూ యికముందూ తమకోసమే నడుస్తోం దనుకుంటున్నారు.

రెండునెలలపాటు వాళ్ళు ప్రియమైన భావనా ప్రపంచంలో గడిపారు. వాళ్లు ఒకరినొకరు ప్రేమించుకున్నారు—అదే చాలు వాళ్లకి. వారు ఏరీతిగా ఒకరినొకరు కలుసుకున్నారో ఆ పరిస్థితులను ఒక్కసారీ ఆలోచించలేదు.

ఒక రోజున ఏదో మాటల సందర్భంలో సరోజ ఉత్సాహంతో, నరసింహం వ్రాసిన ఉత్తరాలగురించి ప్రస్తావించింది. ఆమె ఊహా ప్రపంచంలో గడిచిపోయిన ఘట్టంగురించి జ్ఞాపకంవచ్చి ఆ విషయం ఎత్తింది.

ఆమె ప్రశ్నలు విని నరసింహం చాలా పరితాపాన్ని కనబర్చాడు. రామదాసు ఆకృతి అతనికి అప్రయత్నంగా కనిపించింది. అత నేమీ

తురంగి వెంకటరావు

జవాబు చెప్పలేదు; తన స్నేహితుణ్ణి వివరంగా అడిగి తన ప్రియురాల్ని యింత కలవరపెట్టిన ఉత్తరాలగురించి తెలుసుకోనందుకు చాలా నొచ్చుకున్నాడు.

ఆమె ఊరుకోలేదు. ఆ ఉత్తరాల్లోని కొన్ని విషయాలు వాక్యాలు పూర్తిగా వల్లించిచెప్పింది. నరసింహానికి అనుమానం కలిగింది. ఆ ఉత్తరాలు జాగ్రత్త చేశావా అని అడిగాడు. ఆమె చిరునవ్వు నవ్వుతూ వెళ్ళి ఉత్తరాలు తెచ్చి చూపించింది.

"ఇవిగో, యిప్పుడు మీరు నన్ను యింతగా ప్రేమిస్తున్నారుగాని, పూర్వం ప్రేమించి వ్రాసిన ఉత్తరాలు జ్ఞాపకం లేవూ ..వినండి" అని ఆమె ఆ ఉత్తరాల్లో ఒకటి పూర్తిగా చదివి వినిపించింది. నరసింహం తెల్లబోయి చూశాడు, ఆమెకు నవ్వు వచ్చింది. ఆ ఉత్తరాలు అతను తీసుకుని చూశాడు. అతనికంతా తెలిసింది.

రామదాసు తన ప్రేమకు, ఆరాధనకు సాక్షిగా ఆ ఉత్తరా లున్నాయని గ్రహించకుండాగూడా పారిపోయాడు. అతను పొందిన నిరుత్సాహంతో అతని మనస్సంతా ఒకే విషయం ఆక్రమించుకొని వుంది— అది అతను వెళ్ళిపోవడం, తక్షణం వెళ్ళిపోవడం.

ఆఖరికి నరసింహం దాసు హృదయంలోని లోతులు తెలుసుకో గలిగాడు. అతని చేతుల్లో రహస్యమంతా వుంది; మహోత్కృష్టమైన గంభీరత అతన్ని ఆవరించ లేకపోయింది. అతని యౌవనలో ప్రేమ ఎలుగెత్తి అరచింది, దాన్ని అణచిపెట్టా డతను.

సరోజ చెయ్యి తన చేతిలోకి తీసుకున్నాడు. "మనం ఒకరినొకరం ప్రేమిస్తున్నాం అనుకుంటున్నాం. ఇంతకాలం మనం చిన్నపిల్లల్లా గడిపేశాం. మన నిద్దరినీ ఏకం చేసిన ఆ వ్యక్తి గురించి ఒక్కసారి కూడా తలపోయలేదు. అతను మనకు దూరంగా పోయి ఎంతో బాధపడుతున్నాడు, మనమిక్కడ స్వార్థపరత్వంతో, ప్రేమతో మధురక్షణాలు గడుపుతున్నాం. నీకంతా తెలుసు సరోజా! మనం కరడుగట్టిన హృదయాలు గలవాళ్ళం అని అని పించుకో కూడదు, ఈ ఉత్తరాలు నాకు కను విప్పయి సత్యాన్ని తెల్పాయి ... రామదాసు చరిత్ర విను." అని రామదాసు తనకు చెప్పిన చరిత్రంతా చెప్పాడు.

అతని జీవితమంతా ప్రేమతో నిండియుండి, త్యాగం పరమావధిగా పెట్టుకున్నాడని చెప్పాడు. రామదాసు ఆమెతల్లి రాజేశ్వరమ్మ దగ్గర నిరాకరించిన సంగతి చెప్పాడు సరోజ ఆమాట విని ఏడ్చింది. తను పూర్వం మూర్ఖంగా ప్రవర్తించిన సంగతంతా జ్ఞాపకం వచ్చింది; అతను అనుక్షణమూ తనరక్షకుడుగా వుండి తనని అపాయాల్నుంచిఎలారక్షించాడో జ్ఞాపకానికివచ్చింది.

నరసింహం అక్కడితో ఆగకుండా దాసు తన ఆశయంకోసం ఎంతెంత త్యాగాలు చేశాడో చెప్పాడు ప్రతీ సంఘటననూ నొక్కిచెప్పాడు అతను అనుభవించిన కష్టాలు, వర్ధ దురవస్థ, అన్నీ వివరించాడు. సరోజ బడిలో వున్న ఆ పన్నెండేళ్ళు దాసుపొందినఆరాటం, అతననుభవించిన ఒంటరిపాటు గురించి ముందు చెప్పాడు నరసింహం; ఆ తరువాత దాసు పరిశోధన మానేసి, ఆమెకోసం త్యాగంచేసి సుబ్బారాయుడి కార్యదర్శిగా ఉండడం, ఆమె ప్రపంచంలోని ఆడంబరంకోసం, ఆదరణకోసం వెర్రిగా ప్రాకులాడుతూంటే దాసు ఈర్ష్యతో వాటిని నివారించబోవటం, గోదావరి ప్రాంతాల్లో వాళ్ళు గడపిన రోజులు యివన్నీ ఒక్కొక్కటే చెప్పాడు. అతను చెబుతూంటే జరిగిన కథంతా అతని కళ్ళకు కట్టినట్టుగా వుంది. జరిగిన ప్రతీ విషయం ఎంతో సమంజసంగా తోచింది; తన స్నేహితుడు ఏ విషయం రహస్యంగా దాచాడో అతను గుర్తించాడు అతని గొంతు ఎండిపోయింది. కళ్ళలో నీరు నిల్చింది. కొంచెం శక్తి తెచ్చుకుని నరసింహం ఉత్తరాల గురించి మాట్లాడాడు అతను నిజం చెప్పేశాడు; దాసు ప్రేమ గురించి, అతని వ్యథితహృదయం గురించి సరోజకు స్పష్టంగా చెప్పాడు. అతని హృదయాన్ని గాయపరచిన వారు అతని హృదయాన్ని సరిగా తెలుసుకోలేకపోయినవారే అన్నాడు, అతని ఆరాధనకు బహుమానంగా అతనిమీద యింకో త్యాగపరీక్ష పెట్టారన్నాడు.

నరసింహం అంతా చెప్పాక శాంతించాడు. తల ఎత్తి సరోజ ముఖంకేసి తీక్షణంగా చూశాడు; ఆమె వణికిపోతోంది.

ఆమె రామదాసుతో మాట్లాడిన చివరిరోజు జ్ఞాపకం తెచ్చుకుంది; ఆరోజు ఆవిధంగా మాట్లాడి అతన్ని ఎంత నొప్పించానో అనుకుంది. అతను గడిపే దుఃఖకర జీవితం ఆమె కళ్ళముందు ఒక్క మెరుపులా మెరిసింది. అతనంటే ఎంతో జాలి పుట్టి అతనిదగ్గర క్షమాపణ కోరుకొందామనుకుంది.

“అతనలా ఆత్మనాశనం చేసుకోవడం మనం సహించలేము. మనం కూడా ఎంత త్యాగం చెయ్యగలమో మనకే తెలుసు. మనం సుఖా అంతబాధకూ, అన్ని కన్నీళ్ళకూ కారణభూతమైతే మనం భరించలేము.” అన్నది సరోజ.

“అయితే మనం ఏం చెయ్యాలంటావు?” అన్నాడు నరసింహం.

“మీరు నా పరిస్థితిలో వుంటే ఏం చేస్తారు? నా కర్తవ్యం మీరు చెప్పండి.” అంది

నరసింహం ఆమె ముఖంలోకి చూశాడు “పద, మనం వెళ్ళి రామదాసుని కలుసుకుందాం” అన్నాడు నెమ్మదిగా.

ఆవేళ సాయంత్రం నరసింహానికి అతని స్నేహితుడి దగ్గరనుంచి ఆవేదన కలిగించే ఉత్తరం వచ్చింది. జ్వరంతో వ్రాసిన ఆ ఉత్తరం ఆఖరిసారి సెలవు పుచ్చుకున్నట్టుగా వ్రాశాడు. అతను తనకి కొంచెం జ్వరం వస్తోందని వ్రాశాడు. దాసు ఉత్తరం వ్రాయడంలో ఎంతో ధైర్యంగా వుండడానికి ప్రయత్నించాడు గాని, అతని బాధలు వ్రాయకుండా వుండలేకపోయాడు.

సరోజ, నరసింహం అతని స్థితి విని భయపడి తమ ప్రయాణం సాగించారు.

రామదాసు చెన్నపట్నం వదిలిపెట్టాక అతనింక విచారాలతో బాధపడ నవసరం లేదనుకున్నాడు, కాని ప్రయాణంలో అతనెంతో అస్థైర్యపడ్డాడు. అతనెక్కువగా మాత్రం బాధపడలేదు. అతని జీవితం భగ్నమై పోయింది; అతను నీరసించిపోతున్నాడు; ఈ ఆఖరిబాధ ననుభవించటానికి శక్తి సంపాదించుకోవడానికే ప్రయత్నిస్తున్నాడు.

పెంటకోట చేరగానే రామదాసు తన పాతగది అద్దెకు తీసుకున్నాడు. పూర్వం అతనెంతో బాధననుభవించి అజ్ఞాతవాసం చేసిన స్థలమదే. కిటికీ తలుపుతీసి సముద్రంవైపు చూశాడు. సముద్రం చాలా చిన్నదిగా కనిపించింది—కారణం ...అతనిలో ఏర్పడిన అగాధం అంతకంటే విశాలమైనది. కెరటాల శబ్దం విన్నాడు, అవి రాళ్ళమీద చేసే శబ్దం అతనికి పిడుగులు పడినట్టుగా వుంది. మోహావేశం అతని రక్తనాళాల్లో లేదు, తనలో ఏదైనా కెరటాలు కొద్ది కల్లోలముంటే దాన్ని తుడిచివేస్తున్నట్టుగా వుంది. అతను సముద్రపు ఒడ్డంటే నడిచాడు, కాని అతని దేహాన్ని యీడుస్తున్నట్టుగా వుంది. అడుగడుక్కీ అతనికి ఆయాసం వొస్తోంది. అతనికి తనెక్కడో దూరంగా, పరిచయంలేని దేశాల్లో సంచరిస్తున్నట్టుగా వుంది. ఆకాశంలోకి అనంత వాయువుల్లోకి అతని మండిపోయే గుండె వేడి నిట్టూర్పుల్ని పంపిస్తోంది.

త్వరలోనే అతను పైకి వెళ్ళలేనంత నీరసస్థితికి వచ్చాడు. కిటికీల దగ్గరకూర్చుని రోజల్లా గడిపేవాడు రొదచేస్తున్న నీళ్ళనిచూస్తూ. సముద్రమంటే అతనికి కొత్త ఉత్సాహ మేర్పడింది. సముద్రం మందంగా విచారకరమైన గర్జనతో తన హృదయంలో ప్రతిధ్వనించి నిరాశ అధికం చేసి తన మృత్యువును త్వరపెడుతోందని అతనికి తెలుసు.

ఆ తరువాత అతను విశాలమైన సముద్రం కేసీ, అనంతమైన ఆకాశంకేసీ చూస్తూ తన్ను తాను సముదాయించుకొనేవాడు. ఆకాశం, గాలి, నీరు వీటి పరిశుద్ధత అతని అనారోగ్య పరిస్థితుల్లో అతని నిరుత్సాహాన్ని పోగొట్టేది. ఆకాశం అంచులలో అతన్ని సమ్మోహింపజేసే వెలుగు కనిపించేది, ఆ వెలుగులో తాను లీనమయిపోదామనుకునేవాడు. త్వరలోనే అతను మంచంమీదనుంచి లేవలేని స్థితికి వచ్చాడు. ఆ గదివాసాలు, తెల్లనిగోడ తప్ప అతనికింకేమీ కనిపించటంలేదు. రోజంతా అలాగే చూస్తూ పడుకునేవాడు. తను చాలారోజులక్రిందటే చచ్చిపోయినట్టూ భూమిలో చాలా లోతుగా తనని పాతిపెట్టేసినట్టూ భావించేవాడు.

ఎప్పుడూ అతను విచారంగావుండేవాడు, ఏకాంతంగా, నిశ్శబ్దంగా ఆలోచిస్తూవుండేవాడు. తన జీవితమంతా జ్ఞాపకం చేసుకునేవాడు. అతను కళ్ళు మూసుకుంటే అతని జీవితమంతా అతని ముందు నడిచేది. క్షణంనుంచీ, అతను యింకా

తప్పుచేసి చూసేవాడు గాదు, తన అంతర్యాం తానే చూసుకుని పరీక్ష చేసుకునేవాడు. ఆ క్షణాలు అతనికి ఒక విధమైన ఓదార్పు నిచ్చేవి. అతని హృదయంలో పశ్చాత్తాపం లేదు.

అతని ఆలోచనల్లో నరసింహం, సరోజ ఎప్పుడూ నవ్వుతూ కనిపించేవారు. ఆ దృశ్యం అతని మోహావేశాన్ని శాంతింపచడానికి బదులు అతన్ని ఓదార్చి ఆనందపరచేది. తను అమితంగా ప్రేమించిన వారి నిద్దరినీ కలిపి వారిద్దరి సౌఖ్యాన్ని తను చిత్రించి చూసుకుని ఆనందించేవాడు.

రాజేశ్వరమ్మ నమ్మి తనకు అప్పజెప్పిన కర్తవ్యం, ఆమె కోరిక ప్రకారమే తను చెయ్యగలిగాడు. అతని ఆఖరు ఘడియల్లో తన ప్రేమే తనచేత ఆ మహత్తరకార్యాన్ని చేయించగలిగిందని అతను గుర్తించాడు. సరోజను తను ప్రేమించకపోతే అంత యీర్ష్యతో ఆమెను అనుక్షణమూ కనిపెట్టి వుండకపోను. రాజేశ్వరమ్మ చనిపోయేటప్పుడు ముందు జరగబోయేదంతా ఆమె ఊహించివుండివుండాలి—దాసు తనకూతుర్ని ప్రేమిస్తాడనీ, ఆమెను ప్రియుడుగా అతను ఎల్లప్పుడూ సంరక్షిస్తూ వుంటాడనీ, అవసరం వచ్చినప్పుడు త్యాగం చేసి అతను చచ్చిపోతాడనీ ఆమె తనలో తను అనుకొనివుండాలి.

ఒక రోజున రామదాసు జ్వరంలో ఒక అనుమానం కట్టింది. అతను మళ్ళీ పాత ఆవేదనలో పడ్డాడు. రాజేశ్వరమ్మ అంతర్యంలో ఆలోచించి తననే సరోజను భార్యగా స్వీకరించమని అభిప్రాయపడిందేమో. తను యిలాగ చచ్చిపోవటం, సరోజను యింకొకరికిచ్చి పెళ్ళి చేయటం వీటివల్ల తను ఆమె అప్పగించిన పని సరిగా నిర్వర్తించలేకేమో! అతని హృదయం కొట్టుకోవడం ప్రారంభించింది. మళ్ళీ ప్రాణశక్తి అతనిలో చేరుకుంటోంది.

కాని అతను వెంటనే గుర్తించాడు తను చేసిన ఆలోచన పిరికి పందలు, స్వార్థపరులూ చేసేదిగావుందనీ, అతని మోహాంయొక్క ఆఖరి వ్యూహమనీ భావించాడు. అతనికి తాను చాలా అందవిహీనుడననేసంగతి జ్ఞాపకం వచ్చేటప్పటికి నవ్వువచ్చింది. తను ఎల్లప్పుడూ యితరులను ప్రేమించడానికేగాని, వారిచేత ప్రేమింపబడటానికి పుట్టలేదని బాగా అనుభవంవల్ల తెలుసుకున్నాడు. అతను తెలివితేటలతో బతికేశాడు, అతని కాజ్ఞానమూ, ధైర్యమూ వున్నాయి. శాంతిసౌఖ్యాలు అతన్ని నూతనంగా ఆవరించాయి. అతను చనిపోతున్నాడు—గొప్పగా, ఔన్నత్యంతో, జయప్రదంగా.

ఆఖరి ఘడియలు సమీపించాయి. మరణబాధ ఆసన్నమైంది. అతను చనిపోతుంటే కాకి గంగ నోట్లో పొయ్యటానికి పొరుగింటి ముసలావిడ ఒకామె వచ్చివుంది. దాసు వీమీ గోలగ లేదు. అతనికింకా సముద్రపు హోరు వినిపిస్తోంది. సముద్రం తనకోసం విడుస్తోందనే ఆలోచనకట్టి అతనెంతో సంతృప్తి చెందాడు.

ఆఖరిసారి వెలుతురును చూడటానికి అతను కళ్ళు తెరచినప్పుడు నరసింహం, సరోజ అతని పక్కదగ్గర నిలుచుని దుఃఖిస్తూవున్న దృశ్యం అతనికి కనిపించింది. వాళ్ళనిచూసి అతను ఆశ్చర్యపడలేదు. చిరునవ్వునవ్వి హీనస్వరంతో యిలా అన్నాడు:

"మీరు రావడం చాలా మంచిపని చేశారు. మీ దగ్గర అంత్యసమయంలో సెలవుతీసుకుంటానను కోలేదు...మీ ఆనందం చెడగొట్టడంగాని, మీకు యీ ఆనంద సమయంలో విచారం కలిగించటంగాని నా యిష్టంలేదు.....మిమ్మల్ని చూడటం నా కెంతో సంతోషంగావుంది. మీకు నా ధన్యవాదాలు"

సరోజ అతను అమిత విచారంలో వుంటాడనుకుంది. అతని పాలిపోయినముఖం రాబోయే మృత్యువుతో శోభిస్తోంది. అతని తలచుట్టూ కాంతివలయం వున్నట్టుగా ఆమెకుగోచరించింది. అతని పెదవులమీద మధురమైన చిరునవ్వువుంది. కళ్ళు స్వచ్ఛంగా ప్రకాశిస్తున్నాయి. సరోజ అంతప్రేమతో గూడిన ముఖాన్ని, అంతఉత్కృష్టత సూచించే ముఖాన్ని తనెప్పుడూ చూడలేదనుకుంది.

"దాసుగారూ మమ్మల్ని ఎందుకు మోసం చేశారు!" అంది ఆమె నెమ్మదిగా.

దాసు కొంచెంపైకి లేచాడు. తన మిత్రులను కన్నె పూర్వకంగా చూశాడు. "అలా అనకు సరోజా, నువ్వన్నది వాస్తవంగాలేదు."

"మాకంతా తెలుసు...నువ్వు చచ్చిపోవటం మాకిష్టం లేదు, నీకు సుఖం కలుగ జేయాలని మేము వచ్చాము."



వెలుగు-చీకటి! వెలుగు-చీకటి! మెయిలు ప్లాటు ఫారము విడిచి సాగిపోతూంటే పైనవున్న దీపపుకాంతి కిటికీలద్వారా లోనప్రవేశించి నప్పుడు వెలుగు. రెండు కిటికీలమధ్య చీకటి.

మెయిలు ఉక్కుగుర్రంలా పరిగెడుతూంది. బహుళ త్రయోదశి రాత్రి కాటుకలాంటి చీకటిలో దూరపు కొండలు మరణానంతరం కూడా వీడిపడే పాపపురాసుల్లా వున్నాయి. ఇంజను విడిచి వెడుతూన్న రాక్షసిబొగ్గు రవ్వలు చీకటి కడుపులో చిటపటలాడే ఆకలి నిప్పులవలె మెరుస్తున్నాయి.

అది కలకత్తా వెడుతూన్న మెయిలులో చిన్న పెట్టె. దాంట్లో క్రిందన నాలుగు బెంచీలు పైన రెండు బెంచీలు వున్నాయి. నేను విజయనగరం స్టేషనులో ఆ పెట్టెలో దూరబడగానే అందులో అదివరకే వున్న ఆరుగురు ఆసాములు ఆరుగొంతుకలతో అరుస్తూ నామీద విరుచుకు పడ్డారు:

"మేమంతా కలకత్తా వెళ్ళేవాళ్ళమండీ. రాత్రల్లా నిద్రలేక చావాలి. ఇంకో పెట్టెలోకి వెళ్ళమరూ."

"నేనూ కలకత్తా వెళ్ళేవాణ్నే. ఇంకో పెట్టె అంటూ వుంటేగా వెళ్ళడానికి" అన్నాను సామానులు సర్దుతూ.

ఏడుగురు పూర్తిరాత్రి ప్రయాణీకులు, ఆరు బెంచీలు! ఈ సమస్య తేలడం ఎలాగ? మొహం ముడిపెట్టుకొని బెంగాలీఆయన చేతిఅద్దంలో చూసుకొంటూ వెంట్రుకలు లేకపోయినా, తల గబగబ దువ్వుకొంటూ నలభైఅయిదు డిగ్రీల కోణంలో నావైపొకసారి చూశాడు. జోడు విప్పి బెంచీకింద తోస్తూంటే "కోడిగుడ్లున్నాయండోయి జాగ్రత్త" అన్నాడు ఒక నాయుడుగారు. క్రిందనున్న మిగిలిన యిద్దరూ మీదనున్న ఒక ఆయనా స్నేహంగానే మాట్లాడేరు. ఆరో ఆయన యేదో, చవకబారు అపరాధ పరిశోధక నవల తిరిగి చదవ నారంభించాడు.

ఆరో ఆసామీ కుడిచేతి బంగారంమురుగు, ఉంగరాలలో రాళ్ళు, బెంగాలీ ఆయన బీడీ పీల్చినప్పటి వెలుగులో మెరిసాయి.

రైలు మహాఘోష పెడుతూ పరిగెడుతోంది. దూరపు పల్లెల ఇళ్ళల్లో దీపాలూ, ఆకాశకంలో వెలిగే నక్షత్రాలు, మిన్నుమన్ను ఏకం చేస్తున్నాయి. నా పడక ఇంకా యెక్కడో, నిశ్చయం కాలేదు. నాగావళీ వంతెనదాటించి రైలు

అంగర వెంకటకృష్ణారావు

బిరిగిపోతూంటే అది భూమిని బద్దలు కొట్టుకొని పాతాళలోకం ప్రవేశిస్తుందేమో అనిపించింది. దూసి స్టేషనులో మరో ముగ్గురు ప్రయాణీకులు మా పెట్టెలో చేరగానే మా సమస్య బహు క్లిష్టంగా కనుపించింది. అందరం అరనిమిషం మీటింగు చేసి స్టేషనుమాస్టరుతో రిపోర్టు చేశాం. ఆయన మరో అరనిమిషం ఆకాశంమీద వున్న నక్షత్రాలతో సంప్రదించి చివరకు మామీద జాలిపుట్టి "పలాసాలో మరో పెట్టె తగిలించేటట్టు చేస్తాం" అన్నాడు. వీలాగూ క్రిందకు దిగేం కదా అని ప్రసిద్ధికెక్కిన దూసి పూరీలను కొనుక్కొని మా పెట్టె చేరుకున్నాం.

మేమంతా యెవరెవరు పలాసాలో క్రొత్త పెట్టెలోకి మారాలో, మారినవాళ్ళు రాత్రి మట్టుకి ఏదో సామాన్లు తీసుకొని వెళ్ళాలో మొదలైన విషయాలు చర్చించుకొంటున్నంత సేపూ, ఆరో ఆసామీ తన మంచంలో టార్చిలైటు వెలిగించి యెత్తుగాలక పక్కలో వుంచిన పదుముతో పాంకోళ్ళమీద కూర్చొని చిన్న అద్దంలో చూసుకొంటూ శృంగారించు కొంటున్నాడు. గిరజాలు తిరిగిన తల దువ్వుకొని కనుబొమలు తువ్వాలుతో తుడుచుకొంటూ కోర మీసాలికి విడిపోతూన్న మెలి తిరిగి పెడుతున్నాడు. పావురాగూడు లాంటి మీదబెంచీ మీద చాలాసేపు ఇరుక్కొవడం నిండి అతని యెముకలు నొప్పెట్టాయి కాబోలు "కొత్త పెట్టెలోనికి నేనూ వెడతానండోయి" అన్నాడు.

ఆకలిగా వున్నవాడికి విస్తట్లో అన్నం పడినట్టు పలాసా స్టేషను వచ్చింది. కొత్తపెట్టె తగిలించారు. అది చాలా పెద్దపెట్టె ఇరవై మంది హాయిగా పడుకోవడానికి సరిపడిన ఓల్డుఇంటర్ క్లాసు పెట్టె

ఆ చీకటిలో ఎవరు వచ్చారో లేదో గాని ఆరో ఆసామీ మాత్రం వచ్చాడు.

మే మిద్దరం పెట్టెకి రెండు ప్రక్కలా వున్న బల్లలమీద బిచాణాలు విప్పాం. టైము సుమారు యెనిమిదున్నర అయింది. ఏదో కారణంచేత మెయిలు ఆ స్టేషనులో పదిహేను నిముషాలుండే పరిస్థితి యేర్పడినట్టు తెలిసింది. నేను లేచి ఆరోఆసామీతో స్నేహం కలిపి కాలం వెళ్ళబుచ్చుదామని బుద్ధిపుట్టి అతని దగ్గరికి వెళ్ళి కూర్చున్నాను. నేను దగ్గరికి రాగానే సగం పడుకొని సగం కూర్చొన్న భంగిమ మార్చి, కాళ్ళు దులుపుకొని, సరిగా కూర్చున్నాడు. కిటికీగుండా లోపలపడుతూన్న లైటువెలుతురులో అతని ముఖంమీద చిన్న అపూర్వమైన సూచకమైన చిరునవ్వు, వెనువెంటనే బంగారపు పన్ను యొక్క తళుకు గోచరించాయి.

వెంటనే అతడు జేబులోంచి రెండు సిగ్రెట్లు తీసి నాకొకటిచ్చి అతనొకటి వేసుకొన్నాడు. సిగరెట్టు ఇవ్వబోతే నాకు అలవాటు లేదని సాభిమానంగా వారించాను. అది అతడు వెలిగించి అందరివలె రెండు వేళ్ళతో కాల్చకుండా చేతిని శంఖంలా చేసి రెండు దమ్ములు లాగి రెండుసార్లు చిటిక వేశాడు, రొమ్ము రాసి పోయేందుకు.

"మీరు యెక్కడికి వెళుతున్నారండీ బాబూ" అని ప్రశ్నించాడు.

"మొదటనే మనవి చేశాను కదండీ కలకత్తా కని."

"ఇదే వెళ్ళటమా మునుపెప్పుడైనా వెళ్ళేరా" అన్నాడాయన బొగ్గుపడిన కట్టె నులుపుకొంటూ సిగరెట్టుపొగ పైకొదల్తూ. నేను ఒక్క సెకండాలోచించి 'ఇదే వెళ్ళడమండీ. తమరో'" అన్నాను.

"ఏకే నామాటకేంలెండి. ఇవాళ కలకత్తాలో, రేపు కాన్పూరులో, ఎల్లుండి ఢిల్లీలో, అవతల్నాడు పెషావరులో ఉంటేవాణ్ని."

నేను 'మజాగా ఉన్నాయిరా మాటలు' అనుకొని, బొత్తిగా తెలియని దద్దమ్మలా నటిస్తూ, "కొత్తవాళ్లు కలకత్తా వెళితే గాభరాపడిపోతారని వినికిడి నాదగ్గర యెడ్రసు వుందిలెండి. ఏ జట్కావాడి నడిగినా చెబుతా డనుకొంటాను" అన్నాను.

అతడు మొహం అదోలా పెట్టి అసహ్యంగా నవ్వేడు. "కలకత్తాలో జట్కా లేమిటయ్యా! కాకినాడను కొన్నావా, సామర్లకోట ను కొన్నావా? అది మహా పట్నం. ఆ జన మేమిటి! ఆ కార్లేమిటి! ఆబస్సు లేమిటి! ఓమూలనించి ట్రాములు. ఓప్రక్కనించి సైకిళ్లు ఓకట్టునుంచి మిలటరీ లారీలు. చూశావంటే అదిరిపోయిన వాళ్లకే భయంవేస్తుంది." అన్నాడతను పిల్లిగడ్డ

లాల్చీజెబ్బు పైకితీసి బంగారపు వాచీలో టైము చూస్తూ.

"ఐతే అక్కడ వాళ్ళంతా మంచివారట. దొంగతనాలు చెయ్యరట కదండీ."

అతడు గిక్కురుమని చూశాడు. "ఎవరు చెప్పారయ్యా నీకు! కాలుకింద కన్నం వేసే గారిడీ దొంగలు. ఒకమాటు ఏమైందో తెలుసా? పట్టపగలు పన్నెండు గంటల వేళ నేను ధరమ్ తలాలోంచి వస్తూంటే..."

"అంటే అదిఒక పేటేనా బాబూ"

"కాదు, కాదు. ఓ పెద్దవీధి. వస్తూంటే ఒకడు వెనకబాటునే జేబులో పర్సులాగి పారిపోబోయాడు. వాణ్ణి రెండడుగుల్లో పట్టుకొని గూబ మీద మూడు లాగేసరికి .." అని అతడేమిటో చెబుతూంటే రైలుకూసి కదిలింది.

వెలుగు! చీకటి! వెలుగు! చీకటి! మా పెట్టె మొత్తానికి నలుగురిమే వున్నాం. నేనూ ఆరో ఆసామీ మేల్కొనివున్నాం. మిగిలిన ఇద్దరూ ఒకమూలని చీకట్లో గుఱ్ఱుపెట్టినిద్రపోతున్నారు. మా పక్కలు పెట్టెకి మధ్యగావున్నాయి. నేను లేచి నా పక్కమీదకి వెళ్ళిపోయాను. పడుకొన్నాను గాని నిద్రరావడం లేదు. ముందున్న నా ప్రయాణంగురించి ఆలోచించుకొంటున్నాను. యెక్కడ మద్రాసు, ఎక్కడి 'షిల్లాంగ్.' ప్రయాణం అంటే పరిపాటయిపోయిన నాకు ఆరో ఆసామీ మాటలు వినోదం కలిగించాయి. అతని మీదుగా ప్లాటుఫారం వెంపు చూస్తూంటే వెలుగు చీకట్లు మజా చూపిస్తూంది. అతడు కిటికీలోంచి బుఱ్ఱ పైకిదూర్చి తిన్నగా చూస్తూ సిగరెట్టు పీలుస్తున్నాడు.

ఈ వెలుగు చీకట్ల గారిడీలలో ఒకవ్యక్తి రైలు నడుస్తూంటే మా పెట్టెలో ప్రవేశించి మా వాళ్ళ వెంపున్న మూలను కూర్చొన్నట్టు నేను గ్రహించాను.

రైలు జోరుగా పరిగెడుతోంది. ఆరో ఆసామీ తల లోపటికి తీసుకొని కాళ్ళక్రిందకి పెట్టి సిగరెట్టు పీలుస్తూ "అల్లుడా రమ్మని" అనే పద్యం మాండు రాగంలో నాకు వినిపించేటంత



గట్టిగా నవ్వుతున్నాడు. నేను మాత్రం ఆ చీకట్లో మెరుస్తున్న ఆ తన వ్యక్తి కళ్ళవెంట చూస్తున్నాను. కళ్లు మూసుకొన్నానని ఆరో అసామీ భావించి వుండవచ్చు.

హఠాత్తుగా 'కాంతా' సెంటు వాసన వచ్చింది ఆ మూలనించి. ఆరో అసామీ అటు తిరిగి చూసినట్టు గమనించాను. అతడు గట్టిగా ఒక దగ్గు దగ్గేడు. వెల్తురు లేకపోయినా లాల్చీ చెయ్యెత్తి వాచీ చూసుకొంటున్నట్టనిపించింది. మళ్లీ సర్దుకొని కూర్చొని చేతులు కట్టుకొని ఈలపాట ప్రారంభించాడు. మరొక్క రెండు నిముషాలకి ఆ వెంపునించి ఒక ఇంపైన కంకణ ఝుణత్కారం వచ్చి ఆరో అసామీలో ఒక విధమైన చలనం కలిగించింది. అతడు లేచి "పంతులుగారూ" అని నన్ను పిలిచేడు మేలుకొంటే వినిపించేటట్టు, నిద్రపోతూంటే మెలకువ రానంత గట్టిగా. నేను మాత్రం అవసరమైనప్పుడు కళ్లు మూస్తూ, తరవాత లేనప్పుడు కళ్లు తెరచి ఈ నాటకాన్ని చూస్తున్నాను. నా దగ్గరనించి జవాబు లేకపోగానే, నేను నిద్రపోతున్నానని నిశ్చయించాడాయన. ఈలాగా పరాకుగా ఉన్న ఆయన మనస్సును ఘల్లుమని తిరిగి గాజులు మోగి ఉద్రేకింపజేశాయి. మధురవాణిదో చింతామణిలోదో ఒక శృంగారపద్యం పడుకొన్న వారికి మెలకువ రానంత గట్టిగా చదువనారంభించాడు. ఆ ఓఢ్రదేశపు చీకటిలోంచి వచ్చిన ఆ గాజులచప్పుడులో ఈ వెర్రి వానికేమైనా తెలుగు పలుకులు వినిపించాయేమో!

కాని అతడక్కడనుంచి కదలడంలేదు. మనస్సు తొందర పెడుతూన్నా కాళ్లు కదలలేనట్టు తోచింది. ఒక తియ్యని ఆహ్వానసూచకమైన దగ్గు వినవచ్చేసరికి అతడు మొండిధైర్యం తెచ్చుకొని లేచి అటువెంపు రెండడుగులువేసి మళ్ళీ ధైర్యం దిగజారిపోయి గేటువెంపు తిరిగి బుఱ్ఱ పైకెత్తి ఒకసారి ఉమ్మికొని తిరిగి తన స్థలము వరకువచ్చి కూర్చోబోతూంటే అవమానకరమైన ఒక నవ్వు నవ్వింది, ఆ చీకటిలో మనిషి. ఆనవ్వు "ఓరి పిరికిపందా" అన్నట్టుగానుంది. అతను [illegible] చేశాడు. నా మీదికి జరిగి చూశాడు. అవతల మూలకూర్చున్న ఆమె వెంపూ చూశాడు.

వచ్చిన మనిషి నే పొరపాటుపడ్డాను, కోరి పిరికితనం ప్రవేశించింది కాబోలు కూర్చొండి పోయాడు.

వచ్చిన మనిషి లేచింది. చేయిదులిపేసరికి తెల్లటి చేరుమాలు మడతలలోంచి విముక్తి పొందిన కాంతా సెంటువాసనలు గుప్పు మన్నాయి. మెరుపువెంట ఉరుములాగ గాజులు "ఘల్" మన్నాయి. ఆ స్త్రీ అతని వెంపు నడచివచ్చి అతని ప్రక్క కూర్చున్నది; చీకటిలో ఎక్కువగా కనిపించలేదు కాని అతనిభయం, వారించడం, స్నేహితులున్నారని చెప్పడం, ఆమెధైర్యంచెప్పడం, సముదాయించడం, స్వప్న వృత్తాంతాల్లా అందీ అందకుండా గోచరించాయి. తరువాత కొంతసేపటికి రెండుమూడు ముద్దులు పెట్టుకొన్నట్టుగాకూడా శబ్దం వినిపించింది. మరొక్క ఐదునిముషాలకి ఆదేదో స్టేషనుకి రెండు ఫర్లాంగుల దూరంలో రైలాగింది. "ఎవరైనా చూస్తారేమో దూరంగా కూర్చొంటాను. బండి రాబోయేస్టేషను దాటగానే వస్తాను. పదిరూపాయిలు జ్ఞాపకముందా?" అంది ఆమె "పదిగాకపోతే పాతిక, దానికేం లే. వెళ్లు, వెళ్లు. నేను పడుకొన్నట్టు నటిస్తాను."

పక్కస్టేషను ప్లాటుఫారము వచ్చింది. ఆరో అసామీ పడుకొన్నట్టు నటిస్తూ నన్ను మోసగిస్తున్నాననుకొని మోసపోతూన్నాడు. వెలుగు! చీకటి! వెలుగు! చీకటి! ఒకమాటు గేటుమీద చీకటి పడగానే ఆ స్త్రీ అరసెకండుకాలంలో ఆ ప్రదేశంలో గేటులోంచి బయటకి దూకేసింది. రైలు రెండు నిముషములాగింది. మళ్ళీ కదిలింది. ఆరో అసామీ, నాటకంలో మూర్ఛపోయి లేచిన పాత్రలాగ, లేచి కూర్చొని ఆ చీకటి వెంపు నోరుజాపి పిలుస్తున్నాడు. రైలు క్రమేపీ జోరెక్కుతోంది. కొంత సేపటికి లేచి ఆమె కూర్చున్న స్థలం దగ్గరికి వెళ్ళి వెతికి (ఆశ్చర్య పోయి), గదిఅంతా వెతికి, దొడ్డి తలుపుతీసి దానిలోకూడా చూసి సిగరెట్టు వెలిగించి గేటులోంచి బుఱ్ఱ పైకిపెట్టి దిమ్మపోయి శూన్యంలోకి చూస్తున్నాడు.

నేను అప్పుడే మేలుకొన్నట్లులేచి "ఏమండీ ఇంకా స్టేషను రాలేదా" అని ప్రశ్నించాను.

# జనవాక్యం

సంపాదకునికి ప్రకటనార్థం పంపించిన లేఖలు యీ శీర్షిక క్రింద ప్రచురిత మవుతాయి. లేఖలు క్లుప్తంగా, కాగితానికి ఒక పక్క వ్రాసి పంపాలి.

## ఏది సత్యం! ఏదసత్యం!

మహాకవి గురజాడ అప్పారావుగారి జనన సంవత్సరం: ఆంధ్రవిజ్ఞాన సర్వస్వం- (ద్వితీయ సంపుటం, పునర్ముద్రిత ప్రతిలో 1855.

'ముద్దుకృష్ణ' 'ఎడిట్' చేసిన 'వైతాళికులు' లో 1863; ప్రకాశకర్త ప్రచురణ "ముత్యాల సరములు" లో 1861.

ఈ అభిప్రాయత్రయం పాఠకలోకానికి ఆశ్చర్యం కలిగిస్తోంది. దీని విషయమై అధికార పూర్వక సమాధానం వాంఛిస్తున్నాము.

ఆలమూరు "ఉషశ్రీ"

---

## ప్రభుత్వం: ధాన్యం ధర

ప్రజలంతా ఒద్దు మొర్రో అని ఎంత నెత్తీ నోరూ మొత్తుకున్నా వినక మా పిఠాపురం తాలూకాలోను ఇతరత్రా కొన్ని చోట్లా రేషనింగ్ ప్రవేశపెట్టారు. కొద్ది రోజులు మాత్రం వి సుగ్రాల బియ్యమో, వీపొట్టు, పొల్లుపోయే గోధుమలో సప్లయిచేస్తూ వచ్చారు.

అప్పుడే ఏమయిందన్నట్లు ఇంతలో తుఫాను వచ్చి సామాన్య మానవునికొంప నట్టేట ముంచింది. దానితో ప్రజాసామాన్యానికి కష్టాలు పరాకాష్ఠను పొందాయి. ఏ వార్డు రేషనుకొట్లలోకిపోయిచూసినా [illegible] ఒక్కరోజుకి సరిపడే బియ్యమైనా ఒక నక్కనూ [illegible] అంతమంది డీలర్లు మరీ దీనుల్ని "ఓ, "ఓరి కిరికిరి లేవంటే మీకూ కాదూ!" అని కేకలు [illegible] ప్రకటించుకొన్న సమర్థులు కూడా అవతల పోలేదు. ఇష్టమున్నా లేకపోయినా కొంత వుంది గోధుమలే కొనుక్కునేవారు. ఆదివరకులా సైకిళ్ళమీద పొరుగూళ్ళ నుంచి బియ్యం తెచ్చుకోవటాన్ని రేషనింగ్ పేరుమీద అధికార్లు అరికట్టారు. అంతవరకూ రూలు ప్రకారం బాగానే ఉంది. మరి ఆహార ధాన్యాలను పైనుంచి తెచ్చుకోనియ్యని ప్రభుత్వాధికారులు రూలుప్రకారం సప్లయి చేయాలిసిన మేరకయినా సప్లయి చేయాలా అక్కర్లేదా!

అమ్మ పెట్టా పెట్టదు అడుక్కు తిననియ్యదు. అన్న సామెత సార్థకం అవటం లేదా!

మళ్ళీ ఈ వారంలో పిఠాపురం, ఉప్పాడలలో బియ్యానికి బదులు ధాన్యాన్నే రేషన్‌గా ఇస్తున్నారు కుంచెడు బియ్యం రేషన్‌గా ఇయ్యవలసినవారికి ఆరుశేర్ల ధాన్యం ఇస్తున్నారు. ఆరుశేర్ల ధాన్యం దంపించుకుంటే మూడుశేర్ల బియ్యం అవటం గగనం అయిపోతోంది. ఈ విషయంలో ప్రజలశ్రమ మాట అటుంచి ధర విషయంచూస్తే దారుణం అనిపించక మానదు.

కుంచెడు ధాన్యానికి పదిహేను అణాల ఎనిమిది పైసలు తీసుకుంటున్నారు; అంటే కాటా బస్తా 1 కి ఇరవైమూడు రూపాయల పైచిలుకే అయిందన్నమాట!

తాము నిర్ణయించిన ధర బస్తా 1 కి పదహారు రూపాయల ఎనిమిది అణాలుండగా ప్రభుత్వమే బహిరంగంగా బస్తా ఇరవైమూడు రూపాయలుచేసి అమ్ముతోందంటే దీనిని ఏం మాట్లాడాలో ప్రభుత్వాన్నే చెప్పమనండి.

పిఠాపురం ఆర్. వి. పెండ్యాల

# మహిళల ఆరోగ్య రక్షణకు

## లోధ్ర

గర్భాశయ రోగనివారిణి

స్త్రీలకు కలుగు ఋతుశూలలు, బహిష్టు కాకుండుట, అకాలబహిష్టు, బహిష్టు జాస్తిగాను తక్కువగాను జరుగుట, ముట్టురోగము, నాజూకుతనము, రక్తహీనత, మలబద్ధము నగాతికాపాతము, నడుము నొప్పులు, అరికాళ్లు అరచేతులు మంట మొదలగు స్త్రీ సంబంధ వ్యాధులను నివారించును.

**12 పౌ. రు. 4-4-0 6 పౌ. రు. 2-4-0**

## మాదీఫల రసాయనము

ఇది ముగిసిన మాదీఫలముల రసముతో తయారు చేయబడినది. గర్భిణీ స్త్రీలకు కలుగు వాంతులను (వేవిళ్లు) యిది నివారించును. కళ్ల తిరుగుడు, వాంతులు, అరోచకము, అజీర్ణము, మలబద్ధకము, నిద్రలేమి మొదలగు జబ్బులకు వజ్రాయుధము. జ్వరవేగమును తగ్గించుటలో యీ రసాయనము మేలుచేయును. ఇది సేవించిన యెడల నోటికి రుచికరముగ నుండును.

**3 పౌనుల బుడ్డి రు. 1-4-0**

## గర్భరక్షక

స్త్రీలకు గల [illegible] వలన గర్భము ధరించిన పిమ్మట పెక్కు చిక్కులపాలగుచున్నారు. ముఖ్యముగ మరల గర్భస్రావము, అకాల ప్రసవము, కష్టప్రసవము, కడుపునొప్పి, నడుము నొప్పి, రక్తహీనత, శరీరమునకు నీరు పట్టుట, బలహీనము, నీరసము, అజీర్ణము, అజీర్తి, మలబద్ధకము మొదలగు జబ్బులు కలుగుచున్నవి. ఈ 'గర్భరక్షక' సేవించిన పై జబ్బులు రాకుండుటయే గాక ప్రసవమగునంతవరకు మంచి ఆరోగ్యస్థితి కలిగియుండి నిండుమాసములు గర్భము ధరించి సుఖముగ ప్రసవించెదరు.

**3 పౌ॥ రు. 3-2-0 6 పౌ॥ రు. 5-8-0**

## క్షీరబలాతైలం

స్త్రీలకు ఋతుస్రావ దోషముచే గల్గు వాత వ్యాధులు, పార్శ్వపు తలనొప్పులు, తలపోటు, గర్భవాతము, శరీరము బిగిసియుండుట, మూర్ఛ, అపస్మారవ్యాధులు, క్షయవ్యాధి, నరముల బలహీనత, యీ తైలముతో అభ్యంజన మొనర్చిన నివర్తించును.

**6 పౌ॥ల బుడ్డి రు. 3-0-0**

## సౌభాగ్యశొంఠి

బాలింత లేహ్యము

ప్రసవానంతరమున స్త్రీలకు బాలింతకారమను ఒక ఘాటు ఔషధమును యిచ్చు ఆచారము మన దేశమున చిరకాలముగ నున్నది. అయితే ఈ కారమును లెక్కలేనన్ని సామాన్యపు సామానులతో తయారుచేసి యిచ్చుచున్నారు. ఇందు కలియు వస్తువుల పరిమాణము, పాకజ్ఞానము పాటింపక మూడుగ తయారుచేయుదురు. ఈ కారము వారికి వేడిచేసి అనేక ఉపద్రవములు సంభవించుచున్నవి. ఈ సౌభాగ్య శొంఠి వాడిన ఆరోగ్యము చెడక తల్లియు బిడ్డయు సుఖముగ నుండగలరు. తల్లికి సమృద్ధిగ పాలుపడును.

**బుడ్డి రు. 2-0-0**

## ప్రమేహాంతకం

(తెల్లబట్ట వ్యాధికి)

అనేక కారణములవలన స్త్రీలకు గర్భాశయము నుండి తెల్లటి స్రావము వెడలుచుండును. స్త్రీ జాతియందు యీ జబ్బు సర్వసాధారణముగ నుండును. పసిపిల్లలకుగూడ యీ వ్యాధి సంభవించుచున్నది. చిరకాలముగ యీ వ్యాధివల్ల బాధపడువారి గర్భాశయము పాడగును. అట్టివారికి మేహజ్వరము, దగ్గు, నిస్సత్తువ, సంతాన హీనత సంభవించును.

**బుడ్డి రు. 4—0—0**

# కేసరికుటీరం లిమిటెడ్

15, వెస్టుకాట్ రోడ్డు, రాయపేట, మద్రాసు-14.

తెలుగుజిల్లాలకు, నైజాముకు ఏజంట్లు :

**సీతారాం జనరల్ స్టోర్సు, బెజవాడ — సికిందరాబాదు.**

# తెలుగు స్వతంత్ర

## విషయసూచిక

సంపుటి: 7. సంచిక: 45

శుక్రవారం జూన్ 3, 1955.



గ్రంథాలయము

...దు సంఖ్య.........

తేది..........






# నా దేశంబిది—

"శ్రీవాత్సవ"

ఇచట పుట్టిన చిగురు కొమ్మైన చేవ
మాట నేర్చిన మట్టిబొమ్మయును కవియె
ఒకనిచూచిన మరియొక్క డోర్వలేడు
ఎవనికాతడె బ్రహ్మాండ మేలుపెద్ద

మునుపు దూరపుకొండలు నునుపు మాకు
ప్రజకు పొరుగింటి పుల్లకూరలు రుచించు
కాకిబంగారమునకిందు గౌరవమ్ము
ఇంటమెట్టిన 'యంబ్రహ్మ' యేని మనుజు

బురద పన్నీరుగామెచ్చు బుద్ధి మాది
తెలివి తేటలకిచ్చోట నెలవు లేదు
మంచి చెడ్డల విలువ గ్రహించలేము
పెరటి చెట్టిందు మందు కక్కరకురావు

పిచ్చి నాణాలు హెచ్చుగా పచ్చి చెల్లి
మంచి నాణాలు చెడి మాటు మణగినట్లు
క్రొమ్మెఱుంగులపైపూత కొత్తదనము
ప్రాతపెన్నిధిపై కప్పు మూతవేయు

కలిసి ఒక్కుమ్మడిగ ఒక్క కార్యమైన
చేయగాలేని అసమర్థ జీవులము
ప్రతిజన పరస్పరాయత్త ఖండనముల
ఉప్పు కొమ్మును సరికిన ఉత్తములము

ప్రేమ మాబొజ్జకెప్పుడు శ్రీరామరక్ష!
స్వార్థపరులకు మాసీమ స్వర్గసీమ
ఆత్మలాభాలకెంత యన్యాయమైన
చేయగలవారలిందు భాసించువారు

తిప్పయింటికి వాసమ్ము తెన్నువాడు
మాట నిలుపుకోజాలని మానధనులు
నీతినియమాలు విడిన నీతిపరులు
తలలు పైకెత్తి తిరుగు పెద్దలిటమాకు!

# స్వతంత్ర

సంపుటి-7
సంచిక-45

జూన్ 3, 1955.

ప్రచురణ:
ప్రతి శుక్రవారం


## ప్రదేశ్ కాంగ్రెస్ : అధ్యక్షుని ఎన్నిక

రకరకాల ఊహాగానాలతో నేపథ్యంలో నలుగుతున్న సమస్య—ఆంధ్రప్రదేశ్ కాంగ్రెస్ కమిటీ అధ్యక్షుని ఎన్నిక. ముఖ్య, ఉప ముఖ్యమంత్రుల ధర్మమా అని మరింత సంక్లిష్టమైనది. శ్రీయుతులు సంజీవరెడ్డి, గోపాలరెడ్డిగారలు మంగళవారంనాడు చేసిన సంయుక్త ప్రకటన గడుసుతనంగా ఉన్నది గాని సామరస్యాన్ని సాధించేరీతిలో లేదు. రాజీకోసం గోపాలరెడ్డిగారు చేసిన కృషి నిష్ఫలమైన ఫలితంగానే ప్రకటన చేయవలసిన అవసరం కలిగింది. ఆఖరు క్షణాన ఏవో బేరాలు కుదిరితేతప్ప, పోటీ అనివార్యమని స్పష్టమైనది. అందుకు ప్రముఖ బాధ్యత యీ ఉభయులదే; ఇద్దరిలో ఎవరు చిత్తశుద్ధితో కొంచెం త్యాగంచేసి ఎదుటివారికి చోటిచ్చినా పోటీ తప్పేది. దూరదృష్టితో, పార్టీ శ్రేయస్సుకోసం- ఆఖరికి కనీస సభ్యతకోసం, స్వీయ ప్రాబల్యాన్ని ఎవరు వదులుకున్నా - రభస లేకండా ఎన్నిక గడిచిపోయేది. ఈ అట్టడుగు ప్రలోభాన్ని మట్టుబెట్టి "ప్రస్తుతం కొనసాగుతున్న వివాదంతో తమ పేర్లు జత చేర్చబడుతున్నందుకు వారు తమ విచారాన్ని వెలిబుచ్చడం" ఎవరిని మభ్యపెట్టడానికో వారికే తెలియాలిగాని, అలా మభ్యపడేవాళ్లు ఎవరూ ఉండరు.

ఆంధ్రప్రదేశ్ కాంగ్రెస్‌లో ఎన్నడూ లేనిది ఐకమత్యం; సర్వదా ఏపుగా పెరిగి దినదినప్రవర్థమానమవుతున్నవి ముఠాలు. మొన్నటి ఎన్నికలలో కుదిరినది ఒక అవసరార్థమైన పొత్తు. అది పదికాలాల పాటు నిలిచేటట్లు చూడాలంటే, యీ నాయకులు అధికారవ్యామోహం కాస్త తగ్గించుకోగల్గి ఉండాలి. అది అసంభవం. పదవులకోసం కాకపోతే యీ రాజకీయాలు దేనికి? ముమ్ముందు ఆంధ్ర కాంగ్రెస్ కమిటీ జోక్యం చేసుకోవలసిన ఎన్నికల తతంగం చాలా ఉన్నది. పార్లమెంటు ఎన్నికలు, జిల్లాబోర్డుల, మ్యునిసిపాలిటీల ఎన్నికలు - ఎన్నో ఉన్నాయి. పదవుల పంపకం చాలా జరగవలసిన తరుణాలవి. అందుచేతనే ప్రదేశ్ కమిటీ అధ్యక్షతకోసం నేడింత పెనగులాట. కాని మళ్ళీ యీ పెనగులాట తీవ్రమైతే ప్రజల్లో విశ్వాసంపోయి పార్టీ పలుకుబడి దెబ్బతింటుందని యీ "కాకలు తీరిన" నాయకులకు తెలుసు. వారికి తెలియనిదల్లా ఈలోలోపలి పెనగులాటలనుగుంభనంగా ఉంచుకోగల్గడం. ఈ ముఠాలన్నవి ప్రతి కాంగ్రెస్ కమిటీలోనూ ఉన్నాయి. ఐతే తక్కినచోట్ల అవి గుట్టుగా ఉండి ప్రజా దృష్టికి అంతగా రావు; ఆంధ్రలో మాత్రం క్షణక్షణం రచ్చకెక్కుతాయి.

ప్రజాస్వామిక సూత్రాలపై నడిచేది కాంగ్రెస్ పార్టీ అని పార్టీపెద్దలంటారు. లోలోపల ముఠాలూ, చీలికలూ లేకండా ఐకమత్యంతో ఉండడం పార్టీ శ్రేయస్సుకి వాంఛనీయమే; అధ్యక్షుని ఎన్నిక ఏకగ్రీవంగా జరగడం అభిలషణీయమే. ఐతే, అది సంభవం కానప్పుడు? ఆదర్శపరిస్థితి లోపించిననాడు—అది ఉన్నదన్నట్లు నటించడంకంటె వాస్తవికతను గుర్తించి తదనుగుణంగా వ్యవహరించడమే వివేకం. ఎలక్షన్ల అనంతరం లెజస్లేచర్ కాంగ్రెస్ పార్టీ నాయకుని ఎన్నికలో శ్రీ ఢేబర్ ప్రభృతులు కుందేటికొమ్ము సాధించడానికి ప్రయత్నించారు. తాత్కాలికంగా నెగ్గినట్లు భ్రమచెందడంతో సంతృప్తిపడి నిజంగా దొరికినట్లే సంతోషించారు. కాని అది కృతకమైన విజయం. ఎన్నిక ఏకగ్రీవంగా జరిగింది నిజమే. కాని ఆ సమయంలో కాస్త వెనక్కి తగ్గినవారికి మరింత బలం ఏర్పడింది; నెగ్గినవారిని బలహీనత ఆవరించింది. ప్రతి ఎన్నికా పోటీలేకండా జరగాలనే సూత్రాన్ని అనుసరించి బయలుదేరితే చివరకది హాస్యాస్పదం అవుతుంది. ప్రతి ఎన్నికా ఏకగ్రీవంగా జరగడం సాధ్యం కాదు. పోటీనుండి విరమించుకునేవారికి అడుగడుగునా "అధిక వడ్డీలు" చెల్లించుకోవలసి వస్తుంది. నేడదే జరిగింది. అడుగడుగునా పార్టీపరిస్థితి యిలా సుడులు తిరిగిపోయేకంటె, పోటీదారులందరూ రంగంలోనిలుచోవడమే అభిలషణీయం. అప్పుడు పార్టీలోని ముఠాలేమేమిటో, వాటిస్వరూపం,నాయకత్వం ఎటువంటివో అనుమానాలకు తావు లేకండాస్పష్టంఅవుతాయి. కాని ప్రస్తుతంలో అటువంటిచర్య పార్టీని బలహీనపరుస్తుందని కొందరి వాదన. అది నిజమే. ఐతే ప్రత్యామ్నాయంగా జరుగుతున్న యీ తతంగం కూడా అదే చేస్తున్నది. తొలగించుకోవలసిన అసలు దౌర్బల్యం పార్టీలో ముఠాలు. అవైనా ఊరికే ధర్మపన్నాలు వల్లించినంతమాత్రాన తొలగిపోవు. ముఠాలకు తావులేని వాతావరణం యిటు ప్రదేశ్ కమిటీలోనూ అటు లెజిస్లేచర్ కాంగ్రెస్‌పార్టీలోనూ ఏర్పడాలి. ముఖ్యమంత్రిగా ఎన్నికైన తర్వాత శ్రీ గోపాలరెడ్డిగారు అడుగడుగునా పార్టీ సహకారంకోసం తాపత్రయపడక- ఒక నిర్దిష్టమైన, బహుళజనామోదకరమైన పాలసీని పార్టీముందుంచి "నేను అనుసరించదలుచుకున్న కార్యక్రమం యిదే; వ్యతిరేకించదలుచుకున్నవాళ్ళు యింతకంటె మంచి కార్యక్రమాన్ని సూచించండి" అని నిర్భయంగా, నిర్మలాంతఃకరణతో ప్రకటిస్తే ముఠాలకు లొంగవలసిన అవసరం ఉండేది కాదు; తాము కూడా ఒక ముఠాను కూడదీసి పెంపొందించుకోవలసిన శ్రమ తప్పేది. కాని స్వప్రయోజనాలన్నవి ఒక్క కక్షకే పరిమితమై ఉండవు. ఎన్నికలూ, పదవుల పంపకాలూ అనే సదాశయ సాధన తప్ప యింకో వ్యాపకం లేని నాయకత్వంతోనే యీపార్టీ నిండి ఉన్నన్నాళ్ళు-ఆ పంపకాలలో "ఐకమత్యం" కుదరనప్పుడల్లా యీ పోటీలు ఎదురవుతూనే ఉంటాయి. ఒకవేళ చివరి నిముషంలో "ఏకగ్రీవంగా ఎన్నిక" సంభవమైనా బేరాలలో రాజీలు కుదిరాయనే ప్రజలర్థం చేసుకుంటారుగాని- అకస్మాత్తుగా నాయకులకు ఆదర్శవర్తనమీద ప్రేమ కలిగిందని భ్రాంతిచెందరు. ★




ఆంధ్ర ప్రదేశ్ కాంగ్రెసు అధ్యక్షుని ఎన్నిక అనుకున్న విధంగానే రచ్చకెక్కింది. చివరికి పోటీ జరిగినా జరగకపోయినా ఆంధ్ర నాయకులలో రెండువర్గాలు కలవనేది మరింతగా ధృవపడిపోయింది. ఈనాడు వర్గాలుగా విడిపోయిన వారంతా మూడు నాలుగు సంవత్సరాల కిందట ఒకేవర్గానికి చెందిన పెద్దలే. ఈపెద్దల మధ్య యిప్పుడు అభిప్రాయ భేదాలు తలెత్తడానికి కారణం వ్యక్తిగతమైన, స్వార్థానికి సంబంధించిన సమస్యలేకాని సంస్థకు సంబంధించిన, సంస్థ భావాలకు సంబంధించిన సమస్యలు ఎన్నటికీ కావేమో; అయినప్పుడు వీరి తగాదాలను, పోటీలను వ్యక్తులపరంగా చూడాలేకాని సంస్థపరంగా చూడ్డం అన్యాయం. ఇది వరకు యిలాంటి తగాదాలను సంస్థపరంగా చూచిన ఫలితాన్ని అనుభవించాము. కనకనే తిరిగి సంస్థను స్వచ్ఛందంగా పైకి తెచ్చుకున్నాము: అదే మనలోవున్న విశేషం కూడాను. అయితే సంస్థను పైకి తెచ్చినా, దానితో పాటు కొందరు వ్యక్తులుకూడా పైకివచ్చి పదవులు పట్టుకొని తిరిగి సంస్థను నాశనంచేసేస్థితి తెచ్చిపెడుతున్నారనే ప్రశ్న రావచ్చు. దానికి సమాధానం ఒక్కటే: చైతన్యంకలిగిన ప్రతివ్యక్తీ, ప్రజాస్వామ్యాభిమానంగల ప్రతి పౌరుడూ, కాంగ్రెసు లక్ష్యాలపట్ల విశ్వాసం కలిగినప్పుడు ఆ సంస్థలో చేరిపోవాలి: ఆ సంస్థ ఎవరిదో కొందరిదని కబుర్లు చెప్పుకోనడంకంటే, మనదేననే భావంతో, మనదిగా చేసుకోవాలనే లక్ష్యంతో వ్యవహరించినప్పుడు అవాంఛనీయులుగా కనిపిస్తున్న వ్యక్తుల అసలురంగు బయటపడిపోతుంది. ఎవ్వరికీ వారు మనకెందుకనే భావంతో వేరుగా వుండిపోయి, అవసరం వచ్చినప్పుడు, ఏ ఎన్నికల సమయంలోనో కార్యరంగంలో దూకుతున్నందునే అవాంఛనీయులైన వ్యక్తులు సంస్థలో ఆడినది ఆటగాను పాడినది పాటగాను అవుతున్నది. అదే రాజకీయమై పోతున్నది. ఈ స్థితిని అరికట్టాలంటే చైతన్యవంతులైన వారంతా సంస్థను తమదిగా చేసుకోవాలి. అందుకు ఇప్పుడు సంస్థలోవున్న వర్గాలు, గ్రూపులు అడ్డువచ్చేమాట నిజం కనకనే నేటి ప్రదేశ్ కాంగ్రెసు కమిటీని రద్దుచేసి, అడ్-హాక్ కమిటీనివేసి, కొత్తసభ్యులను చేర్పించడం జరిగితే సమంజసంగా వుండేది. అలా చేయడం సాధ్యపడలేదు కనక, ఇప్పుడున్న రెండువర్గాల మధ్య సామరస్యాన్ని సాధించగలవారిని ప్రదేశ్ కాంగ్రెసు కమిటీ కార్యకర్తలుగా ఎన్నుకొంటే సంస్థకు ప్రతిష్ఠవచ్చేది. ప్రదేశ్ కాంగ్రెసు కమిటీలో, మాజీ-లోక్ పార్టీవారు యింకా సభ్యులు కాలేదు. మొన్నటిఎన్నికలలో కాంగ్రెసు అభ్యర్థులపై స్వతంత్రంగా పోటీచేసి క్రమశిక్షణ చర్యలకు గురైనవారు కొందరు వున్నారు. క్రమశిక్షణ చర్యను తప్పించుకొని పి. సి. సి. సభ్యులుగా వున్నవారు కూడా కొంతమంది యింకా సంస్థలోనే వున్నారు. ఇన్ని రకాలుగా సభ్యులు విడిపోయినప్పుడు, వైదొలగినప్పుడు, నేటి ప్రదేశ్ కాంగ్రెసు కమిటీకి రాష్ట్రం మొత్తంమీద పూర్తి ప్రాతినిధ్యంలేదనే చెప్పుకోవచ్చు. పూర్తి ప్రాతినిధ్యం లేని సంస్థకు కార్యకర్తలుగా వచ్చేవారు, ఏదో ఒక వర్గానికి చెందినవారుగావుంటే రెండోవర్గం వారిని చేరకుండా చేయడానికి ప్రయత్నించడం సహజంకూడా. అందువల్లనే ఉభయులకు సమ్మతమైన వారిని ఈ దఫా అధ్యక్షులుగా ఎన్నుకొని,

కొత్తసభ్యులను చేర్చుకొని, సంస్థను బలపరచుకోవాలని కోరడం.

* * *

ప్రదేశ్ కాంగ్రెసు అధ్యక్షుని పదవికి జరుగుతున్న పోటీ లోగుట్టును తెలుసుకోవాలంటే, కాస్త భవిష్యత్తులోకి తొంగిచూడాలి. ఈసంవత్సరాంతం లోగా పురపాలక సంఘాలకు ఎన్నికలు జరుగగలవని మంత్రులు ప్రకటిస్తున్నారు. 1957 జనవరి-ఫిబ్రవరిలో పార్లమెంటు ఎన్నికలకు దేశం మొత్తం మీద సన్నాహాలు జరుగుతున్నవి: ఆతరువాత అవసరాన్నిబట్టి ఆంధ్రలో జిల్లాబోర్డుల పునరుద్ధరణ కూడా జరగవచ్చు. కనక వచ్చే రెండుసంవత్సరాలలోను ప్రదేశ్ కాంగ్రెసుకమిటీకి చేతినిండా ఎన్నికల పని ఉంటుంది. బహుశా మరొకతరం నాయకత్వానికి అవి గట్టిపునాదులను వేయగలవుకూడా. అందవలనే ఉభయవర్గాలవారు పోటీకి సిద్ధపడుతున్నారు. కాని మొన్నటి ఎన్నికలలో - ఐక్య కాంగ్రెసువల్లనే విజయం సిద్ధించిందనేది కనీసం ఒక వర్గంవారు విస్మరిస్తున్నారు. ఐక్య కాంగ్రెసు విజయానికి కృషిచేసిన పెద్దల సలహాలను కూడా వారే ధిక్కరించి పోటీకి సిద్ధమౌతున్నారు. ఒకవేళ వీరే ప్రదేశ్ కాంగ్రెసును పట్టుకొనడం జరిగితే, వచ్చే పార్లమెంటు ఎన్నికలలోను, లోకల్ బోర్డుల ఎన్నికలలోను "తిరుగుబాట్లు" హెచ్చవడం తథ్యం. అది పరోక్షంగా కమ్యూనిస్టులకు సహాయపడవచ్చు కూడా. బహుశా కాంగ్రెసులో పీఠంవేసిన మాజీ-కమ్యూనిస్టుల ఆంతర్యం కూడా అదేనేమో వారి "కామ్రేడ్ మిత్రులకే" ఎరుక.

* * *

తెలుగు పట్టణాల వార్తలు ఈ వారంలో రకరకాలుగా వచ్చినవి. జీవనదులు ప్రక్కన ప్రవహిస్తూ వుండగానే నీటిసప్లయి కొరతవుందని కొన్నిచోట్లనుంచి, తమకు నీటిసప్లయి ఏర్పాట్లు కొత్తగా కావాలని మరికొన్నిచోట్లనుంచి; పురపాలకసంఘాలు శ్రద్ధచూపడంలేదని ఒకపట్టణంనుంచి; ప్రజాప్రతినిధులు చెప్పినట్టు ఉద్యోగులు వినడంలేదని మరొక బస్తీనుంచి; ప్రభుత్వసహాయాన్ని కోరే పురపాలకసంఘాలు తప్పనిసరిగా పన్నులు విధించే గ్యారెంటీని యివ్వవలసి వుంటుందని రాజధానినుంచి; సంఘం ఏర్పాటుచేస్తే సగం ఖర్చు యిచ్చుకుంటామన్నా వినే సాధువు లేదని మరొక పట్టణంనుంచి వార్తలు వచ్చినవి. ఇవన్నీ చదివినప్పుడు, మన బస్తీలను చూచినప్పుడు "ఇలాంటి మనపట్టణాల అభివృద్ధి యింకెప్పటికి?" అనే అనుమానం (అసహ్యంకూడా) కలుగుతుంది. ఇంతవరకు మద్రాసు రాష్ట్రంలో వున్నాము కనక మన ప్రభుత్వాన్ని నిందించాము. ఇప్పుడు స్వంత రాష్ట్రం వచ్చింది కనక మనప్రభుత్వాన్నే విమర్శించాలి. ఇక మన ప్రభుత్వమేమో ఆర్థిక స్తోమతను పెంచుకోవాలని చెబుతున్నది; సలహాలు యిస్తున్నది. షరతులు పెడుతున్నది. పురపాలక సంఘాలలోని ప్రజాప్రతినిధులుమాత్రం వోటర్లమీద దృష్టిని కేంద్రీకరించి రకరకాల ఎత్తులు వేస్తున్నారు. ఈ సమస్యా పరిష్కారానికి గాను ముందుగా పురపాలక సంఘాలకు ఎన్నికలైనా జరపాలి. లేదా జిల్లాబోర్డులను చేసినట్టుచేసి, కొంత కట్టుదిట్టంచేయాలి. అలా చేసినప్పుడు వోటర్లకోసం వ్యవహరించే తత్వం వదిలిపోయి ధైర్యంగా ఏదో ఒక పనిచేసే శక్తి పురపాలక సంఘాలకు వస్తుంది. ఇక రెండవ ఏర్పాటు కొత్త పురపాలకసంఘాలనాయకత్వానికి సంబంధించినది. పట్టణానికి పెద్దగావుండేవారి వార్డులోను, వారి స్వగృహాల చుట్టూను అనారోగ్యకరమైన పరిస్థితులు వున్నా సహించగలిగినవారిని పురపాలక సంఘాలనికి ఎన్నుకున్నా ప్రయోజనం లేదు. అలాంటివారికి ప్రభుత్వం విశేషంగా అధికారాలు యివ్వడంకూడా దండగే. కనక ఎంతో కొంత దూరదృష్టి, సేవాతత్పరత, చురుకుదనం, శ్రద్ధకలిగిన పెద్దలను ఆయా పార్టీలు ముందుకు తీసుకురావాలి. పోతే మనపట్టణాలలో మరొక విశేషం విపరీతంగా జనాభా అభివృద్ధి. ఏదో ఒక కారణాన పల్లెలనుంచి సాలీనా అనేక కుటుంబాలు బస్తీలకు కదులుతున్నవి. వారివల్లనే బస్తీలలో రకరకాల కొత్తసమస్యలు ఏర్పడుతున్నవి. కనక టౌనుప్లానింగ్ స్కీములు, సహకార గృహనిర్మాణ పథకాలు అమలుజరిపి, సాలీనా కొన్నివందలు చిన్నతరహా ఇండ్లను వ్యాపారప్రాతిపదికపై పురపాలక సంఘాలు కట్టాలి. ఇలా చేసినప్పుడు నీటిసప్లయి, డ్రెయినేజ్ సౌకర్యం వగైరాలు చౌకగా అందరికీ అందుబాటు కాగలవు. అసలు నేటి మన

బస్తీలు కేవలం కొందరు ధనవంతులకు, ఉద్యోగులకు, వ్యాపారస్తులకు, పారిశ్రామికులకు కూడలిగా వుంటున్నవి. మార్కెట్ సౌకర్యాలకు, వృత్తి వ్యాపారాలకు నిలయమౌతున్నవి. కనకనే ఆయా జిల్లాల స్థితినిబట్టి ఆయా పట్టణాలు అభివృద్ధి చెందుతున్నవి. కొన్నిచోట్ల మధ్యరకం ప్రజలు హెచ్చు. అలాంటివాటిలోనే రద్దీ హెచ్చు. శుభ్రం తక్కువ. కొన్నిచోట్ల కలవారు అధికం. కనకనే ప్రశాంతంగానూ, శుభ్రంగాను వున్నట్టు కనిపిస్తవి. ఏమైనప్పటికి వచ్చే అయిదుసంవత్సరాలలోను ఏదోఒకవిధంగా మనబస్తీలకు కనీసం డ్రెయినేజి, మంచినీటిసప్లయి సౌకర్యాలనైనా కలిగించనప్పుడు, ఆంధ్రులు "అనాగరికులు"గానే వుండిపోగలరు కాని నాగరిక లక్షణాలు కలవారనడానికి ఆధునికమైన నిదర్శనాన్ని మాత్రం ముమ్మాటికీ చూపలేరు.

* * *

మద్యనిషేధం మంచి చెడ్డలను గురించి ఒక కమిటీవారు ప్రత్యేకంగా విచారణ జరుపుతున్నారు. అన్నిరాష్ట్రాలకు వెళ్ళి అభిప్రాయాలను తెలుసుకుంటున్నారు. అంకెలను సేకరిస్తున్నారు. మద్యనిషేధంవల్ల రకరకాల కొత్త సమస్యలు ఏర్పడినవి. అందులో మొదటిది కల్లుగీతవారికి వృత్తిపోవడం; వారికి కొత్తగాజీవనోపాధి చూపడం; అంతటితో వారి సమస్య సమాప్తమౌతున్నది. ఇక మద్యం త్రాగేవారివల్ల వస్తున్న చిక్కులు అనేకం-వీటిని నివారించడానికి మధ్యప్రదేశ్‌లో మద్యం త్రాగనివారికే ఉద్యోగాలు ఇవ్వగలమనే నిబంధన చేశారు. ఢిల్లీలో 14 సంవత్సరాలలోపు పిల్లలకు మద్యం అమ్మటం శిక్షార్హం చేశారు. ఇవన్నీ కాదని చివరకు మద్యంత్రాగడం శిక్షార్హమైననేరం అన్నారు. ఇలా శిక్షపడడానికి కూడా త్రాగి, మత్తులోవున్నట్టు డాక్టర్ సర్టిఫికేట్ కావాలనే నిబంధన పెట్టారు. దానివల్ల కొందరు శిక్షలు పడకుండా తప్పించుకుంటున్నారని సాంఘిక సేవకులు ఫిర్యాదులు చేస్తున్నారు. ఇలాగ త్రాగినవారు కూడా శిక్షలు తప్పించుకుంటూవుండగా, త్రాగకుండా, సాంప్రదాయాన్ని పాటించిన పూనా పెండ్లి కొడుకు, తమకులాచారం ప్రకారం, సారాసీసాను పల్లకీలో పెట్టుకొని లగ్నానికి వెడుతుండగా పోలీసులు పట్టుకొని మద్యనిషేధచట్టకింద అరెస్టు చేశారట. తాను త్రాగలేదని చెప్పినా వినక లైసెన్సులేకుండా సారాదగ్గరవుంచుకొనడమే నేరమని చెప్పారట! మద్యపానం జాడ్యమే అయినా ఇలాంటి సాంప్రదాయాలు కూడా కలిసి వున్నప్పుడు చట్టాలవల్ల సంస్కరణలు, ఎంతవరకు జరుగుతవంటారు!

* * *

హరిజన సంక్షేమానికి ఆంధ్రప్రభుత్వం కొన్ని కొత్త ఏర్పాట్లను చేయదలుస్తున్నట్టు వార్తలు వచ్చినవి. ఉచితంగా యిస్తున్న యిండ్ల స్థలాలలో పాకలు వేసుకొనడానికి కూడా ప్రభుత్వమే అప్పులు యిస్తుందట. హరిజనవాడలను ప్రత్యేకంగా కాక గ్రామాలలోని యితర కులాలవారితో కలిసి వుండేటట్టు ఏర్పాటు చేస్తుందట. హరిజన విద్యార్థులకు మధ్యాహ్నం తిండికని లేబర్‌స్కూల్సులో పూటకు యిస్తున్న రెండున్నర అణాలను సద్వినియోగం చేయడానికి పిల్లల తల్లిదండ్రులకే చెల్లిస్తుందట. ప్రభుత్వం సబ్సిడీతో ప్రయివేటు వ్యక్తులు సంస్థలు నిర్వహిస్తున్న హరిజన హాస్టల్సు సరిగా నడపనప్పుడు, ప్రభుత్వమే స్వాధీనం చేసుకొనగలదట. మొత్తంమీద యివన్నీ ఉత్తమమైన ఆలోచనలే. సదుద్దేశ్యాలతో కూడినవే. వీటన్నింటి సారాంశం ఏమంటే, హరిజన సంక్షేమం అనేది ప్రయివేటు వ్యక్తుల, సంస్థలద్వారా సాధ్యమయ్యేది కాదని, ప్రభుత్వమే ముందుకువచ్చి సరాసరిని కొన్ని ఏర్పాట్లు స్వంతంగానే చేయాలని. దీని పూర్తి బాధ్యత కొంతమంది హరిజన నాయకులది. కొంతమంది హరిజన సేవకులనే వారిది. నిజంగా తమవారికి వీరిలో కొంతమంది చేస్తున్నంత అన్యాయం మరెవ్వరూ చేయడం లేదేమో కూడా. హరిజన ప్రతినిధులుగా ముందుకు వస్తున్నవారిలో కొంతమంది చేస్తున్నన్ని మోసాలు మరితర కులాలవారు చేయడం లేదు కూడా. హరిజన హాస్టల్సును నడుపుతున్నామనే పేరుమీద డబ్బు సంపాదించినవారు, డాబాలు కట్టుకున్నవారు, కులాసాగా పట్టణాలవెంట తిరిగేవారు పెక్కుమంది వున్నారు. ఇండ్ల స్థలాలు యిప్పించగలమనో, ఉచితంగా భూములుసంపాదించి పెట్టగలమనోచెప్పి, అమాయకులైన హరిజనులవద్ద

పదులు, పాలికలు చందాలుగా వసూలుచేసి, నాటకమాడుతున్నవారు చాలామంది వున్నారు. విద్యార్థుల సంఖ్యను చూపడానికిగాను, ఒకచోటి నుంచి మరొకచోటికి లారీలలో హరిజన బాలురను రవాణాచేసి అధికారుల కన్ను కప్పడానికి పూను కొనే పెద్దలుకూడా వున్నారు. చాలామందికి ఇదొక రకమైన వృత్తి, వ్యాపారమైపోయింది. అంతేకాదు. యిలాంటి వారంతా ఎవ్వరో ఒక పెద్ద హరిజననాయకుని పేరుచెప్పి యిలాంటి మోసాలు చేస్తున్నారు. చివరకు హరిజనులలో కాంగ్రెసు సంస్థకు చెడ్డపేరుకూడా తెస్తున్నారు. అంతటా అన్ని సందర్భాలలోను యిలా జరగక పోవచ్చు. కాని కొంతవరకైనా పదిమందీ చెప్పు కొనేటంత వరకైనా యిలా జరుగుతున్నది. యిలాంటి ఫిర్యాదులు వినవస్తున్నవి. కనక హరి జన నాయకులేమి, కాంగ్రెసు కమిటీలవారేమి, ఈ విషయంలో శ్రద్ధ చూపనప్పుడు అపఖ్యాతి పాలు కావడం సంగతి అలావుంచి, ప్రభుత్వం లక్షలకొలది ధనం వెచ్చించినా ఫలితం వుండని పరిస్థితి ఏర్పడుతుంది. చివరకు హరిజన సంక్షేమ కార్యక్రమమనేది నవ్వులపాలు కాగలదు. హరిజన ప్రతినిధులవల్లనే కొంతవరకైనా హరిజన సంక్షేమ కార్యక్రమం దెబ్బతింటున్నది కనక, ఈ బాధ్య తను ఇతర సేవాసంస్థలకు అప్పగింత పెట్టడం సము చితం కాగలదేమో ప్రభుత్వం ఆలోచించాలి. జాతీయ వికాస కేంద్రాలు, కమ్యూనిటీ ప్రాజె క్టులు, స్థానిక అభివృద్ధి పథకాలు, సాంఘిక సంక్షేమ ప్రణాళికలు వంటివి విరివిగా అమలు జరుగుతున్నం దున, ఈ హరిజన సంక్షేమ కార్యక్రమాన్నికూడా వాటిలో ఒకభాగంగా చేసినప్పుడు పని సులభమై, హెచ్చు ఫలితాన్ని యివ్వగలదేమో పరిశీలిం చాలి. అదికూడా సాధ్యంకానప్పుడు సిటీ ఇంప్రూవ్ మెంటు ట్రస్టులు, డెవలప్‌మెంట్ బోర్డులవలె, ఏదో ఒకరకమైన ప్రత్యేక సంస్థను స్వతంత్రంగా ఏర్పాటుచేసి దానిద్వారా హరిజన సంక్షేమ కార్యక్రమాలు అమలు జరిపించడం సులభం కాగలదేమో చూడాలికూడా.

* * *

మనది కొత్తరాష్ట్రం కనక అనేక రకాలుగా కొత్త సంస్థలను ప్రారంభించుకొనడం ఎంతైనా అవసరమే. ఇలాంటివాటిని త్వరితంగా అభివృద్ధి చేసుకోవాలనే ఆతురతవున్నా, అనుకున్నంత సులభంగా అవి పెరిగి పెద్దవికావు. కనకనే సాధ్యాసాధ్యాలను కూడా జాగ్రత్తగా ఆలో చించుకోవాలి. పోలీసు ట్రెయినింగ్ కాలేజీని అనంతపురంలో ప్రారంభించడం అవసరమే. స్త్రీల ట్రెయినింగ్ కాలేజీలను రాజమండ్రిలోను, నెల్లూరులోను నెలకొల్పడంకూడా సముచితమే. వీటిని ఈ సంవత్సరంలోనే ప్రారంభిస్తున్నందుకు ఆంధ్రప్రభుత్వాన్ని అభినందించక తప్పదు. కాని ఇంజనీరింగ్ కాలేజీల విషయంలో ఆంధ్రప్రభుత్వం త్వరపడుతున్నదేమోనన్న అనుమానం కలుగు తున్నది. రాష్ట్రవిభజన సమయంలో ఆంధ్రరాష్ట్రా నికి అవసరానికి మించినంతమంది ఇంజనీర్లు కలరనే వార్తలు వచ్చినవి. వారిలో ఈనాడు ఎంతమందికి ప్రభుత్వం పనిచూపగలిగిందీ తెలియదు. ఇక మన రాష్ట్రంలో రెండు ఇంజనీరింగ్ కాలేజీలువున్నవి. ఈ రెండింటిలోను ఒకదానికి తగిన భవనాలులేవు. రెండవదానికి తగినన్ని పరికరాలు వగైరాలులేవు. చివరకు పొరుగునవున్న మద్రాసు రాష్ట్రంలోని గిండీ ఇంజనీరింగ్ కాలేజీతో సమానమైన తాహాతు కూడా వీటికిలేదు. అలాంటప్పుడు, వాటిని అలాగేవుంచి కొత్తవాటిని ప్రారంభించ వలచడం ఎంతవరకు మంచిదికాగలదో ప్రభుత్వం గుర్తించాలి. రెండు కొత్త కాలేజీలను హడా విడిగా, అసౌకర్యాలతో ప్రారంభించడంకంటె, వున్న రెండు కాలేజీలను, అదేసొమ్ముతో బాగా అభివృద్ధి చేసుకొని హెచ్చుమంది విద్యార్థులను వాటిలో చేర్చుకొంటే ఖర్చులుకలిసిరావా అన్నదే నేటిప్రశ్న. వచ్చే కొన్ని సంవత్సరాలలోను దాదాపు 2,000 మంది ఇంజనీర్లు అవసరంకాగల మాటకూడా నిజమే. అంతమందిని తయారు చేయడానికి అసౌకర్యాలతోను అసమగ్రమైన ఏర్పాట్లతోను కాలేజీలను ప్రారంభించి, తర్ఫీదు యివ్వడం ప్రారంభిస్తే, వారెంతటి సమర్థులైన ఇంజనీర్లుగా వుండగలరో! ఇన్ని వేలమందికి ఎన్ని కోట్ల రూపాయల పెట్టుబడిని కొత్త కాలేజీలకు పెట్ట వలసివుంటుందో పరిశీలించిందా? అలా చేసినప్పుడు వున్న కాలేజీలను అభివృద్ధిచేసే తాహాతు కూడా మనకు వుంటుందా?—"గౌరీశంకర్"




మహార్షులులాగ మాటలాడేవారున్నారు గాని మన్నించి ఆచరణలో చూపేవారు లెక్కకు కానరారు. ఆ మాటలాడడంలో కూడా ఉన్నత శిఖరాలకు భావాలనుఎగురవేయగలరేగాని కాలును మాత్రం గడప దాటించరు. అనివార్య కారణాల వల్ల తొమ్మిది రోజులు జరుగవలసిన గ్రీష్మోత్సవాలకు మొదటి మూన్నాళ్ళతోనే ముగింపుచేశారు మా సభ్యులు. మా సభ్యులేకాదు. ఆలోచన లేకుండా మాటలాడేది ... పెద్దలనే ఉదహరించగలను. అని మా బావ...మిత్రుల కెవరికో సముజాయిషీ యిస్తున్నాడు...మా సభ్యులందరూ ఉత్సవాల కిచ్చిన శ్రమదాన పర్యవసానంగా చిరి చాపలమీద వెల్లకిలా పరుండి అకాల నిద్రను ఆహ్వానిస్తున్నారు...

శ్రీమతి నాంచారమ్మ...అందరకూ వినబడేటట్టు..."బొంబాయి గవర్నరు శ్రీ హారేకృష్ణ మెహతాబ్ మహిళామండలి కిచ్చిన హితవు"... అని చదివింది. సన్నగా కునకబోతున్న ఓబయ్య వకీల్ను లేచి కూర్చున్నాడు...బావా! శ్రీ మెహతాబ్ మనకు శాశ్వత సభ్యుడుగా ఉండదగినవాడు. కానిచో...అట్టి హితవు నిచ్చియుండడు ఆయన మహిళా మహాసభలో అన్నమాట లేమిటో తెలుసా?..."శ్రీమతులారా! శాసనములవలన మీ కేమీ ప్రయోజనముండదు...మీ అధికారముల కొరకు మీ హక్కులకొరకు మీరు ఉద్యమము లేపి పోరాడండి" అని...అర్థముకాని వాతావరణములలో ఉపన్యసించవలసిన స్థితి అప్పుడప్పుడు కలుగవచ్చు...అక్కడే వ్యక్తిత్వం వెల్లడి అవుతుంది. అక్కడే వక్త తన యుక్తిని చూపవలసి ఉంటుంది. బాధ్యతకల్గిన వ్యక్తి, అభ్యుదయాన్ని అభిలషించే ప్రభుత్వానికిచెందిన వ్యక్తి...అమ్మా! మీకు శాసనముల తయారీవల్ల లాభ ముండదు... హక్కులకొరకాందోళన చేయండి అన్నాడంటే ఏమనాలి? ప్రతి స్త్రీ సమాజంలోనే కాదు కుటుంబంలో ఒక ప్రాతినిధ్యం వహించేబాధ్యతకలది... సమాజపరంగా ఆందోళనచేస్తే దాని ప్రభావం తన కుటుంబంమీద పడక మానదు..ఆందోళనచేయాలి. అంటే ... ఎట్టి ఆందోళన ... ఆ యాందోళన స్వరూపమెలా ఉండాలి? పైగా శాసనములవల్ల మీకు లాభముండదనే శ్రీ గవర్నరు ప్రభుత్వాన్ని ఏరీతిగా సమర్థిస్తున్నట్టు...కాబట్టే మహాత్ములముగా మాట్లాడేమే అనుకుంటారే కాని వారి హితవు ఎట్టి వికృతరూపాన్ని సృజించబోతుందో భావించరు. ఇప్పుడు శ్రీ బొంబాయి గవర్నరుగారి మాటలనుబట్టి...స్త్రీలకు చెంది ఇటీవల భారతాధ్యక్షునిచే ఆమోదింపబడిన శాసనాలు సమాజంలో ఎందుకూ పనికిరావని...అవి అమలు చేయడంతో స్త్రీకి నిజమైన హక్కులు లభించబోవని...అందుకే శ్రీ వారు...ఏదో ఆందోళన లేవదీయమంటున్నారు...తామొనర్చే శాసనాల మీద తమకే విశ్వాసం లేని ప్రభుత్వమా ఇది? బావను గట్టిగా ప్రశ్నించాడు ఓబయ్య...

బావ యీమధ్యన ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో కొనసాగింపదగిన కర్మకాండలను ప్రభుత్వానికి సూచించడానికై కొన్ని సూత్రాలను తయారిస్తున్నాడు. ఆయా జిల్లా అధికారులకు అచ్చటచ్చటి తమ కోరికలను వెల్లడించుకొనే యీ శుభ సమయంలోనే బావకూడా తన బుద్ధివికాసాన్ని ప్రకటించుకుందామని ... ఆయన జిల్లా అధికారికి అర్పించిన వినతిపత్రంలో... (1) సాధ్యమైనంత

వరకూ వ్యవసాయపు బెరువులు వడ్డీలేని అప్పులు ఉన్నతవర్గాలవారికే యిప్పించవలెను. (2) విద్యుచ్ఛక్తి వలని లాభాలేమిటో యింకా పల్లెటూళ్ళకు తెలియదు కాబట్టి సాధ్యమైనంతవరకూ దానికయే ఖర్చును తగ్గించి కాలువనీటి తగాయిదాలను పెంపుదలఅయేటట్టు చూడవలెను. (3) ప్రతి ప్రభుత్వ కార్యాలయంలోను ప్రథమ పంచవర్ష ప్రణాళికలో అభివృద్ధినందిన లంచగొండితనాన్ని యథాశక్తి పెరిగేటట్టు చేయడానికై లంచం బహిరంగంగా అడిగిపుచ్చుకొనే వాక్ స్వాతంత్ర్యాన్ని సామాన్య ఉద్యోగులకు సహా ప్రసాదించడం. (4) అవినీతిప్రభుత్వాన్ని అడిపోసేయువకులకు ఇంక్రిమెంట్సు కత్తిరించి ఉద్యోగంలోనే నరకాన్ని సృష్టించవలెను. (5) కుటీర పరిశ్రమలయందు భారీ పరిశ్రమలయందు సమానవాత్సల్యాన్ని చూపగల్గిన వారినే రాజబంధువులలో లెక్క వేయవలెను (6) అంతరాత్మలో వారే హత్యలకు దారితీసిన వారైనను కాంగ్రెసునందు భక్తిచూపు వారైనచో వారికన్నివిధములగు సౌకర్యాలను కల్గించవలెను (7) ధనికుల భూములమధ్యనుండి వెళ్ళిన రహదారులను పది పంచవర్షప్రణాళికలు గతించేపర్యంతరం కంకర వేయకుండా ఉంచవలెను (ఇప్పుడే కంకరవేస్తే ఆ రైతులు గండ్లుకొట్టి పొలాలకు నీరు పెట్టుకొనే సౌకర్యం పోతుందని ప్రభుత్వానికి తెలుసు) (8) కులమతత్వాలమీద ఆధారపడే ముందు ముందు కూడా ఉద్యోగాలను పంపిణీచేయవలెను వంటి వానిని ఒక శతకం అర్పించాడు ... అందుకే ఓబయ్య వేసిన ప్రశ్నకు పరమానందపడ్డాడు...

బావ విస్ఫోటక ముఖారవిందుడై ఉపక్రమించాడు...సభ్యులారా! కొద్దినిముషాలు కన్నులు విప్పండి. కనీసం చెవులనైనా నా వైపు త్రిప్పండి ప్రభుత్వానికి తాను చేసిన శాసనాలమీద తనకే నమ్మకం లేనిమాట నిజం. పాపం...దాన్నే శ్రీ హరేకృష్ణ మెహతాబ్ మరొకరీతిగా వెల్లడించారు. శాసనాలమీద ప్రభుత్వానికి నమ్మకం లేదనడానికి "భూదానోద్యమం" మరొకని దర్శనము. శ్రీ నెహ్రూ ధేబరులకే యీ ఉద్యమం శరణ్యమయింది. జయప్రకాశనారాయణ్ కిం కొన్ని సందేహాలు పట్టి బాధిస్తున్నాయి. వాని వలాగుంచండి. ఈ పెద్దలు వాంఛిస్తున్నట్టు ... భూదానములవలన భూములులేని వారికందరకూ భూములు లభించి ధనికవర్గం ఛిన్నాభిన్నమైతేను... శ్రమదానంద్వారా ప్రాజెక్టులు నిర్మింపబడితేను... మనం గర్వించవలసిందే. ఇతరదేశాలు మనల్ని చూసి సిగ్గుపడవలసిందే. వినోబాజీ దేవాలయాలమీద దండెత్తి ఓడిపోయినారు. హరిజనులతో వారు గర్భగుడిలో ప్రవేశింపబోయి అపజయాల నందారు అట్టిచోటులస్థానిక హైందవహృదయాలుద్రవించేటట్టు వారేమీ ప్రతిక్రియ చేయలేకపోయారు... భూదానాలను పరిగ్రహించడంలో వారాకృషికి పూనుకోలేదని అర్థం చేసికొందాం... ఆంధ్రలో వారాసించినంత సారవంతమైన భూములు దానంగా లభించవనే నా అభిప్రాయం. ఈ స్వల్పదానాలతో కొంత పేదవడలవచ్చుని ధనికులు భావించి ఆచరించినా ... పేదలకు భూసమస్య మట్టుకు తీరదు...

ఈమధ్యన శ్రీ ధేబరుగారు త్రివేంద్రంలో విలేఖరులతో వింతప్రసంగం ఒకటి చేశారు. కాంగ్రెసులో సంకుచిత సంప్రదాయతత్వం కులతత్వం నశింపచేయడానికై కొత్త నిబంధనలను తయారించ సంకల్పిస్తున్నామని...అలాటి వక్తవ్యాల విషయంలో ఒకనాడు మితభాషి శ్రీ ధేబర్... నేడు శ్రీ నెహ్రూ పండితులను మించి ఉపన్యాసాల దంచుతున్నారు. మౌనంగా ఆచరించి చూపుతారువారని ఆశించాం...కాని...ఖద్దరు దుస్తులమీదే విశ్వాసంలేని సభ్యులను సంస్కరించేదెలాగో వారికీ బోధపడడంలేదు. నిబంధనలు, శాసనాలు నేటి మానవుని శరీరంపై ఎందుకు పని చేయడం లేదో వారూ శంకిస్తున్నారు...చర్చిస్తున్నారు. సంప్రదాయ మతతత్వ కులతత్వాలు కాంగ్రెసు వారనుకునే జాతీయతకు సంపూర్ణ వ్యతిరేకతత్వాలే...అయ్యును...ఇప్పుడు ప్రశ్న ఏమిటంటే...ఈరెండు తత్వాలచేతనే కాంగ్రెసు బ్రతికింపబడినమాట సత్యమా? అసత్యమా?...అని ఎన్నికలలోని పస్థల తాలూకు బిల్లులు వెల్లడికావు ఆ ఎన్నికలను సక్రమదృష్టితో సమీక్షించుకున్నట్టయితే...కాంగ్రెసు ప్రభుత్వ విజయానికి యీ కులతత్వాలే నిజకారణములయినాయి. పదే పదే యీ తత్వాలను నిర్మూలించాలనే పెద్దలే పరోక్షంగా వానికి బలమిస్తున్నారు. దానికి ఉదాహర

ణాలు ఆంధ్రులకు వేలుపెట్టి చూపనక్కరలేదు. ఆంధ్ర రాష్ట్రంలో ఏయే జిల్లాలలో ఏయే కుల తత్వాలు రాజ్యమేలుతున్నాయో వాని ప్రభావ మెట్టిదో శ్రీ సెప్రాహా థేబరులకు తెలుసు... అలాగే...అన్ని రాష్ట్రాలలోనూ సంప్రదాయిక తత్వాలు పెచ్చుపెరుగుతూనే ఉన్నాయి. వానిని నైతిక మార్గంలోకి ఏ మహాత్ములైనా మళ్ళించ గలరేమో కాని...అసలు మూలస్వరూపాలనే ఎవరూ పెళ్ళగించలేరు...

ఈ కులతత్వాలకు స్వచ్ఛతను కల్గించాలంటే మతాన్ని నిర్మూలించడం ఒకటే మార్గమని రాజకీయవేత్తలు భావిస్తున్నారు. అ దెంత వర కూ సాధ్యమో మీరే వినండి. శర్మ, వర్మ, చౌదరివంటి తోకలను పేర్లనుండి కత్తిరించుకుంటే నిజ జాతీయత నిరూపింపబడుతుందా? వర్ణాంతర వివాహాల వల్ల సంకుచిత హృదయాలు వికసిస్తాయా? నిర్మల హృదయాలు కావాలంటే...ఏంచేయాలి?

గాయన్తి దేవాఃకిల గీతయాని
ధన్యాస్తుతే భారతభూమి భాగే
స్వర్గాపవర్గాస్పద మార్గభూతే
భరన్తిభూయః పురుషః సురత్వాత్...

అన్నవాడు పిచ్చివాడేనా? ఉత్తమ చరిత్ర కల వ్యక్తులు హరించుకుపోయి....మానవతోద్ధరణ పేరుతో మారణ సంప్రదాయాలను రూపొందిస్తే.. భవిష్యత్తు మసి...అంతే...వర్తమాన అభ్యుదయ ప్రణాళికలతోబాటు సత్సంప్రదాయం సాధింపబడితే...ప్రపంచరాజ్యాలలో భారతభూమి తన విశిష్టతను ప్రదర్శించుకోగల్గుతుంది...ఈ పవిత్ర భూమిలో జన్మించేటట్లు చేయమని భగవంతుని ప్రార్థించిన అన్యదేశీయ వేదాంతుల చరిత్రలు మనకు తెలుసు...ఏ మహాత్ముల నైతిక ప్రచారం వల్ల భారతభూమి ధన్య అనిపించుకున్నదో... దాన్ని విస్మరించి క్రొత్త సిద్ధాంతాలవల్ల మానవులను మనం దానవులనుగా తయారించుకుంటున్నాం. మన బిడ్డల భవిష్యత్తును మనమే అంధకారమయం చేస్తున్నాం...చెట్లను, పుట్లను, సూర్యచంద్రులను ఆరాధించిన ఆర్యసమాజము అర్థములేని సమాజము కాదు. అంతరంగికంగా భారతీయుని సంప్రదాయం ప్రాచీనంగా ఉజ్వలమైనది...దాన్ని పునరుద్ధరించుకోవాలి. జాతిలో ధార్మికశిక్షణ కావాలి. భూదాన శ్రమదానాలలో విశ్వాసమున్న పెద్దలకు ప్రాచీనజాతి సంప్రదాయమంటే వెగటెందుకో... బావ కొంచెం ఆగాడు...నిద్రలోనే మైకంగా... శ్రీ వెంగయ్య ఒక వార్తను ప్రసారించాడు...

పాట్నా సమీపంలోనే సీతామఢీజిల్లా అధికారి కుటుంబాన్ని గత ఏప్రియల్ 18 తేదీనుండి భూతాలు బాధిస్తున్నాయి. ఆ యధికారి భార్య తన తమ్ముని సహాయంతో ఒక పామును నాడే చంపింది...అంతే ఆ ప్రేతాత్మ కుటుంబాన్ని కూకటివేళ్ళతో కదిలిస్తోంది. ఇంటిలో ఆహార పదార్థాలు పాడైపోతున్నాయి. పెట్టెలలో గుడ్డలు తగలడిపోతున్నాయి ... గడియగడియకు ఒక విచిత్రం సంఘటనమౌతోంది. ధర్మశాస్త్రజ్ఞులు ఆ పాము ఉత్తమ తరగతికి చెందినదని 'శాపజీవి' అని...శాంతి విధానం బోధపడటంలేదని ఆక్రోశించారు. ఆ ఆఫీసరు అక్కడకు నలభైమైళ్ళ దూరంలో ఉన్న ప్రసిద్ధ భూతవైద్యునిదగ్గరకు తాయెత్తు కట్టించుకున్నాడు. అది చేతిలో చేతిలోనే అదృశ్యమయింది. దానితో మరీ బేజారై ఉద్యోగానికి సెలవుపెట్టి స కు టుం బం గా... స్వగ్రామం అయిన ముంగేర్ వెళ్ళిపోయినాడు... అక్కడ కూడా యీ ప్రమాదాలు తప్పలేదు... నాటినుండి నేటివరకూ ఆ కుటుంబానికి నిద్రాహారాలు లేవు. పకపక నవ్వాడు...వెంగయ్య... వైద్యరాజు ... బరువైన కంటిరెప్పల నాడిస్తూ ఇంకేం ... పామును చంపిన పాపం ... కొంప తుడుచుకుపోయిందన్న మాటే ... అన్నారు... అలాగే కోతిని చంపి సర్వనాశనమైన కుటుంబాన్ని నే నెరుగుదును...ఉదహరించాడో బయ్య ఆర్య సంప్రదాయాలయందు...పునర్జన్మలయందు ప్రేతాత్మలయందు విశ్వాసంలేని తలకాయ లీలాటి సంఘటనల కేం సమాధానం చెబుతారో... అన్నాడు బావ...

ఇలాటి పిచ్చిపిచ్చి భూతాలకు బుద్ధివచ్చే నవసమాజాన్నే మనం నిర్మించుకోబోతున్నది... ధీమాగా అన్నది నాంచారమ్మ...భారతదేశంలో ఇంకా పశుపక్షులు పాములు రాళ్ళు వగైరాలలో ఉన్న మహత్తర శక్తులు జాతిని నడిపే నాయకులలో లేకపోవడం విశేషం...అన్నాడు బావ...అందరూ నిద్రలకు పడ్డారు... ★

తర్జనభర్జన

# రాజభాష: హిందీ

సి. ధర్మారావు

ఈమధ్య ఈ సమస్యని గురించిన కొత్తవిశేషాలు వెలుగులోకి వచ్చినయ్. ఖేర్ కమీషను నివేదికము, రాజగోపాలాచారిగారి ప్రకటనలు, దక్షిణ భారత పత్రికా ప్రపంచంలో కొద్దిపాటి కలవరం, హిందీ వాదులలో ఉద్రేకంతోకూడిన ఆవేశము ఇత్యాదులు.

ముఖ్యంగా రాజాజీ ప్రకటనలు, దేశం యావత్తూ మేధావివర్గంలో కొంత సంచలనము కలుగజేసినయ్. అసలు ఈ సమస్యని గురించిన ఆలోచన ఎన్నడూలేని వాళ్ళకి—వాళ్ళు అసంఖ్యాకం దేశంలో—మంచులాంటి మగత కొంత విడివడింది. ఇక్కడేదో ఆలోచించవలసింది వుంది అన్న విషయం తట్టింది కొంతమందికి. ఈ విషయమే జాతిజీవనములో పాత్రవహించే పదుగురికీ తడితే, నిస్సందేహంగా చెప్పవచ్చు—ఇంగ్లీషుని రాజభాషా స్థానంలో నిలుపుకుంటామని. "మనమంతా ఒకేజాతి, భారతజాతి," "గాంధీజీ జాతిపిత," "నెహ్రూ మన నాయకుడు" వంటి భావాలు ఎంతైతే సెంటిమెంటల్‌గా, సహజంగా దేశీయుల్లో వ్యాప్తిచెందినవో, అంత సెంటిమెంటల్‌గాను, సహజంగాను వ్యాప్తిచెందింది. "హిందీ మన జాతీయభాష" అనే భావముకూడా. అయితే ఆ మొదటి మూడు 'నమ్మకాలూ' జాతికెంత ఆరోగ్యకరమైనవో, ఆ చివరిది, దురదృష్టవశాత్తూ, అంత ప్రమాదకరము. 'ప్రాణికి గాలి అవుసరము' అన్నంత సత్యంగా నమ్మారు మనుషులు ఎంతకాలంగానో—"సూర్యుడు భూమిచుట్టూ పరిభ్రమిస్తాడు" అని కాని కోపెర్నికస్ సిద్ధాంతము సార్వకాలికముగా, నిక్కంగా ఋజువయ్యేప్పటికి మనుషులు దిగ్భ్రమచెందారు, అలజడి పొందారు. ఆగ్రహోదగ్రులయ్యారు. తిరగబడ్డారు, భయపడ్డారు. ముందు అనమ్మకానికిగాని, చివరి ఈ భయానికిగాని కారణాలు వెదకటము తెలివితక్కువ. మనం చేయవలసిందల్లా వాటి పీపుతట్టి, భయాన్ని పోగొట్టి, వెలుగు వెల్లువలాంటి కొత్త సత్యానికి మనుషుల్ని క్రమంగా అలవాటు పరచటము, క్రమంగా కళ్లు తెరిపించటము. మనంకూడా వాళ్లతోపాటు ఉన్మాదంతో కేకలువేశామో, అసలు నిజం మరుగుపడుతుంది, అసలు ఆశయం ఓడిపోతుంది.

ఇంత ఎందుకు చెప్పవలసివచ్చిందంటే, మొన్న రాజాజీ ప్రకటనతో హిందీవాదుల్లో (ఇక్కడ ఉత్తరాదివాళ్ళు, దక్షిణాదివాళ్ళు అని భేదం చూడటం ప్రమాదకారి) ఇలాంటి సంచలనమే కల్గించింది. మళ్ళీ ఆయన ఎక్కువ చెప్పిందేమీ లేదు. సత్యపథంలో ఒక్క అడుగు వేశారు; అంతే. "మూర్ఖంగా ప్రవర్తించవద్దు" అన్నారు. "పదిహేనేళ్ళలో సాధ్యంకాదేమో" అన్నారు. "అవసరమైతే రాజ్యాంగాన్ని మార్చాలి" అన్నారు. ముఖ్యంగా ఈ ఆఖరివాక్యం పిడుగుపాటయ్యింది. హిందీ సాహిత్య సమ్మేళనవారు శ్రీ టాండన్ అధ్యక్షతన సమావేశమై గీష్మతాపంలాంటి తీర్మానంద్వారా "దక్షిణభారతంలో పదిహేనేళ్ళ గడువు పొడిగించటానికి జరిగే ఆందోళనను" నిరసించారు. నిజానికివాళ్లు అనుకున్నంత 'ఆందోళన' ఇక్కడ లేదని మనకందరకూ తెలుసు. కాని ఆ తాపంలో, ఉన్మాదంలో వున్నవాళ్ళకి అంతా ఏమిటోగా కనిపిస్తుంది. అది వాళ్ళ ఓటమికి సూచన. ఇంకా ఇక్కడ కొందరికి రాజాజీ ప్రకటన "కటువు"గాను "కంటగింపు"గాను కనపడింది. అదే సత్యంలోవున్న విశేషం. దానిలో సహస్రాంశమైనా సరే అత్యంత శక్తిమంతమైనది. కటువుగా, కంటగింపుగా అనిపిస్తుంది. నేటి హిందీవాదులు, జాతీయవాదపు ట్రేడ్‌మార్కుతో బయటికొచ్చేవాళ్లు, రాజాజీతో సహా—వీరంతా బ్రిటిష్ వ్యతిరేకోద్యమ తరానికి చెందినవాళ్ళు. బ్రిటిష్ మనుషులూ, వస్తువులూ, సంస్కృతీ, భాషా—వీటన్నిటిని ఎంత ద్వేషిస్తే, ఎంత బహిష్క-

రిస్తే అంత దేశభక్తిగా మనుషులు నమ్మి 'ఫీలయిన్' రోజులవి. ఈ ద్వేషం, బహిష్కరణా, అప్పటిగాంధీ, పట్టాభి, అగ్గర్వాలా, పి. జె. మెహతా లాంటివారందరి రచనల్లోనూ మోతాదును మించి కనిపిస్తుంది. అప్పుడే మనుషులు తమ భాషాసంస్కృతుల్ని గురించి తియ్యటి స్వప్నాలు కన్నారు. అందులో అనేక స్వప్నాలకి కార్య కారణ సంబంధముతో ప్రసక్తేలేదు. స్వాతంత్ర్య వాయువులు పీల్చనున్న భవిష్యద్భారత దేశంలో ఇంగ్లీషే అధికారంగా భావించబడుతున్న దుర్దినాలు అంతరించి హిందీ భారతీయభాష, అశేషప్రజానీకం మాతృభాషగా గలభాష జాతీయ భాషగా అవతరించి, సంస్కృతీసమైక్యతసాధించి దేశాన్ని సుందరస్వప్నంగా మారుస్తుందని 'సెంటిమెంటల్'గా మనుషులు నమ్మారు. బ్రిటిషుపరిపాలనను ద్వేషించటానికి, ఇంగ్లీషుభాషను బహిష్కరించటానికి గల వ్యత్యాసాన్ని నాటి ప్రజలూ, నాయకులూ జాతీయోద్యమ కోలాహలంలోచూడ గలచలేదు. ఫలితంగా, ప్రజల్లో క్రమంగా 'ఇంగ్లీషు భాషపోయి హిందీ జాతీయభాష కానున్నది, కావాలి' అనే భావం బలపడటం, చివరికి అదే నిజమా అన్నంత భ్రమకల్గించటం జరిగింది.

ఇప్పుడు కొందరాభ్రమని చీల్చి ముందుకు చూస్తున్నారు. రాజాజీ ఆ ప్రయత్నంలో వున్నారు. అదే మిగతా ఆ తరంవారికీ బాధ అనిపిస్తోంది. మనతోపాటే వృద్ధ మనోభావాలతోనే వుండకుండా, కొంచెం తేడాగా ముందుకెళ్ళి హెచ్చరించి చెపుతాడేమిటి అని ఈర్ష్యామిళిత మైన వేదన.

యూనియన్ సర్వీస్ కమిషన్ పరీక్షలను హిందీలో నడపటం అవాంఛనీయం, అదిహిందీ ప్రాంతేతరులకు అన్యాయం అని రాజాజీ ప్రకటించారు. తరువాత ప్రభుత్వ విధానం బయట కొచ్చింది. దాని ప్రకారం పరీక్షల్లో అవాంతరాల ప్రణాళికను మూడు దశలుగా విభజిస్తారు. అందులో మొదటి దశలోనే హిందీరానివారికి అన్యాయం జరుగుతుందని కొంచెం పరిశీలనమీద తేలుతుంది. హిందూ పత్రికకూడా అదే అభిప్రాయం ప్రకటించింది. ప్రభుత్వాన్ని చాలవరకు బలపరచే హిందూపత్రికే, రాజ్యాంగాన్ని మార్చడం అవసరం అని సూచించిందంటే, సమస్య స్వరూపం మనకు అవగాహన అవ్వాలి. ఆంధ్రపత్రిక ఇంకో అడుగు ముందుకువేసి, హిందీనీ ఇంగ్లీషునీ! కూడా రాజభాషగా గుర్తించాల్సి వుంటుందని రాసింది. అయినా రాతసిపుందుకు చిల్లరవైద్యాలు పనిచెయ్యవు. బాగా కలుకుబడి కల్గిన, ప్రభుత్వాన్ని కూడా 'ఇన్‌ఫ్లూయెన్స్' చెయ్యగల ఇంగ్లీషు "స్వతంత్ర"లాంటి పత్రికలు కూడా ఈ విషయముపై ఖచ్చితమైన అభిప్రాయాలతో శస్త్రచికిత్సకి పూనుకోవాలి.

ఈలోగా, కేంద్రప్రభుత్వ ఉన్మాదావస్థ నిస్సందేహంగా కాలంతోపాటు కొంత నిప్పుత్తిలో పెరుగుతూంటుంది. ఒకటితరువాత ఒకటిగా 'తుగ్లక్' పనులు తలపెడుతూ, వ్యతిరేక ఆందోళనచేజేతులా వృద్ధిచేస్తూ, స్వయంగా గోతిని తవ్వుకోగలదు. అయితే అదిచూసి, అర్థంచేసుకుని, ఆనందించి, ఏమరక ముందు కార్యంమీద వుండే మనస్థితి వుండాలి మనకి. చూడండి: నౌకా, మిలిటరీ శాఖల్లోని పెద్ద ఉద్యోగస్తులందరూ హిందీ నేర్చుకోవాలని ఉత్తర్వులువెళ్ళినయ్. రేపు అన్ని కేంద్రశాఖల్లో ఉద్యోగులుకూడ హిందీపరీక్షలో ప్యాసుకాకపోతే ఉద్యోగాలకు ముప్పు వాటిల్లగలదని ఉత్తర్వులు పొందినా మనం ఆశ్చర్యపడనక్కరలేదు. యూనియన్ సర్వీస్ కమీషన్ పరీక్షలకి హిందీభాషా పాండిత్యము తప్పనిసరి చేశారు. దేశంలో అన్ని రంగాల్లోనూ, శాఖల్లోనూ హిందీకి వాతావరణం అనుకూలపడేట్లు అవకాశాలు ఇవ్వటానికే రాజ్యాంగంలో పదిహేనేళ్ళ గడువు వుద్దేశించబడింది. ఈ అవకాశం దేశంతోపాటు, కేంద్రశాఖల్లో ఉద్యోగులకీ, యూనియన్ సర్వీస్ కమీషను అభ్యర్థులకీ కూడ అవసరమనే సామాన్య సత్యాన్ని ప్రభుత్వం కానలేకున్నది. కోట్లకొద్దీ ధనం వ్యయంచేసీ, కమీషన్లువేసీ, హిందీకూనని పదేళ్ళలో పరిణతుణ్ణిచేసి, రాజ గౌరవం త్వోడుగుతుంది! ఇలాంటి ఉన్మాదావస్థ ఆలోచనలు చూర నివ్వడు హిట్లరు ఆ వున్మాదంలోనే పతనం చెందాడు. కమ్యూనిస్టు వ్యతిరేకోన్మాదంతో *అమెరికా ఆసియా విషయంలో తప్పటడుగులు* వేస్తోంది. ఇవి చారిత్రిక సత్యాలు, దాచేస్తే దాగనివి.

అసలు ఒక భాషని రాజభాష చెయ్యటానికి, అది ఆ ప్రజలకు, ఆ పదము నిజమైన అర్థంలో 'జాతీయభాష' కావాలి. ఆభాష అత్యంత అభివృద్ధి దశలోవుండి అశేష ప్రజానీకముయొక్క ప్రీతి పాత్రలో కావాలి. దాని సొగసుకు, గాంభీర్యానికి వారంతా ముగ్ధులుకావాలి. వాళ్ళు తమ భావాలను ఆకారం తాల్పించేప్పుడు, కాగితం మీద వుంచేప్పుడు ఆభాష ధారాళంగా వుపయోగింపబడాలి. విజ్ఞానము, చరిత్రలు, జీవితాలు, సాహిత్యము–కొల్లలుగా ఆభాషలో రావాలి. అలాంటిదశలో భాష రాజభాష అయినప్పుడే అది జాతిని పునరుజ్జీవింప చేస్తుంది. ఇంగ్లీషుని రాజభాష చేసినప్పుడు ఈ పరిస్థితులన్నీ వున్నవా అని అడగొచ్చు. లేవుగనకే మనకి అభ్యసించటానికి శతాబ్దముపైగా పట్టింది.

ఇక మే 6 'తెలుగు స్వతంత్ర'లోని శ్రీ 'నిజం' గారి వ్యాసం సంగతి. అందులో వారు తమ్ముతాము చీకాకుపరుచుకోవటం తప్ప మరేమీ కన్పించదు. ఆ 'కన్ఫ్యూజ్డు థింకింగ్' (Confused thinking) ఈ విషయాల్లో తేటతెల్లమవుతున్నది.

(1) వారి ఉద్యమలక్ష్యము, తెలుగు దేశంలో విద్యాబోధన, పరిపాలన తెలుగులోనే జరిగేట్టు చూడడము. ఎవరూ అసలు దీన్ని కాదనడము లేదే! ఎట్లాగూ అది జరుగుతుంది, ఇప్పుడు కాకపోతే, ఇంకా నాలుగేళ్ళు పోయాక అయినా.

(2) అన్యభాష అయినా హిందీకి తెలుగు దేశంలో ఎట్టిస్థానము వుండరాదట; తెలుగు పరిపాలనాభాష అయ్యాక, ఇంగ్లీషు విజ్ఞానభాషగా వుండిపోవాలట. మళ్ళీ వారు 'కేంద్రంలో హిందీ రాజభాషా? ఇంగ్లీషా?' అన్న సమస్యకి ఎక్కువ ప్రాముఖ్యము ఇవ్వరట.

పోతే, ప్రజలముందు 'హిందీయా, ఇంగ్లీషా?' అన్న సమస్య వుంచితే, వోటు తప్పకండా హిందీకే పడుతుందని శ్రీ 'నిజం'గారు అన్నారు. కావొచ్చు. కాని ఆ విషయమై నేనెన్నడూ ప్రజలలో 'రెఫరెండమ్' తీసుకోవాలని అనలేదు. వారి అంగీకారము తీసుకోవటానికి, అసలు ప్రజల అనుమతితో కాదుగా హిందీ రాజభాష అయింది? అదొక 'సెంటిమెంటు' కేవలం విద్యావంతుల్లోనే పెళ్ళుతన్నింది. అందుచేత ఆలోచించటము చేతనయిన వాళ్ళంతా ఒక విషయము కోరితే—రాజ్యాంగాన్ని మార్చకుండా, దాన్ని సాధించవచ్చు. ఇక ఇది అఖిలభారత సమస్యకదా, ఆంధ్రలో మనం ఏం చెయ్యగలము అనుకోవటం అర్థంలేనిది. మన స్వరాష్ట్రవాంఛే, భాషారాష్ట్రకమీషను నియామకానికి దారితీసిందన్న విషయము స్పష్టమే. ఆలోచన ఎప్పుడూ ఎక్కడో ఒకచోటే పుడుతుంది. అది క్రమంగా వ్యాపించి, కార్చిచ్చులాగ నిశ్చేతనత్వాన్ని కాల్చివేస్తుంది.

---

# అధికారభాష: ఒక పరిశీలన

కొండముది దత్తాత్రేయశర్మ

“హిందీని రాజభాషగా చేయటానికి కావలసిన చర్యలు తీసుకునే నిమిత్తం రాజ్యాంగంలో సూచించబడ్డ 'హిందీ కమిషన్' నెలకొల్పటానికి భారతప్రభుత్వం నిశ్చయించిందని” ఇటీవల లోక్‌సభలో ఇండియా హోంశాఖా మంత్రి పండిట్ పంత్ చేసిన ప్రకటన ఇతర భాషా ప్రజల్ని ముఖ్యంగా దాక్షిణాత్యుల్ని కలవరపరుస్తున్నది. శ్రీ బి. జి. ఖేర్ అధ్వర్యాన 'హిందీకమిషన్' నెలకొల్పబడటమూ ఆ వెంటనే ఆలిండియా సర్వీస్ పోటీ పరీక్షలు హిందీలో జరపాలని నిర్ణయం జరగటమూ, ఆ నిర్ణయం వెంటనే ఉపసంహరించుకోబడటమూ గమనార్హములు.

ఇటీవలి 'తెలుగు స్వతంత్ర' పుటల్లో యీ విషయమై శ్రీ సి. ధర్మారావు, 'నిజం'గారలు జరుపుతున్న చక్కని చర్చల్లో ఆంధ్రదేశంలో ఉన్న విద్యార్థి బృందంలో కనీసం ఒకరిద్దరైనా

విద్యార్థులకైనా ఔత్సుక్యం కలిగించుకోకుండా తమకేమీ పట్టనట్లు ఊరుకోవడం నిజంగా శోచనీయం. ఇది ప్రజల జీవన్మరణ సమస్యగా మనం భావించుకోవాలి. కేంద్రప్రభుత్వ భాషగా ఇంగ్లీషునే ఉంచవలెననే ఉద్యమానికి మనతోబాటు మన సోదరజాతుల ప్రజలైన తమిళులు, కన్నడులు, మళయాళీలు, అస్సామీలు, ఒరియాలు మొదలైన వారందరూ సమర్థిస్తున్నారు.

ఇంగ్లీషు స్థానంలో నిలబడగల స్తోమతు హిందీకి ఎంతమాత్రం లేదు. పైగా హిందీ భాషా ద్వేషాన్ని లేవదీస్తున్నదే కాని ఐక్యతకుపయోగించుటలేదు. "హిందీ ప్రభుత్వభాష అయినంత మాత్రాన జాతీయభాష అయిపోదు. రైలుస్టేషన్ల పేర్లను హిందీలో వ్రాయించినంత మాత్రాన, తపాలాముద్రల్లో ఇంగ్లీషు తీసివేసి హిందీ అక్షరాలు చెక్కించినంతమాత్రాన హిందీ ప్రజలభాష అయిపోదు. నిర్బంధ చర్యలవల్ల ఏ వుద్యమమూ ఫలప్రదముకాదు. ప్రధానమంత్రి నెహ్రూ ఈ యదార్థాన్ని గ్రహించినప్పటికీ ప్రభుత్వవిధానములో మార్పేమీ రాలేదు. ప్రభుత్వోద్యోగులను హిందీపరీక్ష నిర్బంధం చేయడంపై పార్లమెంటు సభ్యులు తెలిపిన ఆక్షేపణకు హోంమంత్రి తృప్తికరమైన సమాధానము ఇవ్వలేక పోయినారు. భాషాతత్వం రోజురోజుకూ ప్రబలిపోతున్నది. భారతజాతి ఏకమత్యాన్ని పెంపొందించటానికి ఏకత్వాన్ని నిరూపించడానికి ఉపయోగపడవలసిన హిందీ ప్రాంతీయతత్వాన్ని ప్రోత్సహిస్తున్నది. నూటయాభై సంవత్సరాలు రాజభాషగావున్న ఇంగ్లీషును పదిహేను సంవత్సరాల్లో తొలగించివేయాలనే ఆలోచన నెరవేరేది కాదు. ఇంగ్లీషుస్థానాన్ని హిందీ ఎన్నటికీ ఆక్రమించలే"దని యీమధ్య ఒక ప్రముఖ దినపత్రిక తన సంపాదకీయంలో స్పష్టపరిచింది.

ఈవిధంగా పత్రికా లోకంతోబాటు రాజాజీ వంటి మేధావులు, మద్రాసు రాష్ట్రప్రభుత్వ విద్యాశాఖా మంత్రి శ్రీ సి. సుబ్రహ్మణ్యం ఆలిండియా సర్వీసు పోటీ పరీక్షలు హిందీలో జరిపే ప్రయత్నాన్ని తీవ్రంగా నిరసించారు.

హిందీని రాజభాషగా ప్రజలపై రుద్దే ప్రయత్నాన్ని ఎదుర్కోటానికి విద్యావంతులు పూనుకోవాలి. రాష్ట్రప్రభుత్వాలు తమతమ ప్రాంతీయ భాషల్లోనే పరిపాలనా కార్యక్రమం సాగిస్తూ రాజభాషగా హిందీకంటే సర్వోత్తమమైనది, సమగ్రమైనది, చక్కనిది, సజీవమైనది గనుక ఇంగ్లీషునే ఉంచి తీరవలసినదని కేంద్రానికి నొక్కి చెప్పాలి. ప్రజాభిప్రాయం ప్రాంతీయభాషల్లో పరిపాలనపట్ల సుముఖంగా ఉన్నది. కనుక తరుణంలో జాగ్రత్తపడి హిందీని ఏ పరిస్థితుల్లోనూ మన నెత్తి కెక్కలేకుండా చూచుకోవాలి. 'నిజం'గారు సూచించిన నినాదాలతో ముఖ్యంగా "ఆంధ్రదేశంలో తెలుగునకేగాని, ప్రజలభాషగాని హిందీకి స్థానంలేదు" అన్నశక్తివంతమైన నినాదంతో— కార్యాచరణకు ముందడుగువేయాలి. ఏ రాష్ట్ర ప్రజలు ఆ రాష్ట్రభాషను తమ అధికార భాషగా చేయాలనే ఉద్యమాన్ని ప్రారంభించిన పక్షంలో మనం తలపెట్టిన కార్యం సుసాధ్యమౌతుంది. మద్రాసు ప్రభుత్వం తమిళాన్ని తమ రాష్ట్ర భాషగా చేసుకుని కార్యకలాపాలన్నీ తమిళంలోనే జరుపనిశ్చయించుకున్నట్లు వార్తలొస్తున్నవి. కాని ఇక్కడ ఒక చిక్కున్నది. మద్రాసులోని మలబార్, సేలం జిల్లాల ప్రజలభాష తమిళంకాదు. అందువల్ల వారు తమ రాష్ట్రభాషగా తమిళాన్ని అంగీకరించరుగదా! అదేవిధంగా హైదరాబాద్ రాష్ట్రాన్ని తీసుకోవచ్చు. ఇది మరాటీ, కన్నడ, ఆంధ్ర, ఉర్దూభాషా, సంగమస్థానం. అటువంటి సమయంలో ఏది ఆరాష్ట్రపు అధికారభాష! భాషాప్రయుక్త రాష్ట్రవిభజన జరిగేవరకూ పై ప్రశ్నలకు ప్రత్యుత్తరాలురావు, ఈలోగా 'హిందీ' అధికార భాషగా తయారై తన ఇనుపకాళ్ళతో మన నెత్తిన త్రొక్కుతుంది. అందుచేత హిందీ వ్యతిరేకోద్యమమే మన ప్రధాన లక్ష్యంగా పెట్టుకుని అల్పసంఖ్యాక భాషాప్రజల్ని కొన్నాళ్ళు ఓపిక పట్టమని కోరి ప్రతిరాష్ట్రమూ తన ప్రభుత్వ యంత్రాంగాన్ని "అధికసంఖ్యాకులు మాట్లాడే తన ప్రాంతీయభాష"లోనే నడిపి- హిందీకి వ్యతిరేకంగా కేంద్రంపై ఒత్తిడి తేవటం ఒక మార్గంగా కనబడుతున్నది.

కాని పైమార్గం అంత విజయవంతమౌతుందా అన్నది సందేహమే. ఎందువల్లనంటే విభిన్న భాషలుగల రాష్ట్రాల్లో ప్రభుత్వభాషగా ఒక భాషను నిర

యించినపుడు మిగిలిన అల్పసంఖ్యాక భాషావాదులు అందుకు అంగీకరించక ఆ రాష్ట్ర నిర్ణయంపై తమ నిరసనగా ఉద్యమాలు లేవదీయవచ్చు. ఉదాహరణకు మద్రాసురాష్ట్రంలో రాజభాషగా తమిళాన్ని నిర్ణయించేపక్షంలో ఆ రాష్ట్రంలో నివసిస్తున్న మళయాళీలు, ఆంధ్రులు దానిని వ్యతిరేకించవచ్చుగదా? ఈవిధంగా మనలోమనమే అంతరంగికమైనవిభేదాలు పెట్టుకుని హిందీ (రాజభాషగా) వ్యతిరేకోద్యమాన్ని నడపటం సాధ్యమేనా!

ఇది సాధ్యమవటం తేలిక విషయంకాదు. తమ భాషకాని దానిని రాష్ట్ర అధికారభాషగా నిర్ణయించినపుడు విశాలహృదయంతో ఆ నిర్ణయాన్ని ఆహ్వానించే శక్తి యింకా ప్రజలలో రాలేదు. అందువల్ల మనం భాషాసమస్యను జాగ్రత్తగా పరిశీలించవలసి ఉన్నది.

దీనికొక మార్గమున్నట్లు తోస్తున్నది. రాజభాషగా హిందీని ఎదుర్కొనటానికై రాష్ట్రప్రభుత్వ భాషగా ఇంగ్లీషునే ఆహ్వానించవలసియున్నది. దీనివల్ల రాష్ట్రాల్లో ఉన్న అల్పసంఖ్యాక భాషావర్గాలకి కూడా న్యాయం జరిగినట్లుండి మన ఉద్యమానికి వారి తోడ్పాటుకూడా ఉంటుంది. అందువల్ల ప్రస్తుతం 'ప్రాంతీయభాషలోనే పరిపాలన' అనే నినాదాన్ని తాత్కాలికంగా 'వాయిదా' వేసి రాష్ట్ర అధికారభాషగా ఎప్పటిలాగే ఇంగ్లీషునే ఉంచాలనే ఉద్యమాన్ని ప్రారంభించటం ఒక మార్గం. ఉదాహరణకు: హైద్రాబాద్ రాష్ట్రంలో అధికారభాషగా ఇంగ్లీషునే ఉంచిన పక్షంలో ఆ రాష్ట్రంలోని వివిధభాషల ప్రజకీ న్యాయం జరిగినట్లుంటుంది. లేక ఏభాషనో ఆరాష్ట్రపు రాజభాష చేసినపక్షంలో మిగతా భాషల ప్రజలకి ఏమాత్రం యిష్టముండదు. సరిగదా ఆ ప్రజలంతా కలిసి ఒక ఉద్యమాన్ని లేవదీయవచ్చు. అందువల్ల ఇంగ్లీషు రాష్ట్ర అధికారభాష అయినప్పుడు అందరూ ఆమోదిస్తారు. ఇంగ్లీషు విషయంలో తగాదా లేవీ లేవు. ప్రాంతీయభాషలో పరిపాలన సాగించే సౌలభ్యమున్న రాష్ట్రం మన ఆంధ్రరాష్ట్ర మొక్కటేనని చెప్పవచ్చును. ఒరిస్సా మొదలైన రాష్ట్రాలున్నప్పటికీ అక్కడకూడా భాషాభేదాలు ఎక్కువగా వున్నవి. అందువల్ల ఒక్క రాష్ట్రాన్నే దృష్టిలో పెట్టుకొని 'ప్రాంతీయభాషలోనే పరిపాలన' అనేవాదాన్ని ప్రారంభించటంవల్ల కలిగే లాభం శూన్యం. భాషాప్రయుక్తంగా రాష్ట్రాలు విభజించబడినపుడు ప్రాంతీయభాషలోనే పరిపాలన అన్న నినాదంవల్ల ఉపయోగమున్నది. అందుచేత భాషారాష్ట్రాలు ఏర్పడేవరకు ప్రతి రాష్ట్రప్రభుత్వమూ తన అధికార భాషగా ఇంగ్లీషునే ఉంచటం న్యాయం.

ప్రపంచ ప్రసిద్ధిబొందిన ఆంగ్లభాషలోనే మన విద్యాలయాల్లో యింతవరకూ బోధన జరుగుతున్నది. ఇంగ్లీషు భాషద్వారానే మనం ఇంతవరకు ఇతరప్రపంచంతో సంబంధ బాంధవ్యాలేర్పర్చుకున్నాము. నూటయాభై సంవత్సరాలనుండి రాజభాషగాఉండి మన విజ్ఞాన వికాసాలకు ఎంతో దోహదంచేసిన మహత్తరమైన భాష ఇంగ్లీషు స్థానంలో నిలబడటానికి హిందీకి అర్హతలేదని నా నమ్మకం.

---

ఎన్నో మధురస్మృతులకీ ప్రేమకీ ఆలవమైనది ఇల్లు. పుట్టిపెరిగిన యింటినీ ప్రేమాస్పదులైన బంధు జనాన్నీ కోరుకోవడం కంటె గొప్పవరం వేరే ఏముంది? మనతోపాటే మన కుటుంబమూ పెరుగుతుంది... పాషాణ జీవితపథానికి సంసారం ఒక అల లాంటిది. మానవ జీవితమనే సంద్రతరంగాల గర్జనని ఎదుర్కొనే బలిష్టమైన కొండలాంటిది సంసారం. జీవితసంక్షోభాన్నుంచి మానవజాతిని రక్షించే పవిత్ర దేవాలయం లాంటిది గృహం.

—ప్రేమచంద్.




# అంతరాలు

"వల్లపురెడ్డి"

బస్సులో కూర్చుని ఎవరితోనో మాట్లాడుతున్న పొరుగూరి బాలయ్యను చూసి బుచ్చిరాజు అకస్మాత్తుగా తలదించేసుకుని చరచరా వెళ్ళిపోయాడు. అతని పోకడను బాలయ్య గమనించనే లేదు. గమనించినా అతను తలవంచుకుని వెళుతున్నాడెందుకో అని సందేహించేవాడు కాదు. ఒకవేళ అలాంటి సందేహం కలిగినప్పటికీ అతని తలవంపునకు కారణం తను అక్కడ అగుపడటమే అని మాత్రం తెలిసికోలేక పోయేవాడే. ఎందుకంటే బుచ్చిరాజును బాలయ్య అంతగా ఎరుగడు. కారణం: బుచ్చిరాజులాగ తాను గొప్పగా చదువుకున్నవాడూ కాదు; దర్జాకలవాడూ కాదు. టిన్నిషర్టు, గ్లాస్కోపంచె, మీద అందంగా కప్పుతున్న పెద్దాపురం సిల్కుకండువా, చెప్పులు. అంతేగాక అతను సహజంగా అంతగాడు; నీటుగా క్రాఫు దువ్వి పరిశుభ్రంగా ఉన్నాడు. బాలయ్య వీటి కన్నిటికీ దూరంగా ఉన్నాడు. అతనిమీద చిరిగి పేలికలయిపోయి చెమటలో పలుమార్లు తడిసి, ఎండి బిగుసుకుపోయిన ఒక తలపాగా, చాలీచాలని పాతపంచెకు మినహా మరేమీ లేవు. ఇక అందచందాలు పరిశుభ్రత కావాలంటే అతని దగ్గర వెతికినా దొరకవు. ఇవన్నీ వ్యక్తిగత విషయాలే అయినా, సామాజికంగా కూడ ఇరువురికీ ఏవిధమైన కలయికలూ లేవు ఒకే ఊరివాళ్లు కాకపోవటంవల్ల. ప్రాపంచిక తారతమ్యాలను దాటించగరు వాళ, వీ రిరువురినీ ముడివేసి సమానత్వం కల్పించేది ఒక్క సృష్టిమాత్రమే!

బుచ్చిరాజు బాలయ్య జీవితంలో ఒకక్షణం తటస్థపడి మరుగుపడిపోయిన అసంఖ్యాకుల్లో ఒకడే కాని నిత్యమూ కలిసేవాడుమాత్రం కాదు. అయితేమరి బాలయ్యను చూసీ చూట్టంతోనే ప్రధానాంగాన్ని వంచుకుని వెళ్ళిపోవటానికి కారణం?

నిజానికి అతను తన మస్తకాన్ని బుద్ధిపూర్వకంగా వంచుకోలేదు. బాలయ్యను చూట్టంతోనే దానంతటదే అప్రయత్నంగా వంగిపోయింది. అతను చదువుకున్నవాడు; న్యాయాన్యాయాలను నలుగురికి తెలియజెప్పగల మనిషి. అభ్యుదయ రచయిత; సంఘసంస్కరణ ప్రధానాశయంగా పెట్టుకున్న వ్యక్తి. వీటన్నిటికి తోడు అతనిలో ఆత్మను పరిశీలించుకునే సుగుణమొకటుంది. ఎవరేనా నీతిబాహ్యంగా ప్రవర్తించారంటే అతనికి కంటగింపు. ఎప్పుడైనా పొరపాటున తనే అలా ప్రవర్తిస్తే ఎనలేనిబాధ ననుభవిస్తాడు. తనమీద ఉన్న సద్భావంకొద్దీ ఇతరులు తనతప్పిదాన్ని ప్రేలెట్టి చూపకపోయినా తనకుతానే పశ్చాత్తాప పడుతాడు. అతన్లో ఉన్న ఈ గుణమే ఎన్నడో తను చేసిన పొరపాటుకు శిక్షగా ఈ నాడు తలవంచేలా జేసింది.

మూడేళ్ల క్రితం సంగతి. వేసవి సెలవుల్లో గోవిందూ, దశరథం బుచ్చిరాజును ఓ మారు చూసి వెడదామని వచ్చారు. ఆ నాడు ఏవో సాంసారిక క్లిష్టపరిస్థితులు ఎదురు తగలటం వల్ల బుచ్చిరాజు మనస్సేమీ బావుండలేదు. వచ్చిన మిత్రద్వయంతో ఎప్పటిలా మనసువిప్పి మాట్లాడలేదు. సరికదా, కనీసం పల్లెత్తుమాటైనా పల్కకుండా మౌనధారి అయ్యాడు. గోవిందు కొంచెం మితభాషి. కాని దశరథం ఓపట్టాన వదిలాడుకాడు. ఎలాగైనా మాట్లాడించాలని ప్రయత్నం చేశాడు. అయినా అతను మాట్లాడకపోవడమటుంచి, దశరథ హాస్యభరితంగా సాగించినధోరణి అనవసర ప్రసంగంగా తోచి విసుక్కున్నాడు. బుచ్చిరాజు ఎందుకంత విచారిస్తున్నాడో మిత్రులకి తెలుసు. తెలిసే అతణ్ణి విచారంలోంచి బయటికీడ్వాలని ప్రయత్నించారు. కాని ప్రయత్నాలన్నీ విఫలమయ్యేసరికి "మేం వెళ్ళిపోమా!" అనడిగారు.

వెళ్ళొద్దని ప్రాధేయపడతాడని వారి అంతరంగికాభిప్రాయం.

"వెళ్లేవారిని అడ్డుకుని అడుక్కునేవా లెవరూ లేరిక్కడ" సమాధానంలో తీవ్రత కన్పించినా లోలోపల వారు వెళ్ళటమంటే అయిష్టంగానే ఉంది.

"మాట్లాడకపోతే మానె. కనీసం అలా పొలాలవైపు వెళ్ళివద్దాం పద" అని లాగారు. తనకేమో బయటికి వెళ్ళటానిక్కూడా మనస్సొప్పటం లేదు. కాని వాళ్ళ కోరికను ఈమాత్రమైనా సాగనీయకపోతే వారు వెళ్ళటం తథ్యం అని తోచేసరికి వెళ్ళక తప్పలేదు. పొలాలవైపు బయల్దేరిన వారు మెల్లిగా మామిడితోటవైపు దారి తీశారు, కాస్సేపు అలా సరదాగా తిరిగి నాలుగు మామిడిపళ్ళు కొనుక్కుని తినివద్దామని. ఈ కోరికను గూడా కాదనలేకపోయాడు. మనిషిలో సహజంగా వున్న లోపం ఇదొక్కటే. కటువుగా ప్రవర్తిస్తూన్నప్పుడు చర్యలన్నీ ఒకదానికంటే మరొకటి కటువుగా వుంటాయి. కాని దానిలోనే ఏ కొంచం నమ్రత ప్రవేశించినా ఆదే నమ్రత మరో నమ్రతకు దారితీస్తుంది. కటువుతనంగాని, నమ్రతగాని మనిషిలో పరిమితంగాఉంటే మంచిదే. కాని ఇవెప్పుడూ హద్దుల్లో వుండవు. ఇవి కల్లు సారావంటి మత్తు పదార్థాల వంటివి. వీటిని ఒక పరిమితిలో ఉపయోగిస్తున్నంతవరకు మనిషికి ఏ భయమూ అక్కర్లేదు. కాని ఒక గ్లాసు కల్లు మరో గ్లాసుకు నాంది. బుచ్చిరాజు మిత్రుల ఒక కోరికను చెల్లించాక మరో కోరికను చెల్లించకుండా ఉండలేకపోయాడు.

తోట ఆ వూరికి మైలుదూరాన్న మరో ఊరి జాగీర్దారుది. దాన్ని ప్రతి సంవత్సరమూ జాలరి వాళ్ళు కౌలుకు తీసుకుంటారు. దానిలో పలు రకాల మామిళ్ళున్నాయి. విరివిగా కాస్తాయి. జాలరివాళ్ళు బాగాలాభం తీస్తుంటారు. కౌలుదార్లు బుచ్చిరాజు గ్రామస్థులే కావటంచేత పరిచయాన్ని బట్టి కొంచం చౌకగా మంచిపళ్ళు ఇస్తారు. అందుచేత ప్రతి సంవత్సరమూ మిత్రులెవరైనా వస్తే ఆ తోటకే తీసికెళ్ళటం పరిపాటి.

గేటు తెరచుకుని తోటలో కెళ్ళారు. పది గజాలదూరం వెళ్ళారో లేదో, దూరంనుంచి "ఎవరయ్యా...యాడికి?" అని కేక వినపడింది. ఆ కేక తమను ఉద్దేశించే అయినప్పటికీ అంతటి గట్టి కేకకుతగ్గ సమాధానం ఇచ్చే గొంతు ఎవ్వరికీ లేకపోవటంవల్ల ఇంకా ముందుకు వెళ్ళారు. ఒక మనిషి పరుగెత్తుకుంటూ వచ్చి "యాడికయ్యా, కేకేస్తూంటే యిన్పించుకోకుండానే ఒస్తున్నారు!" అని ప్రశ్నించాడు.

"ఆఁ, మరేమీలేదు; కొంచం తోట చూసి వెడదామని వచ్చాం. అంతే" అన్నాడు గోవిందు. నెమ్మదిగా మరో నాలుగైదడుగులు ముందుకు నడిచారు మామిడి అంట్లను పరికిస్తూ.

"ఏముంది సూట్టానికి? యెల్లిపొండయ్యా, దొరోళ్లెవరైనా సూస్తె నామాటొస్తది" ముందుకు నడిచివెడుతున్న వారి ననుసరిస్తూ "సెప్తుంటె యిన్పడదయ్యా మీకు?" అన్నాడు మొదటి ధోరణిలోనే. చెబుతూన్న మాటలు తమకు గాదన్నట్లుగా ముందుకు నడుస్తూంది మిత్రత్రయం. బుచ్చిరాజు పాదాలు ముందుకు వెళ్ళటానికి ఒప్పుకోలేదు. మిత్రుల ముఖంలోకి చూశాడు వెడదామన్నట్లు.

మిత్రుని ముఖకవళికల్ని ఖాతరు చెయ్యకుండానే గోవిందు ప్రారంభించాడు. "ఊరికే చూట్టానికి కాదు; పళ్ళు కొనుక్కెళ్ళాలని వచ్చాం"

"కొంటమూ, అమ్మటమూ ఇక్కడేమీలేదు. వచ్చిందారినే మల్లండి" అంటూ త్వరపెట్టాడు.

"ఏటేటా మేమిక్కడే కొనుక్కుని తిని పోతూంటాం. ఇదేమిటి ఈ ఏడు ఇట్లంటావ్? ఇంకెవరూ లేరా గుత్తాకు తీస్తున్న వాళ్ళు?" చుట్టూరా కలియచూశాడు. గోవిందు. "తోట బొత్తిగా పండనట్లుందే?"

"ఏదీ చెట్లకు ఈ యేడంతా నీళ్లే పోయనివ్వలేదు. పండమంటే ఎట్లా పండుతాయయ్యా!" అతడు మాటల్లోకి దిగాడు. మొదటిలాగా కోపపూరితంగా లేవు మాటలు "ఎందుకూ! ఇంత పెద్ద బావి ఉండనేవుంది. నీరెందుకు పట్టలేదు తోటకి!" అనడిగాడు గోవిందు.

అతఁడు ఒక పదిగజాలు ముందుకువెళ్ళి ఒక చెట్టుక్రింద చతికిలపడ్డాడు. "ఉంది బావివుంది; ఇంజన్లూ వున్నయ్. కాని ఏదో ఆమధ్య చిన్నదొర

పెద్దోరా కొంచం కీచులాడుకున్నారు. పట్నం నుంచి పెద్దోర కొలికీ, కన్నెల్లకూ వచ్చి తోటమీ దొచ్చిన డబ్బులన్నీ తీసికెళ్లి కర్చుపెడ్తూంటే చిందోర సూడ్లేక ఇంజన్లు పీకించి బంగలాలో పడేసారు. మమ్మల్ని నీరెట్టొద్దన్నారు. మాకేం? జీతగాల్లం సెప్పినంత సేసేవాళ్ళం. ఈయేడు ఏదో ఈమూలొకటి, ఆమధ్య రెండు, అపక్కన ఓనాలుగు చెట్లు; అంతాకలిసి ఒక ఏడెనిమిది గల్లయి పండినయి. వాటికి నన్ను కాపలా ఉంచారు. అవికూడా మొన్న లేగిన గాలులకి అన్నీ రాలిపోయినయి. ఇంకా కొంచం మిగిల్నయి."

"మరి రాలిన కాయలన్నీ ఏంజేశారు?" మధ్య లోనే ప్రశ్న.

"ఏమో, రెండుమూడు గంపల కాయలకు రాలినయ్. అన్నీ ఏరికెల్లి బంగలాలో పోసాను. ఏం జేసుకున్నారో ఎవరికి తెలుసు? వాటితోని మాకేంపని? ఒక్కటిగూడా ముట్టుకోలా నేను..."

"అయితే నువ్వు దొరలదగ్గర జీతం చేస్తున్నా వన్నమాట. ఎన్నాళ్ళనుంచి? ఎంతిస్తారు జీతం?" విషయం మార్చాడు గోవిందు.

"పదేళ్ళ పిల్లగాడి దగ్గర్నుంచి ఈల్లదగ్గరే వున్నా. ఇరవై ఏల్లయింది. యాడాదికి నూట యాభై గాడీలిస్తారు. తోటదగ్గర ఉండమంటే వుండాలి. అవుసరమొచ్చి దున్నటానికి కెల్లమంటే ఎల్లాలి. ఒక్క పనిగాదు. అన్ని పనులూ సెయ్యాలి. మొన్నసే సాలిచ్చుకుందామంటే, చిందోర ఉండీ, కాదు బాలయ్యా ఈ ఒక్కేడే ఎట్టాగో ఉండు. మధ్యలో మానేస్తే ఎట్లాగు? అని ఊరికే అడిగితే కాదన్లేక వున్నా. ఈ ఒక్కేడూ అయిపోతే ఇక మానుకుంటా ఉన్నంత వరకూ న్యాయంగా చెయ్యాలిగదా...", గోవిందు ముఖంలోకి చూశాడాయన. గోవిందు పరధ్యా న్నంగా వూకొడ్తున్నాడతని మాటలకు దశరథం మాత్రం శ్రద్ధంగా వింటున్నాడు.

దశరథం జేబులోంచి సిగరెట్టుడబ్బీ తీసి ఒకటి ముట్టించుకున్నాడు. డబ్బీ గోవిందుకిస్తూ అతని కొకటివ్వమని సైగచేశాడు. గోవిందు "నువు సిగ రెట్టు కాల్చవూ?" అతన్నుద్దేశించి ప్రశ్నిస్తూ చేతిని ముందుకు పోనిచ్చాడు. "ఊహుం, నేం తాగను. నాకొద్దు." వైముఖ్యం, తత్తరపాటు వ్యక్తపరి చాడు - ముఖంలోనూ, చేష్టలోనూ.

"మరేంలేదు; తీసుకో బాలయ్యా మేం పండ్ల కొరకిస్తున్న లంచమనుకుంటున్నావా, ఏం? నువు పండ్లివ్వక పోయినా ఫరవాలేదు. తీసుకో." అన్నాడు దశరథం.

"పండ్లిచ్చినా, ఇయ్యకపోయినా నేను తాగ నయ్యా. చుట్టతాగితే తీసుకోటానికేం. తాగ నయ్యా అంటే..." అన్నాడు.

గోవిందు సిగరెట్టు డబ్బీని దశరథం కిచ్చాడు. "అయితే మరి ఇంతదూరంనుంచి వచ్చి తిన కుండానే వెళ్ళాలా బాలయ్యా?" అన్నాడు. ఎక్కడలేని నిరాశ నిస్పృహ కనబరచాడు మాటల్లో.

"ఆఁ, ఎల్లాల్సిందే. నేనేం జెయ్యను? ఇదేం నాతోటా? ఏదో నాల్గుపండ్లివ్వటానికి? నేనివ్వ నయ్యా నాకు మాటొస్తది."

"నీకు మాటొచ్చేట్లు చేస్తామా? ఇదుగో డబ్బు తీసుకుని నీకిష్టంవచ్చినన్ని—మూడో, నాల్గో—తెచ్చివ్వు తోట వెనకదారిగుండా వెడతాం. నీకేమీ మాట రానీములే దూరంగా వెళ్ళిపోతాం."

"ఊహుఁ, అదంతా ఏమీ పడదు. ఎల్లండి దొరలెవరైనా చూస్తే నన్ను దక్కనివ్వరు. తోటలో మనుషులు తిరిగితే సరి; నన్ను కుచ్చి కుచ్చి అడుగుడారు. ఎల్లండయ్యా ఎన్నిసార్లు చెప్పాలి?"

ఎంతసేపు మాట్లాడినా అతను తమదార్లో పడే సూచనలేమీ అగుపడలేదు. "అయితే, ఇంత దూరం వచ్చినందుకు బావిలో నీళ్ళయినా త్రాగి వెడదాం పదండి." అన్నాడు గోవిందు. ముగ్గురూ బావిదగ్గరికి దారితీశారు. కాని ఎవరూ నీళ్లు త్రాగనేలేదు. బుచ్చిరాజు మాత్రం బావిలోకి దిగి, నీళ్ళవాసన కొడ్తున్నందున బయటికొచ్చాడు. అతడూ వారివెనకాలే వెళ్ళాడు. బావిచుట్టూరా నాలుగైదు చెట్లు బాగాపండిఉన్నయి. వెళ్ళిన త్రిమూర్తులు ఏమైనాచేస్తారేమోనని అనుమానం చేత అతడు అక్కడే నిరీక్షిస్తూ నిల్చున్నాడు.

బుచ్చిరాజుకేమో అక్కడ నిల్చున్న ప్రతి క్షణం విసుగ్గా గడుస్తూంది. కాని గోవిందుమాత్రం తోటకాపరితో మాటలు ముగించటంలేదు. అప్పు

తప్పుడు దశరథం గూడా అగ్నికి వాయువులా తోడౌతున్నాడు. గోవిందు, అంట్లవెంపకాన్ని గురించి సంభాషణ మొదలెట్టాడు. మధ్యమధ్య గోవిందు డబ్బులు తీసుకుని పళ్ళివ్వమనటమూ, అతడు నిరాకరించటమూ జరుగుతూనే ఉంది. బుచ్చిరాజు అతని న్యాయబుద్ధికి, విశ్వాసానికి లోలోపల మెచ్చుకున్నాడు.

గోవిందు ఆఖరి ప్రయత్నం చేశాడు. జేబులోంచి ఒక రూపాయి నోటుతీసి అతని దగ్గరికి వెళ్ళి బలవంతంగా చేతిలో, అతడు వద్దువద్దంటుండగానే ఉంచి "ఇదిగో ఇది తీసుకుని నీ ఇష్టంవచ్చినన్ని పళ్ళుతీసుకొచ్చివ్వు. మేం ఇదే, ఈ వెనకదారిగుండా వెళ్ళిపోతాం. ఎవ్వరికీ ఈ విషయం తెలియనివ్వంలే. ఇంతదూరంవచ్చి ఊరికే ఎలా వెళ్ళాలి! తెచ్చివ్వు." పిలయినంత మృదువుగా చెప్పాడు.

ఆ దృశ్యం బుచ్చిరాజుకేమీ బాగనిపించలేదు. తోటమనిషి చేతిలోంచి నోటును జారవిడువలేకపోయాడు. అతనిలో ఎన్ని ఊహాలు రేకెత్తినవో ఆ రూపాయివల్ల తన భార్యను ఒక రవికె తీసుకురావచ్చుననుకున్నాడో, లేక చిన్నకొడుక్కి ఒక చొక్కా కుట్టించవచ్చు ననుకున్నాడో, లేక మూన్నాళ్ళకు సరిపోయే బత్తెం కొనవచ్చు ననెంచాడో, ...ఏమేమి ఊహించాడోగాని ముఖం మాత్రం ఒకవైపున ఏదో ఆశచేత జేవురించింది. మరోవైపు, యజమానిపట్ల విశ్వాసరాహిత్యంగా ప్రవర్తిస్తున్నాననే బాధచేతనేమో, కళ దగ్గింది. ఎట్టకేలకు అతను కాదనలేక పోయాడు. "మీకెంత చెప్పినా ఇనటంలేదు. నాకు మాటొస్తదని అప్పట్నుంచి చెబుతుంటే మీపట్టు మీదే. కచ్చితంగా మాట్లాడుదామంటే పెద్దకులపోళ్ళు ...సరే, ఆలారండి." అంటూ తోటకు పూర్తిగా వెనకభాగానికి తీసుకువెళ్ళాడు వారిని. బాగా వెడల్పుగా పెరిగిన చెట్లమాటుకు వెళ్ళి నాలుగుపండ్లు త్రెంధి తీసుకుని పరుగెత్తుగొచ్చి వాళ్ళచేతుల్లో పెట్టి, "ఇక వెళ్ళండి. నాకు భయమేస్తుంది. దూరంగా ఎల్లిపోండి." అన్నాడు. అతను అపాదమస్తకమూ వణుకుతున్నాడు. అతని స్థితిచూచి బుచ్చిరాజుకు మనస్సు చివుక్కుమంది, అతనిమీద జాలి, కోపమూ కలిగినయి. డబ్బు ఆశచూపి అతడిని ఆ స్థితికితెచ్చిన మిత్రులమీద పట్టలే అగ్రహం కలిగింది; కాని ఏమీ అనలేకపోయాడు.

తోటబయటికివెళ్ళి ఒకచోట కూర్చున్నారు. మిత్రులు గోవిందూ, దశరథం పళ్ళను పగులకొట్టారు కత్తిఏమీలేకపోవటంవల్ల. బుచ్చిరాజుకు ఆ పళ్ళతినటం సుతరామూ ఇష్టంలేదు. కాని మిత్రుల్ని సంతృప్తి పరచటానికి తినక తప్పలేదు; తరువాత గోవిందు ఒక పెద్ద ఉపన్యాసమిచ్చాడు. తను తోటకాపరి శీలానికి భంగకరంగా ప్రవర్తించలేదనీ, జాగీర్దార్లకు అన్నిపండ్లు అవసరం కనుక ఒక విధంగా తోటవాడికి సహాయం జరిగిందీ, తమ కోరిక నెరవేరిందనీ.

సాయంత్రం ఇంటికి మరలి వస్తూంటే దశరథ అన్నాడు గోవిందుతో "ఏం గోవిందూ, తప్పించుకుందామని చూస్తున్నావేమో, తోటవాణ్ణి డబ్బుతోమార్చి! ఇదో మన కవిగారు ఎక్కడైనా దెబ్బతీస్తారు. కొంచెం జాగ్రత. రేపోమాపో కథనో, గేయాన్నో వ్రాస్తారుచూడు."అని హెచ్చరించాడు నవ్వుతూ.

"రాసుకుంటే రాసుకో, కాని మా పేర్లతో డైరెక్టుగా మాత్రం డీల్ కావద్దు స్వామీ" అన్నాడు గోవిందు బుచ్చిరాజువైపు చూస్తూ. బుచ్చిరాజు పలుక్కుండా గంభీరంగా నడుస్తున్నాడు.

మరునాడు ఉదయం మిత్రులు వెళ్ళిపోయారు. పోస్టుమాన్ ఉత్తరాలు తెచ్చి ఇచ్చాడు. ఒక కవరులో ఒకచెక్ గూడా వచ్చింది. ఎక్కడ్నుంచో అని ఆదుర్దాగా చూశాడు. ఒక ప్రముఖ పత్రికాధిపతి పంపాడు. ఉత్తరాలన్నీ చూస్తే అతనినుంచి ఒక ఉత్తరంగూడా వచ్చిఉంది."ప్రత్యేక సారస్వత సంచిక వెలువరిస్తున్నాం. మీ రచన అవశ్యం కావాలి. పారితోషికంగా ఏభైరూపాయలు పంపుతుంటున్నాం." ఇవీ ఉత్తరంలోని మాటలు. ఏం చెయ్యాలో స్ఫురించలేదు బుచ్చిరాజుకు.

వాళ్ళ మాటను తీసివెయ్యలేక రచనైతే పంపాడు; కాని తరువాత చాలా బాధపడ్డాడు. అంతకు క్రిందటిరోజున జరిగిన బాలయ్య ఘట్టం జ్ఞప్తికొచ్చింది. అతనికి తనకూ భేదమేమీ అగుపడలేదు. అవమానంతో కుచించుకు పోయాడు.

ఈ కారణంవల్లనే బుచ్చిరాజు బాలయ్యను చూసి తల దించుకున్నాడు. ఇప్పుడే కాక ఇంతకు మొదటకూడ ఎన్నో పర్యాయాలు బుచ్చిరాజుకు తటస్థపడ్డాడు. ఇతణ్ణిచూసి అతడు చలించలేదు. ఇతడే తలవాల్చి వెళ్ళిపోవాల్సి వచ్చింది. కారణం బుచ్చిరాజుకు తెలుసు. బాలయ్య తన ప్రవర్తనకు పశ్చాత్తాపపడి ... బాలయ్య తన ప్రవర్తనకు వణికిపోయింది క్షణ కాలం మాత్రమే ఆ ఘట్టం కాస్తా కళ్ళముందు నుంచి మాయమవగానే తనూ మర్చిపోయాడు. బుచ్చిరాజును ఈనాడతను గుర్తేపట్టడు. కాని బుచ్చిరాజు మాత్రం తన తప్పిదానికి ఈనాడు కూడా తలవంచుకుంటున్నాడు. బాలయ్యకూ, బుచ్చిరాజుకూ ఉన్న తేడా ఆత్మసంస్కారం లోనే.

త్వరత్వరగా ఇంటికివచ్చి బుచ్చిరాజు ఈజీ చైర్‌లో కూర్చున్నాడు. కాని అతని మనస్సు మనసులోలేదు. ఎందుకు తను అప్రయత్నంగా అలాంటి అవమానం ఫీలవుతాడు? బాలయ్య ఏనాడో మర్చిపోయినట్లుంది. కాని తననింత వరకూ పీడిస్తుందే ఆఘట్టం! తనూ, బాలయ్యమల్లే ఉంటే ఎంత బావుండును! 'ఛీ, ఛీ ఈ చదువూ, సంస్కారమూ లేకున్నా బావుండేది! అని మనసులో అనుకుంటూంటే వేడినిశ్వాసం ఒకటి వెలువడింది.

కథానిక

# ఫలించిన పథకం

ఎస్. యం. సుభాని

అట్లుంచి వస్తున్న రాజారావు రౌండ్ గార్డెన్ లోని ఫౌంటెన్ దగ్గర నిలబడివున్న విజయలక్ష్మిని చూశాడు. అంతకు క్రితం చాలసార్లు చూశాడు, కాని పరిచయ మేర్పడిన తర్వాత ఇదే మొదటిసారిగా చూడటం. ఎప్పుడుచూసినా ఏదో విచారంతో బాధపడుతున్నట్లు కనిపిస్తుండేది. ఈ రోజు ఆమె ముఖాన విచారం ప్రస్ఫుటంగా కనిపిస్తున్నది. ఒక్కక్షణం ఆమెవైపు చూస్తు నిల్చున్న రాజారావు మనసులో ఒక ఊహ మెరిసింది. ఎలాగైనా ఆమె విచారం పోగొట్టాలని నిశ్చయించుకొని గార్డెన్‌లో ప్రవేశించాడు.

ఆమెతో కేవలం ఒక్కసారిమాత్రం సమావేశంలో పరిచయమైనా, అతను ఎటువంటి సంకోచం లేకుండా ఆమెను సమీపించాడు. కొంతవరకు అతనిలోని సత్సంకల్పం అతనిని ముందుకు నెట్టింది.

"బాగున్నారా?" అని అడిగాడు రాజారావు.

"ఆఁ" అంటూ ఆమె అస్పష్ట మందహాసంతో తలఊపింది.

"అదోలాదిగా ఉన్నారు. ఒంట్లో బాగా లేదా?"

"ఏమీలేదండీ, కులాసాగానే వున్నాను" తల వంచుకుని సమాధానం చెప్పింది.

"ఎప్పుడు చూసినా ఏదో దిగులుగావుంటారు. అంతకన్నా నాలుగు రసగుళికలు పుచ్చుకో రాదూ?" నవ్వుతూ అన్నాడు రాజారావు.

"రసగుళికలు..." అంటే ఏమిటన్నట్లు ఆమె ఆశ్చర్యంగా చూసింది అతనివైపు.

"మరేంకాదు, ఉత్సాహంగా ఉండేందుకు డాక్టరుగారి నడిగి నాలుగు మోతాదుల ఆనంద రసం పుచ్చుకోరాదా?"-అని.

ఆమె మళ్ళా తలెత్తి రాజారావువైపు చూసింది. అతను చిరునవ్వు చిందిస్తున్నాడు... ఆమె కళ్ళలో కోపం, సిగ్గూ, రెండూ ప్రతిబింబించినై. రాజారావు ఇంకా మందహాసం చేస్తూనే వున్నాడు. ఆమె తలవంచుకున్నది.

పాలిపోయిన ఆమె చెక్కిళ్లు క్షణికంగా గులాబివర్ణం దాల్చటం రాజారావు స్పష్టంగా చూడకలిగాడు. అతనికి తన సత్సంకల్పం నెరవేరుతుందనే విశ్వాసం కలిగింది.

"నీ నిర్భయంగా చనువుతో మాట్లాడటం మీకు కష్టం కలిగిస్తే క్షమించాలి... మొన్న సమావేశంలో మీతో పరిచయమైనది. అంతకు క్రితం కూడా చాలాసార్లు చూశాను. ఎప్పుడు చూసినా మీరో విచారంగా కన్పిస్తారు. మీ విషణ్ణ వదనం చూస్తు వుంటే ఎందుకనో ఒకమాదిరిగా వుంటుంది. మీకు ఈ విచారాన్ని పోగొట్టుకునే మార్గం ఏమీ లేదా?" అతని స్వరం మృదువుగా అనునయపూర్వకంగా వున్నది.

"మీ మాటలవలన కష్టంకలిగే మాట నిజమే, నేను విచారంగా వున్నాననే అనుమానం ఎందుకు కలిగింది మీకు? ఒకవేళ విచారంగావున్నా అదెలా పోతుంది మరి?" అడిగిం దామె విచిత్రంగా నవ్వుతూ.

ఆమె మాటల తీరుచూస్తే రాజారావుకు కొంచెం ఆశ్చర్యం కలిగింది. ఆమెలో అత ననుకున్నంత సంకోచం కన్పించలేదు.

"ఆ అనుమానం నాకు ఎందుకు కలిగిందో చెప్పటం ఎంత కష్టమో తెలిస్తే మీరా ప్రశ్న వేసేవారు కారు. మిమ్మల్ని చూసి చిన్నపిల్లవాడు కూడా చెప్పగలడు మీరు దిగులుగా వున్నారని. ఇక అది పోయే విధాన మంటారా, ఆ విచారం ఎందుకు ఏమిటో తెలుసుకోగలిగితే దానిని పోగొట్టుకోవచ్చు. కారణం తెలిస్తే దానికి తగిన చికిత్స చేసి నివారించటం కష్టంకాదు. మీ కీ విచారం ఎందుకో అడిగేపాటి సాహసం చేయ కలను కాని దానిని మీరు దుస్సాహసం అనుకుంటే మళ్ళా నేను చాలా బాధపడవలసి వస్తుంది."

విజయలక్ష్మి అతని మాటలకు సమాధానం చెప్పలేదు. ఉన్నట్టుండి ఆమె ముఖాన విచార రేఖలు వ్యాపించినై. ఆమె నిస్పృహాలో బాధ పడుతుందేమోననే అనుమానం కలిగింది రాజారావుకు. తను ఆలోచించిన ఉపాయంతో ఏలాగైనా ఆమె విచారం పోగొట్టా లనుకున్నాడు.

"నాచోటివాడు చేయకలిగేదేమీ లేదు. కాని మీ విచారం పోయే మార్గం తెలిస్తే బాగుండును! ఇటువంటి తహతూహలం కలగటం సహజమే నని నిస్తుందేమో కాని ఇది [illegible] కాదు. టైం అయిపోవచ్చింది, వార్డు కెళ్ళండి. అదృష్టం బాగుంటే మళ్ళా మీ దర్శన భాగ్యం లభిస్తుంది...నమస్తే."

ఆమె సమాధానం చెప్పే అవకాశం లేకుం డానే వెళ్ళిపోయాడు రాజారావు. వెనక్కు కూడా తిరిగిచూడలేదు. అతను కన్పిస్తున్నంతసేపు అతనిని చూస్తూ నిలబడిం దామె.

విజయలక్ష్మి ఆలోచించింది—ఆమెను దిగులు పడవద్దని చాలామందిచెప్పారు. చెప్తూనేవున్నారు. అస లామె దిగులుపడుతుందనే సంగతి నిజమో అబద్ధమో కూడా నిర్ధారించుకోలేక పోయింది. ఒకవేళ దిగులుపడుతున్న మాట నిజమే అయితే ఆ దిగులు దేనిగురించో ఆమెకు అర్థంకాలేదు. ఆమె తన స్థితిని ఒకసారి పర్యాలోకనంచేసి చూసు కున్నది. చాలా శోచనీయంగావున్నట్టు తోచింది. తండ్రి ఎప్పుడో చిన్నప్పుడే పోయాడు. తల్లి ఉండేది. కూతురుమీద ఎన్నో ఆశలు పెట్టుకొని కలలు కంటూ వుండేది. కూతురుకి యీ వ్యాధి రావటంతో ఆమె సుందరస్వప్నాలు ఎక్కడికూడ విడిపోయినై. ఆ దెబ్బతో ఆమె కోలుకోకుం డానే పోయింది. ఇటువంటి విధి దుర్భరంగా తోచింది ఆమెకు. విజయలక్ష్మి ఆలోచిస్తూనే ఉన్నది. ఈ ఆలోచనే ఆమెకు దిగులుగా పరిణ మించి కృంగదీస్తున్నదనే విషయంఆమె తెలుసుకో గలిగితే ఎంతబాగుంటుంది!

రాజారావుకు విజయలక్ష్మితో మాట్లాడే అవ కాశం కొన్నాళ్ళకు కాని లభించలేదు. ఈమధ్య ఆమె కన్పించినా, ఆమెవెంట ఎవరో ఉండేవారు. అటువంటప్పుడు ఆమెనుచూసి కేవలం చిరునవ్వు నవ్వి వెళ్ళిపోయేవాడు. మొదట ఆమెకు కొంచెం కష్టంగా వున్నట్టనిపించేది అతనితీరు. కాని ఎప్పుడు చూసినా చిరునవ్వు నవ్వుతుండే అతనిని చూస్తుంటే ఆమెకు ఒకవిధమైన ప్రసన్నత కలిగినట్టుండేది.

ఒకసారి రాజారావు షికారు వెళ్ళి వస్తుంటే ఆపరేషన్ థియేటర్ వైపునుండి వస్తున్న విజయలక్ష్మి కన్పించింది. అతనిచూసి ఆమె అప్రయత్నంగా మందహాసం చేసింది. రాజారావుముఖం వికసించి నట్టయింది.

"ఆరోగ్యం ఎలావున్నది?" అని అడిగాడు.

"చాల బాగున్నది." అన్నదామె.

"కేవలం అతిశయోక్తి! ఇదివరకటికంటె కొంచెం 'లైట్' వచ్చినట్లు కన్పిస్తున్నారు. అంతే కాని, చాల బాగుండేంతటి ఆరోగ్యం మీకింకా కలగలేదు. అయినా మీకు నిర్లక్ష్యం చాల ఎక్కువగా ఉన్నట్లు కన్పిస్తున్నది."

"నిర్లక్ష్యం దేనిని గురించి?"

"మిమ్మల్ని గురించే. మీరు ఆరోగ్య విషయంలో అంత శ్రద్ధ తీసుకుంటున్నట్లు కన్పించదు. ఎప్పుడూ ఏదో విచారిస్తూ కూర్చుంటారు. ఈ వ్యాధికసలు విచారం అనేది పనికిరాదు. డాక్టర్గనా మీ యింటికి ఉత్తరంవ్రాసి మీ నాన్నగారికి తెలియజేస్తే బాగుండేట్లున్నది. వారనా వచ్చి..."

రాజారావు వాక్యం పూర్తి చేయకుండానే ఆమె ముఖభావాలుచూసి ఆశ్చర్యపోయాడు. మళ్ళా ఆమెముఖం విషాదచ్ఛాయలతో మ్లానమైంది. వాళ్ళనాన్న గురించి ఏదో అంటుంటే ఆమె హఠాత్తుగా బాధపడటం అతనికేదో స్ఫురింప జేసింది.

"క్షమించాలి. నా మాటలు మీకు కష్టం కలిగిస్తవనుకోలేదు. చాల విచారిస్తున్నా"నన్నాడు బాధగా.

ఆమె ఏమీ మాట్లాడలేదు. ఇద్దరూ నడుస్తున్నారు. వచ్చేపోయే పేషెంట్లు కొంతమంది వీరిద్దర్నీ ఆశ్చర్యంగా చూస్తు అసహ్యంగా చేతులు తిప్పుకుంటు వాళ్ళలోవాళ్ళు ఏదో మాట్లాడుకుంటూ పోతున్నారు.

"మీకింత విచారం ఎందుకో చెప్పరూ..." అతని కంఠస్వరం జాలిపుట్టిస్తుంది.

విజయలక్ష్మి అతనివైపు చూసింది. అతని ముఖాన బాధతోకూడిన వ్యథరేఖ అస్పష్టంగా కన్పించింది. అతను ఆమెకళ్ళలోకి చూస్తూ "చెప్పరూ..." అన్నాడు గోముగా.

ఆమె కళ్ళలో నీళ్ళు నిల్చినై. తల అడ్డంగా తిప్పి "ఊహుఁ" అంటూ చకచక నడిచి వెళ్ళిపోయింది.

రాజారావు అలాగే ఆమెను చూస్తూ నిల్చుండిపోయాడు. ఎంత ప్రయత్నించినా ఆమె కొరకు బాధపడకుండా ఉండలేకపోయాడు. తన ఉపాయంతో ఎలాగైనా ఆమె విచారాన్ని పోగొట్టగలననుకున్నాడు.

మళ్ళా వారంరోజులవరకు విజయలక్ష్మి అతనికి కన్పించలేదు. ఒకరోజు క్లబ్బుసమీపంలో కన్పించింది. రాజారావు ఆమెను సమీపించటం చూసి త్వరత్వరగా నడచి వెళ్ళిపోయింది. ఏ కారణం వలన అయినప్పటికి, ఆమె రాజారావునుండి తప్పించుకోవాలని ప్రయత్నించినట్లుఊహించాడు. ఒకవేళ ఆమెను కలుసుకున్నా ఇదివరకటి మాదిరిగా సంభాషణ జరిపే అవకాశం ఉండదేమోనని ననిపించింది.

ఆ మర్నాడు డాక్టర్ రాజారావును 'డిశ్చార్జి' చేశాడు. తనసంకల్పం నెరవేరకుండానే, ఆమె విచారం పోగొట్టకుండానే వెళ్ళవలసి వస్తుందేమోననిపించిందతనికి. ఎలాగైనా ఒకవారం లోపల ప్రయత్నించి తనపక్షాన్ని అమలుపర్చి ఆమె విచారాన్ని పోగొట్టాలనుకున్నాడు.

ఆ సాయంకాలం విజయలక్ష్మి కన్పిస్తుందేమోనని నాలుగు వైపులా తిరిగాడు. రోడ్డుమీద నడచిపోతుంటే ఎడంప్రక్కనున్న గ్రౌండులో వేపచెట్టుక్రింద బెంచీపై కూర్చునిఉన్న విజయలక్ష్మి కన్పించింది. ఆమెను సమీపించాడు. ఇటువైపు వీపుచేసి కూర్చుని ఏదోపుస్తకం చూస్తున్నది. ఈ సమావేశంతో తన పక్షాన్ని అమలుపరచి విజయం పొందాలనుకున్నాడు.

"లక్ష్మీ" అన్నాడతను. అతని స్వరం కంపించింది. ఆ కంపనం వలన కంఠంలో ఆర్ద్రత ఉన్నట్లు స్ఫురించింది.

ఆమె తలెత్తి చూసింది. లేవబోతుంటే అతను వారించాడు. ఆమెసమీపంలోకెళ్ళి నిల్చున్నాడు.

"నామీద ఎందుకింత కోపం లక్ష్మీ?" అతనామెను పేరుతో పిల్చే విధానం చాలా చిత్రంగా వున్నట్లున్నది. ఆమె కొంచెం తడబడింది.

"ఇక నావలన ఏమీ కష్టం కలగదు. నేను త్వరలోనే వెళ్ళిపోతున్నాను లక్ష్మీ!" మళ్ళా అతని కంఠస్వరం ఆర్ద్రమయింది.

విజయలక్ష్మి జాలిగా అతనివైపు చూసింది. అతని ఏకవచన సంబోధనలోని అనౌచిత్యం ఆమెకు

తట్టలేదు. ఆనాడినుండీ అతనలాగే పిలుస్తున్నట్లనిపించింది.

“నేనేం తప్పుచేశానని ఆ రోజు నన్ను చూసి కూడా మాట్లాడకుండా వెళ్ళిపోయావు... చెప్పు లక్ష్మీ. నీ క్షేమాన్ని కాంక్షించటమేనా నా తప్పు? నీవు దిగులుపడటం చూసి బాధపడటమేనా నేను చేసిన అపరాధం? చెప్పు లక్ష్మీ. ఆ రోజు నే నెంత బాధపడ్డానో తెలుసా” అతని మాటల్లో అతని బాధ వ్యక్తమవుతున్నది.

ఆమె చలించిపోయింది. కళ్ళవెంట నీళ్ళు కారుతున్నయి.

“నేనొక దురదృష్టవంతురాలిని. నాకొరకు మీ రెందుకంత బాధపడటం. మీరు ఇంతగా చూపిస్తున్న సానుభూతిని నే నెలా సహించగలను?” గద్గదికంగా అన్న దామె.

“పిచ్చి లక్ష్మీ. ఇది కేవలం సానుభూతి కాదు. ఆ దశను అధిగమించింది. ప్రపంచంలో చాలా మంది దుఃఖితులున్నారు. వాళ్ళందరినీ ఓదార్చేవారు వుండరు. ఒక్కొక్క చోట అలా జరుగుతుంది. ఒకరి దుఃఖానికి ఇంకొకరి హృదయం స్పందిస్తుంది. ఇది సామాన్య దృష్టికి అర్థంకాని అలౌకిక సంబంధం. నీవు అనవసరంగా విచారించవద్దు లక్ష్మీ. కనీసం నాకొరకు, పరిస్థితు లెలాంటివైనా జీవితంలోనుండి ఆనందాన్ని పిండి దాన్ని ఆస్వాదించటం నేర్చుకోవాలి. దిగులుపడుతూ కూర్చుండటంవలన ప్రయోజనంలేదు. ఇదిగో ఇది మా అమ్మ ఉంగరం. దీనిని నీవు అగౌరపర్చవద్దు. నేను రేపే వెళ్ళిపోతాను. నెలకొకసారి క్షేమాన్ని కాంక్షిస్తూ ఉత్తరం వ్రాస్తాను” అంటూ తన చిటికిన వేలుకున్న ఉంగరంతీసి లక్ష్మీ చెయ్యి పుచ్చుకుని ఆమె వేలికి తొడిగాడు. అలాగే ఆమె చేతిని మృదువుగా పెదవులకు హత్తుకున్నాడు.

“శలవులక్ష్మీ, నన్ను మర్చిపో” అంటూ వేగంగా చేతిగుడ్డతో కళ్ళు తుడుచుకుంటూ వెళ్ళిపోయాడు.

విజయలక్ష్మి మంత్రముగ్ధ మాదిరిగా నిశ్చేష్టురాలై అలాగే రాజారావు వెళ్ళినవైపు చూస్తూ ఉండిపోయింది. అతను అదృశ్యుడవంగానే వేలికున్న ఉంగరంవైపు చూసింది. చిన్న వజ్రంతో వున్న ఉంగరం. అందంగా ఉన్నది. ఆ ఉంగరాన్ని చూస్తూ కూర్చున్న ఆమె ముఖాన వింతకాంతి ఏర్పడింది.

రాజారావు ఒక ఘనకార్యం సాధించిన తృప్తిలో మర్నాడే బండెక్కాడు. అంత ఖరీదు చేసే ఉంగరం పోగొట్టుకున్నందుకు విచారం కలగకపోయినా ఉంగరం విషయంలో అలా అబద్ధం చెప్పినందుకు కొంచెం కష్టమనిపించింది. అయినా ఆమె కొరకేనన్న సంతృప్తి సాంత్వనపర్చింది. ఆమె చేతికా ఉంగరం ఉన్నంతకాలం ఆమె పిచ్చిపిచ్చి ఆలోచనలతో, నిరాశతో, బాధపడుతూ విచారించవలసిన అవసరం ఉండదనుకున్నాడు.

రాజారావు అనుకున్నట్లుగానే ఆ సంఘటన ఆమెలోని రసావిర్భావానికి తోడ్పడింది. ఆనాడు ఆమె ముఖాన ప్రకాశించిన కాంతి ఏనాడూ తగ్గలేదు. ఆ ఉంగరం తత్సంబంధస్మృతి ఆమెలో నూత్న ఉత్సాహం నూత్న స్ఫూర్తి ఏర్పర్చి త్వరగా ఆమె ఆరోగ్యం పొందే అవకాశాన్ని కల్పించినై!

నాలుగు నెలల తరువాత రాజారావుకొక ఉత్తరం వచ్చింది విజయలక్ష్మి దగ్గర్నుండి. దానిలో—“లోభివాడు తన చిరసంచిత ధనాన్ని ఎంత జాగ్రతగా దాచి కాపాడుకుంటాడో అంతకన్నా జాగ్రతగా నాకు లభించిన మధురసంపత్తి హృదయంలో దాచుకొని కాపాడుకొంటున్నాను. సరేకాని నేను ఏ సంపత్తిని నైతే జీవితాధారంగా స్వీకరించి భవిష్యజ్జీవితాన్ని గడపాలనుకుంటున్నానో ఆ సంపత్తి నిచ్చిన వారిని మర్చిపోవటం ఎలాగో కొంచెం నేర్పుతారూ?

మీ ఆశీస్సు సగం ఫలించింది ఇవ్వాళే ఇంటికి వెళ్తున్నాను” అని వ్రాసిఉన్నది.



తెలుగు విశ్వవిద్యాలయ
గ్రంథాలయం
నమోదు సంఖ్య............
తేది..............

# త్రాగుబోతు

(పెద్దకథ)

మూలం:
హాన్స్ ఫల్లాడా

అనువాదం:
డాక్టర్ వి. ఎస్. శర్మ

(గతసంచిక తరువాయి)

ఏమాత్రం సందడిచేయకుండా ఆ బుడ్డి బిరడాను ఎంతో నేర్పుతో తీసి పానీయాన్ని గ్లాసులో కొంచెంపోసింది. ఎంతో నురుగువచ్చింది. కొంచెం సేపు ఆగింది. నురుగు తగ్గేక మరికొంత పోసింది. గ్లాసును ఎత్తి త్రాగబోతూ

"మీ కోసం దీన్ని రుచిచూడటంలేదు. అలా చేయటానికి ప్రారంభించానా...మీరు ఏమాత్రం పూరుకోరు. మీరు త్రాగిందిచాలు. ఇంకా త్రాగుతే రభస అవుతుంది" అంది.

ఆ పిల్లతో వాదించటం నాకేమాత్రం ఇష్టం లేదు. ఇప్పటికే ఎంతో త్రాగాను. కడుపునిండి పోయింది. ఇక తాగటానికి స్థలంవుంటే లేదూ! నన్నొకసారి చూచింది. ఏమనుకుందో? నన్నే వేళాకోళం చేయదలచి "ఒక్కసంగతిని చెప్పాలి. నేను మిమ్మల వదలివెళ్ళాక మరెన్నిగ్లాసులు త్రాగారో చెప్పండి? ఆయిదా? ఆరా?"

"మూడే" అని నవ్వుతూ జవాబిచ్చాను. ఈ పిల్ల నన్నెందుకీ ప్రశ్నను అడగాలి? నావిషయంలో అంత శ్రద్ధ నెందుకు తీసుకోవాలి? ఇలా ఆలోచిస్తూ, "మరి నీపేరేమో చెప్పలేదే!" అని అన్నాను. దానికి జవాబియ్యక "ఎప్పుడూ ఇలాగే త్రాగుతుంటావా?" అని చనువుగల మనిషివలె అడిగింది. అంతేనా? "ఎప్పుడూ ఇక్కడికే వస్తూ వుంటావా?" అనీ ప్రశ్నించింది.

దీనికేం జవాబు చెప్పాలో తోచలేదు. కాని "ఆ సంగతంతా ఎందుకు వచ్చిందిమరి?" అన్నాను.

"అలాగయితే నాపేరు నెందుకు తెలుసుకోవాలి? నీవు వచ్చే ఎంతోసేపు కాలేదే? ఇంతలోనే నే నెవరో నీ కెందుకు..."

నాకు ఒళ్ళు మండిపోయింది. "చెప్పటానికి ఇష్టంలేకపోతే పరవాలేదులే" అని ఒక కేకేసాను. "అంత కోపపడితే నేనూ చెప్పనులే" అంది.

దాని చేతిలోనుండి బుడ్డిని అమాంతంగా తీసుకొని నా గ్లాసు నింపాను. ఇంకా త్రాగితేనా నా ఆనందమే పూర్తిగా పోతుంది. అల్లరీ జరుగుతుంది. కాళ్లు వణకుతున్నాయి. గొంతు తడబడ్డది...ఎవరో నాతోనే అన్నట్లువుంది. ఏమిటాశబ్దం? ఏం చెప్పతలచింది? ఆమె చెప్పేది నిదానంగా వింటేకదూ?...

కొంచెం వోపిక తెచ్చుకొన్నాను...ఇంత పెడసరిగా జవాబియ్యటం ఏమాత్రం సవ్యంకాదని తలంచాను. "నే నెప్పుడూ ఇక్కడికి వస్తూన్నానో లేదో నాకేం తెలుసు. కాని నీవిలా ప్రశ్నించటం సబబుగాదు. నిన్ను మధ్యాహ్నం చూచినప్పుడే ఏవగించుకొన్నాను ... కాని మళ్ళీ నీ దగ్గరకే వచ్చాను. ఇంత ఘాటైన పానీయాన్నించి చూడటానికి ఇవ్వాళే-నీ దగ్గరే-మొదలుపెట్టాను. నీ చేతితోనే దాన్నిచ్చావు. నీవే ఈ విషాన్ని నాకిచ్చావు. నన్నీ అధోగతికి నీవే ఇవ్వాళ ఈడ్చేసావు..." అని ఏమోమో అన్నాను. ఇలా వాగుతానని పాపం ఆ పిల్ల అనుకోలేదు. దాన్నే ఎగాదిగా చూస్తూవున్నాను...నా ఎదుటనే ఆ పిల్లా కూర్చున్నది. నాయీ అఘాయిత్యానికి అదేం చేస్తుంది? ఎంత వోపికగా కూర్చుంది. కాళ్ళ మీద కాళ్లువేసుకొని బెంజరగనట్లే నన్ను చూస్తూ, మాట్లాడక...దాని పాదాలను చూచాను. జోళ్ళను తీసింది. మేజోళ్ళనూ తీసివేసింది. పాదంమీద పుట్టుమచ్చవుంది...సిగరెట్టు తాగటానికి ఆరంభించింది. పొగను ఎంతో అందంగా పీల్చివేస్తూ, కనురెప్పలనే మాత్రం కదల్పక

"సరేలే...ఇంకేం చెయ్యాలి?" అని మెల్లగా శాంతంగా అడిగింది.

దానికేం జవాబు చెప్పాలి? ఏంమాట్లాడాలి?.. ఒకే కోరిక. అదేకావాలి! ఆ పిల్లను కౌగలించుకోవాలి. అదేనాకు కావాలసింది. ఇంకేం కావా

మరి? ఇదే లభ్యమైందా తృప్తిపడ్తాను. దాని దగ్గరకు వెళ్ళటానికి ధైర్యంలేక పోయింది. కుర్చీలోనుండి లేవలేను... నా గొంతుక [illegible]. ఊపిరి పీల్చలేక పోయ్యాను. ఏమంటున్నానో నాకేం తెలుసు? కొంచెంసేపటికి అన్నాను.

"నేనొక వర్తకుడ్ని. వ్యాపారాన్ని ఇంత కాలం బహు చక్కగానే సర్దుకొన్నాను. కాని... దివాలా అయింది. దీన్నివింటే నీవేనవ్వుతావు. నీవేకాదు, అందరూ అలాగేచేస్తారు. అందు ముఖ్యంగా నాభార్య... ఎన్నోతప్పులను చేసాను. మార్గా వాటినన్నిటినీ క్షమించింది. మార్గా నా భార్య..."

దానిముఖంలో కళాకాంతీ బొత్తుగానేలేవు. రెప్పలను కదల్చదు. ఊరికే వింటూవుంది. అంతే! నేనూ నా కథను పూర్తిచేయడానికి "దివాలాతీసిన కొంచెం సొమ్మును దాచాను. రెండుమూడు వేల కన్నా ఎక్కువ సొమ్మురాదు. మార్గామీది కసి చేతనే ఈ పని చేసాను. ఇక వ్యాపారాన్ని సర్దుపాటు చేసేబాధ్యత మార్గాదే. కాని మార్గా ఈ పనిని చక్కచేయగలదా? నేనే ఈ వ్యాపారాన్ని ఇంకెవరికైన అమ్మాలని తలచాను. దాన్ని కొంటానికి ఒక్కరు తయారుగానే వున్నారు. బహుశా పన్నెండు, పదమూడు వేలు ఇస్తారను కొంటాను. అదేలభించిందా ఎక్కడికైనా వెళ్తాం. పారిస్‌ను చూచావా మరి?" అని అన్నాను.

ఆదేం మాట్లాడదు. అవుననీ, కాదనీకూడా దానినోటినుంచి రాదే! నేనే తిరిగి మాట్లాడటం మొదలుపెట్టాను. "నేనూ పారిస్‌ను చూడనేలేదు. కాని ఆ నగరాన్ని గురించి ఎన్నో విషయాలను చదివాను. ఎంతో అందమైన నగరం. రాస్తాలకు ఇరుప్రక్కలా చెట్లే! ఎన్నో పార్కులు వున్నాయి. నేను విద్యార్థిగా వున్నప్పుడు కొంచెం ఫ్రెంచి భాషను నేర్చుకొన్నాను. కాని దాన్ని సొంతంగా నేర్చుకోటానికి అవకాశం దొరికిందికాదు. మా తల్లిదండ్రులు బీదలు. పెద్దస్కూల్లో చదివించటానికి వాళ్ళకు శక్తిలేకపోయింది. కాని ఒక్క సంగతిని చెప్పనా? ఫ్రెంచిభాషలో "జోన్ జ్ మోవున్ బసర్ మాడమొసెల్"అంటే అర్థమేమో తెలుసా?"

అంటే "ఓ పిల్లా నాకొక ముద్దిస్తావా?" అని. కాని పిల్లా అని నిన్ను పిలవటం నాకేమాత్రం ఇష్టంలేదు. నీతో సంభాషించేటప్పుడు "జోన్ జ్ మోవున్ బసర్ మా రెని" అని అనాలి. రెని అంటే రాణి. నీవు నా హృదయేశ్వరివి, అవును ఈ 'విషాల' రాణివి. నీవే ఈ విషాన్ని తీసి ఇచ్చావు. నీ చేతిని నాకియ్యి. ఎల్‌సబ్... నిన్ను నిన్ను ఎల్‌సబ్ అని పిలుస్తాను... నీ చేతినే ముద్దుపెట్టుకోవాలి..."

నా గ్లాసు నింపింది.

"దీన్ని తాగు. త్రాగాక వెళ్ళిపో. ఇక్కడ వుండకూడదు—నీ సరసం చాలు. తప్పతాగావు. కావాలంటే ఈ బుడ్డిని తీసుకొనిపో... కాని దీని వెలను చెల్లించి తర్వాత కదలాని. నిన్ను చూస్తేనే తెలుస్తున్నది కాదూ నీ మంచీ మర్యాదా... నేను పుచ్చుకొన్న పానీయానికి నీవే ఇచ్చుకోవాలి..."

"నీవలా మాట్లాడుతావెందుకు ఎల్‌సబ్?" ఆ మాటలు వింటుంటే కోపం వచ్చిందనాలా? ఏడుపువస్తుందనాలా? "డబ్బును చెల్లించి మరీ వెళ్తాను. దాని విషయం అన్యథా తలంచ నక్కర లేదు... ఎంత ఇవ్వాలో చెప్పు!... డబ్బంటేనా"

"కొంచెం మర్యాదగా మాట్లాడు! మగవాళ్ళంతా ఇంతే! నాకది తెలియదనుకొన్నావా మరి?...డబ్బంటే నీకు అంత నిర్లక్ష్యమా? సరేలే. ఇటువంటి వాళ్ళతో పేచీలు పెట్టుకొంటేనా? రేపు ప్రొద్దున్నే పోలీసులు వస్తారు. దబాయిస్తారు. నా కిదేం వద్దు. బొత్తిగావద్దు. నీవు చెల్లించాలసిందా?... రెండుబుడ్లు.. వాటితోసిగరెట్లు..."

అంతా లెక్కవేసి చెప్పింది.

"అంతేనా? ఇంకా ఎక్కువమొత్తాన్ని అడుగుతావనుకొన్నాను" ఏడుపు వచ్చింది. కన్నీటిధారలు కారసాగాయి ... జేబులోనుంచి నోట్లనుతీసి "ఇదిగో నీ సొమ్ము" అని బల్లమీదే వుంచాను. దాంతో ఆగలేదు. నూరురూపాయల నోటును తీసి "దీన్ని తీసుకో. నా మనశ్శాంతినంతా పాడు చేశావు. ఇదంతా నిన్ను ప్రార్థించినందుకు కదూ? దీన్ని తీసుకోవాలి. నీకు జాలి అంటే ఏమిటో తెలియదు. దానికోసం ఈ రాత్రాంతమంతా తిన్నావా? పట్నవాసం పిల్లవైతే ఇలా చేస్తావా? ఇదంతా నాకెందుకువచ్చిందో" అని ఏడ్వ సాగాను.

ఆ పిల్ల లేచింది. నేనూ లేచాను. బల్లమీద సొమ్మువుంది. దీపంకూడా కొనవూపిరితో వున్నట్లుంది. ఏమీ కనపడదు...సగం ఖాళీ అయిన బుడ్డిని చేతిలో పుచ్చుకొన్నాను. ఆ కంపంతోనే వూగుతూ నడువబోయాను. ఈ నా దృశ్యాన్ని ఆ పిల్ల చూసింది.

"వెళ్లానికిముందు ఆ నోటును తీసుకో. నాకీ నోటు అక్కరలేదు. పో...నీ దారినే పో" అని మెల్లగా అంది.

"నన్నెందుకాలా బలవంతం చేస్తావు? అది నీది. నీకే ఇచ్చాను. నారాణీ, దాన్ని తీసుకో...ఇక నేను వెళ్తాను..."

ఎంతో కష్టంమీద తలుపుదగ్గిరకి వచ్చాను. తలుపు గడియను తీయబోయాను. ఆ పిల్ల నా దగ్గిరకి వచ్చింది. "ఇదుగో చూడు...ఒక్క నిమిషం నావంకచూడు..." అంది. దానివైపు తిరిగాను. ఆ గంభీరత పోయింది. ఎంతో దీన వదనంతో నన్ను చూచింది... "ఇదుగో..." అని మెల్లగా అన్నది. పోయిన కళాకాంతులు కళ్ళకు వచ్చాయి. మందహాసం చేస్తున్నది... ఇక తెప్పరిల్లాను. పోయినప్రాణమే వచ్చినట్లుంది. నేనూ చిరునవ్వునవ్వాను. కొంచెంసేపు మౌనంతో నా వంకే చూచింది. తరువాత మెల్లగానే అన్నది "ఆ జోళ్ళను తీసివెయ్యి. ఏమాత్రం సందడిచేయకుండా నావెంటరా. శబ్దం చేస్తివా ఇంట్లోవాళ్ళు వింటారు. తెలిసిందా. తొందరగా నా వెనకనే నడు..."

ఆ పిల్ల ఆజ్ఞాపించిన ప్రకారం చేసాను. ఎందుకలా ఆజ్ఞాపిస్తుంది? ఆ ప్రశ్న ఇప్పుడు అడగకూడదు. "నాచేతిని గట్టిగా పట్టుకో" అని నా చెవిలో వూదింది. దీపాన్ని ఆర్పింది. ఒకచేతిలో బుడ్డీ, మరొక్కచేతిని అది గట్టిగా పట్టుకొంది. ఆ హాలు చీకటి. మెట్లెక్కాం. బయటనుండి చంద్రకాంతి చక్కగా తెలుస్తున్నది. గదిలోకే ప్రవేశించాం. ఇవ్వాళ ఇక్కడే మకాం. ఎల్ సెబ్ గదిలోనే రాత్రిని గడపాలి! ఇక నా యింటికా! *అది ఎప్పుడో పోయింది. ఇల్లని ఒకటి వున్నా* నన్ను మాగ్దా లోనికి రానిస్తుందా మరి!...

అలసి వున్నాను. ఆ బుడ్డిని పట్టుకోటానికి ఎంతో భారంగా వుంది. కొంచెం పుచ్చుకొంటే ఈ బడలిక పోతుందేమోమరి! ఎంతో కష్టంతో కొంచెం తాగాను. ఆ గదిలో మంచంవుంది. కుర్చీవుంది. గుడ్డలు పెట్టుకోటానికి బీరువావుంది. కిటికీ తెరిచేవుంది. చంద్రకాంతి బాగావచ్చింది.

"నీవేమాత్రం మాట్లాడకుండా ఆ కుర్చీమీద కూర్చో...ఇప్పుడే వస్తాను" అని అదృశ్యమైంది. కిటికీదగ్గిరకే వచ్చాను. బయట చూచాను. ఫలవృక్షాలతోట. చెట్టుకొమ్మలు కిటికీనానుకొనే వున్నాయి. ఆ ప్రక్కనే మరొక తలుపువుంది. దాన్ని తెరిచి వెలుపలికి వచ్చాను. ఆ వైపు చిన్న వరండావుంది. దానిమీద కొంతసేపు నిలుచున్నాను. చల్లనిగాలి వీస్తూవుంది. ఆ గాలితో నా అలసట పోయింది. పోయిన ప్రాణమే వచ్చిందని చెప్పాలి. ఆ పరిసరాలను పారచూస్తున్నాను. కొమ్మలు పట్టుకొని దిగితినా ఎంతో సునాయాసంగా క్రిందికి రావచ్చు. తోటలో ఎన్నోరకాల పూలమొక్కలు వున్నాయి. అంతాచూసి నాలో నేననుకొన్నాను "ఇదెంతో బాగావుంది. చాలా బాగావుంది."

చంద్రబింబం వంక చూడలేక పోయాను. ఆకాశం ఎంతో కాంతివంతగా వుంది. నక్షత్రాలు అందచందాలతో ప్రకాశించుతూ వున్నాయి. ఇదే చాలు. ఈకాంతే నాకు నూతన శక్తినీ, తేజాన్నీ ఇచ్చింది. తలవని తలంపుగా నాలో ఎంతో ప్రశాంతత వచ్చింది ... "ఎందుకాలా ఆలస్యం చేస్తావు? ఎందుకాలా చూస్తున్నావు. రా శీఘ్రంగా లోపలికిరా. ఇలాచేస్తే నేనెలా నిద్రపోతానను కొన్నావు మరి" అని తలుపుదగ్గిరకేవచ్చి నన్ను మెల్లగా పిలిచింది. లోపలికి వచ్చాను. పిల్ల అప్పుడే పండుకొన్నది. దుప్పటి కప్పుకొన్నది. మంచంమీద కూర్చున్నాను. "ఎందుకాలా కూర్చుంటావు?" అన్నది.

నాకేం తోచలేదు. నిట్టూర్పు విడిచాను. ఎన్నో ఆలోచనలు! ఎంత వేధిస్తున్నాయి! ఏదో తలంచి లేచాను. బుడ్డిని మరిచిపోలేదు తిరిగీ తలుపుతీసి వరండాలోకి వచ్చాను దానికి ఆపిల్ల *కోపపడ్డది. లేచింది. లేచి తలుపుగడియ గట్టిగా* వేసింది. కిటికీ తలుపులనూ మూసివేసింది. ఏం చేస్తున్నానో తెలియకుండానే ... తోటలోకి వచ్చాను...

పైనుంచి శబ్దం వినబడ్డది "తాగుబోతు... తాగుబోతు."

నడుస్తున్నాను. నడుస్తున్నాను. పరుగెత్తాను కొంతదూరం. మెల్లగా నడిచాను మరికొంత దూరం. నాకు వచ్చిన సంగీతాన్ని మీటాను. పాటలు పాడాను. మాగ్దాతో ఆకాలంలో హాయిగా షికారు వెళ్లేటప్పుడు పాడిన పాటలన్నీ టిసీ పాడాను. కాళ్లు నొప్పిపెట్టాయి. పాదాలు మండిపోతున్నాయి. ఈ హుషార్లో పాడుతూ నడుస్తున్నప్పుడు బొటవేలికి రాయిగుచ్చుకొంది. దాని బాధ ఇక చెప్పలేను. కాళ్లు కదలవు. ఓపిక లేదు. శక్తి చచ్చిపోయింది. చెప్పులు తొడుక్కోకుండానే నడుస్తున్నాను. వాటిని అక్కడే వదిలిపెట్టి వచ్చాను కాదూ! ఈరాత్రి బాటలో మేజోళ్లు వున్నవని పేరేగాని, తునకలైపోయాయి. కొంత దూరం వచ్చాక సెలయేటిని దాటవలసి వచ్చింది. వొడ్డుదగ్గరే కొంచెంసేపు కూర్చున్నాను. పాదాల్లను నీళ్ళలో వుంచాను. చల్లనీళ్ళు మొదట దాని బాధను వోర్చులేకపోయాను. కొంతసేపటికి అవే నా ఆయాసాన్ని తీర్చాయి. పాదాలబాధ పూర్తిగా పోయింది. అక్కడినుండి లేచేటప్పటికి లేని సత్తువ వచ్చింది. దాంతో మరికొంతదూరం గబగబా నడిచాను.

నడిచినడిచి ఒకగ్రామం చేరుకున్నాను. గ్రామం నిద్రావస్థలోనే వుంది. దీపంలేదు. నరపురుగు కదలటమే లేదు. ఎర్విన్‌ని-గ్రామాదుల్లో వుత్పత్తి అయ్యే సామాన్లను సప్లయిచేసే కంపెనీకి యజమానుడ్ని మాత్రం కదలుతూవున్నాను. నిజంగా నా సంస్థ తన స్థలాన్నుంచి కదిలేపోయింది.

కుక్కలు కాపలా కాస్తున్నవి. నా చడీవిని మొరగటానికి ప్రారంభించాయి. వాటినుండి తప్పుకోవాలి గబగబా నడుస్తూ. పాదాలు కదిలితే కాదూ! కాళ్ళు వాచాయి. పాదాలు వాచాయి.

నిన్న ఇంట్లో మాగ్దా బయటికి వెళ్ళటంచూచి పుష్కలంగా మంచి పానీయాన్ని తాగి కడుపు నింపుకొన్నాను. దాంతో మైమరపు వచ్చింది. సోఫామీద పండుకొని గంటల పర్యంతం హాయిగా నిద్రపోయాను. నిద్రలేచాక మాగ్దాను చూడనే లేదు. తెల్లవారిలేనో! మరి తెల్లవారిలే కాదూ! ఇంకా ఆ చరిత్రనే పూర్తిగా మరిచిపోవాలి. హాయిగా నిద్రపోవాలి. దాంతో అంతా సర్దుకుంటాను...

ఇంకా చీకటికమ్మేవుంది. అటు తిరిగినా, ఇటు తిరిగినా మా యింటి సమీపానికే చేరుకున్నాను. మిగిలివున్నదాన్ని ఒక గుటకలో త్రాగేసి, సీసాను ప్రక్కనున్న పొదలో దాచేశాను.

తలుపు గడియతీసి ఇంట్లోకి ప్రవేశించాను. మాగ్దా గాఢనిద్రలోవుంది. ఏమాత్రం సద్దుచేయకుండా సోఫామీదే పడుకొంటే మంచిది. ఈ రాత్రి నాటకమేం జరగదు. రేపు ప్రొద్దున్నో! ఇప్పుడు దాన్నిగురించు ఆలోచించాలా? నిద్రపోతాను. అప్పటికి మధ్యాహ్నం జరిగిన కథనాన్ని, రాత్రి జరిగిపోయిన ఘట్టాల హాయిగా మరిచేపోవచ్చు. కంపెనీ విషయాలు చక్కగా చూచుకోవచ్చు. అసమర్థతవల్ల చేసిన పొరబాట్లను సర్దుకోవచ్చు.

సద్దుచేయకుండా అంతాచూచాను. మత్తంతా పోయింది. ఇప్పుడెవ్వరినీ లేపనేకూడదు. స్నానాలగదిలో ప్రవేశించాను. పాదాలు చక్కగా కడుగుకోవాలి; అదే చాలా ముఖ్యం. కొళాయి తెరిచితే సందడి అవుతుంది! మాగ్దా తప్పక లేస్తుంది. వంటగది దూరంలోవుంది. అక్కడ ఈ పనిచేసుకోంటేనో? అంతా చూచాను. మామూలుప్రకారం మా పనిమనిషి ఎల్సీ పండుకొన్నది. అది చాలా మంచిది. నా సంగతి సందర్భాలను ఎంతో తెలివితో తెలుసుకొని అప్పుడు అయోమయంలో పడ్డప్పుడు నన్ను లాలించింది. చేయవలసిన పరిచర్యనంతా ఎంతో ప్రేమతో చేసింది. దానిమనస్సు మాగ్దా మనసువంటిది గాదు. దీపాన్ని వెలిగించి నా పని చేసుకొంటే అదేం అనదు. నీళ్ళకాగుదగ్గరకు వెళ్లాను. నీళ్ళు వెచ్చగానే వున్నాయి. సబ్బునూ తువాలును, బ్రష్‌ను తెచ్చాను. పాత్ర అక్కడే వుంది. పీటను తెచ్చి దానిదగ్గరే వుంచాను. నీళ్ళు పోశాను. పాదాలను దాన్లోవుంచేటప్పటికి ఎంత హాయిగావుంది! కళ్ళు గట్టిగామూసుకొని ఇదీ అదీ ఆలోచించుతూ వున్నాను. దాహం, దాహం. కొంచెం పానీయాన్ని పుచ్చుకొంటే ఎంత హుషారుగావుంటుంది. దప్పిక పూర్తిగా తీరిపోతుంది. మానవుడికి ఆత్మశాంతి వుండాలి. అది వస్తేనా

ఆకలి దప్పులన్నీ పోతాయి. ఆ శాంతి ఇల్లు ఇయ్యకపోతేనో! ఇంటిదోవను వెతకాలి. ఇంట్లో వుండేవి తీసి పానీయాలు. అవి నా దప్పిని ఏమాత్రం తీర్చలేవు. ప్రొద్దునే సారాయిదుకాణానికి వెళ్ళాలి. ఘాటుసారాయిబుడ్లనే రెండుమూడు కొనాలి.

ఈలాటి ఆలోచనలు తండోపతండాలుగా వస్తూవున్నాయి. పొరబాటు జరిగింది. పాత్ర చిల్లిది. దాన్ని మొదట చూడనేలేదు. నీళ్ళు కారిపోతున్నాయి. గదంతా తడి. అయితేనేం ఫరవాలేదు. నాకు ఇప్పుడు అత్యవసరంగా కావలసింది పానీయం. దాన్ని పుచ్చుకోకపోతే నా ప్రాణాలు ఏమాత్రం నిలవవు. మాగ్దా సూపులోకి బెల్లపు సారాయ వాడేది. దాన్ని కొంచెం పుచ్చుకొంటేనో? అది ఎక్కడవుంటుందో నాకూ తెలుసు. ఆ సామాన్లగదిలోకి వెళ్ళాను. అల్మారులో ఎన్నోరకాల సీసాలు అమర్చబడివున్నాయి. వాటిలో ఇదేదో! సగం ఖాళీగా వున్న సీసాను చూచాను. అదే ఇది. నల్లగావుంది. దాన్ని తాగాను. రుచిగాకూడా వుంది మొదట. కాని కొంచెంసేపయ్యాక చేదు, చేదు. గొంతంతా మండిపోతున్నది. దానికి సహించుకోలేక వణకసాగాను. తల దిమ్మయింది. కళ్లు మంటలు...

ఎందుకా సందడి? ఎవరు వస్తున్నారు మరి? నన్నెందుకు తొందరపెట్టాలి? ఆ వంకే చూచాను. మాగ్దా వచ్చింది. తలుపు తెరిచి ద్వారబంధందగ్గరే నిలుచున్నది. ఆ పాలిపోయిన ముఖాన్ని ఆ కళ్ళను చూస్తే నాకే భయంవేసింది. కాని దాన్ని బయటికి చూపలేదు. లేచాను; మాగ్దాదగ్గరకేవచ్చాను. చేతిని గట్టిగా పట్టుకొని మందహాసం చేస్తూ "నేనే మాగ్దా! కొంచెం షికారుకు వెళ్ళితే ఎంత ఆనందంగా వుంటుందనుకొన్నావు! పక్షుల గానాన్ని వినవచ్చు... రేపు మనమిద్దరం కలిసి షికారుకు వెళ్ళాలి. వస్తావుకదూ? దోవలోనే హోటలుంది. దాన్లో కొంచెంసేపు కూర్చుని కాలక్షేపం చేయొచ్చు... నీ వెంతో గట్టిదానివి. లెక్కలపుస్తకాలన్నీ అడిటరుకే ఇచ్చావు. మీరిద్దరూ కలిసి జమాఖర్చులను తణిఖీచేయటమూ చూచాను. అంతా సరిగా వున్నదికదూ? సరిగాలేదని భయపడ్డాను....

మాగ్దా మాట్లాడదు. నావంకే చూస్తూవుంది. నా వాచిన పాదాలను తదేకదృష్టితో చూచింది. కళ్ళనుండి నీళ్ళు కారుతూవున్నాయి. దాన్ని తుడుచుకొన్నది. కాని ఆగితేకాదూ? బుగ్గలన్నీ ఈ కన్నీటిధారతో నిండిపోయాయి. ఏడ్వసాగింది. ఈ జాలి గట్రా ఎందుకువచ్చింది?

"నీకు జాలి అన్నమాటేలేదు. నీ పని ఏదో దానితప్ప తక్కినవాటిని ఏమాత్రం తెలుసుకోలేవు పెద్దయంత్రాన్నివి... జైలు ఆర్డర్ని పూర్తిగా పొగొట్టుకొన్నాం. దానికోసం బాదరబందీ పడనక్కరలేదు. మరో ఆర్డర్ని తెస్తావు, 'ఈ నష్టాన్ని ఏరీతిగానైనా సర్దుకోటానికి నాకు అవకాశం ఇస్తేకదా ఈ జన్మలో, నేనేదాన్ని సర్దుకోటానికి? నన్ను అణగద్రొక్కి పెట్టటమే నీకు తెలిసింది. నీ గాయిల్లోనే నడవవాలసిన దౌర్భాగ్యం పట్టింది. దానిచేతనే పైకెక్కలేక పోతున్నాను.... కాని ఒక్కసంగతి మాత్రం స్పష్టంగా చెప్తాను. అధఃపాతాళంలోనే పడిపోయాను. ఆ లోకపు రహస్యాన్ని కొంచెం తెలుసుకొన్నాను. ఆ లోకపు పిల్లతో నాకూ పరిచయమైంది. దానికి బాధ అంటే సంతోషం అంటే ఏమో బాగా తెలుసు. వాళ్ళల్లో ప్రేమ అనేది కూడా బొత్తుగా చావలేదు. నీకన్నా సొగసుకత్తె నేను చూచిన ఆపిల్ల! నన్నే అమాంతంగా తన లోకానికి తీసుకుపోడానికి చేయవాలసిన ప్రయత్నాలన్నీ చేసింది. బహుశ చక్కగా దాన్లోపడిపోతేనే శాంతివస్తుంది. సుఖంవస్తుంది. కాని కాని, ఆ పనినిమాత్రం చేయడానికి మనసొప్పలేదు. నేనింకా శుభ్రంగానే వున్నాను. అని మనస్సుపీల్చి పిప్పిచేస్తున్న నా భావాలన్నిటినీ చెప్పటానికి ప్రయత్నంచేసాను.

"ఎర్విన్ అలా మాట్లాడవద్దు. తాగవద్దు ఇప్పుడే జబ్బుపడ్డావు. ఇట్లా తాగుతూవుంటే ఇంకా జబ్బుచేస్తుంది. కొంచెం ఓపిక పట్టి లే. కొంచెం పండుకో. ఆ గాయాలకు మందేసి కట్టు కట్టాను. పించెప్పా, అంతవాచిపోయ్యాయి. కట్టుకట్టనీ"...అని నన్నెంతో వేడుకొన్నది.

"నాకు దాహం అవుతున్నది. నిన్నడిగితే నీవు ఇయ్యవు. ఇది నీ సీసా. సామాన్లగదిలోనుండే తెచ్చాను. దాని వెల ఇచ్చుకొంటాను. రొక్కాన్నే ఇచ్చివేస్తాను. వ్యాపారాన్ని చక్కగా

నడుపుకోటానికి రొక్కాన్ని చెల్లించటమే రాజ మార్గం... నా గాయాలసంగతిని గురించి కాదూ ఆ తాపత్రయమంతా? నీవు ఆఫీసులో ఆడిటర్తో లెక్కలను తణిఖీ చేస్తున్నపుడు నేను హాయిగా షికారు చేస్తున్నాను. చెప్పులు తొడుక్కోకుండా నడిస్తే మంచిదని వట్టికాళ్ళతోనే నడిచాను...” అని ఏదో అన్నాను. నా ప్రత్యుత్తరానికి అడ్డం రాక, నన్నే వాగనిచ్చింది. కొంతసేపటికి లోపలికి వెళ్ళి మందుసామాన్లను తెచ్చింది. నీళ్ళతో దుమ్ము తుడిచింది. ద్రావకంతో పాదాలను శుభ్రం చేసింది. మందు వేసి కట్టుకట్టింది. ఈ పని చేస్తున్నప్పుడూ నా వాగుడు ఏమాత్రం ఆపక, ఏదోది చెప్తున్నాను...

మేల్కొన్నాను. మంచంమీదే పడుకొని వున్నాను. కిటికీలు తెరిచివున్నాయి. చల్లగాలి వస్తూవుంది. సూర్యుడు ఉదయించనే వుదయించాడు. ఎండ కాస్తున్నది. ఇప్పుడు టైమెంతవుతుందో? పడకగది చక్కగా సర్దేవుందే! ఇంట్లో ఎవళ్ళ సందడీ వినబడటంలేదే? నేనొక్కడ్నే! నా శరీరపరిస్థితీ అధ్వానంగానే వుంది. కడుపు మండిపోతున్నది. మంచంమీద నుంచే గదినంతా కలయచూసాను. ఇక ఆలోచనలా? ఎన్నో! నన్ను నిండు సముద్రంలో ముంచివేస్తూ వున్నాయి, క్రమేణా రాత్రి నేనెదుర్కొన్న ఘట్టాలను తలపోస్తూ వున్నాను. కాళ్ళబాధ చెప్పతరంగాకుండా వుంది. దుప్పట్ని అవతల పడవేసాను. పాదాలవంక చూచాను. కట్లు వూడిపోలేదు. కళ్ళు నులుపుకొన్నాను. చీకట్లు కమ్ముతున్నాయి. నీరసం ఎక్కువైపోతున్నది. రాత్రిదృశ్యాలే ఎన్నోరకాలుగా నాముందు కనపడుతూవున్నాయి. నా ఆఫీసుగది, దాన్లో వాళ్ళ గుసగుసలు. నడిచాను, ఎంతో దూరం హోటలు చేరుకున్నాను. తప్పు తాగాను. ఆపిల్ల ఈడ్చుకొని పోయింది మేడమీది తన గదిలోకి. అలా అవమానం చేస్తుందా నన్ను బయటికిత్రోసి, తలుపు గడియవేస్తూ? మళ్ళీ పొట్ట నింపుకొన్నాను ఆ అడివిమార్గాన ఒంటరిగా నడుస్తూ పాదాలు మండిపోయాయి. కాళ్లు కదలటంలేదు. వాటికన్నా పెద్దదెబ్బను మాద్దా వంటగదిలోనే వేసింది! అప్పటి నా దుస్తులు ఖరదమయం. మేజోళ్ళు ముక్కలు ముక్కలుగా చినిగిపోయాయి. అప్పటి నా అవస్థను తలుచుకొంటేనే ఏడ్పు వచ్చింది. ఎంత అవమానం, ఎంత అవమానం. పురుగుకన్నా నీచమై పోయానే మాద్దాముందు? వీటిని తలంచుకొంటే నా నోళ్ళు కృంగిపోయింది. కళ్ళు గట్టిగా మూసుకొన్నాను. నాలో ప్రవరు గెత్తుతూవున్నా ఈ దృశ్యాలను చూడలేక! వాటిని చూడను. ఆమాటలు వినను. వీటిని గురించి తలపోయటం ఎంతమాత్రం సబబుకాదు. పళ్ళు పటపట కొరికాను; దవడలు పీకుతూవున్నాయి. నిట్టూర్పును కష్టంగా విడిచాను. “ఇవన్నీ నిజంకాదు! ఏమాత్రం నిజంకాదు. నేనూ ఇల్లువదిలే వెళ్ళనేలేదు. ఇవన్నీ కలలు. పిచ్చికలలు. వీటినన్నిటినీ పూర్తిగా మరిచిపోవాలి. ఇవన్నీ పిశాచాలు వాటినుండి తప్పుకోవాలి. లేకపోతే పూర్తిగా మ్రింగివేస్తాయి.

ఒంటిలోని నరాలు ఉండుండి కంపిస్తున్నాయి. అసహాయుడ్ని! ఆమాట జ్ఞప్తికి వచ్చేసరికి ధైర్యం పోయింది. కన్నీటి ధారలు పెద్ద జలపాతంవలె నన్ను పూర్తిగా తడిపేసాయి. ఎంత తుడుచుకొన్నా, అవి ఆగవేమరి?

చల్లగాలి వీస్తూవుంది. సూర్యకిరణాలు గదిలోకే ప్రవేశించాయి. నన్నే లాలిస్తున్నాయి. నేను ఒంటరిగావున్న ఈ విషమావస్థలో వీళ్ళే పరమమిత్రులయ్యారు. నా ఆందోళనను చాలించి చిరునవ్వు నవ్వేను. దాంతో చెప్పరానంత శక్తి నాలోకేవచ్చి నా తత్వానంతా పూర్తిగా మార్చేసింది. పోయిందేమో పోయింది. దానికోసం తాపత్రపడటం ఎందుకు? నేను చావలేదు, జీవించేవున్నాను. అయిపోయిందాన్ని మరిచిపోయే, కొత్తదోవలను కనిపెట్టాలి. వాటిలోనే బండిని మరమ్మతుచేసి నేర్పుతో నడపాలి. అప్పుడే మనశ్శాంతి వుంటుంది.

మంచానికి సమీపాన్నే చిన్న బల్లమీద కాఫీ వగైరాలు అమర్చబడి వున్నాయి. కాఫీ చల్లారిపోకుండా వుంటానికి వూలుసంచి కప్పివుంది. ఒక రొట్టెముక్కను నోట్లో వేసుకొన్నాను. నమలటానికి ఎంతో బాగావుంది. కప్పులో కాఫీపోసుకొని తాగాను. మామూలుకంటే ఎంతో రుచిగా వుంది. మాద్దా ఎంతో తెలివిగలది. నాకే సమ

యాన ఏది మంచిదో చక్కగా గ్రహించి ఈ పనంతా చేసింది. బల్లమీద వున్నవాటి నన్నిటినీ ఒక్క నిముషంలో ఖాళీ చేసాను. బల్లమీదే ఒక చీటీ వుండటం చూచాను. దాన్ని మాగ్దా రాసింది. ఒకగంటలో తిరిగి వస్తాననీ, అంతవరకూ పండుకొనే వుండమనీ, లేకపోతే గదిలోనే పచారు చేస్తూ వుండమనీ రాసింది.

భోజనాన్ని ముగించాక, లేవడానికి ప్రయత్నించాను. కాళ్ళు కదలవు. ఏలాగయితేనేం, కొంచెం కష్టంతో స్నానాలగదిలోకివెళ్ళి స్నానం చేశాను. కొత్త సూటును ధరించాను.

ఇంక నా లోకంలోనే అడుగుబెట్టాలి. బండి బ్రేకును మాగ్దా చేతిలోనుండి లాగేసి నేనే పుచ్చుకొని బండిని నడపాలి. ఎగుడు దిగుళ్ళనుండి దాన్ని నేనే సారథ్యం చేస్తూ నడుపుకోవాలి.

రాత్రిమాదిరికాక, ఎంతో పటాటోపంతో ఆఫీసుకు చేరుకున్నాను. క్రింది అంతస్థులో గుమాస్తాలు తమతమ పనుల్లో నిమగ్నులయివున్నారు. వాళ్ళను కుశలప్రశ్నలతో పలకరించి, తిన్నగా పైమేడమీదికే వచ్చాను: నా కుర్చీమీదే మాగ్దా కూర్చునివుంది. నన్ను చూచేటప్పుకి విభ్రాంతురాలై గబుక్కున లేచి నిలుచుంది. నా స్థలాన్నే మాగ్దా ఆక్రమించుకోటం బాగులేదు. కోపంతో వురిమిచూచాను. చేతిలో కాగితంవుంది. దాన్లో ఏవేవో గుర్తులు పెట్టుతూవుంది.

“ఎర్విన్, నీవా?... నీవు అక్కడేవుంటావని” గడగడ వణకుతూ అన్నది. నా వంకే చూస్తూ హాన్సు పీటరువంక చూచింది. తర్వాత నేనూ అతడ్ని చూచాను. కుశలప్రశ్నలు వేసాను లేని మందహాసాన్ని తెచ్చుకొంటూ. వాడీనాటకాన్ని తెలుసుకోకూడదు. కాని, నా ఆందోళనాన్ని నిలుపుకోలేక తిరిగీ మాగ్దాతోనే అనివేశాను “నేను అక్కడే వుంటాననేనా అనుకొన్నది ... కాని నిద్రలేచేటప్పటికి అలసటంతాపోయింది...పాదాల నొప్పి తీవ్రంగావున్నా...ఆ సంగతంతా ఎందుకు మరి? జయిల్ ఖాతాపోయిందనుకొందాము. ఆ నష్టాన్ని సర్దుకోటానికి మరేదైనా ఆలోచించాలి” అంటూ నా కుర్చీమీదే కూర్చున్నాను. మాగ్దాకి ఇదంతా ఒకకలలావుంది. రాత్రి ఆగొడవనుచూచింది. ఇప్పుడు ఈ గొడవను చూస్తూవుంది. దేన్ని నమ్మాలి? ఇంతగొడవలోకూడా మాగ్దా తన చాకచక్యాన్ని మరిచిపోలేదు...ఇంటినుంచీ బయలుదేరి నేనిచ్చటికి వచ్చేలోపుగానే ఎన్నో వ్యవహారాల్లను చక్కబెట్టేసింది. చేసినపనంతా చెప్పడం ప్రారంభించింది. కారాగారానికే తిన్నగావెళ్ళింది. ఇన్‌స్పెక్టర్ను కలుసుకొంది. మాగ్దారావటానికి ఆయనా సంతోషించాడు. కంట్రాక్టువ్యవహారమంతా నిన్ననే పరిష్కరించాడు. నా అశ్రద్ధవల్ల ఇది మాకే లభ్యపడటానికి అవకాశం లేనందుకు ఆయన ఎంతో చింతించాడు. కాని ఇంకోవిధంగా మాకు సహాయం చేయడానికి నిశ్చయించుకొన్నాడు. ‘స్టీమర్లకూ’ పడవలకూ అవసరమైన పురితాళ్ళను కారాగృహంలోని నేరస్థులుతయారు చేయాలి. దానికి కావాలసిన సామాన్లు మీరే సప్లయిచేయండి. జయిల్లోవున్న సామానంతా అయిపోయింది. ఇది హెంబర్గు దొరుకుతుంది. దాన్ని బేరంచేసి పంపండి. ప్రస్తుతంమూడుబండ్ల సామాను చాలు. దీని వెల సరసంగా వుంటే మరి రెండు మూడు ఆర్డర్లను ఇస్తాను. దాంతో కంట్రాక్టు పోయినందువల్ల వచ్చేనష్టాన్ని కొంతవరకుసర్దుకోవచ్చు’ అన్నాడట. తనకు ఎట్టిరకం నారకావాలో అది ఏ వర్తకుని దగ్గర టోకుగా కొంటే లాభం వస్తుందో. ఆ వివరాలన్నిటినీ ఇన్‌స్పెక్టరు మాగ్దాకు చెప్పాడు.

మాగ్దాచెప్పిన భోగట్టానంతా శ్రద్ధతోవిన్నాను. ఇంతేనా ఆయన మనకు చేసేసహాయం.

సరేలే, అక్కడికి ఎవర్ని పంపాలని అనుకొంటున్నావు?” అని మాగ్దాను అడిగాను. కొంచెంసేపు మరీ నిదానించి “నీవే వెళ్ళితేనో...” అన్నాను.

ఈ మాట వినేటప్పటికి మాగ్దా కోపపడ్డది. దాన్ని బయటికి కనబర్చకుండా “నేనా... నేను వెళ్ళడానికి వీలుపడదు. ఇక్కడి పరిస్థితి అధ్వాన్నంగా వుంది. నేనే వెళ్ళితేనో...” ఏదో చెప్పబోయింది. దాన్ని ముగించలేదు. అందలి రహస్యాన్ని గ్రహించాను.

“అవును మాగ్దా! నీవు వెళ్ళితే ఇక్కడి పని సర్దుకోలేం. ఒక ఆఫీసుపనే కాదు. ఇంట్లో నీ చేతినిండా ఎంతోవుంది. ఎల్సీ చిన్నపిల్ల. అయితే

నేనే వెళ్తానులే. ప్రయాణం చేయటమంటే నాకూ ఇష్టమే. ఈ నొప్పికోసం అంత భయపడనక్కర లేదు. అక్కడ నడుస్తుంటే కదా ఆ సంగతిని ప్రస్తావించవలసింది. బోలెడుటాక్సీలు వుంటాయి."

"ఎర్విన్, ఈ బాధలో నీవేమాత్రం వెళ్ళడానికి వీలులేదు. ఈ బాధలో నిన్నిలా వెళ్ళనిస్తాననుకొన్నావు?" అని ఎంతో జాలితో అన్నది. ఆ కోపంగీపం అంతా అదృశ్యమైపోయింది. మాగ్డాను చూసేటప్పటికి నాకూ ఎంతో జాలివేసింది... కొంచెంసేపు మాట్లాడలేదు. ఏదో ఆలోచించి మాగ్డా అన్నది: "మన ఆడిటర్నే పంపితేనో? ఈ సాయంకాలమే వెళ్ళవచ్చు. ఎల్లుండి ప్రొద్దున్నే ఇక్కడే తిరిగివుంటాడు."

"క్షమించాలి. కొంచెం వోపికపట్టుకొని నేను చెప్పేదంతా వినాలి. నన్నే హాంబర్గుకు పోనియ్యి. అలా వెళ్ళడం ఎంతో అవసరం." నా వాదాన్నే చూస్తూవుంది. చూడనట్లు నటిస్తూ "రెండుమూడు రోజులు ఈ ఊరువిడిచి వెళ్ళటం నాకూ ఎంతో మంచిది. నేనే ఇక్కడ ఈ సమయానవుంటే కంట్రాక్టును పోగొట్టుకోటానికి నాలోనే ఏదో తప్పువుంటుందని అందరూ అనుకొంటారు" అని అన్నాను.

మాగ్డాకు ఈ సాకు వినడం ఏమాత్రం ఇష్టం లేదు "కాని ఒక్కనిముషం వుండాలి" అని మాగ్డా చెప్పేమాటకు అడ్డువచ్చి, ఆడిటరువంకకు తిరిగి "హిన్స్‌పీటర్, నీవు ఇక వెళ్ళవచ్చు. అవసరమైతే తిరిగి పిలుస్తాంలే" అని అన్నాను. అతడు మాదగ్గిర సెలవుపుచ్చుకొని తన గదిలోకి వెళ్ళిపోయాడు. అంతవరకూ మాగ్డావైపే చూస్తూ ఏం మాట్లాడకుండా వున్నాను.

తలుపు గడియవేసివచ్చి కూర్చున్నాను. "మాగ్డా! అయిపోయిందేదో అయిపోయింది. దానిసంగతి నేమాత్రం తలపెట్టవద్దు. దాన్ని పూర్తిగానే ఇద్దరం మరిచిపోదాం" అని వేడుకొన్నాను. మాగ్డా ఏదో చెప్పదలంచింది.

"లేదు ఎర్విన్, నీవే చెప్పావుకదూ పోయిన దాన్ని మరిచిపోవాలని. అందుకూ అంగీకరించాను... కానిఆ సంగతిని తిరిగీ ఎందుకు తెస్తావుమరి? అవును, నీవు వెళ్ళటం మంచిదే. కాని డాక్టరుకు టెలిఫోను చేసాకే మధ్యాహ్నం మనమిద్దరం వచ్చి అయన్ను చూద్దామని"

"నీవలాచేయటం నాకేమాత్రం ఇష్టం లేదు. మరి డాక్టర్ను ఎందుకు చూడాలి? జబ్బుందనా!" అరిచాను.

మాగ్డా దానినేమాత్రం వినక "ఎర్విన్, నీవలా అనటం బాగులేదు. నీ వొళ్ళు బొత్తిగా బాగా లేదు. డాక్టరు పరీక్షించి వైద్యంచెయ్యాలి. గిరి కేమాత్రం అడ్డురావద్దు" అన్నది.

"డాక్టరుదగ్గరకు నీవూ రావాలా? నేనే వెళ్ళి కలుసుకొంటే సరిపోదా మరి?" అని ప్రశ్నించాను.

"ఎర్విన్! అంతకోపమెందుకు? నీతో తగవులాడటానికి నాకు ఇష్టంలేదు. కాని నన్ను నీవెంట డాక్టరుదగ్గరకు రానియ్యి...ఆయన పరీక్షచేశాక ఆలోచిద్దాం నీ ప్రయాణాన్ని గురించి."

ఈలా నామీద పెత్తనాన్ని చేయడం నాకే అవమానంకాదూ? "నీవే అన్ని ప్లాన్లను సర్దుకోటానికి అంత పట్టుదలపట్టితే నేను డాక్టరుదగ్గరకు వెళ్ళను, హిన్సుపీటర్‌తోనే చెప్పు, అతన్నే వెళ్ళమని" అని గట్టిగా కేకవేశాను.

మాగ్డా నా దగ్గిరకివచ్చింది. భుజంతట్టింది. "ఎర్విన్..." అని మెల్లగా పిలిచింది.

"హాఁ" అన్నాను.

"ఎర్విన్! నీతోపేచీ నాకేమాత్రం ఇష్టంలేదు. కష్టసముద్రంలోమునిగిపోయాం. దానినుండి రేవుకు చేరుకోవాలి. అదే మనకు ముఖ్యం. మన సంపాదనంతా పోగొట్టుకొన్నాం. అదే చాలు...నీ కోరికని నెరవేరుస్తానులే. నేనే హాంబర్గుకు వెళ్తాను. నేను తిరిగి ఇంటికి చేరుకొన్నాక డాక్టర్నిచూడ్డానికి నావెంటనే రావాలి. ఇదే నా కోరిక."

ఈ మాటను విని పక్కున నవ్వాను.

"వద్దువద్దు, నేనే వెళ్ళివస్తాను. అప్పటికి నేనెంత ఆరోగ్యంగా వున్నానో నీవే చూస్తావు. డాక్టర్ను చూడటంమాత్రం నాకు ఇష్టంలేదు. మాగ్డా! ఆ సంగతిని మాత్రం ఇక చెప్పవద్దు, తిరిగి వచ్చేటప్పుడు నీకుఇష్టమైన సామాన్లనుకూడా తెస్తానులే"

"ఇక నీమాటకు అడ్డురాను. ఇది నీ ఆరోగ్యానికి మంచిదికాదు. అయితేనేం...వెళ్ళు..." అని ఎంతో కష్టంమీద అన్నది...

(ఇంకా వుంది)

శ్రవ్య వాటిక

# దారిపక్క నిమ్మతోట

అనిసెట్టి సుబ్బారావు

పాత్రలు:

సుగుణ, సుగుణ తల్లి, సుగుణ తండ్రి, వెంకట్రావు, బావ (యౌవనంలో; వృద్ధాప్యంలో) బాటసారి.

యువకుడు: (పిలుస్తూ) తాతా, తాతా—ఓ తాతా!

తాత: (దగ్గరికివస్తూ) ఏం బాబూ! నన్నేనా పిలుస్తున్నారు?

యు: అవును. ఇంకా ఎంతదూరం వుంటుంది స్టేషను?

తా: ఇంకా ఒక కోసెడుదూరం వుంటుంది. ఏంబాబూ, ఎర్రనెండలో బయలుదేరారు?

యు: బయలుదేరడమేమిటి ప్రాణంపోతుంటే. ఎండేమో నిప్పులుచెరుగుతున్నది, ఈ డొంకనిండా ముళ్ళూ గులకరాళ్ళూ...అంతా ఎడారి...

తా: అవును బాబూ, అదుగో, ఆ కనపడే నిమ్మ తోట తప్ప ఎక్కడా నీడ అనేదే లేదు.

యు: మరి ఇంత ముసలివాడివి ఈ ఎండలో ఇక్కడ తిరుగుతున్నావేం నువ్వు?

తా: (నవ్వుతూ) బాబూ, ఈ తోటంతటి లోనూ ఈఒక్కచెట్టు నాకు ప్రాణంతో సమానం. మరి నిమ్మచెట్టు సరిగ్గా నీళ్ళులేయ్యకపోతే ఎట్లా బ్రతుకుతుంది? అందుకని, పగలైనా రాత్రైనా నేనెప్పుడూ ఇక్కడేవుండి...

యు: అట్లాగా, ఈ కాయలూ అవీ అమ్మి బాగానే గొప్ప సంపాదిస్తావ్ గామోలు.

తా: (అదుర్దాగా) అయ్యయ్యో, నేనంత పాపాత్ముణ్ణి కాదు బాబూ. ఒక్క పండుకాదు గదా, ఒక్క ఆకుగూడా ఎవ్వరినీ ముట్టుకో నియ్యను.

యు: ఏం, అదేమిటంత విచిత్రంగా మాట్లాడ తావ్. దీనిలో ఏమన్నా మహాత్తుఉందా?

తా: అడుగుతారేం. అందరికీ తెలిసిన సంగ తేగా. (అదుర్దాగా) వద్దు, వద్దు, దాని నీడలో కెళ్ళొద్దు ఆగండి.

యు: ఏమిటి తాతా?

తా: మీరు మా వూరొచ్చిన పనేమిటో చెప్పండి.

యు: ఎందుకు? పెళ్ళిసంబంధం వుంటే చూసి పోదామనొచ్చాను.

తా: కుదుర్చుకున్నారా?

యు: ఆ, నిశ్చయమైంది. ఇక ముహూర్తం పెట్టడమే తరువాయి—

తా: అట్లాగా. (సంతోషంగా) అయితేపదండి. నీడలోకి పదండి. మీకు తప్పకుండా శుభం కలుగు తుంది. కూర్చోండి.

యు: (ఆశ్చర్యంగా) అరె, అరె. ఏమిటిది? ఆకులన్నీ ఇట్లా జలజల రాలుతున్నాయేం, ఇట్లా వీస్తుందేం ఈ గాలి? ఏమిటీ సువాసన అబ్బ. నీడంతా చల్లగా మంచులా వుంది.

తా: (పెద్దగా నవ్వుతూ) ఆ. ఇప్పుడన్నా అర్థమైందా...అదీ దీని మహత్తు. దీవిస్తుంది బాబూ, శుభంగా పెండ్లిచేసుకుని సుఖపడమని చిన్నవాళ్ళందరినీ దీవిస్తుంది.

యు: దీవిస్తుందా? చెట్టు! ఏమిటి తాతా?

తా: అవును బాబూ. చెట్టుగూడా మనిషి లాంటిదే. దీనికిగూడా మనసుంది. ప్రేమించు కున్నవాళ్ళూ పెళ్ళిచేసుకోబోయే వాళ్లూ అంటే ఎంతో ఆప్యాయంగా ఆదరిస్తుంది. ఆకులన్నీ కళ్ళు చేసి ఆ కథంతా చూసింది, ఎట్లా మరిచిపోతుంది. ఎప్పటికీ మరిచిపోదు.

యు: ఏమిటాకథ? చెప్పవూ? నాకు చెప్పవూ?

తా: ఏమని చెప్పేది బాబూ. ఎంతమందికని చెప్పేది పాపం, ఆ అమాయకురాలు సుగుణఎంత నిర్మలంగా ప్రేమించిందో, ఎంత బాధపడిందో...

తను మనసిచ్చిన చిన్నవాడికోసం ఇక్కడికి కెన్ని సార్లొచ్చిందో...

* * *

సుగుణ: మీరు...ఏమిటాలోచిస్తున్నారు?

వెంకట్రావు: ఏమీలేదు సుగుణా.

సు: మరి...మీరిలా మాట్లాడకుండా వుంటే బాగుండదు.

వెం: ఏమనుకుంటున్నారు సుగుణా.

సు : ఏమనుకుంటున్నారు? వెంకట్రావు చాలా మంచివాడు, నువ్వు అదృష్టరాలివి అంటున్నారు.

వెం: ఎవరు?

సు: నాకు తెలిసిన అమ్మాయిలు.

వెం: నేనంటే నీకు యిష్టంగదూ? చెప్పుసుగుణా.

సు: అడుగుతారేం...మీకు మాత్రం...

వెం: చెప్పమంటావా?

సు: నాకు తెలుసుగా.

వెం: అది సరేగానీ, చూడు, ఇవాళెందుకు ఇంత తొందరగా రమ్మని కబురుచేశావ్?

సు: నేనొక మాటచెపుతా వింటావా?

వెం: తప్పకుండా.

సు: మరి ఊరుకో, నన్ను ముట్టుకోవద్దు.

వెం: (ఉలిక్కిపడి) ఓ అదా, చెయ్యి పట్టుకో బోయాను.

సు: తప్పుగదూ...పెళ్ళిగాకుండానే...

వెం: ఇదేనా నువ్వు చెప్పతలుచుకున్నది?

సు: ఊహుఁ, మీరు మా నాన్నతో మాట్లాడితే బాగుంటుంది. ఎంతకాలం ఇట్లా...

వెం: మీ నాన్నకు తెలిస్తే ఊరుకుంటాడా?

సు: తెలిసింది. రాత్రి మానాన్నా అమ్మా నన్ను చీవాట్లుపెట్టి మీతో మాట్లాడొద్దని...

వెం: అదే నాకు భయంగావుంది. అంతపెద్ద శ్రీమంతుడు, గొప్ప పరువూ ప్రతిష్ఠవున్నవాడూ, పైగా మీ బావొకడు పెళ్ళి పెటాకులు లేకుండా నీకోసం కాచుకొన్నాడు...

సు: మా బావ చాలా మంచివాడు.

వెం: మీనాన్న నేనడిగితే నామీదకూడా కోప్పడితే?

సు: అయితే ఏం చేస్తాం. తప్పేముంది. ఇంకా మనం రహస్యంగా మాట్లాడుతున్నామంటే మా నాన్న ఊరుకోడు.

వెం: అయితే అడుగుతాను కానీ—

సు: మనం పెండ్లిచేసుకోవడం మీకిష్టమైతే—

వెం: అట్లా అంటావేం సుగుణా.

సు: అవును, మీరు ధైర్యంచేసి అడగండి.

వెం: ఒప్పుకోకపోతే...

సు: మా అమ్మా నాన్నా ఇష్టపడకుండా నా మనసులో ఎంత వుంటేమాత్రం ఏం చేస్తాను? (గద్గదికంగా) నాకెందుకో ఇదంతా ఆలోచించు కుంటే ఏడుపొస్తూంది.

వెం: ఊరుకో సుగుణా, నేను మీ నాన్నతో గట్టిగా మాట్లాడతాను. రేపే ఏదో ఒకటి తేల్చేసుకుందాం. ఊరుకో...ఊరుకో...

* * *

బావ: (ప్రవేశిస్తూ) ఏంటి మామా, ఎవరిమీద కోప్పడుతున్నావ్?

తండ్రి: అసలు తప్పంతా నీదిరా అబ్బాయ్, అది దానిష్టమొచ్చినట్టు ఆటలాడుతుంటే కళ్ళప్పజెప్పి చూస్తూ వుంటావ్, మంచిగా మాట్లాడి కొంచెం మచ్చిక చేసుకోవాలని గూడా ఆలోచన లేదాయె. నీకన్నా మనసులో ఉందో లేదో చెప్పరాదూ.

బా: మామయ్యా, నా వుద్దేశం అందరికీ తెలుసు. చిన్నప్పట్నుంచీ కలిసి తిరిగాం, ఆడుతూ పాడుతూ పెరిగాం. మామయ్యా, నేను చేసు కుంటే సుగుణనే చేసుకుంటా, లేకపోతే అసలు నేను పెళ్ళే చేసుకోను.

తం: అసాంగలి గట్టిగా అమ్మాయితో చెప్ప రాదటోయ్?

బా: ఎందుకు చెప్పను...కాని సుగుణ వొట్టి మెతకమనిషి...దాని మనసు బాధపెట్టడం నా కిష్టంలేదు.

తం: ఇది మరీ బాగుంది. ఐతే మధ్యలో మాకెందుకొచ్చిన అవస్థరా ఇదంతా?

బా: మామయ్యా, వెంకట్రావొస్తున్నాడు.

తం: వెంకట్రావా? వస్తున్నాడా, ఇక్కడికెందు కొచ్చాడు, ఇంట్లో ఎవరూ లేరనుకున్నాడు గామాలు, రామయ్యా, నువ్వు లోపలికి పోతా వేంరా, కూర్చో ఫర్వాలేదు.

బా: వద్దులేగానీ, నువ్వు అతనితో మాట్లా డొద్దు మామా.

తం: ఏమిట్రా నీసలహా నువ్వూనూ, చాల్ చాల్లే.

బా: అదికాదు మామయ్యా, సుగుణ మనసు నొచ్చుకుంటుంది. (వెళ్ళిపోతాడు.)

వెం: (వస్తూ) నమస్కారమండీ.

తం: ఏమయ్యా వెంకట్రావ్, ఇవాళ మా ఇంటి పైకొచ్చావ్?

వెం: అవునండీ.

తం: ఇదుగో వెంకట్రావ్, నీకూ నాకూ వాదోపవాదాలక్కర్లేదు. నువ్వేం అడగదల్చుకున్నావో నాకు తెలుసు. వీల్లేదు. ముమ్మాటికీ వీల్లేదు. వెళ్ళిపో.

వెం: మరేమీ మంచీ చెడూ విచారించకుండానే...

తం: నాకన్నీ తెలుసునయ్యా.

వెం: ఆస్తిలేనంతమాత్రాన నన్నిట్లా...

తం: అంతేగాదయ్యా, నీకు నా అన్నవాళ్ళెవరున్నారు చెప్పు?

వెం: నిజమే మరి. దానికి నేనేం చేస్తాను. నా చదువుగూడా పూర్తయింది...

తం: అదొక విశేషమా. చదువుకున్న వాళ్ళంతా సంసారాలు పోషిస్తున్నారా?

వెం: నేను ఉద్యోగంకోసం ప్రయత్నించాలని...

తం: చెయ్యి, అట్లాగే ప్రయత్నం చెయ్యి. ఆ తర్వాత చూసుకుందాం.

వెం: మళ్ళీ మీరు మాటతప్పరుగదా!

తం: (కోపంతో) ఏమన్నావ్. నామాటమీద నమ్మకంలేదా? నీ మాట మేం నమ్మాలేం! ఇదిగో అసలు సంగతి చెప్తున్నా. నీకూ మాకూ పొత్తు కలవడం అసంభవం. నా పిల్లని నీకిచ్చి పెళ్ళిచేస్తానని నువ్వు కలలోగూడా అనుకోవద్దు. పో... వెళ్ళిపో...

సుగు: (ఏడుస్తూ వచ్చి) నాన్నా, నాన్నా... అట్లా అనొద్దు నాన్నా. ఆయన తప్పకుండా ఉద్యోగం సంపాదిస్తారు. నాకేం లోటురాకుండా చూస్తారు. నేనంటే ఎంతో...ఎంతో...ప్రేమగా వుంటాడు...

తం: నువ్వు లోపలికిపో ముందు. పోతావా, పోవా...

సుగు: నేనుపోను. నువ్వొప్పుకో నాన్నా. నా మాట వినకున్నా.

తం: అమ్మాయ్, నీ క్కూడా చెప్పేది! నీకే మన్నా పూనిందా. ఎప్పుడూ లేనిది ఇదేమిటే ఇట్లా తెగబడి మాట్లాడుతున్నావ్?

వెం: ఏమండీ నేనొకటి చెప్తాను వింటారా?

తం: ఏమిటయ్యా అది?

వెం: నామాట నేను నిలబెట్టుకుంటే... నేను మంచి ఉద్యోగం సంపాదించుకుంటే అప్పుడు మీమాట మీరు నిలబెట్టుకుంటారా?

తం: నీ మాటకూ, నామాటకూ పోటీ పెడుతున్నావా? నీకేం ఉద్యోగం వస్తుంది? ఎప్పటికొస్తుంది?

సుగు: అట్లా అంటావేం నాన్నా. తప్పకుండా వస్తుంది. పెద్ద ఉద్యోగమొస్తుంది. ఒప్పుకో నాన్నా.

తల్లి: అట్లాగే కానివ్వండి, అమ్మాయినెందుకు బాధపెట్టడం.

తం: సరే. పోవయ్యా, ఏదన్నా మంచి ఉద్యోగమొస్తే అప్పుడు తిరిగిరా. లేకపోతే నువ్వు ఆశపెట్టుకోవద్దు.

వెం: అట్లాగేనండీ. నమస్కారం. సెలవు.

తం: (పెద్దగా) ఇదిగో, నీకోసం ఆరునెల లాగుతాం. అది దాటితే నువ్వు మా యింటి మొఖమే చూడక్కర్లేదు. తెలిసిందా. (జాలిగా) ఏరా రామయ్యా, దిక్కుమొఖంపెట్టి అట్లా నిలబడతావ్. ఒక్కమాటన్నా మాట్లాడవేంరా?

బావ: నీకు తెలియనిదేముంది మామయ్యా.

* * *

(పెండ్లి బాజాలు వినపడుతున్నాయి)

తం: ఏంచేస్తూందమ్మాయి, ఎక్కడా కనపడదేం!

త: గదిలో పడుకొనుంది.

తం: ఇంతమంది బంధువులొచ్చారు. అందరూ అడుగుతున్నారు. అది పోయి గదిలో పడుకుంటే ఎట్లా? పో, నిద్రలేపి అలంకారం చెయ్యండి.

త: అది నిద్రపోవడం లేదండీ. ఏడుస్తూన్నది. మూడురోజుల్నుంచి సరిగ్గా అన్నంగూడా ముట్టుకోవడం లేదు. తలుచుకుని తలుచుకుని ఏడుస్తుంది. ఏవేవో మాట్లాడుతుంది. అప్పుడే ఆరునెల్లయిందా అంటుంది. నాన్నా నువ్వూ నన్ను మోసం చేశారంటుంది.

తం: మోసంచేసింది నువ్వూ నేనూ గాదు. వాడు. లేకపోతే అప్పుడే వచ్చేవాడుగా.

త: ఎందుకు రాలేదో?

తం: అసలు వాడొస్తాడని ఒకప్పుడు మాత్రం నేననుకున్నానా. ఆరునెలలు కాదుగదా ఆరేళ్లాగినా వాడు రాడు. పో. అట్లానిలబడతావేం. దానికోంచెంసర్ది చెప్పి లేచినలుగురిలో తిరగమనండి.

త: ఏమో. దాన్ని చూస్తుంటే నాకెందుకో భయం పుడుతున్నది. ఈ దిగులుతో ఏం అఘాయిత్యం తలపెడుతుందో అనీ...

తం: (కోపంగా) నీకేం మతిపోయినట్టుంది. మాటమాటకూ దాన్ని సమర్థించుకొస్తావేం! మీ ఇద్దరి ఉద్దేశం రామయ్యను నాశనం చేద్దామనా. ముహూర్తం నిశ్చయించి, పెద్దలంతా మనింటికొచ్చి, వారు పెండ్లిబట్టలేసుకుని...అంతా అయిపోయినాక మీ అపహారింపేమిటి? పో, దాన్ని ముస్తాబుచేసి సిద్ధం చెయ్యండి. నేనిప్పుడే బజారు కెళ్ళి బంధువులందర్నీ కేకేసొస్తాను.

త: అట్లాగే.

బావ: అత్తా నీతో ఒకసంగతిచెప్పాలి.ఏమిటత్తా అట్లా వున్నావేం?

త: అబ్బే, ఏమీలేదు నాయనా, చూడు, ఇవాళ నువ్వు అమ్మాయితో మాట్లాడావా?

బావ: లేదు, ఎందుకు?

త: నువ్వెళ్ళికొంచెం ఆమాటా ఈమాటాచెప్పి దాన్ని ఓదార్చు నాయనా. అదింకా ముస్తాబు కాలేదని మీ మామగారు కోప్పడుతున్నారు.

బా: అంతకంటె ముఖ్యమైన సంగతి ఒకటుంది. నీతో చెప్పాలనీ...

త: ఏమిటా సంగతి? ఏమొచ్చిందిప్పుడు?

బా: ఉత్తరమొచ్చింది.

త: ఎక్కణ్ణుంచి?

బా: వెంకట్రావు దగ్గరనుంచి అతనీవూరు వస్తున్నట్టు.

త: అతనా! వస్తున్నాడా? ఇక్కడికొస్తాడా, ఎట్లా? ఎట్లామరి? అంతా ఏర్పాటు చేసుకున్న తర్వాత...

బా: ఇక్కడికి రావటంలేదు. ఊరిబైట నిమ్మతోట దగ్గరుంటాను, వచ్చి కలుసుకోమని సుగుణకు వ్రాశాడు.

త: అట్లాగా. ఇక్కడికి రాడుగదా. అయితే చూడు (రహస్యంగా) అబ్బాయ్, అది చించేసెయ్. అమ్మాయితో చెప్పొద్దు.

పో: చెప్పకపోతే తప్పుగదూ?

త: తప్పేమిటి! దానితో చెప్తే ఇప్పుడిదంతా ఏమైపోతుంది. అసలే దిగులుతో కూడూ నీళ్ళూ లేకుండా పడున్నదే.

బా: అందుకే చెప్పకపోవడం అన్యాయమనుకుంటున్నా.

త: చెపితే అప్పుడేం జరుగుతుందో తెలుసా నాయనా?

బా: తెలుసు. సుగుణ మనసులో ఎట్లావుందో అట్లా జరుగుతుంది.

త: అదేమిటి, నీసంగతి నువ్వు ఆలోచించుకోవేం?...

బా: సుగుణ బాధ పడుతుంటే నేను చూడలేనత్తయ్యా.

సు: (ప్రవేశిస్తూ) అమ్మా, అమ్మా, ఏమిటమ్మా మాట్లాడుతున్నారు?

త: ఏమీలేదమ్మా లోపలికి పోదాంపద.

బా: సుగుణా ఉండు ఇదుగో, నీకు ఉత్తరం వ్రాశాడు, వెంకట్రావు.

సు: (ఆశ్చర్యంగా) ఎవరు? ఆయనా ఉత్తరమా ఏదీ?

బా: ఇదుగో, నేను చదివి వినిపించనా?

సు: చదువ్ తొందరగా చదువ్ అమ్మా. నేను చెప్పలా, వస్తాడు. తప్పకుండా వస్తాడు, నాకు తెలుసు, ముందే తెలుసు చదువ్ బావా, నిజంగా అందులో వున్నట్టు చదువు.

బా: అట్లా అంటావేం సుగుణా? అబద్ధం చెప్పదలుచుకుంటే, అసలీ వుత్తరం వచ్చిందని చెప్తానా, (గద్గదికంగా) ప్రియమైన సుగుణకు, నేను ఆదివారం సాయంత్రానికి మీవూరు వస్తున్నాను. దారిప్రక్క నిమ్మతోటలో నీకోసం ఎదురుచూస్తుంటాను. తప్పకుండా వచ్చి కలుసుకో.—నీ వెంకట్రావు.

సు: (ఆదుర్దాగా) ఇవాళేనా, అయితే వచ్చేవుంటాడు. అమ్మా నే పోతున్నా.

త: అదేమిటే, ఇప్పుడెల్లా పోతావ్? వద్దువద్దు

సు: కాదమ్మా, నే వెళ్ళాల్సిందే. నీకు తెలి యదు. నన్నొదిలి పెట్టు. నన్ను పోనీ.

త: మరి పెండ్లి?

సు: పెళ్ళీవద్దు, ఏమీవద్దు, నన్ను పోనియ్యి.

త: ఏమండీ, అమ్మాయి వెళ్ళిపోతున్నది. ఆపండి, మీరన్నా చెప్పండి.

తం: (బిగ్గరగా) సుగుణా, సుగుణా, ఆగు ఇంత మంది ముందు నన్ను అప్రతిష్టపాలుచేసి పోతు న్నావా, ఆగు.

సు: నన్ను వెళ్ళనీ నాన్నా, నేనుండలేను, అత నొచ్చాడు.

తం: ఇదిగో, ఇప్పుడు నువ్వు వెళ్ళిపోతే నీకూ నాకూ ఇంతటితో సరి. నువ్వేమైపోయినా సరే, బ్రతికినా సరే, చచ్చినా సరే నీకూ మాకూ సంబంధం లేదు.

సు: మీయిష్టం నాన్నా, నేను వెళ్ళాల్సిందే.

తం: ఏమిట్రా నువ్వట్లా వూరుకుంటావ్?

బా: సుగుణా ఉండు. బావ బాధపడతాడని కూడా ఆలోచించవుగదూ,

సు: బావా నువ్వు చాలా మంచివాడివి, నీ మేలు జన్మ జన్మాలకూ మరిచిపోను. వెళుతున్నా.

* * *

వెం: సుగుణా, బాగున్నావా?

సు: ఎంతసేపైందొచ్చి?

వెం: ఇప్పుడే వచ్చాను.

సు: సమయానికే వచ్చారు. మీరు రాలేదని, ఆరునెల్లయిపోయిందని, మానాన్న నాకూ మా బావకూ పెండ్లిచెయ్యడానికి అంతా సిద్ధంచేశాడు. అందరూ నన్ను బలవంతం చేస్తున్నారు. మీరు రాకపోతే నేనేమైపోయేదాన్నో.

వెం. పరవాలేదు సుగుణా. దేన్ని గురించి కూడా దిగులు పెట్టుకోవడం మంచిదిగాదు.

సు: ఇంక నాకేం దిగుల్లేదులెండి వెళ్దాం రండి.

వెం: ఎక్కడికి?

సు: ఊళ్లోకి. మా ఇంటికి.

వెం: మీ ఇంటికా? ఎందుకు?

సు: అదేమిటి?

వెం: నాకింకా ఉద్యోగం రాలేదు. ప్రస్తుతం ఆ ఆశకూడాలేదు.

సు: అయితే—

వెం: అదే నీతో చెబుదామని వచ్చాను. ఎందుకు నాకోసం ఎదురు చూస్తావ్? ఎందుకిట్లా బాధపడతావ్! నన్ను మరచిపో.

సు: ఏమిటి మీ మాటలు? ఇది చెప్పడానికా? మీరిక్కడికొచ్చింది? పరవాలేదు రండి. ఊళ్లోకి పోదాం. మా నాన్నని ఏదోవిధంగా ఒప్పించుదాం

వెం: ఊట్టినే సుగుణా, ఎవరూ ఒప్పుకోనక్కర లేదు. నేను వెళ్ళిపోతున్నాను.

సు: ఎక్కడికెళతారు? అంతా నాకు అయోమయంగా వుంది. ఏమిటట్లా గడియారం వంక చూసుకుంటారు?

వెం: వేళ అయిందేమోనని...

సు: దేనికి? నా ముహూర్తానికా?

వెం: నేను గడియారం చూస్తున్నది రైలుకు వేళవుతున్నదేమో అని... వెళ్లు ఇంటికిపో.

సు: నేను పోను. అక్కడికివెళ్ళి ఆ పదిమందిలో నా ముఖమెట్లా చూపిస్తాను. మా నాన్న నన్ను ఇంట్లో వుండనియ్యడు. నన్ను బ్రతకనియ్యడు.

వెం. పోనీ, మీ బావున్నాడుగా, అతను మంచివాడని నువ్వే అన్నావుగా!

సు: మీరట్లా అనొద్దు. నాకెవ్వరితోనూపని లేదు. మీరు నన్నుగూడా తీసుకుపొండి. మీ తోనే వుంటాను.

వెం: సుగుణా. అది జరిగే పనికాదు. ఆ విష యం నేనుగూడా ఎంతో తీవ్రంగా ఆలోచిం చాను. నేను ఉద్యోగం కోసం దేశంకాని దేశం పోతున్నా. ఎక్కడవుంటానో, ఎక్కడతింటానో నాకే తెలియదు. నాతో పాటు నువ్వు కూడా నాశనమైపోవడం నా కిష్టంలేదు.

సు: (ఏడుస్తూ) అయితే నన్నేంచెయ్యమం టారు. ఎట్లామరి? నేనేమైపోతాను? చెప్పండి. మీరే చెప్పండి?

వెం: నేనేం చెప్పగలను. నా జీవితమే నాకర్థం కావడంలేదు. నాకు రైలుకు వేళయింది. నేను వెళ్ళనామరి?

సు: వెడతారా, నన్నిట్లా వొదిలిపెట్టి? మీకు న్యాయమేనా? వద్దు వెళ్ళొద్దు. వెళ్ళొద్దు.

వెం: అనవసరంగా పిచ్చిగోలపడొద్దు. నన్ను మరిచిపో. వస్తా.

సు: వెడుతున్నారా, వెడుతున్నారా, వెళిపోతున్నారా!—(ఏడుస్తుంది.)

* * *

యు: (ఆందోళనగా) అయ్యయ్యో, తర్వాతేం జరిగింది తాతా!

తా: ఆ అమాయకురాలు అల్లాగే ఏడుస్తూ అతనివంక చూస్తూ నిలబడిపోయింది. పడిపోయింది. చనిపోయింది.

యు: పాపం.

తా: అప్పుడు గాలి వలిచింది ఈ చెట్టు ఒక్కటే తన చల్లని నీడకప్పి. ఆకుల కన్నీళ్ళురాల్చి తనుగూడా ఏడ్చింది. దీవించింది. అందుకే ఎప్పుడూ నేను దీనిదగ్గరే వుంటూ, నీరుపోసి పెంచుకుంటూ, ప్రేమగా చూసుకుంటూ వుంటా.

యు: తాతా పాపం అతనిదిగూడా ఏమీ తప్పులేదనే అనుకుంటా. తనకే గడవనప్పుడు ఆ అమ్మాయిని తీసుకుపోయి కష్టపెట్టడం గూడా అన్యాయమేగా!

తా: తప్పకుండా, ఆమెను మనసారా ప్రేమించబట్టే అట్లా చేశాడుగాని, అతనిలో మరేమీ దుర్దేశంలేదు, బాబూ! అసలు ప్రేమించడమనేదే మనుష్యుల్లో అగ్నిజ్వాలలు వెలిగించడం లాంటిది. కొంతమంది ఆ కాంతిలో ఎంతో సుఖంగా కాలం వెళ్ళబుచ్చుతారు. కొంతమంది ఆ వేడికి తాళలేక గలించిపోతారు.

యు: అవును తాతా, పాపం, ఈ కథ విన్న వాళ్ళెవ్వరూ వాళ్ళిద్దర్నీ మరిచిపోలేరు. ఊఁ, ఎండ కొంచెం తగ్గినట్టుంది. నేను వెళ్ళొస్తా.

తా: మంచిది బాబూ! (పిలుస్తూ) బాబూ.

యు: ఏమిటి తాతా?

తా: ఈ కథ నేనెవరికి చెప్పినా వాళ్ళిద్దరినీ మెచ్చుకుంటారే, మరి ఆ రామయ్య ఏమైపోయాడని అడగరేం?

యు: రామయ్యా! ఆ, నేను మరిచేపోయాను. ఆ తర్వాత అతనేంచేశాడు?

తా: అతనిప్పటికీ బ్రహ్మచారిగానే వుంటూ ఆ అమ్మాయిని తలచుకుంటూ జీవితం గడుపుతున్నాడు.

యు: అట్లాగా! వాళ్ళిద్దరి ప్రేమకూ అతని జీవితాన్ని అర్పించాడు. అసలు ఈకథంతటిలోనూ నిజమైన త్యాగం చేసింది అతనే తాతా.

తా: బాగా చెప్పావ్ బాబూ, నీకు నూరేళ్లాయుష్షు. ఆ రామయ్యను నేనేబాబూ.

(ఆలిండియారేడియో ప్రసారితం)

---

కథానిక

# స్మృతిపథంలో ఛాయామూర్తి

"రాజా"

ఇంకా సాయంకాలం అవలేదు. ప్రకృతిఅంతా అదోలా వుంది. తనుకూడా రాధను మూగగా బ్రతిమాలుతోందా అన్నట్టువుంది. దొడ్లోవున్న పున్నాగచెట్టు తన సందేశాన్ని పూల ద్వారా పంపిస్తోంది రాధ దగ్గరకు.

"రాధా, నువ్వు ఇందుకు ఒప్పుకోకపోతే ఎల్లాగమ్మా, చెప్పుతల్లీ నువ్వే చెప్పు ఏదైనా వుపాయం. మనకి వేరే మార్గదిక్కూ లేరాయెను. మరి ఇంతకన్నా ఏం చేస్తాం." బ్రతిమాలుతోంది తల్లి. బ్రతిమాలడం కాదు ప్రాధేయపడడమే.

ఆవిడన్నట్టు వాళ్ళకి ప్రకాశంకన్న వేరే దిక్కు ఎవ్వరూ లేరు. అతనికైనా ప్రస్తుతం ఇంకెవ్వరూ లేరు. రాధ తండ్రి పోయినప్పటినుంచీ వీళ్ళిద్దరూ, ఇంకో చెల్లెలూ, తమ్ముడూ ప్రకాశం ఇంట్లోనే వుంటున్నారు. అతనైనా అల్లుడు మాత్రమే కాకుండా మేనల్లుడుకూడాను.

ఆరునెలలైంది రాధ అక్క వసుంధరపోయి. ఒక మూగ నలుసును భూమ్మీద పడేసి కాలింపప్పుడే పోయింది. అప్పట్నుంచీ చుట్టాలంతా అదపాదడపా అంటూనే వున్నారు ఇహ రాధను ప్రకాశానికివ్వమని.

"బావ పనేమిరా వద్దంటే వద్దంటున్నా ఎల్లాగో

ఒప్పించారమ్మా అంటాను. ఇప్పటికైనా అతను సరే అనలేదుట. మౌనం అర్థాంగీకారంగా తీసుకున్నారుట. మరి ఇప్పుడిహ ఆలశ్యంచేస్తే మళ్ళీ అతనికేం తిక్కవస్తుందో" దూరం ఆలోచించి అంటోంది తల్లి.

కాని పద్ధెనిమిదేళ్లు నిండని రాధ కన్నెమనసు బావను చేసుకోడానికి ఒప్పుకోడంలేదు.

"ఏవమ్మా ఏమంటావ్ బావకు వయసుమాత్రం తీరిపోయిందా పట్టుమని ముప్పైఏళ్ళు లేవు." ఎల్లాగో సర్దాలని చూస్తోంది తల్లి.

"అమ్మా" రాధ కంఠం గద్గదమైంది. ఇకపైన మాట నోట్లోంచి పెకిలిరాలేదు. "ఏవమ్మాఏమిటిది?"

"వద్దమ్మా నే బావను చేసుకోలేనమ్మా. మొన్న మొన్నటి దాకా అక్క తిరిగిన స్థానంలో ఇవాళ నే తిరగలేనమ్మా." కళ్ళనీళ్ళు తుడుచుకుంది రాధ. అక్కపేరు వినేటప్పటికి తల్లికికూడా ఏడుపు వచ్చింది. ఒక్క ఐదు నిముషాలు నిశ్శబ్దం రాజ్యంచేసింది అక్కడ.

"చూడు రాధతల్లీ నీకు అంత తెలియని ఈడు కాదుగదా. ఇప్పుడు బావని నువ్వు చేసుకోకపోతే ఇంకెవరన్నా కళ్ళకద్దుకుంటూ పిల్లనిస్తారు. అప్పుడు మనం ఇక్కడ వుండగలమా చెప్పూ, అక్క కాబట్టి సరిపోయిందిగాని ఆ వచ్చేది మనల్ని వుండనిస్తుందా? ఇంక అక్కపోతూ బాబును మన చేతుల్లో పెట్టింది. ఇంకెవతైనావస్తే అది వాడ్ని సరిగా చూస్తుందంటావా చెప్పూ?"

"అమ్మా నువ్వు నిజంగా వాడిమీది ప్రేమకొద్దీఏనా నన్ను బావకిస్తానంటున్నావు. దాన్లో ఎంత స్వార్థంవుందో నాకు తెలుసు నువ్వు నిజంగా తల్లివైనా మామీదే కనుక ప్రేముంటే ఇల్లా చెయ్యమంటావా?"

రాధకి కోపంరాదు. వచ్చిందా అంటే ఏమవుతుందో తనకో తెలియదు. ఉద్రేకం ఎంతపనైనా చేయిస్తుంది.

"రాధా" తల్లికేకతో ఆగింది రాధ.

"రాధా, నిన్ను బావకివ్వమనుకో. ఎక్కడన్నా వెళ్ళాలి మనం. అంతేగా? నువ్వూ చదువుకుంటున్న అందరు ఆడపిల్లలలాగే వుద్యోగం చేస్తానంటావు. అంతేగా. ఇంటర్ చదువుతున్న నువ్వు ఏం ఉద్యోగం చేసి ఎంత సంపాదిస్తావ్? ఇటు చెల్లెల్ని, అటు తమ్ముడ్ని చదివించాలి. ఇహా నీకు పెళ్ళా అంటే అదిమాత్రం మనసాధ్యమా? చెప్పూ. నేను ఎంత ఆలోచించి అన్నానో. నాకు మాత్రం..."

"అమ్మా"

"నాకుమాత్రం నిన్ను రెండోపెళ్ళివానికివ్వడం ఇష్టమా? నాలో ఎన్ని మాటల్ని పైకిరానివ్వకుండా ఆపుకుంటున్నానో నీకేం తెలుసు?"

"అమ్మా"

"నీకు వేరే సంబంధం వెతకాలన్నా మనం అంతకన్నా మంచిది తేగలమా? ఇదంతా నా స్వార్థంకదూ. నాకోసం చేస్తున్నదేగదూ?"

"అమ్మా ఏదో అనేశాను. క్షమించమ్మా. నేను ముందూ వెనకా ఆలోచించకుండా అనేశాను నిన్ను మాటలు. క్షమించమ్మా" పశ్చాత్తాపం పెల్లుబుకుతుంది రాధహృదయంలో. కాని చూస్తూ చూస్తూ పెళ్ళికి మాత్రం తిరుగుబాటు చేస్తోంది.

"అమ్మా వీళ్ళసుఖంకోసం నా సుఖాన్ని కాలదన్నుకో మంటావా? ఏం అమ్మా!"

..........

"ఏం అమ్మా మాట్లాడవ్?"

"ఏం చెప్పనమ్మా. ప్రాపకం తెలిసిన నువ్వే ఇల్లా అంటే ఇక నేను చెప్పేదేమిటి? పోనీ నువ్వు బావని చేసుకోవే అనుకో అప్పుడుమాత్రం సుఖం ఏవిధంగా వస్తుంది. తమ్ముడ్ని, చెల్లెల్ని ఏంచెయ్యదల్చుకున్నావో ఆలోచించు. ఇక నేను ఇన్ని సార్లు చెప్పడం మాత్రం బాగుండా. వచ్చేవారం నాడు ముహూర్తం వుందిట. అయిందనిపిస్తే బాగుంటుంది. అంతా ఆలోచించుకు రేపు చెప్పు" లేచింది తల్లి. లోపలిగుమ్మందాకా వెళ్ళి వెనక్కు తిరిగి "మన సంసారం సంగతి కూడా ఆలోచించు" అని లోపలకు మళ్ళింది.

రాధ అల్లాగే ఆలోచిస్తూ కూర్చుంది. అవును. అమ్మమాటలన్నీ నిజమే అబద్ధంకాదు. తను బావను చేసుకోకపోతే తన చెల్లెలిపెళ్ళి ఎలాగా? తనతమ్ముడి చదువో మరి. తన అక్క చనిపోతూ తనచేతుల్లో పెట్టిన బాబునుకూడా తను పెంచాలి. తప్పదు. వీళ్ళందరిబ్రతుకులూ, వీళ్ళందరిసుఖాలూ, తనమీద ఆధారపడి వున్నాయి.

తన ఒక్కమాట, కనీసం తను అంగీకారసూచకంగా తలవిప్పాలే చాలు. వీళ్ళందరూ సుఖంగా

ప్రతిగ్గలుగుతారు. వీళ్ళ భవిష్యజ్జీవితాలు సిమెంటు రోడ్డుమీదుంచి నడిచిపోతాయి. తన పూహాలోకం లోనే తల్లిముఖం చిరునవ్వు నవ్వుతూ కన్పించింది.

లేకపోతే అది ఆలోచించడం కష్టమే. కాని వీళ్ళందరి జీవితాలకోసం, వీళ్ళ సుఖాలకోసం తన జీవితాన్ని, తన వయసునూ, వలపునూ నాశనం చేసుకోవమేనా. తనిప్పుడు బావను చేసుకుంటే తన కృష్ణమూర్తి ఏమైపోతాడు? బహుశా అతను కూడా బలవంతపెళ్ళి చేసుకుంటాడేమో. లేక పోతే...అమ్మయ్యో! తను ఆలోచించడానికే భయ మేస్తోంది. ఆ మాటలు తల్చుకుంటేనే వళ్ళు గగు ర్పొడుస్తోంది.

ఇప్పుడు తను నిలుపవలసినవి ఇటు కుటుంబ శాంతి సౌఖ్యాలా, అటు మనసార ప్రేమించిన కృష్ణమూర్తి జీవితాన్నా?

మళ్ళీ తల్లి వదనం కన్పిస్తోంది. భీకరంగా "రాధా నువ్వు తప్పుదారిలో పడుతున్నావ్. నువ్వు చూడాల్సింది నీ సుఖంమాత్రమే గాదు పిచ్చితల్లీ! అందరిదీ చూస్తేనే సిద్ధిని; జాగ్రత్త. బురదలో కాలుపెట్టకు, తర్వాత లాభంవుండదు."

కాని తనుమాత్రం ఏంచేస్తుంది? మరువరాని సంఘటనలు అవి—

ఏంచెయ్యాలి? ఇప్పుడు తన కర్తవ్యం ఎమిటి? తన ఒక్కతె సుఖాన్ని సునాయాసంగా బలిచెయ్య డానికి అంత మహానుభావురాలు కాదు తను. స్వార్థం అందరిలోలాగే తనలోనూ వుంది.

మళ్ళీ ఆ వదనం కన్పిస్తుంది. తనకి అర్థం కావడంలేదు. కాని చివరకు "కర్తవ్యం" అన్న మాట గట్టిగా విన్పించింది.

"రాధా!" బయటనుంచి పిలుపు.

ఉలిక్కిపడింది ఆలోచనా తరంగాలనుంచి "రా శారదా" అంటూను.

లోపలకు వస్తూనే "అలావున్నావేం ఇవ్వాళ? మరి పిక్చర్ ప్రోగ్రాం సంగతి మర్చిపోయావా?" అంది శారద.

"ఇవాళ పిక్చర్‌కి వద్దుగాని, అలా కాస్త షికా రుకి వెడదాంపద. కాస్త మాట్లాడాలి."

"నా సలహా దేన్లో కావాల్సివచ్చింది. అయినా పిక్చర్ మానేటంకదా?"

"అదికాదు శారదా. నాలైఫ్ సుడరించేవదు."

ఉన్నదున్నట్టుగానే బయల్దేరి దారిలో అంతా చెప్పింది రాధ. ఇంతలో పార్కు చేరుకున్నారు.

"ఏం చెయ్యమంటూ విప్పుడు శారీ" నిర్మాను ష్యంగా వున్న చోట కూర్చుంటూ అడిగింది రాధ.

"పోనీ ఎదిరించి చూడలేకపోయావా? నీకన్న వాళ్ళంతా ఎక్కువేమిటి?"

"అదిచూశా కానిఎదిరించడం మంచిదిగాదేమో అనిపిస్తోంది ఇప్పుడు" దూరంగా చూస్తూఅందిరాధ.

"నీవంటి పిచ్చిది ఇప్పుడు వుండవలసిందిగాదే. చదువుకుంటూ కూడా దండగే. ఏమీ యెరగనిపల్లె టూరిమొద్దులా శ్రీరంగనీతులు మాట్లాడుతావేం?"

"అదికాదు శారదా. మనకి చదువు ఎదిరిం చడం నేర్పుతుందా. చదువుకుని కొద్దిగా దూరం ఆలోచించాలి కాని మనం కూడా ఇంటి పరిస్థితు లిలా వున్నప్పుడు చదువుకోని వాళ్ళలా ఎదిరించ డమే? ఇదేనా నీ సలహా?

"సరే. ఇంతకీ ఏంచేస్తా నంటావు? బుద్ధిమంతు రాల్లా బావను చేసుకుంటానంటా వంతేగా?"

"ఏంచెయ్యను చెప్పు. ఇక వేరే గత్యంతరం లేదు. లేద్దామా శారదా" ఇద్దరూ నిశ్శబ్దంగా నడుస్తున్నారు ఇంటివైపు. దారిలో ఎవరింటించో "ఆనందమానంద మాయెనే. మా సీతమ్మ పెళ్ళి కూతు రాయెనే" సన్నాయి స్వరం విన్పిస్తోంది.

శారద, "ఇక వారంరోజుల్లో మా రాధమ్మ పెళ్ళికూతురాయెనే అని వింటాంకదూ" అంది చిలిపిగా.

"శారదా, నీకంత వేళాకోళంగా వుందిగదూ?"

"లేదు రాధా తమాషాకన్నా నంతే. ఇంత త్యాగం చెయ్యాలంటే మాటలా! నేనే నీ పరి స్థితుల్లో వుంటే ఎక్కడికైనా వెళ్ళేదాన్ని గాని ధైర్యం చేసుకునేదాన్ని గాదు. నువ్వు నిజంగా..."

"కాదులే శారదా. ఎవరికివాళ్ళు అలా అను కోడం మానవ నైజం. అంతేకాని ఈ పరిస్థితుల్లో ఎవరున్నా నాలా చేసేవాళ్ళే."

తల్లి దీనవదనం కళ్ళకు కట్టింది. ఆ వదనం ఎంత పసైనా చేయిస్తుంది! "జీవితంలో ఒడు దుడుకులకు ఇక ఆగలవు తల్లీ సుమంగళీ భవ" దీవిస్తూ మాయమైంది ఆ ముఖం. తల్లి ఎదురు కుండా నిల్చి చేయలేని పని అదృశ్యంగా వుండి ఆమె వదనం చేయించిందా? ★




కలకలలాడే బజారులు, ఉత్సాహవంతులైన జనం, నడిరోడ్డుమీద యోగక్షేమాలు, రాజకీయాల అర్జంటు చర్చలు, సమృద్ధిగా ఉండి అడుగు వేస్తే అవతరించే కాఫీహోటళ్ళు, ట్రాఫిక్ నిబంధనలను పూర్తిగా గుడిచిపెట్టే రకరకాల వాహనాలు—ఆంధ్రలో కోస్తాజిల్లాల పట్టణాలు నవనవోన్మేషంగానే ఉన్నాయి. పెసరట్ల రుచిలో పెద్ద మార్పేమీ రాలేదు; అదే ఎండాకాలాలు; పోగా "కూల్ డ్రింక్" శాలలు మాత్రం సంఖ్యలో విపరీతంగా పెరిగిపోతున్నాయి, రంగురంగులతో మెరిసిపోతున్నాయి. వాటి గోడల అద్దాలలో ప్రతిఫలించే అనంత దరహాసాలు, ఖరీదైన ద్రాక్ష పానీయాల నిరంతరాస్వాదనలు—ఎండ వేడిమి ఓడిపోయింది. అది బందరో లేక గుడివాడో—కాక గుంటూరో విజయవాడో, పట్టణం ఏదైతేనేం, నేటి యాత్రికుడికి అన్నీ ఒక్కలాగే గోచరిస్తూ ఆంధ్రసంస్కృతి విరుస్తూ, ఇక్కడి జనం మహా చైతన్యవంతులు సుమీ అని చెంపపెట్టు పెట్టినట్టు రుజువు చేస్తున్నాయి. బాహ్యదృష్టికి అంతా "ధనధాన్య సమృద్ధిగా" ఉంది. రెండు మూడు పంచవర్ష ప్రణాళికలు కోస్తాజిల్లాలప్పుడే పూర్తిచేశాయేమోననే అనుమానం విదేశీ యాత్రికులకు క్షణమాత్రం కలిగిందంటే క్షమార్హమే మరి. ఇన్ని పానీయ ఫలహారశాల లిన్ని గాజుల దుకాణాలిన్ని సిల్కుబట్టల శాలలిన్ని సినిమా థియేటర్లు—జీవనప్రమాణం ఎంతగా పెరిగిందనిపిస్తుంది. వ్యాపారం ఎంత అభివృద్ధి చెందిందనిపిస్తుంది. కోస్తా ఆంధ్ర అంటే ఒక్క పట్టణాలు మాత్రమే అయితే - సర్వమూ నవరత్నఖచితంగా ఉంది. క్రిక్కిరిసిన సినిమా హాలులో చోటు దొరకడం కష్టం; కిళ్లీకొట్టుల్లో రేడియోలు—వాటి "పికప్"లలోంచి "వీరు వాక సాగాలోయ్!" అంటూ నిరంతరగానం -అదినిస్పందేహంగా చీకుచింతలు లేని సీమ.

అందుకే బస్సు డ్రైవర్లను చూస్తే ప్యాసింజర్లకంత భయం; కండక్టర్లనుచూస్తే అంతహడల్. అందులోనూ మొన్ననే ఆంధ్రలో ప్రజాస్వామ్యం గెలిచింది కాబట్టి "ఓవర్ లోడింగు" జరిగినా ఫ్రంటు సీటులో పోలీసు సబిన్‌స్పెక్టరంతగా పట్టించుకోడు: "పొగ త్రాగరాదు" అన్న నిబంధన ఎదురుగా చెక్కి ఉన్నా డ్రైవరు సిగరెట్టు కాల్చుకునేందుకు అడ్డురాదు. పట్టణంలోని పార్కులు బిచ్చగాళ్ళ వంటశాలలుగా మార్చేసినా అది ప్రజాస్వామ్యంలో భాగమే. గనక ఫరవాలేదు. అతిక్రమించడానికి కాకపోతే నిబంధనల ప్రయోజనం దేనికి? ఫరవాలేదు, అంతా సజావుగానే ఉందని ఆనందంతో నా హృదయం కెవ్వుమంది. ఆమాటకొస్తే వెనకటికంటె నేడే ఎక్కువ సజావుగా ఉంది. వినోదం, విజ్ఞానం, ప్రజాస్వామ్యం-మూడూ ముప్పేట జడలాగ నిత్యజీవనవాహినిలో అంతర్లీనంగా మెలికలు తిరిగిపోతున్నాయి. మంత్రుల సంఖ్యకి కొదవలేదు గనక వారి పర్యటనలకీ కొదవలేదు; పక్షం తిరిగేసరికి ఎవరో ఒకమంత్రి ప్రత్యక్షంగాని కోస్తాపట్టణం ఉండదు. అప్పుడు స్థానిక కాంగ్రెస్ భవనాలు కలకలలాడుతాయి; రహదారి బంగళా ఆవరణలో నిలిచే సరికొత్త కార్లకు అంతులేదు; ఆ సమయంలో పోలీసుల హడావిడికీ అంతే; అప్పటికప్పుడు ట్రాఫిక్ నిబంధనలు అకస్మాత్తుగా అమల్లోకి వస్తాయి. కాని ప్రజాస్వామ్యంతో పాటు రోడ్లు అంతగా అభివృద్ధి చెందలేదు గనక మంత్రిగారికి దారి యివ్వడంకోసం కొన్ని తాత్కాలికపు ఏర్పాట్లు చెయ్యాలి. అది ప్రజలకు యిబ్బందికరంగా ఉంటుందా, ఏం చేస్తాం మరి—ఉన్న పాటున రహదారులు బాగుపడాలంటే కష్టం. ఎన్నో సమస్యలతో సతమతమవుతూన్న స్థానిక సంస్థలకి యీ రోడ్ల గొడవా యిప్పుడు ముఖ్యం!' పదవులు నిలబెట్టుకోవాలి, మంత్రులతో మంత




ఒక్కొక్కసారి అసౌకర్యంవెంబడే కొంత మంచి కూడా ఉంటుంది. మనదేశంలో తీసే హిందీ చిత్రాలకుండే మార్కెట్ బెంగాలీ, మరాఠీ, తెలుగు, తమిళ, మళయాళ, కన్నడభాషలలో తీసే చిత్రాలకు లేకపోవటం నిజంగా అసౌకర్యమే. ఇందువల్ల నిర్మాతలేగాక, నటులూ, టెక్నీషియనులూకూడా నష్టపడ్డారు. చిత్రనిర్మాణానికయే ఖర్చు ఏ భాషలో అయినా ఇంచు మించు ఒకటే అయినప్పటికీ, సుమారైన హిందీచిత్రం చేసుకునే డబ్బు, ఇతర భాషలలో తీసిన మంచి చిత్రానికి కూడా రాకపోయే అవకాశం ఉంది. హిందీ చిత్రాలలో చిల్లరపాత్రలు ధరించేవారికివచ్చే పబ్లిసిటీ ఇతరభాషలలో ప్రధానపాత్రలు ధరించేవారికి రాదు. "హిందీ" తారల కుక్కలకుకూడా ఇంగ్లీషు సినిమా పత్రికలద్వారా పబ్లిసిటీ లభిస్తుంది; ఆ పత్రికలు యావద్భారతంమీద విక్రయిస్తాయి. ("హిందీ" తార మాతృభాష బెంగాలీ, మరాఠీ, కన్నడం, ఉర్దూ, పంజాబీ, తమిళం, తెలుగు, కొంకణి—ఏదైనా కావచ్చు!)... టెక్నీషియనుల స్థితి ఇదే.

ఈకారణంచేత ఇతర భాషలలో తయారయే చిత్రాలలో పనిచేసేవారికి హిందీ చిత్రాలలో పనిచేసే అవకాశం దొరికితే వాళ్ళు కొమ్మెక్కినట్టుగా లోకమంతా భావించటంకూడా జరుగుతున్నది. ఫలాని "హిందీ" కామెరామాన్ తెలుగువాడే నంటే తెలుగువారందరికీ గొప్ప! ఫలాని "హిందీ" తార తమిళురాలంటే తమిళులకు [illegible]! దేశంలోని సినిమా అభిమానులు ఇటువంటి భావ దాస్యంలో పడటానికి ప్రధాన కారణం హిందీ చిత్రాలకు గల పెద్ద మార్కెట్; ఇంకో చిన్న కారణం—[illegible] అన్యాయమైన ఇంగ్లీషు సినిమా పత్రికలలో హిందీ చిత్రాలకూ, తారలకూ, టెక్నీషియనులకూ పబ్లిసిటీ ఉండటం.

ఈ అసౌకర్యాలవెంట ఒక మంచి కూడా ఉన్నట్టు కనిపిస్తుంది. ఇతర భాషలలో తయారయే చచ్చు చిత్రాలకన్న హిందీలో తీసే చచ్చు చిత్రాలు నాలుగైదింతలు చచ్చుగా ఉన్నాయి. హిందీ చిత్రాలకు దేశమంతటా మార్కెట్ ఉండికూడా ఖర్చు రాబట్టుకోలేక దివాలాతీసే చిత్రాలు ఉన్నాయి! బాగా నడిచి లాభాలు చేసుకున్న హిందీ చిత్రాలనుబట్టి మనకు హిందీ చిత్రనిర్మాతల నెత్తిమీద రెండేసి కొమ్ములుంటాయని భ్రమ కలగటం సహజమేగాని, మనం చచ్చునిర్మాతలనుకునేవారికంటె చాలా చచ్చునిర్మాతలు హిందీ రంగంలో ఉన్నారనటానికి సందేహం ఏమీలేదు.

కొద్ది మార్కెట్ అయిన కారణంచేత మన నిర్మాతలు హిందీవారంత గుడ్డిగా, నిర్లక్ష్యంగా, గొర్రెదాటుగా చిత్రాలుతీయటానికెన్నడూ సాహసించరు. కిందటేడు విడుదలయి డబ్బు చేసుకోలేకపోయిన ఒక తెలుగుచిత్రాన్ని బొంబాయి టెక్నీషియనులు చూసి, అద్భుతమైన చిత్రమనీ, హిందీలో విజయవంతంగా నడిచి ఉండేదనీ అన్నారు.

దీనికితోడు ఇంకొకటి స్పష్టంగా కనిపిస్తుంది. మన దేశంలో సినిమాపరిశ్రమ పుట్టాక అన్నిటికన్న విజయవంతంగా నడిచిన హిందీ చిత్రం మద్రాసులో, తమిళ నిర్మాతలద్వారా తయారయింది! కొంతకాలం క్రితం హిందీలో తయారై గొప్ప లాభాలు తీసిన హిందీ చిత్రాలను తెలుగు తమిళ భాషలలోకి దించితే అవి చెప్పుకోదగినంత బాగా పోలేదు. ఇతర భాషలలో బాగా నడిచిన చిత్రాలను ఆ నిర్మాతలేగాని, ఇతర నిర్మాతలుగాని

హిందీలో తయారుచేస్తే అవి చాలా విజయవంతంగా నడిచాయి!

ఈ వివరాలన్నీ సినిమా ప్రేక్షకులందరికీ తెలిసినవే. అభిరుచి విషయంలో, కథల విషయంలో, నటన విషయంలో, ఇంకా అనేక విషయాలలో ఇతర భాషాచిత్రాలు హిందీ చిత్రాలకన్న ముందుంటున్నాయనటానికి సందేహం లేదు. చేతకాకుండా తీసిన చిత్రాలూ, అపజయంపొందే చిత్రాలూ ఏభాషలో అయినా తయారుకావచ్చు కాని స్థూలంగాచూస్తే తక్కువ మార్కెట్‌గల చిత్రాలు ఎక్కువ బాగుండటానికి యత్నిస్తున్నాయి. మరీ అల్పసంఖ్యలో తయారయే మళయాళ, కన్నడ, గుజరాతీ వగైరాలకు ఈ ముక్క వర్తించకపోవచ్చుగాని, విరివిగా చాలాకాలం నుంచీ నిర్మాణంసాగే బెంగాలీ, మరాఠీ, తమిళ, తెలుగు చిత్రాలకు ఇది తప్పక వర్తిస్తుంది. ఈ రంగాలలో దీర్ఘానుభవంగల దర్శకులూ, టెక్నీషియనులూ, నటులూ ఉన్నారు. ఈ రంగాలలో కొన్ని పరిణామదశలు గడిచి మేధావులు ముందుకు రావటం జరిగింది. కనకనే 1952 లో అంతర్జాతీయ చలన చిత్రోత్సవంలో పాల్గొనేటందుకు నాలుగు చిత్రాలు ఎన్నుకోబడితే తెలుగు చిత్రానికి ఎక్కువ వోట్లువచ్చాయి.

ఈ పరిస్థితులను పురస్కరించుకుని ,జరగవలసిన పరిణామం ఏమంటే, ఇతరభాషలలో ఉత్తమ నిర్మాతలనిపించుకునేవారు హిందీచిత్రాలుతీయటం. మద్రాసు రాష్ట్రంలో ఈ పని వాసన్, మెయ్యప్పన్ మొదలైనవారు అదివరకే ప్రారంభించారు. జూపిటర్ పక్షిరాజా సంస్థలవారూ అదేపద్ధతి అమలుజరిపారు. హిందీచిత్రం తీసిన మొదటి తెలుగుసంస్థ భరణీ పిక్చర్. ఇప్పుడు విజయాసంస్థకూడా ఈ పద్ధతి అవలంభించింది.

ఈ యేడు మద్రాసులో హిందీచిత్రాల నిర్మాణం పూర్వంకంటె భారీఅయింది. "హిందీ"నటులూ రచయితలూ, సంగీతకారులూ తదితరులూ మద్రాసులో తరుచు కనిపిస్తున్నారు. వారు ఇంతదూరంవచ్చి, ఇక్కడి తారలలాగే, రెండుమూడు స్టూడియోల ఆవరణలో ఒకేసారి పనిచేయటంకూడా జరుగుతున్నది. త్వరలోనే హిందీచిత్రాల నిర్మాణానికి బొంబాయి తరవాత మద్రాసు పెద్దకేంద్రముగా పరిణమించేటట్టు కనిపిస్తుంది. (ఒకప్పుడీ గౌరవం కలకత్తాకుండేది.)

ప్రస్తుతం ఉన్న దశలో మద్రాసులో తయారయే హిందీ చిత్రాలలో అధికంగా "హిందీ" వారిని ఉపయోగించక తప్పదల్లే కనిపిస్తుంది. మన నటులకుగాని, తదితరులకుగాని హిందీ చిత్రాలను విజయవంతంగా నడిపించేపాటి పబ్లిసిటీ లేదు. నిర్మాతలకూ, సంస్థలకూ హిందీ మార్కెటులో పేరు ప్రతిష్టలు వచ్చేదాకా హిందీనటుల, సంగీతకారుల, రచయితల పేర్లను ఉపయోగించకతప్పదు.

కాని, కాలక్రమాన మద్రాసులో సమగ్రమైన హిందీ చిత్ర పరిశ్రమ ఏర్పడటానికీ, ఎవరినీ దిగుమతిచేసుకోకుండా, హిందీ చిత్రాలు ఇక్కడ తయారుకావటానికీ దోహదం జరగవలిసి ఉంది. అంటే భావి "హిందీ" నటులనూ, రచయితలనూ నేరుగా ఇక్కడికే ఆకర్షించటానికి తగిన శక్తి సామర్థ్యాలను ఇప్పటినుంచే మన "హిందీ" నిర్మాతలు పెంపుచేసుకోవాలి.

ఈ "శక్తి"లో ఒక పాలు, తగినంత హెచ్చు సంఖ్యలో హిందీచిత్రాలు తీయటం. ఒకప్పుడు మద్రాసులో తెలుగు చిత్రం తీయాలన్నప్పటికీ ఆంధ్రదేశం నలుమూలలనుంచి "నటులను" మద్రాసుకు దిగుమతిచేసి, లాడ్జీలలోపెట్టి భరించి, చిత్రం తీయవలసి వచ్చేది. భావి తారలను నేరుగా మద్రాసుకులాగే శక్తి సామర్థ్యాలను తెలుగు చిత్రనిర్మాతలు సంపాదించుకోగలిగారు. ఇదేవిధమైన పరిణామం హిందీ చిత్రనిర్మాణం విషయంలో కూడా రావలసి ఉంది.

బొంబాయిలో తారలకుగల సామాజిక జీవితం మద్రాసులో తారలకు ఇంకాలేదు. సూర్యకాంతి చూసి దడుసుకోకుండా ఉండటం మన తారలు ఇప్పుడిప్పుడే నేర్చుకుంటున్నారు. ఈ ఒక్కతేడా మినహాయిస్తే, నటించటంలో తెలుగు తమిళ నటులు చాలావరకు హిందీ నటులకు ఏమాత్రమూ తీసిపోనివారే. అవకాశాలు దొరికి, అనుభవం సంపాదించగలిగితే హిందీలో రచన చేసేవారూ, హిందీ సంగీతం ఇవ్వగలవారూ మద్రాసు గడ్డమీద కూడా వెలుస్తారు. వీరంతా బొంబాయిపోలేకపో కొమ్మెక్కరన్న పరిస్థితిపోయేటట్టు చూసే బాధ్యత మన "హిందీ" నిర్మాతలు వహించాలి. ★




> "చుట్టూరా ఆవరించి ఉన్న చీకటిని ఊరికే తిట్టుకుంటూ కూర్చోకండి; ప్రయత్నించి ఒక చిన్న దీపాన్ని—ఎంత చిన్నదైనా సరే— వెలిగించండి."

హనుమకొండనుండి శ్రీమతి తెన్నేటి అహల్యాదేవిగారు యిలా వ్రాస్తున్నారు:

వరకట్న సమస్యనుగురించి నేను వ్రాసిన వ్యాసం మీద మే 20 తెలుగు స్వతంత్రలో శ్రీ సన్యాసి రావుగారు వెలిబుచ్చిన అనుమానాలు చదివాను. వారు సూచించిన అనుమానాలు రెండు: ఆడ పిల్లలు కేవలం వరాన్వేషణకొరకే ఉద్యోగాలు చేయాలా అనేది ఒకటి. 'లోవర్ మిడిల్ క్లాసు' వారు ఆడపిల్లలకు చదువు చెప్పించగలరా అనేది రెండు.

ఉద్యోగాలు వరాన్వేషణ కోసమే చేయాలని నా వ్యాసంలో ఎక్కడా ధ్వనించినట్లు అనిపించదు. స్వతంత్రంగా తాము బ్రతకటానికే ఆడ పిల్లలు చదువుకోటముగానీ ఉద్యోగాలు చేయటం గానీ. యుక్తవయస్సు రాగానే ఎవరిమీదనో ఆధారపడి తీరవలసిన అగత్యం లేకుండా ఉంటే గాని కట్నాలసమస్య నాశనం కాదుగనక ఆడ వాళ్ళు ఉద్యోగాలు చేయాలని నేను సూచించాను. ఇకపోతే గృహనిర్వహణ, సంస్కృతి వీటి సంగతి అప్రస్తుతం. సంస్కృతి సంఘాన్నిబట్టి మారుతూ వుంటుంది. గృహనిర్వహణ అనేది ప్రత్యేక సమస్య. వరకట్న సమస్యకు సంబంధించి నంతవరకు ఆడపిల్లను ఎవరిమీదనో 'ఆధారపడి తీరవలసిందిగా' చేయరాదని నా అభిప్రాయం.

రెండో అనుమానం సంగతి: సన్యాసిరావుగారు ప్రభుత్వాన్ని పూర్తిగా విస్మరించారు. ప్రజా స్వామ్య యుగంలో, సామ్యవాదం బలపడుతున్న కాలంలో ప్రభుత్వంలో'లోవర్ మిడిల్ క్లాస్'వారికి విద్యాది సౌకర్యాలను ఉచితంగా కలిగిస్తోంది. ఉదాహరణకు మద్రాస్ ప్రభుత్వం ఏడాదికి 1200 రు. ఆదాయానికి తక్కువైనవారి పిల్లలకు 3వ ఫారంవరకూ ఉచితవిద్యా సౌకర్యం కలిగించింది. పోనీ, అలా కాకపోయినా, కట్నమంటే తల తాకట్టుపెట్టి చచ్చి చెడీ డబ్బు తేగలిగిన తండ్రి, తన కూతురికి చదువుకోసంగాను నెలవారీ చిన్న మొత్తాలను చెల్లించలేకపోడు. విద్య అంటే ప్రతి వారూ డిగ్రీదాకా చదవాలని కాదు. ఏస్థాయికి తగినట్లు ఆ స్థాయిలోనే విద్యలుగానీ; ఉద్యోగాలు గానీ.

ఇంతకీ ప్రధానంగా రావాలిసింది దృక్పథంలో మార్పు. ఉన్నత తరగతుల వారికి ఈసమస్య లేదు. మధ్యతరగతులవారికి నా సలహా ఉపయోగిస్తుంది. ఇక 'లోవర్ మిడిల్ క్లాస్' వారికి ప్రభుత్వ సహాయం ఉండనేఉంటుంది.

* * *

లక్ష్మీనరసుపేట (శ్రీకాకుళం జిల్లా) నుండి శ్రీమతి వి. శ్యామలారావు యిలా వ్రాస్తున్నారు:

ఆంధ్ర యువతా లోకానికి ఒక అపూర్వమైన వాతావరణము సృష్టించి భావప్రకటనకు తగిన

హిందీలో తయారుచేస్తే అవి చాలా విజయవంతంగా నడిచాయి!

ఈ వివరాలన్నీ సినిమా ప్రేక్షకు [illegible] రాష్ట్రంలో [illegible] అందరినీ కలవరపరిచేవి వరకట్న సమస్య; నిరుద్యోగ సమస్య చాలా తీవ్రరూపం దాల్చియున్నాయి. ఈ రెండు సమస్యల్ని మనము యావచ్ఛక్తి విని యోగించి ఎదుర్కోవడం మనయొక్క విద్యుక్త ధర్మము. ప్రస్తుత పరిస్థితి ననుసరించి శ్రీమతి తెన్నేటి అహల్యాదేవిగారి అభిప్రాయంతో యేకీభవించలేకుండా యున్నాను. ఆవిడ చెప్పింది ఒక విధంగా నిజంకావచ్చు. కాని నిరుద్యోగ సమస్య దృష్టియందుంచుకుంటే యిది అంత ఆరోగ్యమైన సలహావలె కనబడదు.

ఈ రోజుల్లో ముఖ్యంగా మన ఆంధ్రదేశంలో వేలకొలది విద్యార్థినులు నిరుద్యోగులుగా యున్న సంగతి అందరికి తెలిసినదే! ఇలాంటి సమయములో స్త్రీలుగూడ పురుషులతోబాటు ఉద్యోగాల నిమిత్తం పోటీ పడునప్పుడు స్త్రీ పురుషుల మధ్య సహజంగాయుండే గౌరవము తగ్గిపోయి ఒక విధమయిన అసూయ ప్రబలడానికి అవకాశమున్నది. ఈ రోజుల్లో చదువు సంస్కారానికి మాత్రమే గాని బ్రతుకుతెరువుకోసం కాదన్నది నిజమనిపిస్తోంది. అందులోనూ దేశంలో పురుషులకన్న స్త్రీలే అధికంగా యున్నట్టు "స్టాటిస్టిక్స్" వలన తెలుస్తోంది. అలాంటి సమయములో విద్యావతులైన స్త్రీలందరు స్వతంత్రముగా బ్రతకాలంటే ఉద్యోగాలెక్కడినుండి వస్తాయి? స్త్రీలు స్వతంత్ర జీవనము కావాలని వాంఛించడము యీ రోజుల్లో ఎంతవరకు సాధ్యం?

సహజంగా పురుషుల్లో యుండే మానసిక దౌర్బల్యమువల్ల నిరుద్యోగి యైన పురుషుడు ఉద్యోగం చేస్తూయున్న స్త్రీని వివాహమాడుటకు అంగీకరించడు. స్త్రీ పురుషులందరికి ఉద్యోగాలు కల్పించడం ప్రస్తుత పరిస్థితిలో మన ప్రభుత్వానికి తలకు మించిన పని అవుతుంది. అందులోనూ ఉద్యోగం చేస్తూయున్న యువతి సంస్కారంలేని నేటి సంఘము దృష్టిలో నైతికంగా అధోగతిలో యుండునని నమ్మకము. కాలమే ఆ అభిప్రాయాన్ని సంస్కరించాలి.

కట్నాలు యిచ్చినా, యివ్వకపోయినా స్త్రీల విషయములో వివాహము చేయని పక్షములో చాలా విపరీత పరిణామాలకి గురికావలసి వస్తుంది. ఉదాహరణకు ఇక్కడికి సమీపంలో యున్న ఒక పట్నములో ఒక యువతి బి. ఏ. బి. ఎల్. పాస్ అయినకూడా పాతికేళ్ళవరకు వివాహంచేయని కారణంగా ఆత్మహత్య చేసుకుంది. ఆమె కుటుంబము వారంతా చదువుకున్నవారూ, సంస్కారము గలవారూ, మంచి పలుకుబడిగలవారున్నూ. అయితే యీవిషయంలో యీ విపరీత పరిణామానికి కారణం ఏమిటి? ఎవరిమట్టుకివారే ఊహించుకోవచ్చు.

ఆఖరుసారిగా నేచెప్పేదేమిటంటే స్త్రీ పురుషులలో యేఒక్కరిని దృష్టిలోపెట్టుకున్న కట్నాల సమస్య పరిష్కారంగాదు. స్త్రీ పురుషులు పరస్పరం అభ్యుదయభావాలు కలవారైనప్పుడే వరకట్న నిర్మూలనకి ఒక మార్గమేర్పడుతుంది. మనదేశంలో ముఖ్యంగా ఆంధ్రులలో అనైకమత్యము హెచ్చుగా యుంది. అనేకత్వములో యేకత్వం సాధించడమే "స్నేహలత"ఆశయం. "స్నేహలత" యొక్క నిర్మాణాత్మక కృషివల్ల యీ సమస్య ఒక కొలిక్కి వచ్చి ఆంధ్ర యువతాలోకంలో నిద్రాణామైయున్న అభ్యుదయ భావాలకి తగిన ఫలితం లభిస్తుందని ఆశించవచ్చు. ప్రయోజనము లేని వాదోపవాదాలకి ప్రాధాన్యం నివ్వక నిర్మాణాత్మకమైన కృషికే సంస్కరణాభిలాషులైన స్నేహలత సభ్యులు దోహదము కలిగించగలరని ఆశిస్తూయున్నాను.

* * *

నేవీపేట (నైజాం రాబాదు) నుండి శ్రీ. టి. సి. హెచ్. మాళిగారు యిలా వ్రాస్తున్నారు:

స్నేహలతద్వారా సభ్యులు తమ వ్యక్తిగత భావాలను మాత్రమే వెల్లడించగల్గుతున్నారు. అంత మాత్రంతో స్నేహలత సదభిప్రాయం నెరవేర్చినవారమగుటలేదేమో! అభిప్రాయాల ద్వారా పరిష్కారమైన సమస్యలు సత్వరాన కార్యరూపంలో వుంచేందుకు తగిన కృషి చెయ్యాల్సివుంది. సభ్యులు అక్కడక్కడ కమిటీలుగా ఏర్పడినట్లు తెలుస్తుంది వారికి తద్వారా చేయవలసిన బాధ్యత ఎంతేని

గలదు. కమిటీలు కార్యసాధనకు తగిన శ్రద్ధ-ఓర్పు పట్టుదల, సహనం నడవడి కలిగివుండాలి. అన్ని రాజకీయ పార్టీలకు అతీతమైన శక్తితో పని చెయ్యాలి. సంఘంలోగల పాతను మార్చి అభ్యుదయ భావాలను కూర్చటంవల్ల దేశ సౌభాగ్యానికి ఎంతేని పాటుపడిన వారమౌతాము.

స్నేహలతలోగల హైదరాబాదు సభ్యులు కూడా ఒకసారి సమావేశమై అన్ని రంగాలలోనూ అభ్యుదయ కార్యక్రమాన్ని నిర్ణయించుకోవలసిన బాధ్యతయుంది. కనక సభ్యులసమావేశ నిర్ణయానికి అభిప్రాయాలను వెల్లడించ కోరుతాను. సమావేశ స్థల కాల కార్యక్రమ నిర్ణయం తర్వాత రూపొందించుకోవచ్చు. సభ్యులంతా తమ వుద్దేశాన్ని స్నేహలతద్వారాగాని, ప్రత్యేకంగా కాని వెంటనే తెలియపర్చ కోర్తాను.

[హైదరాబాదు రాష్ట్రంలోని సభ్యులు- శ్రీ. టి. సిహెచ్. మౌళి. నేవీపేట. హైదరాబాదు, అన్న చిరునామాకు వ్రాయ ప్రార్థన.]

* * *

బుద్వేల్ నుండి కుమారి బి. పద్మావతి యిలా వ్రాస్తున్నారు:

స్నేహలతకు తలవని తలంపులుగా విత్తునాటడము; అది మొలవటము; ఉవ్వెత్తుగా ఆంధ్రావనియంతా అల్లుకుపోవటము అందరికి ఆశ్చర్యమే కాక ఆనందాన్ని కూడ కలుగజేస్తూవుంది. ఈలత నిరాశాజీవులపాలిటి ఓ ఆశాజ్యోతిగా వెల్లివిరుస్తూంది. దీనివ్యాపకం చూస్తూవుంటే ఇది యావదాంధ్రమే గాక; యావద్భారతము, యావత్ప్రపంచమంతా అల్లుకపోతుందా అనిపిస్తూవుంది. ఎందరెందరో పలుప్రాంతాలనుండి ఎన్నెన్నో సందేశాలు; ఆశయాలు పంపిస్తున్నారు. ఎంతోమంది సభ్యులుగా చేరుతున్నారు. ఇందులో మూడు వంతులు యువతీ యువకులు కనుపించుట ముదావహం. కాని కొన్నివేల యువతీ యువకులకన్న కొన్ని వందల పెద్దలను (తలిదండ్రుల) స్నేహంతో పొత్తు కుదిరిస్తే ఎంతైనా లాభంగా ఉంటుంది. ఎందువల్ల? యువకులు (యువతులు) క్షణికోత్సాహమువల్లనేమి, లేక మరి ఏ యితరమువల్లనేమి స్నేహలత ఆంధ్రావనియంతా పరతులు గైకొనడముగాంచి అందులో నేనూ పాల్గొంటే బావుంటుందనో లేక సంఘసంస్కరణాభిలాషవల్లో ధైర్యంచేసి; త్యజించి వర్ణాంతర వివాహాలకు; కట్ననిర్మూలనకు సంసిద్ధపడవచ్చు; నెరవేర్చనూవచ్చు; కానీ వారు ఆ త్రాటిపైననే వారు నిర్మించుకున్న ఆశయసౌధములో జీవితాంతమువరకు అలాగే నడుచుకుంటారన్నది సంశయమే. ఈ కుత్సితసంఘం అలాగే వారిని బ్రతుకనీయదు. ఇలాంటి వారినందరినీ తానే భరిస్తూవున్నట్లు, తానే పోషిస్తున్నట్లు, వారంతా తన మూలంగానే తానే నిర్మించిన సూత్రాలపైననే నడవాలని ఓ చక్రవర్తిలాగా శాసిస్తుంది. వారిని వేలుబెట్టి ఎత్తిపొడుస్తూ ఏమేమో అంటుంది, బెదిరిస్తుంది. చివరకు పరోక్షంగా కాక ప్రత్యక్షముగానే నడివీధిలో నిలవేసి నీవుచేసినకార్యం నాకిష్టములేదు. నీమానవత్వాన్ని చంపుకొని నా మాటవింటావా? లేదా? అని గర్జిస్తుంది. కొంతమంది ఈ అవతారానికి జంకి ఆశయాలని; ఆశలని చలుపుకుంటారు. మరికొంతమంది తలిదండ్రుల కన్నీటిబొట్లు కన్నీళ్ళకి, బెదరింపులకు బెదరి వారు నిర్మించుకున్న ఆశయసౌధాన్ని తమ చేతులారా కూలద్రోసుకుంటారు. ఇంతటితో వారి ఆశయాలు కాస్తా అణగిపోతాయి. చివరికి వారి సంసారములో తుఫానులు; ఆటంబాంబులు పైకి లేస్తాయి. కావుననే సంఘానికి వెరచిన తలిదండ్రుల ఆదరణ, ప్రోత్సాహమంటూ కొంతవుంటే కొద్దికొద్దయిన ధైర్యంతో ఉత్సాహంతో కార్యాచరణకు ముందంజవేయనూవచ్చు. సంఘాన్ని ఎదురించనూవచ్చు. నిర్మించుకున్న సౌధం చిన్నదైనా కాస్త బిగువుగా నిర్మించుకోవటమే మంచిదిగాని పెద్దది కావాలి చాల త్వరలో అభివృద్ధికావాలి అంటే అది త్వరలోనే నాశనమవుతుందంటాను. మరి దీనికి స్నేహలత ఏమంటుందో. కావుననే ముందు పెద్దలతో మార్పు తేవాలి. వారిలోమార్పు తేవడానికి వారికి తగురీతిగా నచ్చచెబుతూ స్నేహలత ఆశయాలు బాగా విపులీకరించి విశదపరచాలి. ఇందులకై స్నేహలత సభ్యులు స్నేహలతాభిమానులు ముందడుగు వేయాలి.

స్నేహలత సభ్యుల అనుక్రమణిక:

1743. శ్రీమతి పి. లీలావతి, బి.ఎస్.సి., బి.యిడి., బి.ఎల్. (29)
(ఎడ్వకేటు)

1744. శ్రీమతి ఎస్. సుందరమ్మ (45)
(గృహిణి)

1745. శ్రీ ఎస్. వెంకటరమణారెడ్డి (20)
(విద్యార్థి)

1746. శ్రీ యం. రాఘవరెడ్డి (21)
(విద్యార్థి)

1747. శ్రీ అల్లూరి భాస్కరరామారావు (20)
(విద్యార్థి)

1748. శ్రీ బి. రామమూర్తి (22)
(విద్యార్థి)

1749. శ్రీ అద్దేపల్లిరెడ్డయ్యరాజు (20)
(విద్యార్థి)
పైవారి అభిరుచి: స్నేహలత ఆశయ నిర్వహణ; చిరునామా: c/o ఆర్గనైజరు, 6/115 మెయిన్ బజారు, మదనపల్లి.

1750. శ్రీ కె. ధూర్జటి (22)
c/o పడిశాల జనార్దన్.
రామన్నపేట, వరంగల్.
(ఉపాధ్యాయుడు)
సంఘసంస్కరణ, అభ్యుదయ మార్గాన్వేషణ

1751. శ్రీ అంబడిపూడి బాలసుబ్రహ్మణ్యం (24)
c/o మహేంద్ర అండ్ కో. విజయనగరం.
(ఏమీ లేదు)
పత్రికారచన, చదవాలని ఆసక్తి.

1752. శ్రీ సిహెచ్. కోటనారాయణ (21)
c/o చినకోటయ్య అండ్ కో.
వ్యాపారులు
(విద్యార్థి)
రాజకీయాలు, నవల పఠనం.

1753. శ్రీ ఆర్. దక్షిణామూర్తి (21)
1/58 రైల్వే క్వార్టర్సు.
గుంటకల్.
(గుమాస్తా)
పత్రికాపఠనం; నిరుద్యోగసమస్య.

తెలుగు విశ్వవిద్యాలయ గ్రంథాలయం
I.I.B.
తేది 18-11-86

1754. కుమారి కె. శైలజ (16)
c/o కొడిమెల కృష్ణమూర్తి
తూర్పువీధి, ఏలూరు.
(విద్యార్థిని)
స్నేహితులు, కట్ననిర్మూలన; నవలాపఠనం.

1755. కుమారి డి. వి. వి. కుమారి బి. ఏ. (20)
కంకటపాలెం. (వయా) బాపట్ల.
గుంటూరుజిల్లా.
(విద్యార్థిని)
వరకట్న నిర్మూలన, సాంఘిక సమస్యలు.

1756. శ్రీ వల్లభజోస్యుల ఆంజనేయులు (21)
'త్రివేణి' హౌస్
నరసారావుపేట.
(ఉద్యోగం)
సంగీతం. పత్రికాపఠనం, స్నేహితులు.

1757. శ్రీ కె. వి. మధుసూధనరావు బి. ఏ. (21)
రామడుగు పోస్టు.
కరీంనగర్ జిల్లా. హైదరాబాదు.
(ఉపాధ్యాయుడు)
చిత్రలేఖనం, శాస్త్రీయ సంగీతం.

1758. కుమారి బి. శోభ (16)
c/o బి. సుబ్బారావు. మాచ్ ఖండ్ పోస్టు.
(వయా) వాల్తేరు.
(విద్యార్థిని)
చిత్రలేఖనం, స్నేహితులు.

1759. శ్రీమతి కె. నాగమణి (16)
c/o కె. శ్రీరామమూర్తి.
కుకెళ్ళ గూడెం పోస్టు. (వయా) ఏలూరు
(గృహిణి)
పుస్తకపఠనం, సంగీతం.

1760. శ్రీ వేమూరి శ్రీనివాసరావు బి. కాం. (21)
20/312 రాజగోపాలాచారి వీధి.
బకింగ్ హామ్ పేట పోస్టు, విజయవాడ-2.
(నిరుద్యోగి)
నవలా పఠనం, విమర్శలు.